# అండమాను జైలుః ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు

(ANDAMAN JAIL: MUSLIM FREEDOM FIGHTERS)


## సయ్యద్ నశీర్ అహమ్మద్

Syed Naseer Ahamed





ప్రచురణ సంఖ్యః 26

ముద్రణ సంవత్సరం ః 2023

ముఖచిత్రాలంకరణ ః అబ్దుల్లా, విజయవాడ

టైపు సెట్టింగ్ ః యన్.జయరాజు, దీప్తి గ్రాఫిక్స్, వినుకొండ.

ముద్రణ ః స్వామి ప్రింటర్స్, విజయవాడ

**ప్రచురణః**

## ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్

ఫ్లాట్ నం. సి-2, శ్రీరామ్స్ ఆర్కేడ్, అమరావతి రోడ్,

ఉండవల్లి - 522 501, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

సంచారవాణి : 9440241727, naseerahamedsyed@gmail.com

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :**

## తెలుగు బుక్ హౌస్

3-3-862, కాచిగూడా క్రాస్ రోడ్స్, హైదరాబాద్-500 027, తెలంగాణ.

సంచారవాణి: 9247446497, దూరవాణి: 040-65347374

**వెల : రూ. 500-00**

**నా**కు పాలిచ్చి ప్రాణం పోసిన

నా పాలతల్లి



# గురిజాల యశోదమ్మ

(1931–2011)

గారికి

**అంకితం.**

# గురిజాల యశోదమ్మ

**ఆ**ంధ్రప్రదేశ్ రాష్ట్రం నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా పురిణి గ్రామ ఆడపడుచు గురిజాల యశోదమ్మ 1931లో జన్మించారు. ఆమె తల్లి చొక్కరాసి లక్ష్మీదేవమ్మ, తండ్రి చొక్కరాసి కొండయ్య. పదమూడు సంవత్సరాల వయస్సులో పురిణికి చెందిన గురిజాల వెంకయ్యతో యశోదమ్మ వివాహం జరిగింది. రైతు కుంటుంబానికి చెందిన యశోదమ్మ కష్టజీవి. ఆమెకు ఆరుగురు సంతానం. ఆమె భర్త 04-06-2000న కన్నుమూసారు. ఆ తరువాత 80 ఏండ్ల వయస్సులో 05-05-2011న యశోదమ్మ నెల్లూరు జిల్లా కావలి పట్టణంలో తుదిశ్వాస విడిచారు.

మా అమ్మ సయ్యద్ బీబిజాన్, గురిజాల యశోదమ్మ నెల్లూరు జిల్లా పురిణి గ్రామ ఆడపడుచులు. మా ఇళ్ళు పక్క పక్కనే ఉండటం వలన మా కుటుంబాల మధ్య సహజ సిద్ధమయిన గ్రామీణ ఆత్మీయత పెనవేసుకుంది. అత్తా... మావా... అన్న... బావ... అక్కా.... తాతా... అవ్వ అంటూ కలసి పోవడం పురిణి బిడ్డల అలవాటు. 1955లో మా అమ్మ నాకు, యశోదమ్మ తన పెద్ద కుమారుడు మాలకొండయ్యలకు జన్మనిచ్చారు. నేను మాలకొండయ్య కంటె నెలల చిన్నవాడ్ని. మా అమ్మకు పాలు సరిగ్గా పడలేదు. నాకు తల్లిపాల సమస్య వచ్చింది. ఆ పరిస్థితులలో యశోదమ్మ నాకు తల్లిపాల వరం ప్రసాదించి తల్లిపాల లోటు తీర్చింది. ఉదయం పొలానికి వెళ్ళేప్పుడు, సాయంత్రం పొలం నుండి ఇంటికి వచ్చేప్పుడు దారిలోని మా ఇంటికి వచ్చి నా కడుపు నిండా పాలుపట్టి నాకు ప్రాణం పోసింది. నేను తాగాక తన వద్ద మిగిలిన పాలను తన బిడ్డడు, మాలకొండయ్య మావకు పట్టి మిగిలిన ఆకలి తీర్చేందుకు అతడికి అన్నం పెట్టేది. నేను చిన్నోడిని కనుక నాకు పాలు పట్టడం అవసరమంటూ, తన బిడ్డ పాలలో నాకు భాగం కల్పించింది యశోదమ్మ. మానవత్వానికి మహోన్నత రూపంగా నిలిచిన ఆ గురిజాల యశోదమ్మ అత్తకు నా పుస్తకం అంకితం ఇవ్వగలగటం నా అదృష్టం.

**- సయ్యద్ నశీర్ అహమ్మద్.**



**కె. శ్రీనివాస్**

**సంపాదకులు**

**ఆంధ్రజ్యోతి దినపత్రిక**

**హైదరాబాద్**

# పరిచయ వాక్యం

## విస్మరణ, విధ్వంసానికి విరుగుడు

సయ్యద్ నశీర్ అహమ్మద్ ది ఆశ్చర్యకరమైన పట్టుదల. అసూయ పడవలసినంత పట్టుదల. చేయగలిగినదేమిటో, చేయవలసినదేమిటో స్పష్టత కలిగి ఉండటం అందరికీ సాధ్యపడే విషయం కాదు. సమాజానికి ఎంతగానో అవసరమయ్యే పనిని, రాను రాను అవసరం పెరుగుతున్న పనిని ఆయన చేస్తున్నారు. కష్టపడగలిగే తత్వం, మొండితనం, లక్ష్యశుద్ధి ఉండడం ఇవన్నీ ఆయన ఇంత పనిచేయడానికి కారణమవుతున్నాయనుకుంటాను. అందుకని ముందుగా అభినందనలతోనే ఈ పరిచయవాక్యం మొదలుపెడుతున్నాను.

నశీర్ అహమ్మద్ పుస్తక సందర్భంలో, ఇతర రచనలనో ఇతర ప్రక్రియలనో తక్కువ చేయాలనుకోవడం కాదు కానీ, కవిత్వంతోనూ, కవిత్వరాజకీయాలతోనూ సతమతం కావడం కంటె ఇటువంటి పుస్తక రచన చేయడం సమాజానికి ఉపయోగకరం అనిపిస్తుంది. ముఖ్యంగా, వర్తమానంలో అత్యంత ముఖ్యమయిన సామాజిక అవసరాల కోసం పనిచేసేవారు తక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు ఉన్న కొద్దిమందీ పనికివచ్చే పనులు చేయడం మంచిది. భారతీయ చేతనలోను, చరిత్రల్లోను ముస్లింను కుట్రపూరిత అస్తిత్వంగా మలుస్తున్నప్పుడు. పరాయిగా, దేశద్రోహిగా, ఉగ్రవాదిగా మూసపోసే ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు నశీర్ అహమ్మద్ ఒక సరైన సానుకూల అస్తిత్వాన్ని

నిర్మిస్తున్నారు. ముస్లిం భారత జాతీయవాదిని, ముస్లిం భారత స్వాతంత్ర్య సమరయోధుడిని ఆవిష్కరిస్తూ వస్తున్నారు. తప్పుడు చరిత్రను, విస్మరణను పునర్నిర్మాణంతో భర్తీ చేయడానికి ఆయన పూనుకున్నారు. కూల్చిన ఇటుకలను మళ్ళీ ఒక్కొక్కటిగా పేర్చి నిర్మాణం చేస్తున్నారు. ఆధునిక భారతదేశానికి రకరకాల మత, కుల, సాంస్కృతిక శ్రేణులు చేసిన ప్రయాణంలో ముస్లింల దోహదం ఎంతటిదో పరిమాణాత్మకంగాను, గుణాత్మకంగాను కూడా సయ్యద్ నశీర్ అహమ్మద్ సోదాహరణంగా, సాధికారికంగా లెక్కిస్తున్నారు. ద్వేషాన్ని అవలీలగా పుట్టించవచ్చు. ఒక శ్రేణి ప్రజలను 'ఇతరులు' గా మార్చడం సులభ ప్రక్రియ కావచ్చు. కానీ దానికి విరుగుడు చేయాలని ప్రయత్నించడం సులువు కాదు. అసత్యాన్ని ప్రచారం చేయడం ఎంతటి పని? సత్యావిష్కరణే కష్టతరమైనది. ఆ ప్రయాసను నశీర్ అహమ్మద్ తలకెత్తుకున్నారు.

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం యోధుల గురించి నశీర్ అహమ్మద్ రచనలు అనేకం. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య పోరాటంలోను, జాతీయోద్యమంలోను, గదర్ పార్టీలోను, ఆజాద్ హింద్ ఫౌజ్‌లోనూ పనిచేసిన ముస్లిం నాయకులు, కార్యకర్తలందరి పరిచయాలను తెలుగు పాఠకులకు ఆయన అందజేశారు. ఇందరు త్యాగధనులు, దీక్షామూర్తుల గురించి తెలియకపోతే మన చారిత్రక జ్ఞానం అసంపూర్ణం. భారత సామాజిక చరిత్ర అసమగ్రం. ఇది ముస్లింలకు మాత్రమే కాదు. భారతీయులందరికి కూడా తమకు తెలియని తమ చరిత్రే. నశీర్ అహమ్మద్ పుస్తకాల రచనకు సంప్రదించిన ఆధారాల జాబితాను చూస్తే ఎక్కడెక్కడి నుంచో చరిత్రను తవ్వి తీసి పూసగుచ్చి, విశ్లేషించి అన్వయించిన తీరు ఆశ్చర్యం కలిగిస్తుంది. ఈ పుస్తకాలలో చెప్పిన గొప్ప వ్యక్తుల జీవిత విశేషాలు, పోరాట విశేషాలు చదివినప్పుడు భారత స్వాతంత్ర్య పోరాటం, జాతీయోద్యమం ఎంతటి వైవిధ్యంతో, బాహుళ్యంతో కూడుకున్నవో తెలిసి, సమ్మిశ్ర జాతీయత (ఎంతటి వైరి సమాసం అయినా) అనే ఆదర్శం మీద ప్రేమ కలుగుతుంది.

ఇది అండమాన్ లో ప్రవాస శిక్ష అనుభవించిన ముస్లిం భారత స్వాతంత్ర్య సంగ్రామయోధుల గురించిన పుస్తకం. అండమాన్–నికోబార్ ద్వీపసముదాయంలో బ్రిటిష్ వారి స్థావరం ఏర్పాటైన సమయమూ ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం జరిగిన

కాలమూ దాదాపుగా ఒకటే కావడంతో, ఆ దీవులను ప్రవాస కారాగార శిక్షకు యోగ్యమైనవిగా భావించారు. అప్పటి నుంచి రెండో ప్రపంచ యుద్ధకాలంలో జపాన్ చేతికి వెళ్ళేదాకా ఆ దీవులు సమరయోధుల బందిఖానాగా, శిక్షాకాలం ముగిసిన వారిలో కొందరి నివాసంగా కొనసాగింది. 1857 పోరాటం ముగిసిన మూడేళ్ళకు పోరాటకారుల విచారణ, శిక్షల విధింపులు ముమ్మరమయ్యాయి. దేశ వ్యాప్తంగా అనేక సంస్థానాలలో తిరుగుబాట్లలో భాగమైనవారు, ప్రోత్సహించినవారు, బ్రిటిష్ ప్రభుత్వంలో పోలీసులుగాను, సివిల్ అధికారులుగాను పనిచేసినవారు అనేకులు 1857 నాటి కేసులలో అండమాన్ కు బందీలుగా వచ్చారు. హైదరాబాద్‌లో బ్రిటిష్ రెసిడెన్సీ మీద జరిగిన దాడి కేసులో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ అను పోరాటయోధునికి కూడా అండమాన్ ప్రవాసశిక్ష విధించారు. సుప్రసిద్ధ సెల్యూలర్ జైలు అండమాన్ లో బంధితులైన స్వాతంత్ర్య సమరయోధుల చేతనే నిర్మింపజేశారు. దుర్మార్గులు, క్రూరులు అయిన బ్రిటిష్ అధికారులు ఖైదీలతో అత్యంత అమానుషంగా వ్యవహరించేవారు. 1857 అనంతరం కూడా భారతదేశంలో అనేక చోట్ల తిరుగుబాట్లు జరిగాయి. వాటిలో పాల్గొన్నవారు కూడా అండమాన్ కే బందీలుగా వచ్చారు. 1920 దశకంలో జరిగిన మోప్లా తిరుగుబాటుదారులను కూడా ఇక్కడే బంధించారు. సావర్కర్ సంగతి తెలిసిందే. జపాన్ చేతికి వెళ్ళే సమయానికి అండమాన్ జైలు ఖాళీ అయ్యింది. కానీ అక్కడ నివాసం ఏర్పర్చుకున్నవారిని బ్రిటిష్ ఏజెంట్లుగా ఆక్రమణదారులు అనుమానించి, తీవ్రమైన అణిచివేత చర్యలు అమలుచేసారు. ఈ పుస్తకంలో స్థూలంగా అండమాన్ చరిత్ర, అక్కడికి వచ్చిన ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల చరిత్ర, అండమాన్ జైలులో జరిగిన తిరుగుబాటు చర్యలు, బ్రిటిష్ వైస్రాయ్ హత్యల వివరాలు అన్నిటినీ నశీర్ అహమ్మద్ క్రోడీకరించారు.

బ్రిటిష్ వారిని 1857 లో హిందూ ముస్లిం సిపాయిలు, సంస్థానాధీశులు కలసి ఎదిరించారు. ఆ యుద్ధం నాటికి, ఈ దేశం ముస్లింలకు, హిందువులకు చెందినదని పరాయివారు బ్రిటిష్ వారేనన్న భావన స్థిరపడింది. అదే జాతీయోద్యమంలో కూడా కొనసాగిందని, 20వ శతాబ్దపు మూడో దశాబ్దం నాటికి బ్రిటిష్ వారి విభజన

రాజకీయాలు ఫలించి ఉభయ మతవర్గాల మధ్య దూరం పెరుగుతూ వచ్చిందని చరిత్ర చెబుతుంది. జాతీయోద్యమంలోనూ, స్వాతంత్ర్యానంతర కాలంలోనూ మతతత్వం పెరిగి, ఆ విభజనను మరింత పెంచిందని, ఇప్పుడది ఒక రాజకీయ సామాజిక ఆధిక్యవాదంగా, ఫాసిస్టు ధోరణిగా పరిణమించిందని గుర్తిస్తున్నాము. ఈ నేపథ్యంలో ఒకనాటి ఐక్యతను స్మరించుకోవడం, ఈ దేశం కోసం జరిగిన నెత్తుటి త్యాగాలలో ఉన్న భాగస్వాములను గుర్తించడం, ప్రచారం చేయడం ఒక కర్తవ్యం. సయ్యద్ నశీర్ అహమ్మద్ దాన్ని నెరవేరుస్తున్నారు.

రచనలు చేయడం, పుస్తకం ప్రచురించడం మాత్రమే కాదు, వీటిని విస్తృతంగా పాఠకులకు చేర్చడం కోసం నశీర్ అహమ్మద్ రకరకాల మార్గాలను అనుసరిస్తారు. పుస్తక విక్రయాలు మాత్రమే కాక, విద్యార్థులకు ఉచితంగా అందేట్టు చూడడం, డిజిటల్ రూపాలలో ఉచితంగా పంపిణీ చేయడం చేస్తారు. అయన ఆదర్శానికి సహాయసహకారాలు అందించే మిత్రులు కూడా ఉన్నట్టున్నారు. మొత్తానికి నశీర్ అహమ్మద్ రచన, ప్రచురణ, ప్రచారం అన్నీ ఉద్యమ స్థాయిలో జరుగుతున్నవే.

మీ నుంచి చాలా నేర్చుకోవాలి సయ్యద్ నశీర్ అహమ్మద్ గారు !



**యం. అహ్మద్ ముజ్తాబా**

**రచయిత, విద్యావేత్త**

**పోర్టు బ్లయర్**

**అండమాను - నికోబారు దీవులు**

# ఆప్త వాక్యం

## అభినందించదగిన బృహత్తర ప్రయత్నం

గత ఏడాది ఓ పొద్దు ఒక అపరిచిత వ్యక్తి ద్వారా నాకో ఫోన్‌కాల్ వచ్చింది. ఆ కాల్‌కు నేను ప్రతిస్పందించే లోగా అవతలి వ్యక్తి తన్నుతాను సయ్యద్ నశీర్ అహమ్మద్ అని వినయంగా పరిచయం చేసుకున్నారు. ఆంధ్రప్రదేశ్ నుండి మాట్లాడుతున్నానని ఆయన అన్నారు. ఆ వెనువెంటనే తాను 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' గ్రంథరచనకు పూనుకున్నానని అందుకు నా సహాయం కావాలన్నారు. ఆయన మాటలు నాకు ఆశ్చర్యం తో పాటుగా ఎంతో ఆనందాన్ని కూడా కలిగించాయి.

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న మా తాత Pandit Ayodiya Rai Sharma S/o Pandit Jeevan Rai Sharma గారికి ఈస్ట్ ఇండియా కంపెనీ 20 ఏండ్ల ప్రవాస శిక్ష విధించి 1871లో అండమాను శిక్షాక్షేత్రానికి తరలించింది. 1891లో శిక్షాకాలం పూర్తయ్యాక ఆయన ఇస్లాం స్వీకరించి Nazir Mohammed పేరుతో అండమాను దీవుల్లోనే స్థిరపడ్డారు. ఆ తరువాత ఆంగ్ల సైన్యాలతో ఢీ అంటే ఢీ అంటూ పోరుబాట నడిచిన 'అజాద్ హింద్ ఫౌజ్', 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ల అండమాను-నికోబారు శాఖలలో సభ్యులుగా Nazir Mohammed సంతతి అయినటువంటి నా పెదనాన్నలు, చిన్నాన్నలు, మా తండ్రి 1943 -1945 ప్రాంతంలో జపాన్ సైన్యాధికారుల దుష్టత్వానికి గురయ్యారు, బలయ్యారు. ఆ యోధుల కుటుంబీకుడను కనుక నశీర్ అహమ్మద్ ప్రయత్నం నన్ను సహజంగానే ఆకర్షించింది.

భారతదేశం మొత్తం మీద నుండి అండమాను శిక్షాక్షేత్రానికి పంపబడిన స్వాతంత్ర్య సమర యోధులలో ముస్లిం వీరులు అసంఖ్యాకంగా ఉన్నా ఆ పోరాట వీరుల వివరాలతో

పూర్తి స్థాయి గ్రంథం ఒక్కటి కూడా వెలువడలేదు. ఆ లోటును తీర్చడానికి అండమాను దీవులకు వెలుపల ఎక్కడో ఆంధ్ర రాష్ట్రంలోని మారుమూల గ్రామంలో ఉంటున్న ఓ చరిత్రకారుడు 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' అను అంశాన్ని ఎన్నుకుని అలనాటి త్యాగమయ సాహసోపేత చరిత్రకు అక్షర రూపమివ్వడానికి పూనుకున్నందున అతనికి అన్ని విధాల సహాయ సహకారాలు అందించటం నా బాధ్యతగా భావించాను. అనారోగ్యం ఎనిమిది పదులు దాటిన వయోభారం ఇబ్బందులు పెడుతున్నా నశీర్ అహమ్మద్‌కు సమాచార సహకారం అందించడానికి సిద్ధపడ్డాను.

ఈ గ్రంథ రచనను ఆరంభించే ముందు ఆయన స్వయంగా అండమాను సందర్శనకు వస్తానన్నారు. ఆ సమయాన 'కరోన' కల్లోలం సృష్టిస్తున్నందున ప్రభుత్వాలు విధించిన ఆంక్షలు-నిషేధాల వలన ఆయనను అండమానుకు రావద్దన్నాం. 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' గ్రంథరచనకు అవసరమగు ముడి సరుకును, చిత్రాలను, ఛాయాచిత్రాలను, గ్రంథాలను పంపిస్తానన్నాను. ఈ మేరకు నా గ్రంథాలను, ఇతర గ్రంథాల వివరాలను, పలు ఛాయా చిత్రాలను, దస్త్రాలను పంపిస్తూ అండమానులో స్థిరపడిన స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబీకులను కూడా ఆయనకు పరిచయం చేశాను.

ఈ సందర్భంగా ఆశ్చర్యకరం అన్పించిన విషయం ఏమిటంటే నశీర్ అహమ్మద్ ఆపాటికే అండమాను శిక్షాక్షేత్రానికి పంపబడిన స్వాతంత్ర్య సమరయోధుల వివరాలు, ఆ యోధుల పట్ల ఆంగ్లేయాధికారులు అనుసరించిన కిరాతక చర్యలు, ఆ తరువాతి కాలంలో జపాన్ సైన్యాధికారుల క్రూరత్వానికి ప్రతీకలుగా నిలచిన దుస్సంఘటనల వివరాలను వెల్లడిస్తున్న పలు గ్రంథాలను, ప్రభుత్వ దస్త్రాలను, చిత్రాలను సమకూర్చుకుని అధ్యయనం చేసి ఉండడం. ఈ క్రమంలో భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న ముస్లిం యోధుల చరిత్రలకు అక్షర రూపం కల్పిస్తూ 1999 నుండి పలు పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాలను వెలువరించి ఆయన ప్రజలకు అందించారని, ఈ చారిత్రక విశేషాలను ప్రజల ఎరుకలోకి తీసుక రావడానికి విస్తృతంగా వినూత్న ప్రచార కార్యక్రమాలు కూడా ఆయన నిర్వహిస్తున్నారని తెలిశాక 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' గ్రంథ రచనకు నశీర్ అహమ్మద్ అన్ని విధాల సమర్థులు అన్పించింది.

'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' పుస్తకం విషయానికొస్తే నిజంగా ఇది అభినందించదగిన బృహత్తర ప్రయత్నం. అండమాను-నికోబారు దీవుల భౌగోళిక-సామాజిక చరిత్రతో ఆరంభించి ఆంగ్లేయులు అండమాను దీవులను శిక్షాక్షేత్రంగా రూపొందించిన తీరుతెన్నులు, 1896లో సెల్యూలరు జైలు ఏర్పాటు, ద్వితీయ ప్రపంచ

యుద్ధం నేపథ్యంలో 1942లో జపాన్ సైన్యాల ఆక్రమణ, 1945లో ఆంగ్లేయుల పునరాక్రమణల వివరణ, చివరకు 1947లో ఆంగ్లేయుల నుండి కూడా అండమాను-నికోబారు దీవులకు పూర్తి విముక్తి కలిగేంత వరకు విశేషాలను సంక్షిప్తంగా అందించటంతో పుస్తకం ప్రథమ అధ్యాయం ముగుస్తుంది. ఆ తరువాత చారిత్రక-రాజకీయ కాలగమనాన్ని అనుసరించి అండమాను శిక్షాక్షేత్రం, అండమాను సెల్యూలర్ జైలుకు దఫదఫాలుగా తరలించబడిన భారత స్వాతంత్ర్య సమరయోధుల వివరాలను, అక్కడ అంగ్లేయులు సాగించిన దమనకాండ తోపాటుగా, జపానీయులు సాగించిన దుష్కృత్యాలను కూడా ప్రత్యేక విభాగాలుగా/ అధ్యాయాలుగా పొందుపర్చారు. ప్రతి విభాగం ఆరంభంలో అలనాటి రాజకీయ పరిస్థితులను, ఆంగ్లేయ వ్యతిరేక పోరాటాలు సాగిన తీరు తెన్నులను సంక్షిప్తంగా వివరిస్తూ ఆ కాలం నాటి సమరయోధుల ఔన్నత్యాన్ని పాఠకులు సులువుగా గ్రహించేందుకు అవసరమగు సమాచారాన్ని క్లుప్తంగా అందించారు. ఈ సందర్భంగా ఆయా విభాగాలకు / అధ్యాయాలకు సంబంధించిన సమాచారాన్ని ఏఏ గ్రంథాల నుండి ప్రధానంగా రాబట్టారో కూడా స్పష్టంగా, వివరంగా పేర్కొనటం ద్వారా సయ్యద్ నశీర్ అహమ్మద్ మేధోపరమైన నిజాయితీకి తార్కాణంగా నిలిచారు. చివరకు 'జీవిత రేఖాచిత్రాలు' శీర్షికన 1858 నుండి అండమాను శిక్షాక్షేత్రానికి, ఆ తరువాత సెల్యూలర్ జైలుకు పంపబడిన పలువురు స్వాతంత్ర్య సమర వీరుల, 1942 నుండి 1945 వరకు జపాన్ సైన్యాల అకృత్యాలకు గురైన అండమాను యోధుల జీవిత విశేషాలను కూడా చిట్టచివర్న ప్రత్యేక అధ్యాయంగా సమకూర్చి 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమర యోధులు' గ్రంథాన్ని ముగించారు.

ఓ తెలుగు రాష్ట్రానికి సంబంధించిన సయ్యద్ నశీర్ అహమ్మద్ గ్రంథానికి 'ఆప్త వాక్యం' రాస్తున్న నేను ఈ సందర్భంగా అండమాను-నికోబారు దీవులలో నివసిస్తున్న తెలుగు ప్రజల గురించి ప్రస్తావించడం సబబని భావిస్తున్నా. మా తాత, తండ్రుల నుండి మేమంతా అండమాను-నికోబారు దీవుల స్థిరనివాసులం కనుక ఈ దీవులలో నివసిస్తున్న తెలుగు ప్రజలతో మాకు దశాబ్దాలుగా సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. ప్రస్తుతం ఈ దీవులలోని 17 ప్రాంతాలలో మొత్తం మీద అరవై వేల మంది తెలుగు ప్రజలు నివశిస్తున్నారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాటన సాగిన 1857 నాటి భారత స్వాతంత్ర్య సమరయోధులు ఖైదీలుగా అండమాను-నికోబారు దీవులకు పంపక ముందు నుంచే ఇక్కడ తెలుగు ప్రజలు మసలిన దాఖలాలున్నాయి. ఆ కారణంగా 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధులు, అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడిన మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి (1838-1905) విరచిత Tawarike-e-Ajeeb గ్రంథంలో

ఆనాటి తెలుగు భాష గురించి, తెలుగు ప్రజల జీవనం గురించి ఒక ప్రత్యేక అధ్యాయంలో ప్రస్తావించారు. తెలుగు ప్రజల భాషను, తెలుగు ప్రజల వ్యవహార శైలిని, తీరుతెన్నులను కూడా ఆయన ఉర్దూలో రాసిన తన గ్రంథంలో స్థాలీపులాకంగా పేర్కొన్నారు. ఆ Tawarike-e-Ajeeb గ్రంథాన్ని అధ్యయనం చేసిన నశీర్ అహమ్మద్ అత్యంత ప్రాముఖ్యత గల ఈ విషయాన్ని తన సునిశిత దృష్టితో పట్టేసి 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' గ్రంథంలో ఆ ప్రస్తావనలను ఉటంకించడం మాత్రమే కాకుండా మౌలానా థానేసరి ఉర్దూ పుస్తకంలోని సంబంధిత పుటలను కూడా తన గ్రంథానికి జతచేసి తెలుగు ప్రజల పట్ల, తెలుగు భాష పట్ల తెలుగు నేల పట్ల తనకున్న మక్కువను వ్యక్తంచేశారు.

1857 పోరాటంలో పాల్గొన్న ప్రస్తుత తెలంగాణ రాష్ట్రం రాజధాని హైదరాబాద్‌కు చెందిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్‌తో అరంభమయ్యి ప్రస్తుత రెండు తెలుగు రాష్ట్రాలకు చెందిన హుస్సేన్ షాహ్ ఫకీర్, యతీం షాహ్ ఫకీర్, సయ్యద్ అహ్మద్ లాంటి 1857నాటి పలువురు సమరయోధులు అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడ్డారు. 1857 తరువాత జరిగిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటాల నుండి ఆరంభమయ్యి 1906 నాటి జాతీయోద్యమం నుండి 1947లో భారతదేశానికి ఆంగ్లేయ పాలకుల నుండి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించేంత వరకు సాగిన పలు ఉద్యమాలలో పాల్గొన్న సమర వీరుల, ఉద్యమకారుల గురించి తనకు లభ్యమయినంత సమాచారాన్ని నశీర్ అహమ్మద్ 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' గ్రంథంలో పొందుపరిచారు.

ఈ గ్రంథంలో మా తాత Nazir Mohammed గారి దగ్గర నుండి మా పూర్వీకుల చరిత్రలను కూడా ఛాయాచిత్రాలతో సహా పొందుపర్చినందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడిన వారి గురించి మాత్రమే కాకుండా అండమాను-నికోబారు దీవుల ఆడపడుచుల మీద జపాన్ సైన్యాలు సాగించిన అత్యాచారాలను వ్యతిరేకిస్తూ సాగిన పోరాటానికి శ్రీకారం చుట్టిన మున్షీ జుల్ఫికర్ అలీ తో ఆరంభించి అండమాను-నికోబారు దీవులకు చెందిన పలువురు పోరాట యోధుల సాహసోపేత చరిత్రలను పొందుపర్చినందుకు చరిత్రకారులు నశీర్ అహమ్మద్ కు అండమాను ద్వీపవాసిగా కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను.

'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' పరిశోధనాత్మక చరిత్ర గ్రంథానికి 'ఆప్తవాక్యం' రాసే అవకాశం నాకు లభించడం నిజంగా నాకు దక్కిన గౌరవంగా భావిస్తూ సన్మిత్రులు, సుప్రసిద్ధ చరిత్రకారులు, బహుగ్రంథకర్త సయ్యద్ నశీర్ అహమ్మద్ కు శుభాశీస్సులను అందిస్తున్నా. ◆




సయ్యద్ నశీర్ అహమ్మద్

పిడుగురాళ్ళ - 522413

గుంటూరు జిల్లా,

ఆంధ్రప్రదేశ్.


# కృతజ్ఞతలు

'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' గ్రంథరచనకు పూనుకోవాలన్న భావన 2014లో కలిగింది. ప్రముఖ చరిత్రకారులు, సన్మిత్రులు Prof Samsul Islam (Delhi University, Delhi) నుండి Unsung Heroes of Freedom Struggle in Andamans Who's Who గ్రంథాన్ని 2014 నవంబరు 21 న అందుకున్నాను. ఆ గ్రంథాన్ని Department of Art and Culture, Cellular Jail, Port Blair, Andaman Nicobar Islands ప్రచురించగా, Dr. Rashida Eqbal (Port Blair, Andaman) రాసారు. ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం అధ్యయనం చేశాక ఈ తరహా పుస్తకాన్ని తీసుకరావాలని అన్పించింది. ఆ మరుక్షణమే Dr. Rashida Eqbal గారితో సంప్రదించాను. ఆనాటి నుండి 2021 జనవరి వరకు "అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" పుస్తక రచనకు అవసరమగు సమాచారం కోసం అన్వేషిస్తూ అలనాటి బ్రిటిష్ ప్రభుత్వ-భారత ప్రభుత్వ దస్త్రాలను, అధికారిక-అనధికారిక పత్రాలు, గ్రంథాలను సమకూర్చుకోసాగాను.

నా 20వ గ్రంథం "ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్" పుస్తకం పూర్తికాగానే "అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" రచనకు పూనుకున్నాను. ఏదేని పుస్తకం రాసేప్పుడు ఆయా చారిత్రక ప్రదేశాలను సందర్శించటం ఆనవాయితీగా పెట్టుకున్న నేను అండమాను-నికోబారు దీవులను చూసి వద్దామని అనుకున్నాను. నా శ్రీమతి షేక్ రమీజా బాను కూడా అండమాను-నికోబారు దీవుల సందర్శన తరువాతనే గ్రంథ రచన ఆరంభించాల్సిందిగా సూచించారు. అండమానులోని పోర్టు బ్లయర్‌లో ఉంటున్న ప్రముఖ పరిశోధనాత్మక రచయిత Dr. Rashida Eqbal, ప్రముఖ విద్యావేత్త, బహుగ్రంథ రచయిత M. Ahmad Mujtaba తో ఈ విషయం గురించి మాట్లాడాను."అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" రాసే ముందు

అండమానుకు రావాలనుకుంటున్నానని చెప్పాను. కరోనా మహమ్మారి విజృంభణ వలన అండమాను– నికోబారు దీవుల్లో కూడా లాక్‌డౌన్ ప్రకటించి ఉన్నందున. సంస్థలు, వ్యవస్థలు అన్ని మూతపడి ఉన్నాయని. ఎవ్వరూ ఎక్కడికి కదలలేని పరిస్థితి ఉన్నందున అండమాను వచ్చినా ఫలితం ఏమీ ఉండదని వారన్నారు. అయినా "అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" పుస్తక రచనకు అవసరమగు సామగ్రి, సమాచారం, ఛాయా చిత్రాలు మాత్రం తాము పంపగలనని, కరోనా లాక్‌డౌన్ తొలిగాక మరింత సమాచారం, చిత్రాలు, ఛాయాచిత్రాలు అందించగలం అంటూ, "అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" తక్షణమే ఆరంభించమని సూచించారు.

ఆ విధంగా లభించిన ప్రోద్బలంతో 'అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు' పుస్తక రచనను 2021 ఫిబ్రవరిలో ఆరంభించాను. 2014 నుండి అప్పటి వరకు నేను సమకూర్చుకున్న గ్రంథాలు, దస్త్రాల అధ్యయనం పూర్తిచేశాను. నాకు అవసరమగు సమాచారాన్ని పక్కన పెట్టుకుంటూ, విస్తృతంగా నోట్స్ తయారు చేసుకుంటూ, మరింత సమాచారం కోసం అంతర్జాలాన్ని ఆశ్రయించాను. అంతర్జాలం ద్వారా ఈ అంశం మీద వెలువడిన సరికొత్త పుస్తకాల గురించి తెలుసుకున్నాను. ఆ గ్రంథాలను అధ్యయనం చేయాలన్పించింది. ఆ పుస్తకాలను తెప్పించుకునే ప్రయత్నంలో ఉండగా నా గ్రంథ రచనను తొలుత నుండి ప్రోత్సహిస్తున్న సన్మిత్రులు Mr. Abdul Sattar Khan, IPS {Inspector General of Police (Retd.)} నాకు సహకరించారు. నేను అవసరం అనుకున్న కొన్ని పుస్తకాలను వెదికి తెప్పించి నాకు అందించారు. Mr.Abdul Sattar Khan IPS సహకారం వల్ల నాకు అత్యవసరమయిన సరికొత్త పుస్తకాలు నా గ్రంథాలయంలోకి వచ్చి చేరాయి.

ఆ క్రమంలో అండమాను–నికోబారు దీవుల గురించి 19వ శతాబ్ది ఆరంభంలో వెలువడిన పలు గ్రంథాల సమాచారం అంతర్జాలం ద్వారా అందింది. ఆ గ్రంథాలు, అప్పటి దస్త్రాలు ప్రస్తుతం లభించే అవకాశం కన్పించలేదు. ఆ కారణంగా ఆ గ్రంథాల, సంబంధిత దస్త్రాల పిడియఫ్ ఫైళ్ళ కోసం అన్వేషణ సాగిస్తుండగా మిత్రులు, చరిత్ర పరిశోధకులు Mr Suhail Ahmad Wani (Faculty of History, Govt. Law College, Indore, MP) సహాయపడ్డారు. ఆయన తన వద్దనున్న పలు ముఖ్యమయిన గ్రంథాల పిడియఫ్ ఫైళ్ళు మాత్రమే కాకుండా నాకు అవసరమగు పలు గ్రంథాలు, దస్త్రాల పిడియఫ్ ఫైళ్ళు కూడా లోతుగా వెతికి నాకు అందించారు.

ఆ తరువాత అంతర్జాలం ద్వారా నేను సాగించిన అన్వేషణ వలన సరికొత్త సమాచారం తోపాటుగా నాకు సరికొత్త మిత్రుల సహవాసం కూడా లభించింది. 1857

నాటి స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబానికి చెందిన ప్రముఖ రచయిత, విద్యావేత్త Mr. M Ahmad Mujtaba (Port Blair, Andaman & Nicobar Islands) పరిచయం అయ్యారు. 1858లో అండమానుకు పంపబడిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధుల చరిత్రల సమాచారం ఆయన నుండి ఎంతో లభ్యమయ్యింది. ఆయన పలు గ్రంథాలను, దస్త్రాలను అందించారు. అండమానుకు సంబంధించిన అత్యంత చారిత్రక ప్రాధాన్యత గల ప్రాంతాల, వ్యక్తుల ఛాయా చిత్రాలను తీయించి పంపించారు. అండమానులో స్థిరపడిపోయిన 1857 నాటి స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబీకులతో పరిచయం కలుగజేస్తూ వారితో సంప్రదించే అవకాశం కూడా ఆయన నాకు కల్పించారు.

Dr. Rashida Eqbal అందించిన సమాచారంతో అండమాను జైలుకు పంపబడిన స్వాతంత్ర్య సమరయోధుల, వారి వారసులతో ఏర్పడిన Ex-Andaman Political Prisoner's faternity Circle సంస్థకు అధ్యక్షత వహిస్తున్న Mr. Anup Dasguptha (Kolkata, West Bengal) పరిచయం లభించింది. ఆయన అండమాను రాజకీయ ఖైదీల గురించి బెంగాలి భాషలో Cellular Jail E Nirbasito Biplobider Katha శీర్షికతో రాసిన గ్రంథాన్ని ప్రచురణకర్త నుండి తెప్పించుకున్నాను. ఈ విషయమై Mr. Dasguptha తో సాగిన నా సంభాషణల వలన ఆయన వద్దనున్న ఉపయుక్త సమాచారం నాకు లభించింది. ఈ విధంగా సమకూరిన సరికొత్త సమాచారం, గత ఎనిమిది ఏండ్లుగా మిత్రులు, గ్రంథాలు, అధికారిక–అనధికారిక దస్త్రాలు, అంతర్జాలం నుండి నేను సమకూర్చుకున్న సమాచారానికి అక్షరరూపం ఇవ్వడం మార్చి 2021న ఆరంభించాను. ఆ విధంగా ఆరంభమయిన రచన ఏకబిగిన కొనసాగి ఆగస్టు రెండవ వారంలో పూర్తయ్యింది.

"అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" పుస్తకాంశంలోని సమయం–సందర్భం బట్టి పుస్తకంలోని సమాచారాన్ని విభాగాలుగా వర్గీకరించాను. బ్రిటిష్ పాలకుల మదిలో అండమానులో జైలు ఏర్పాటు చేయాలన్న ఆలోచన అంకురించి అదికాస్తా 1858లో శిక్షాక్షేత్రం (Penal Settlement) గా రూపుదిద్దుకుని Open Jail అయ్యింది. ఆ తరువాత అండమాను జైలు క్రమానుగతంగా మార్పులు చేర్పులతో 1906లో సెల్యులర్ జైలు (Cellular Jail) గా మారింది. భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా సాగిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న స్వాతంత్ర్య సమరయోధులను వివిధ సందర్భాలలో, వివిధ సమయాలలో అండమాను జైలుకు తరలించడం తదితర అంశాలను పుస్తకంలో ప్రస్తావించాను. ఆ తరువాత ద్వితీయ ప్రపంచ యుద్ధంలో భాగంగా అండమాను దీవులను 1942 మార్చి 23న జపాన్ సైన్యం ఆక్రమించుకున్నాక ఆసియన్లు, ఆసియన్లకు మిత్రులని

ప్రకటించిన జపాన్ సైన్యం ఆ తరువాత అండమానులోని ప్రజలు, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ సభ్యులు, భారత జాతీయ సైన్యం యోధులు గూఢచర్యానికి పాల్పడుతున్నారన్న నెపం మీద వారందరిని నిర్దాక్షిణ్యంగా బలితీసుకున్న తీరుతెన్నులను వివరంగా ఏకరువు పెడుతూ **కథనం** శీర్షికన మొదటి విభాగం పూర్తయ్యింది.

ఆ కథనం పూర్తయ్యాక 1858 మార్చి పదిన అండమాను చేరుకున్న 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సమరయోధుల మొట్టమొదటి జట్టుతో ఆరంభమయ్యి అండమానుకు తరలించబడిన వీరుల వివరాలను **1857 నాటి సంగ్రామ యోధులు** శీర్షికన ద్వితీయ విభాగంలో వివరించాను. 1857 తరువాత కూడా వివిధ ప్రాంతాలలో సాగిన పోరాటాలలో పాల్గొన్న సమరయోధుల వివరాలు, భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాన్ని కార్యక్షేత్రం చేసుకుని ఆంగ్ల ప్రభుత్వం మీద పోరాటాలు సాగించిన వహాబీ యోధులను అండమాను జైలుకు తరలించిన విశేషాలను **ప్రజా పోరాట వీరులు** శీర్షికన మూడవ విభాగంలో పేర్కొన్నాను. 1906 నుండి ఆరంభమయిన జాతీయోద్యమంలో భాగంగా సాయుధపోరాట బాట ఎన్నుకున్న విప్లవకారులను అండమాను సెల్యులర్ జైలుకు తరలించిన వివరాలను **విప్లవోద్యమకారులు** శీర్షికన నాల్గవ విభాగంలో పొందుపర్చాను. ప్రస్తుత కేరళ రాష్ట్రం మలబారు తీరప్రాంతంలో భూస్వాములకు వ్యతిరేకంగా ఆరంభించి 1919 నాటి ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమంలో భాగమయ్యి ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడిన వందలాది మలబారు మోప్లాలను సెల్యూలర్ జైలుకు తరలించిన వివరాలను **మలబారు మోప్లా మొనగాళ్ళు** శీర్షికన ఐదవ విభాగంలో సమర్పించాను. భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా భారత దేశంలోని వివిధ ప్రాంతాలలో ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమించినందుకు సెల్యూలర్ జైలుకు పంపబడిన స్వాతంత్ర్య సమరయోధుల వివరాలను **పోరాటయోధులు** శీర్షికన ఆరవ విభాగంలో అందించాను. 1942 మార్చి 23 నుండి 1945 ఆగస్టు 15 వరకు అండమాను దీవులను తమ ఆక్రమణలో ఉంచుకున్న జపాన్ సైన్యం, గూఢచర్యానికి పాల్పడుతున్నారన్న నెపంతో ఇటు అండమాను వాసులను అటు భారత జాతీయ సైన్యం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ సభ్యులను ఉరిశిక్షలు, సామూహిక కాల్చివేతలకు బలిచేశారు. ఆ విధంగా జపాన్ సైన్యాల కిరాతకత్వానికి బలైన యోధుల వివరాలను **సమరయోధులు–అమరవీరులు** శీర్షికన ఏడవ విభాగంలో పేర్కొన్నాను. ఈ క్రమంలో 1858 నుండి 1945 వరకు అండమానుకు తరలించబడిన వారిలో ఓ 25 మంది సమరయోధుల జీవిత విశేషాలను ఎనిమిదవ విభాగంలో **జీవిత రేఖా చిత్రాలు** శీర్షికన పొందుపర్చడం ద్వారా ఈ పుస్తకం ప్రధానాంశం ముగించాను.

ఆ తరువాత ఈ పుస్తక రచనకు నేను సంప్రదించిన వివిధ భాషల గ్రంథాలు, అంతర్జాలం, యూట్యూబ్‌లు, పత్రికలు తదితరాలను **ఆధార గ్రంథాలు-పత్రికలు-ఇతరత్రాలు** శీర్షికన తొమ్మిదవ విభాగంలో ఇచ్చాను. చివరిలో సమాచారసేకరణ, పుస్తక రచన తదితర బృహత్తర కార్యక్రమంలో నాకు పలు విధాలుగా సహకారం అందించిన సన్మిత్రులను ప్రస్తావిస్తూ పదవ విభాగంలో **ధన్యవాదాలు** శీర్షికన "అండమాను జైలు : ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" పుస్తకాన్ని ముగించాను.

నా మేరకు పూర్తయిన పుస్తకానికి పరిచయవాక్యం, ఆప్తవాక్యాలతో సంపూర్ణత తెచ్చేందుకు ప్రయత్నాలు ఆరంభించాను. అండమాను నివాసి, ప్రముఖ రచయిత, బహుభాషాకోవిదులు, విద్యావేత్త 83 ఏండ్ల వయస్కులు, పెద్దలు Mr. M Ahmad Mujtaba (Aberdeen, Port Blair, Andaman & Nicobar Islands) గారిని **ఆప్తవాక్యం** రాసి పెట్టాల్సిందిగా విజ్ఞప్తి చేశాను. నా విజ్ఞప్తిని మన్నిస్తు ఆప్తవాక్యం రాసిచ్చినందుకు Mr. M Ahmad Mujtaba గారికి, ఆ తరువాత **పరిచయ వాక్యం** రాసిపెట్టాల్సిందిగా ప్రముఖ పాత్రికేయులు, సోదరులు శ్రీ కె. శ్రీనివాస్ (సంపాదకులు, 'ఆంధ్రజ్యోతి' తెలుగు దినపత్రిక, హైదరాబాద్) గారిని కోరగా పలు బాధ్యతల నిర్వహణ ఒత్తిడిలో ఉండి కూడా నా వినతిని మన్నిస్తూ పరిచయవాక్యం రాసిచ్చినందుకు హృదయపూర్వక మప్పిదాలు.

నా పుస్తకాల ముసాయిదాలను చదివి తగిన సలహాలు-సూచనలు ద్వారా సహకరిస్తున్న ప్రియమిత్రులు శ్రీ భువనగిరి వెంకట కృష్ణ పూర్ణానందం (విశ్రాంత ఆంగ్లోపన్యాసకులు, ప్రభుత్వ జూనియర్ మహిళా కళాశాల, గుంటూరు), ప్రముఖ రచయిత, న్యాయవాది శ్రీ మాదిరాజు గోవర్ధనరావు (మంగళగిరి, గుంటూరు జిల్లా), సద్విమర్శకులు, విశ్రాంత ఆంగ్లోపన్యాసకులు శ్రీ కొత్తపల్లి రవిబాబు (తెనాలి) గార్లకు, ఈ పుస్తకానికి ముఖచిత్రం రూపొందించడమే కాకుండా నా పుస్తకాల రూపకల్పన – ప్రచురణ – పంపిణీకి సంబంధించిన పలు కార్యకలాపాలలో నాకు అన్ని విధాల సహాయ – సహకారాలు అందిస్తున్న మిత్రులు శ్రీ నలబోతుల జయరాజు (దీప్తి గ్రాఫిక్స్, వినుకొండ) గారికి, ఈ పుస్తకంలోని కొన్ని బొమ్మల తోపాటుగా ముఖచిత్రాన్ని కూడా అందంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ షేక్ అబ్దుల్లా సాహెబ్ (విజయవాడ) గారికి నా ధన్యవాదాలు.

నా రచనావ్యాసంగానికి ఉపయుక్తమగు పలు ఉర్దూ గ్రంథాలను నా కోసం చదివి పెడుతూ, ఆ గ్రంథాలలోని అవసరమైన సమాచారాన్ని నాకు విడమర్చి చెబుతూ, అనుక్షణం నన్ను ఆశీర్వదిస్తూ, ప్రతిక్షణం నా వెంట నిలచి నన్ను ఎంతగానో ప్రోత్సహించిన మా అమ్మ సయ్యద్ బీబీజాన్ (1936-2008), నా ప్రయత్నాలన్నిటికి తొలినుండి చేయూత

అందించి నన్ను ప్రోత్సహించిన నా మేనమామ-పిల్లనిచ్చిన మామ, "ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్" ఛైర్మన్ షేక్ పీర్ అహమ్మద్ (1939-2017) గార్లను ఈ సందర్భంగా మనసారా స్మరించుకుంటూ స్మృత్యంజలి ఘటిస్తున్నాను.

నా ప్రతి ప్రయత్నం వెనుక తానుండి సతతం నాకు చేదోడుగా నిలుస్తూ, నా రచనా వ్యాసంగానికి క్రియాశీలక చోదకశక్తిగా నిలచి సహకరిస్తున్న నా జీవిత భాగస్వామి షేక్ రమిజా భాను, నా గ్రంథరచనా ప్రక్రియ విధానాన్ని, వేగాన్ని నిరంతరం పర్యవేక్షిస్తూ, నా రచనా వ్యాసంగం మందగించినప్పుడల్లా ప్రశ్నిస్తూ, నన్ను ప్రోత్సహిస్తున్న నా కుమార్తె సయ్యద్ జాశ్మిన్ అహమ్మద్, అల్లుడు డాక్టర్ షేక్ ముహమ్మద్ తల్మీజుద్దీన్ లకు నా ప్రేమాభిమానాలను తెలుపుకుంటున్నాను.

"అండమాను జైలు ః ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" పుస్తక రచన పూర్తి కావస్తున్న సందర్భంలో నా మిత్రులు చాలా మంది పుస్తకం ప్రచురణ విషయమై నాతో సంప్రదించారు. పుస్తక రచన-ప్రచురణ-పంపిణీ కార్యక్రమాలలో గల కష్టాల ఎరుక గలిగిన సహృదయులయిన సోదరులు నాకు ఆర్థిక చేయూతనిచ్చారు. ఈ మేరకు సహకరించిన Sree Sivarathri Chandra Mouli {General Manger (Retd..), Coal India Limited}, Janab Mohammed Jawahar Ali, (Advocate, Kakinada, AP), Janab Shaikh Esdani Basha, (Senior Mechanical Engineer, Gulf Consult, Kuwait), ATA Muhammad Nizamuddin Nizami Sha Taj Khadari, (ASTANA ATA E BAGH E SARKAR TAJUL AULIYA DARBAR, JAMPANI, Guntur Dt. AP), Dr. B. Prasada Reddy (Vice Principal, Sliver Jubilee Govt. College, Kurnool , AP), Janab Mohammed Hanief (Senior Sales Supervisior, Al Shaya Enterprises, Kuwait) లకు నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు.

ఈ పుస్తక రచనకు పలు గ్రంథాలు, పత్రికలు, వ్యక్తులు, వ్యవస్థలు, సంస్థల నుండి ప్రత్యక్షంగా / పరోక్షంగా సమాచార సహకారం-సహాయం స్వీకరించాను. ఆ కారణంగా ఈ పుస్తకం రచన 'వ్యష్టి' కృషి కంటే 'సమష్టి' కృషి ఫలితమని భావిస్తున్నాను. ఆ కారణంగా పుస్తక రచనకు ఉపయోగపడిన గ్రంథాల రచయితలు, ప్రచురణకర్తలు, సంస్థల బాధ్యులు, మిత్రులు, పిన్నలు/పెద్దలు ప్రతి ఒక్కరికి కృతజ్ఞతలు. "అండమాను జైలు ః ముస్లిం స్వాతంత్ర్య సమరయోధులు" పుస్తకాన్ని చదివాక పాఠకమిత్రుల మదిలో మెదలిన సూచనలు - సలహాలను నా దృష్టికి తీసుక రావాల్సిందిగా వినమ్రంగా విజ్ఞప్తి చేస్తున్నాను. ◆

# ఇందులో...

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామ భౌగోళిక చరిత్రలో ఒక ప్రత్యేక అధ్యాయాన్ని సృష్టించుకున్న అండమాన్-నికోబార్ దీవుల (Andaman-Nicobar Islands). సమూహం భారతదేశానికి తూర్పున బంగాళాఖాతంలో విస్తరించి ఉన్నాయి. చిన్నా-పెద్దా కలసి 8,249 చదరపు కిలోమీట్లర్లు విస్తీర్ణం గల 572 ద్వీపాల సమూహమిది. అండమాను-నికోబారు దీవులు ఉష్ణమండల పర్యావరణ పందిరిని కలిగి చక్కని-చిక్కని-దట్టమైన వృక్ష సంపద, రాళ్ళు-రప్పలు, గుట్టలు-కొండలు, సహజసిద్ధమయిన వాగులు-వంకలు, కాల్వలు, సన్నపాటి జలపాతాలు, చిన్నపాటి సరస్సులతో, పురుగు-పుట్రా జంతుజాలాల సమ్మేళనంతో ప్రకృతి ప్రసాదించిన అత్యంత సహజ సౌందర్యంతో ఉట్టిపడుతుంటాయి.

## బ్రిటిష్ నౌకాస్థావరం ఏర్పాటు

అండమాన్-నికోబార్ దీవుల సమూహం మీద జనవాసాలు, నౌకా స్థావరాల ఏర్పాటు కోసం ఫ్రెంచ్, పోర్చుగీసు, డచ్ తదితరుల ద్వారా ప్రయత్నాలు ఎప్పటి నుండో జరిగినప్పటికి ఆ ప్రయత్నాలు శాశ్వత ఫలితాలను సంతరించి పెట్టలేదు. చివరకు ఆ అవకాశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం సొంతం చేసుకుంది. 1789లో అండమాను దీవులలో భాగమైన ఛాతం (Chatham) దీవిలో బ్రిటిషర్లు తొలి నౌకాస్థావరాన్ని ఏర్పాటు చేశారు. ఆ తరువాత అక్కడి వాతారావరణ పరిస్థితులు అనుకూలించక ఛాతం స్థావరాన్ని 1796లో మూసేశారు. ఆ తరువాత కల్లోలిత సముద్ర వాతావరణం సృష్టిస్తున్న సమస్యలు, సముద్రపు దొంగల దాడుల బెడద కలుగజేస్తున్న ఆస్తి-ప్రాణ నష్టం నుండి నౌకాదళాల రక్షణ, నౌకలకు ఆశ్రయం కల్పించాల్సిన అవసరం ఏర్పడింది. ఆ అనివార్యత దిశగా సాగిన తర్జనభర్జనల పర్యవసానంగా బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం అండమానులో స్థావరం ఏర్పాటుకు మళ్ళీ నిర్ణయంతీసుకుంది. ఆ నిర్ణయం మేరకు సత్వరచర్యలను చేపట్టింది.

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం

అండమానులో స్థావరం ఏర్పాటు కార్యక్రమం ఒకవైపున సాగుతుండగా, మరోవైపున భారతీయులు 1857 మే 10న ప్రథమ బారత స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావం పూరించారు. గతంలో ఎన్నడూ లేనంతగా భారత దేశంలోని దాదాపు అన్ని ప్రాంతాల, అన్నివర్గాల, అన్ని స్థాయిల ప్రజలు ఏకోన్ముఖంగా ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు, బలగాల మీద సమరం ప్రకటించారు. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం అంతిమంగా విజయం సాధించలేక పోయినప్పటికి స్వేచ్ఛా-స్వాతంత్ర్య కాంక్షతో ప్రజానీకం ప్రదర్శించిన, అనన్యసామాన్య ఐక్యత, అద్భుత పోరాటపటిమ, అసమాన త్యాగాలను చూసిన ఆంగ్లేయులు బెదిరిపోయారు. ఇండియా బహుళ సామాజిక సమూహాల సమ్మిశ్రిత సమాజం అయినప్పటికి అంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజానీకం ఏకమై ప్రదర్శించిన బలమైన ఐక్యతను బద్దలు కొట్టడం మాత్రమే కాకుండా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర వహించిన ప్రజలను-ప్రముఖులను అత్యంత ప్రమాదకారులుగా భావించారు. ఆంగ్లేయ అధికారుల పరిభాషలో 'తిరుగుబాటుదారులు / దోషులు' (Rebels - Mutineers / Convicts) గా భావించబడిన సమరయోధులను వారి స్వస్థలాలకు, స్వజనానికి, భారత ప్రధాన భూభాగానికి కడు దూరంగాను, తిరిగి రాలేని విధంగాను ఉంచాలని నిర్ణయమయ్యింది.

## సహజసిద్ధ 'బహిరంగ కారాగారం' అండమాను

అండమాను-నికోబారు దీవులు అందుకు అనుగుణమయిన సహజసిద్ద బహిరంగ కారాగారం (Open Jail) గా అంగ్లేయాధికారులు భావించారు. ఆంగ్ల ప్రభుత్వానికి ఎదురొడ్డి నిలచి, ఆంగ్ల ప్రభుత్వ సైన్యాలతో పోరాడిన సమరయోధులను అండమాను-నికోబారు దీవులకు పంపాలన్న స్పష్టమయిన నిర్ణయానికి వచ్చింది ప్రభుత్వం. ఆ నిర్ణయం మేరకు 1856 లో అండమానులో నౌకాస్థావరం ప్రధాన లక్ష్యంగా ఆరంభించిన ప్రయత్నాలను 1857 తరువాత మరింతగా వేగవంతం చేసింది. చివరకు అండమానులోని పోర్టు బ్లెయర్‌లో నౌకాస్థావరం తోపాటుగా శిక్షా క్షేత్రం (Penal Settlement) ఏర్పాటుకు ఆంగ్ల ప్రభుత్వం చర్యలను ముమ్మరంగావించింది.

చివరకు 1858 జనవరి 22న అండమాను-నికోబారు దీవుల రాజధానిగా ప్రస్తుతం భాసిస్తున్న పోర్టు బ్లెయర్ (Port Blair) లో బ్రిటిష్ ప్రభుత్వ పతాకం ఎగిరింది. ఆ పతాకావిష్కరణతో అండమానులో శిక్షా క్షేత్రం (Penal Settlement) ఏర్పాటు-నిర్మాణానికి శ్రీకారం చుట్టినట్టయ్యింది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని ఆంగ్లేయ న్యాయస్థానాల

ద్వారా సుదీర్ఘకాల శిక్షలు విధించబడిన స్వాతంత్ర్య సమరయోధులను అండమానులోని శిక్షాక్షేత్రం (Penal Settlement) పంపేందుకు ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయించగా, ఆంగ్ల న్యాయస్థానాలు అందుకు తగినట్టుగా దీర్ఘకాలిక శిక్షలు ప్రకటిస్తూ దోషులను (Convicts) అండమానుకు తరలించాల్సిందిగా ప్రత్యేకంగా ఆదేశాలు జారీచేయడం ఆరంభించాయి.

## 'కాలాపానీ' పేరుతో అప్రతిష్టపాలు

అండమాను జైలును 'కాలాపానీ' అని కూడా అంటారు. అండమానుకు బహిష్కరించబడిన శిక్షను 'కాలాపాని' శిక్ష అని కూడా చెబుతారు. భాషాపరంగా 'కాలాపానీ' (Kalapaani) అంటే 'నల్లని నీరు' (Black Water) అని చెప్పవచ్చు. అలనాటి ఆంగ్లేయులు కూడా కాలాపాని అంటే నల్లని నీరు అర్థంలో బ్లాక్‌వాటర్ పదప్రయోగం చేసారు. అండమాను శిక్షా క్షేత్రం కాలాపానీ వద్ద ఉందంటూ Black Water / Kalapaani పదాన్ని వాడుకలోకి తెచ్చారు. కానీ అండమాను-నికోబారు దీవుల్లో ఈ కాలాపాని అంటే బ్లాక్ వాటర్ నిజానికి ఎక్కడా లేదు. అండమాను సమీపంలోని సముద్రం ప్రాంతం పై నల్లటి మేఘాలు కమ్ముకుని ఉంటున్నందున సముద్రంలోని నీరు నల్లగా కన్పించటం ఒక కారణం అంటారు. అండమాను సముద్రతీరాన ఉన్న పర్వతాల ప్రతిబింబాలు సముద్రపు నీటిలో నల్లగా కన్పించటం వలన సముద్రపు నీరు నల్లగా గోచరిస్తుందనే కారణంగా కూడా 'కాలాపానీ' పద ప్రయోగం ఉనికి లోకి వచ్చిందంటారు. ఈ కాలాపానీ మాటకు సంస్కృతంలో 'కాల్' అంటే కాలము లేక మృత్యువు అని అర్థం ఉన్నందున దీనిని 'మృత్యు జలం' లేక 'మృత్యు స్థలం' (Water of Death / Place of Death) అని కూడా పిలుస్తుంటారని చెబుతారు.

భౌగోళిక / భాషాపరమైన భావంలో 'కాలాపానీ' అర్థం-పరమార్థం-పుట్టుక ఎలా ఉన్నా చారిత్రకంగా మాతృభూమి విముక్తి ఆకాంక్షిస్తూ ఆంగ్లేయ పాలకుల మీద ధ్వజమెత్తిన సమరయోధులు అండమాను జైలులో అనుభవించిన నరకయాతనలు, భయంకర శిక్షలు ఆంగ్లేయాధికారుల రాక్షస చర్యలు 'కాలాపానీ' పదానికి నకారాత్మక అర్థాన్ని ప్రచారంలోకి తెచ్చిపెట్టాయి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయుల మీద ధ్వజమెత్తిన సమర యోధులను వారి స్వజనం, స్వస్థలం నుండి దూరంగా, వారెవ్వరూ కూడా తిరిగిరాలేని సుదూర తీరాలకు తరలించాలన్న దుర్మార్గపు ఆలోచనతో ఆంగ్లేయులు ఏర్పరచిన అండమాను శిక్షా క్షేత్రం (Penal Statement), ఆ తరువాత అక్కడ ఏర్పరచిన పలు భయానక బందిఖానాలు (Dreadful Prisons), ఉరిశిక్షా గృహాలు (Hanging Houses), చిత్రహింసల కోనలు (Torture Centers) కలగలసి అండమాను జైలు భారత స్వాతంత్ర్య సమరయోధుల పాలిట

మృత్యు కుహరంగా మారి అండమాను జైలు కాస్తా 'కాలాపానీ' (Kalapaani) పేరుతో అప్రతిష్ట పాలయ్యింది. ఈనాటికి కూడా 'కాలాపానీ' అనే పదం స్మరణకు రాగానే ఆనాడు మన స్వాతంత్ర్య సమరయోధులు అనుభవించిన నరకయాతనలు గుర్తుకు వచ్చి మన శరీరం గగుర్పాటుకు గురవుతుంది.

## అండమానుకు తరలిన తొలి జట్టు

ఆంగ్ల ప్రభుత్వ అభిమతం, ఆంగ్ల న్యాయస్థానాల ఆదేశాల మేరకు దీర్ఘకాలం జైలు శిక్షలకు గురయ్యిన 200 మంది ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామయోధులను, ఇతర అధికారులను తోడ్కొని Semiramis యుద్ధనౌక (Frigate) 1858 మార్చి నాలుగున ఆంగ్లేయాధికారి డాక్టర్ జేమ్స్ పాటిసన్ వాకర్ (Doctor James Pattison Walker) నాయకత్వంలో అండమాను ప్రయాణానికి సిద్ధమయ్యింది. ఒక భారతీయ పర్యవేక్షకుడు, ఇరువురు భారతీయ డాక్టర్లు, ఒక నావికా రక్షణ దళం అధికారి ఆధ్వర్యంలో 50 మంది నావికాదళం సైనికులతో కూడిన డాక్టర్ వాకర్ బృందం కలకత్తా నౌకాశ్రయం నుండి ఆ రోజున బయలుదేరింది. 1857 నాటి స్వాతంత్ర్య సమరయోధులతో కూడి అండమానుకు కదలిన ఆ తొలి జట్టు 1858 మార్చి పదిన అండమాను దీవులకు చేరుకుని భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రత్యేక అధ్యాయానికి నాంది పలికింది. (A History of Our Relations with the Andamanese, MV Portman, Calcutta, 1899, Page 253).

## సమరయోధులు కడు ప్రమాదకారులు

సమాజాన్ని భయకంపితులనుజేసే కిరాతక కృత్యాలకు పాల్పడిన కరడుగట్టిన నేరస్థుల కంటె ప్రభుత్వ వ్యతిరేకులు అత్యంత ప్రమాదకారులని ఆంగ్లేయ వలసపాలకులు స్థిరమైన అభిప్రాయానికి రావడం వలన స్వాతంత్ర్య సమరయోధులను తిరుగుబాటుదారులు / దోషులు (Mutineers / Convicts) గా పరిగణించారు. 1857 నాటి స్వాతంత్ర్య సమరయోధులను 1858లో అండమానుకు తరలించక ముందే ఆంగ్లేయ ఉన్నతాధికారులు తమ లేఖలలో కరడుగట్టిన నేరస్థుల కంటె ప్రభుత్వ వ్యతిరేకులు అత్యంత ప్రమాదకారులన్న భావాన్ని వ్యక్తంచేశారు. ఆ కారణంగా ఆంగ్లేయ ఉన్నతాధికారుల అభిమతం మేరకు క్రింది స్థాయి అధికారులు వారికి తీసిపోకుండా సమరయోధుల పట్ల వ్యవహరించాల్సిన తీరుతెన్నులను ముందస్తుగా నిర్దేశించుకున్నారు. ప్రధాన భూభాగానికి దూరంగా అండమానుకు తరలించబడిన సమర యోధులను 'కరడుగట్టిన నేరస్థుల కంటె ప్రమాదకారులు'గా క్రింది స్థాయి ఆంగ్లేయాధికారులు భావించటం వలన స్వాతంత్ర్య

సమరయోధులు ఆంగ్లేయాధికారుల అమానుష చర్యలకు గురికావాల్సి వచ్చింది. {Letter of C. Beadon, Secretary to Government of India to Captain H.H Man (No.87, Dated 15 January, 1858) – A History of Our Relations with the Andamanese, MV Portman, Office of the Superintendent of Government Printing, India, Calcutta, 1899, Page. 142}

## అసామాన్యులు కాస్తా సామాన్యులయ్యారు

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని ఆంగ్లేయుల ఆగ్రహానికి గురయ్యి అండమానుకు తరలించబడిన సమరయోధులలో రాజులు, రాణులు, నవాబులు, సంస్థానాధీశులు, ప్రధాన మంత్రులు, మంత్రులు, ఆస్థాన సలహాదారులు, సర్వ సైన్యాధిపతులు, సైన్యాధికారులు, కవి–పండితులు, విద్వాంసులు, ధార్మికవేత్తలు, సంపన్నకులీన వర్గాలకు చెందిన ప్రముఖులున్నారు. అత్యంత వైభవ ప్రాభవాలతో పాలన చేసిన పాలకులు, ఆ పాలకుల ఆస్థానాలలో తమ ప్రతిభాపాటవాలతో అధికార–అనధికారులుగా వెలుగొందిన ప్రముఖులు ఆంగ్లేయుల పరిభాషలో 'తిరుగుబాటుదారులు / దోషులు' అయ్యారు. భారత ప్రధాన భూభాగంలో వీరంతా ఎలాగున్నా, ఎంతటి వైభవప్రాభవాలను అనుభవించినప్పటికి 'తిరుగుబాటుదారులు / దోషులు' గా అండమానులో అడుగు పెట్టగానే ఆ అసామాన్యులు కాస్తా ఆంగ్లేయాధికారుల దృష్టిలో సామాన్యులయ్యారు.

## భయంకరారణ్యం

అండమాను–నికోబార్ దీవులన్నీ దట్టమయిన అడవులలో నిండి ఉన్నాయి. ఈ దీవుల చుట్టూ సముద్రం చుట్టుకుని ఉంటుంది. నిరంతర వర్షాల వాతావరణం అలుముకుని ఉంటుంది. ఆ కారణంగా నేలంతా చిత్తడి చిత్తడిగా ఉండి అడుగు తీసి అడుగు పెట్టడం కష్టం. అండమాను 'కాకులు దూరని కారడవి ... చీమలు దూరని చిట్టడవి'లా ఉంటుంది. స్పర్శ తగిలితే చాలు శరీరంలోని రక్తాన్ని జుర్రున పీల్చే జలగలు మిక్కుటంగా అక్కడ పారాడుతుంటాయి. వృక్షాల ఆకుల మీద నివాసం ఉంటూ మనిషి వాసన సోకగానే చెట్ల ఆకుల మీద నుండి జర్రున జారిపడి క్షణాలలో మనిషి శరీరంలోని రక్తాన్ని ఖాళీచేయగల పెద్దపెద్ద జలగలకు ఇక్కడి అడవులు ఆవాసం. ముట్టీ ముట్టగానే ప్రాణాలను హరించగల పెద్ద సైజు తేళ్ళు, విషపు పురుగు–పుట్ర, క్రిమి–కీటకాలు మిక్కుటం. మలేరియా వ్యాధి వ్యాప్తిచేయు దోమలు ఇక్కడా అక్కడా అని కాకుండా అండమాను అంతటా రాజ్యమేలుతూ, మలేరియా వ్యాధిని శరవేగంగా వ్యాప్తి చేస్తుంటాయి. అడవి అంతటా తారాడు–పారాడు

భయానక విషసర్పాలిక్కడ అసంఖ్యాకం. ఆ సర్పాలు వృక్షాల కొమ్మల మీద నుండి జర్రున జారి పడుతూ విషపుకాటుతో మనిషిని గాని జంతువులను గాని క్షణాలలో బలితీసుకోగల సర్పాలు అండమాను అంతా నిండి ఉండి మనిషి అడుగు తీసి అడుగు వేయడం కష్టతరమయ్యేది. ఈ విషయాలను స్వాతంత్ర్య సమరయోధులు Vinayak Damodar Savarkar తన My Transportation for Life అను గ్రంథంలోని The Andamans అను ప్రధాన ఆధ్యాయంలో భాగంగా The Bed of Malaria, Leeches and Serpents అను రెండు ఉప శీర్షికల క్రింద అండమానులోని భయానక పరిసరాలు, ఆ పరిసరాలలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు అనుభవించిన భయంకర పరిస్థితులను సవివరంగా పేర్కొన్నారు. (My Transportation for Life, Veer Savarkar, Prabhat Prakashan, New Delhi, 2020. Page. 69-71)

## అడుగుపెట్టగానే కాయకష్టం ఆరంభం

భయానక వాతావరణం, భౌగోళిక పరిస్థితులకు ఆలవాలైన అండమానులో కాళ్ళకు, చేతులకు సంకెళ్ళతో అడుగు దీసి అడుగు పెట్టడం కూడా కష్టంగా ఉన్న పరిస్థితులలో అండమానులో అడుగు పెట్టగానే స్వాతంత్ర్య సంగ్రామ యోధులను ఆంగ్ల అధికారులు కూలీలుగా మార్చివేశారు. 'తిరుగుబాటుదారులు / దోషులు'గా పరిగణించబడిన స్వాతంత్ర్య సమరయోధులను అండమానుకు పంపుతున్న ఆంగ్ల ప్రభుత్వం ఎటువంటి ముందస్తు ఏర్పాట్లు చేయలేదు. ఆ కారణంగా బహిరంగ జైలు (Open Jail) గా ఉన్న అండమానులో సమరయోధులను బంధించి పెట్టడానికి అవసరమైన పాకల (Barracks) తోపాటుగా, ఆంగ్లేయాధికారుల నివాసగృహాలు, గిడ్డంగులు తదితర నిర్మాణాలను సమరయోధుల ద్వారా చేయించడానికి ఆంగ్ల అధికారులు సిద్ధమయ్యారు.

అండమానుకు తరలించబడిన సమరయోధులను జట్టుకు 25 మందిగా అండమానును నివాసయోగ్యంగా మార్చడానికి ఉపక్రమింపజేశారు. భూమిని చదును చేయడం కోసం బలంగా ఎదిగి ఉన్న వృక్షాలను, చిక్కగా అలుముకున్న చెట్లతీగెలను తొలగించడంతో ఆరంభమయి స్థానిక ఆదిమ జాతుల ప్రజలు ఏర్పరచ్చుకున్న కాలిబాటలను బట్టి రాకపోకలకు రహదార్లు ఏర్పాటుకు రాళ్ళురప్పలు, గట్టులు-గుట్టలు తొలగించడం తదితర పనులతో ఆండమాను శిక్షాక్షేత్రం నిర్మాణం ముందుకు సాగింది.

స్వదేశంలో, సంస్థానాలలో అత్యంత విలాసవంతమయిన ప్రాసాదాలలో కూర్చొని మంతనాలు చేయడం, యుద్ధరంగాన ఆయుధం చేత బట్టి శత్రువులను దునుమాడటం, కవి- పండిత సభలలో పాల్గొని తమ ప్రతిభను ప్రదర్శించే ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించటం

తప్ప గొడ్డలి, గునపం, పార, పలుగు కత్తి, సుత్తి లాంటి పనిముట్లను ఎప్పుడూ చేపట్టి ఎరగని ఆ కులీనులకు ఆంగ్లేయులు అప్పగించిన పని కష్టమయ్యింది. అలవాటు లేని పనులు, పరిచయం లేని భయంకర అటవీ ప్రాంతం, భయానక క్రిమికీటకాలు, విషసర్పాలు పారాడాతున్న దట్టమయిన అడవిలో వృక్షాలను నరకడం, చెత్తా-చెదారాన్ని దూరం చేసి భూమిని ఆవాసాల నిర్మాణానికి అనుగుణంగా చదును చేయడం లాంటి పనులను సమరయోధుల చేత ఆధికారులు చేయించసాగారు. ఆ పనులు చేయడానికి అవసరమగు కనీస ఏర్పాట్లు, సదుపాయాలు కూడా లేకుండా, కాయకష్టం చేయడం వలన సమరయోధులకు ఆ పని నరకప్రాయమయ్యింది. అటవీ ప్రాంతమంతా విస్తరించిన మహా వృక్షాలు, వాటికి దట్టంగా అల్లుకుపోయిన బలమైన తీగలు, లతలను నరికి చెట్లను నేలకూల్చడం, వాటిని ఇతర ప్రాంతాలకు తరలించడం కూడా చాలా కష్టతరమయ్యింది.

ప్రతికూల వాతావరణం, ప్రతికూల భౌతిక - భౌగోళిక పరిస్థితుల నేపథ్యంలో అప్పగించిన పనులు నిర్దేశిత కాల పరిమితులలో పూర్తి చేయడానికి స్వాతంత్ర్య సమర యోధులు ఎంతగా కష్టపడింది, ఎంతటి దుర్భర పరిస్థితులను అనుభవించింది అండమాను శిక్షాక్షేత్రం (Andaman Penel Settlemnet) సూపరింటెండెంట్ గా పనిచేసిన డాక్టర్ జేమ్స్ పాటిసన్ వాకర్ (Superintendent Doctor James Pattison Walker) ఆంగ్లేయ ఉన్నతాధికారులకు స్వయంగా పంపుకున్న నివేదిక వెల్లడిస్తుంది. అండమానులోని భౌగోళిక పరిస్థితులు, వాతావరణం, చిక్కగా-దట్టంగా పెరిగిన వృక్షాలు, ప్రాణాంతక పురుగు-పుట్రా, భయానక రోగకారకమయిన క్రిమికీటకాలు అధికంగా ఉండటం వలన అత్యంత ప్రమాదకర పరిస్థితులలో 'తిరుగుబాటుదారులు / దోషులు' చేయాల్సిన పనిభారం అధికమయ్యిందని, డాక్టర్ వాకర్ ఉన్నతాధికారులకు వివరించాడు. (A History of Our Relations with The Andamanese, MV Portman, Office of the Superintendent of Government Printing, India, Calcutta, 1899, Page. 254).

అండమానులోని సరికొత్త వాతావరణం, అక్కడి దుర్భర పరిస్థితులను తట్టుకోలేక అండమాను శిక్షాక్షేత్రం వచ్చిన నాలుగు మాసాలల్లోనే పలువురు స్వాతంత్ర్య సమరయోధులు అనారోగ్యం బారినపడ్డారు, మరికొందరు మృత్యువాత పడ్డారు. అండమాను శిక్షాక్షేత్రంలో వైద్య వసతి సౌకర్యం ఉన్నా కూడా వాతావరణ పరిస్థితులు, అండమాను అంతటా అసంఖ్యాకంగా పారాడుతున్న విష సర్పాలు, మలేరియా జ్వరాలను వ్యాప్తిచేయు భయంకర దోమలు, మనుషుల ప్రాణాలను క్షణంలో హరించివేయగల జలగలు, విషపు పురుగు-పుట్రా వలన 64 మంది తీవ్ర అనారోగ్యంతో అసువులు బాసారు. (Penal Settlement in

Andaman, R.C. Majumdar, The Ministry of Education and Social Welfare, Government of India, Delhi, 1975)

## కాయ కష్టానికి అరకొర పరిహారం

అంతటి భయానక అండమాను అడవుల్లో మన స్వాతంత్ర్య సమరయోధులు వెట్టి చాకిరి చెయ్యాల్సిన అగత్యం ఏర్పడింది. స్వస్థలాలలో ప్రభువులుగా, ప్రముఖులుగా వెలుగొందిన సమరయోధులు అండమాను శిక్షాక్షేత్రంలోని ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలకు 'జీ హుకుం' అంటూ రోజుకు తొమ్మిది గంటల పాటు, ఎండా-వాన అనకుండా కాయకష్టం చేయాల్సి వచ్చింది. ఆ ప్రతికూల వాతావరణంలో సమరయోధులు చేసిన కాయకష్టానికి రోజుకు అణా తొమ్మిది పైసల (One Anna and Nine Paise) పారితోషికం మాత్రమే లభించేది. ఈ పారితోషికంతో మాత్రమే సమరయోధులు తమ ఆహారం, బట్టలు సమకూర్చుకొని ఇతర అవసరాలు తీర్చుకోవాల్సిన దుస్థితి. ఆహారం, బట్టలు, ఇతర అవసర సామగ్రి అండమాను శిక్షాక్షేత్రంలోని ఆంగ్ల ప్రభుత్వ స్టోర్స్ నుండి తీసుకోవాల్సి ఉంటుంది.

## డాక్టర్ జేమ్స్ పాటిసన్ వాకర్ క్రౌర్యం

ఒకవైపున పనిభారం ఎక్కువయ్యిందని వాపోతున్నప్పటికి సమరయోధుల నుండి అలవికానంత పనిని రాబట్టుకునేందుకు డాక్టర్ వాకర్ వారి పట్ల క్రూరంగా వ్యవహరించడం మాత్రమే కాకుండా చాలా అమానుషంగా ప్రవర్తించాడు. అండమాను శిక్షాక్షేత్రం వచ్చీరాగానే తామెప్పుడు చేసి ఎరుగని పనులను వారికి అప్పగించడం, నిర్ధేశిత సమయం లోగా నిర్ధేశిత అలవికాని పనిని పూర్తిచేయాలన్న ఆంక్షలు పెట్టడం, పని పూర్తి చేయలేకపోయిన వారి పట్ల అమానుషంగా వ్యవహరించడం వలన సమరయోధులు అంతులేని మనోవ్యధకు గురయ్యారు. అలవాటు లేని పనుల వలన కాళ్ళు చేతులు బొబ్బలెక్కి, రక్తం కారుతున్నా ఓర్చుకుంటూ పని చేయాల్సి వచ్చేది. అప్పగించిన పనిని, నిర్దేశిత సమయం లోగా పూర్తి చేయకుంటే స్వయంగా డాక్టర్ వాకర్, ఆ తరువాత ఆయన సిబ్బంది చేతుల్లో చిత్రహింసలకు, కొరడా దెబ్బలకు కూడా సమరయోధులు గురికావాల్సిన దుస్థితి వచ్చేది.

గతంలో ఎప్పుడూ కాయ-కష్టం ఎరుగని, దాస-దాసీ జనంతో పరివేష్టితమయి గడిపిన కులీన కుటుంబాల సమరయోధులు రోజుకు కనీసం తొమ్మిది గంటల పాటు పని చేయాలన్న నిబంధనకు గురయ్యారు. ఉష్ణమండల ప్రాంతంలో తొమ్మిది గంటలపాటు అడవుల్లో భయంకర పురుగూ - పుట్రా నుండి తమను తాము రక్షించుకుంటూ సంక్లిష్టతరమయిన కాయకష్టం నిర్వహించలేక సమరయోధులు నరకయాతనలు

అనుభవించారు. అప్పగించిన పనులు చేయడం ఆయా వ్యక్తులకు అలవాటు ఉందా లేదా, వారు చేయగలరా లేదా అనే కనీస ఆలోచనకు కూడా ఆస్కారం ఇవ్వకుండా పని పూర్తికానట్టయ్యితే సమరయోధుల మీద డాక్టర్ వాకర్ కొరడా దెబ్బల వర్షం కురిపించసాగాడు. ఆ కారణంగా డాక్టర్ వాకర్ సమరయోధుల విమర్శలకు గురయ్యాడు. (The Andaman Islands, FAM Das, Good Shepherd Convent Press, Bangalore, 1937, Page. 37)

## చావుకు సిద్ధమయ్యి స్వస్థలం దిశగా పరుగులు

డాక్టర్ వాకర్ అమానుష చర్యలు ఇలా ఉండగా ప్రధాన భూభాగం నుండి దూరంగా స్వజనానికి, స్వగ్రామానికి అందుబాటులో లేనంత కడు దూరాన ఉండటం, స్వగ్రామం, స్వజనం వద్దకు చేరుకోలేనంత సుదీర్ఘకాలం శిక్షలను అనుభవించాల్సిన గడ్డు పరిస్థితులతో సతమతమౌతున్న సమరయోధులు కలవరపాటుకు గురయ్యారు. అనుభవించాల్సిన శిక్షాకాలం ఎంతున్నా స్వస్థలాలలో ఉన్న జైళ్లల్లో ఉన్నట్టయితే స్వజనుల సందర్శన లభించే అవకాశం తోపాటుగా స్వజనానికి దగ్గరగా ఉన్నామన్న మానసిక సంతృప్తి ఉంటుంది. అలా కాకుండా సుదూరన ఉండటం. తిరిగి స్వస్థలాలకు చేరటం ఇక దుస్సాధ్యం అన్న భావన బాగా బలపడి, డాక్టర్ వాకర్ అమానుష చర్యలను భరించలేని అసహనం పెరిగి పోవడంతో అండమాను నుండి ప్రధాన భూభాగానికి పలాయానం చిత్తగించేందుకు పలువురు ప్రయత్నాలు ఆరంభించారు. అవకాశం చిక్కితే ప్రాణాలకు తెగించి దుర్భేద్యమైన అడవులు, సముద్ర జలాల వైపుగా తప్పించుకుని వెళ్ళడానికి సిద్ధపడ్డారు.

అండమాను నుండి ఆవలి తీరంగా ఉన్న బర్మా సముద్ర తీర ప్రాంతం దగ్గరగా కన్పించడం, దట్టమయిన అండమాను అడవుల్లో నుండి చిక్కకుండా ముందుకు సాగితే ఆవలి వైపున వచ్చే సముద్ర తీరం నుండి ఈదుకుంటూ భారత ప్రధాన భూభాగానికి చేరుకోవడం అత్యంత సులభమని సమరయోధులు భావించారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారుల, అండమాను శిక్షాక్షేత్రం సిబ్బంది కన్నుగప్పి తప్పించుకునేందుకు విఫల ప్రయత్నాలు చేసిన పలువురు మృత్యువాతపడ్డారు.

ఈ మేరకు 1858 మార్చి నుండి ఏప్రిల్ వరకు అండమాను శిక్షాక్షేత్రం నుండి తప్పించుకొడానికి ప్రయత్నం చేసిన 258 మందిలో 88 మంది పట్టుబడ్డారు. ఆ 88 మందిలో 86 మందిని డాక్టర్ వాకర్ ఒక్కరోజులో నిర్దాక్షిణ్యంగా ఉరికంబాలకు బలిచేసి తన క్రూరత్వాన్ని చాటుకున్నాడు. (Black Days in Andaman & Nicobar Islands, Rabin Raychowdhury, Manas Publications, New Delhi, 2004. Page 255)




## జట్లు జట్లుగా అండమానుకు తరలింపు

ఆంగ్ల ప్రభుత్వం చేత శిక్షలు ఖరారయిన స్వాతంత్ర్య సమరయోధుల ప్రథమ జట్టు 1858 మార్చి పదిన అండమాను దీవులకు చేరుకుంది. ఆ తరువాత నుంచి పలు దఫాలుగా అటు స్వాతంత్ర్య సమరయోధులు ఇటు నేరస్థులు జట్లు జట్లుగా అండమానులోని శిక్షాక్షేత్రం చేర్చారు. ఈ విధంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న యోధులలో శిక్షలకు గురయిన యోధులతోపాటుగా వివిధ భయానక నేరాలకు పాల్పడిన నేరస్థులను కూడా అండమానుకు పంపడం ఆరంభమయ్యింది. ఈ మేరకు వచ్చి చేరుతున్న స్వాతంత్ర్య సమరయోధుల చేత అటవీ ప్రాంతంలోని చెట్లను నరికించి శుభ్రం చేయడం, నిర్మాణాల కోసం భూమిని చదును చేయడం, ఆవాసాల నిర్మాణం, రహదార్ల ఏర్పాటు తదితర కార్యక్రమాలను డాక్టర్ వాకర్ ముమ్మరం చేసాడు. అండమాను శిక్షాక్షేత్రం అభివృద్ధి ప్రధాన లక్ష్యంగా సమరయోధులను, నేరస్థులను బానిసలుగా పరిగణిస్తూ రోజుకు 14 గంటలపాటు అలవిగాని చాకిరిని వారి చేత చేయించారు.

అండమానులోని పోర్టు బ్లయర్ హార్బర్ (Port Blair Harbour) చుట్టూతా రాస్ ఐలాండ్ (Ross Island), ఛాతం ఐలాండ్ (Chatham Island), వైపర్ ఐలాండ్ (Viper

Island) తదితర దీవులలో నివాసయోగ్యమయిన ఏర్పాట్లు, సమర యోధులను బంధించి పెట్టడానికి అవసరమయిన జైళ్ళ నిర్మాణాలు, శిక్షలు విధించడానికి ప్రత్యేక ఏర్పాట్లను డాక్టర్ వాకర్ ఆరంభించాడు. అధికారుల నివాసాలు, శిక్షాక్షేత్రం ప్రధాన కార్యాలయం తదితర ఇతర కార్యాలయాల నిర్మాణం కోసం రోస్ ఐలాండ్ (Ross Island) ను ఎంపిక చేశాడు. క్రమశిక్షణారాహిత్యానికి పాల్పడుతున్న 'తిరుగుబాటుదారులు/దోషుల'ను నిర్బంధించడానికి, శిక్షలు విధించడానికి ప్రత్యేకమైన బందిఖానాలు, సమరయోధులకు విధిస్తున్న వివిధ రకాల క్రూర శిక్షల సమాచారం బయట ప్రపంచానికి పొక్కకుండా ఉండేలా ప్రత్యేక తరహాలో వైపర్ ఐలాండ్ (Viper Island) మీద నిర్మాణాలు చేయించాడు. ఈ నిర్మాణాలన్నిటికి 'తిరుగుబాటుదారులు/దోషులు' కాయకష్టం అందించారు. ఒకవైపున ఈ నిర్మాణాలు పూర్తయ్యే కొద్దీ రోస్ ఐలాండ్‌లో వెయ్యి మందికి సరిపడ బ్యారక్స్ 1858 నవంబరు ఆరు నాటికి పూర్తయ్యాయి. అప్పటి నుండి ప్రతి ఏడాది వెయ్యి మంది 'తిరుగుబాటుదారులు/దోషులు' అండమాను పంపడానికి అవసరమగు ఏర్పాట్లు పూర్తి చేసినట్టు డాక్టర్ వాకర్ తెలియజేశాడు.

## చిత్రహింసల కర్కశ కోన 'వైపర్ ఐల్యాండ్'

డాక్టర్ వాకర్ వైపర్ ఐలాండ్ (Viper Island) లో ఏర్పాటు చేసిన జైళ్ళు, ఉరి శిక్షాగృహం (Hanging House) వలన భయంకర చిత్రహింసల కోనగా వైపర్ ఐలాండ్ ప్రసిద్ధి పొందింది. అండమాను శిక్షాక్షేత్రంలో వైపర్ ఐలాండ్‌లో పలు శాశ్వత నిర్మాణాలను కాంక్రీట్‌తో చేపట్టారు. అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడిన 'తిరుగుబాటుదారులు / దోషులు' డాక్టర్ వాకర్, ఆయన ఆంగ్లేయ సిబ్బంది పెడుతున్న ఇక్కట్లను భరించలేక ఎదురు తిరగడం, తప్పించుకుని పారిపోవడం లాంటి చర్యలకు పాల్పడినప్పుడు వైపర్ ఐలాండ్‌లో నిర్మాణం చేసిన ప్రత్యేక జైళ్ళకు వారిని తరలించి చిత్రహింసల పాల్జేయడం నిత్యకృత్యం అయ్యింది. క్రమశిక్షణను ఉల్లంఘించారన్న నెపం మీద కాళ్ళకు చేతులకు కలిపి సంకెళ్ళు వేయడం, కూర్చోడానికి వీలు లేకుండా సంకెళ్ళతో పాటుగా ఇనుప రాడ్ బిగించి రాత్రి-పగలు అని తేడా లేకుండా నిర్విరామంగా నిల్చోబెట్టడం, పదిమంది పదిహేను మందిని కలిపి బారుగా ఉన్న ఇనుపరాడ్‌ను 'తిరుగుబాటుదారులు / దోషులు'ల కాళ్ళ మధ్య నుండి బిగించటం, బిగించటం మాత్రమే కాకుండా ఆ స్థితిలో వారి చేత మండుటెండలో గంటల తరబడి కాయకష్టం చేయించటం పరిపాటి అయ్యింది. ఆ సంకెళ్ళను, బేడీలను, ఇనుప రాడ్‌లను రాత్రి పూట కూడా తొలగించకుండా సమరయోధులను నరక యాతనలకు గురి చేయడం అక్కడ సర్వ సాధారణమయ్యింది. ఈ భయానక శిక్షలను అనుభవిస్తున్న

'తిరుగుబాటుదారులు / దోషుల' ను 'వైపర్ ఐలాండ్ చైన్ గ్యాంగ్' (Viper Island Chain-Gang) అని ఆంగ్లేయాధికారులు ప్రత్యేకంగా నామకరణం చేశారు.

క్రమశిక్షణ ఉల్లంఘన సాకుతో సమరయోధులు పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరించిన డాక్టర్ వాల్కర్ సమరయోధుల ప్రాణాలను హరించడానికి వైపర్ ఐల్యాండ్‌లో ప్రత్యేక నిర్మాణం కూడా చేయించాడు. డాక్టర్ వాల్కర్ ప్రత్యేక శ్రద్ధతో నిర్మాణం చేయుంచిన ఆ నిర్మాణం 'ఉరిశిక్షా గృహం' (Hanging House) గా పేర్గాంచింది. ఈ ఉరిశిక్షా గృహంలోనే 1872 ఫిబ్రవరి 8న బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ మేయో (Viceroy of India Lord Mayo) ను హతమార్చిన సమరయోధుడు, వహాబీ వీరుడు మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రీదిని 1872 మార్చి 11న ఉరితీసారు. అండమాను-నికోబారు దీవులకు వచ్చిన సందర్శకులు మహమ్మద్ షేర్ అలీ ఖాన్ సాహస చర్యను స్మరించుకుంటూ ఈనాటికి వైపర్ ఐలాండ్ లోని ఉరిశిక్షా గృహాన్ని (Hanging House) సందర్శించి షేర్ అలీ కి నివాళులు అర్పిస్తున్నారు.

## డాక్టర్ వాకర్ మీద దాడి

డాక్టర్ వాకర్ 'తిరుగుబాటుదారులు / దోషులు'లలో ప్రధానంగా స్వాతంత్ర్య సమరయోధుల పట్ల అమానుషంగా, అనాగరికంగా ప్రవర్తిస్తూ వారి నుండి పని రాబట్టేందుకన్న నెపంతో రాక్షస శిక్షలను విధిస్తూ ఆ శిక్షలను అత్యంత క్రూరంగా అమలు చేసాడు. ఆ చర్యల వలన డాక్టర్ వాకర్ పట్ల సమరయోధులలో క్రమంగా ఆగ్రహం గూడు కట్టసాగింది. అలా గూడుకట్టుకున్న ఆగ్రహం 1859 ఏప్రిల్ ఒకటిన భగ్గుమంది. పంజాబ్ నుండి విచ్చేసిన సుమారు 200 మంది 'తిరుగుబాటుదారులు / దోషులు' డాక్టర్ వాకర్ ను అంతమొందించి అండమాను శిక్షా క్షేత్రాన్ని స్వాధీనం చేసుకోవాలనుకున్నారు. అందుకు గాను డాక్టర్ వాకర్‌ను అంతం చేయాలని లక్ష్యాలకు అనుగుణంగా పటిష్టమయిన ప్రణాళిక సిద్ధం అయ్యింది. ఆ ప్రణాళిక ప్రకారంగా 1859 ఏప్రిల్ ఒకటిన డాక్టర్ వాకర్ మీద దాడి చేయాలని నిర్ణమయయ్యింది. ఆ రహస్య నిర్ణయాన్ని కాస్తా మోతిరాం అను నమ్మకద్రోహి పూసగుచ్చినట్టుగా డాక్టర్ వాకర్‌కు సమాచారం చేరవేశాడు. అప్రమత్తుడయిన ఆంగ్లేయుడు తగిన రక్షణచర్యలను తీసుకున్నందున సమరయోధుల ప్రయత్నం విఫలమయ్యింది.

ఈ సందర్భంగా డాక్టర్ వాకర్‌ను అంతం చేయాలన్న లక్ష్యంతో అతనికి తుపాకి గురిపెట్టి సర్బార్ షాహ్ (Sarbar Shah) ముందుకు సాగుతుండగా మథురా దాస్ (Mathura Das) అనునతడు సర్బార్ షాహ్ ను అడ్డుకుని నిలువరించాడు. ఈలోగా వాయవ్య సరిహద్దు ప్రాంతాల నుండి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న స్వాతంత్ర్య సమరయోధులు

నుజ్జర్ ముహమ్మద్ (Nuzzar Muhammad) అడ్డుగా నిలచిన మథురా దాస్ ను నెట్టివేస్తూ డాక్టర్ వాకర్ వైపుకు శరవేగంగా దూసుకెళ్ళాడు. ఆ వాతావరణంలో అంగ్లేయాధికారి డాక్టర్ వాకర్ ప్రాణభయంతో గడగడ వణుకుతూ ఆశ్రయం కోసం పరుగులెత్తి సురక్షిత ప్రాంతంలో దాక్కొని బ్రతికిపోయాడు. ఈలోగా అండమాను శిక్షాక్షేత్రం భద్రతా సిబ్బంది అప్రమత్తమయ్యి నుజ్జర్ ముహమ్మద్ మీదకు లంఘించి ఆతడిని నిర్బంధించారు.

## అండమాను ఆదిమజాతి జనుల దాడులు

అండమాను అడవుల్లోని వృక్షసంపదను ఇష్టారాజ్యంగా వినియోగించుకుంటున్న ఆంగ్లేయాధికారులు, సిబ్బంది, సమరయోధుల పట్ల అండమాను ఆదిమజాతుల ప్రజలు ఆగ్రహించసాగారు. అడవిలోకి చొచ్చుక వస్తూ తమ ప్రాంతాల మీద ఆధిపత్యం వెలగబెడుతున్నారన్న కోపంతో ఆదిమజాతుల జనులు రగిలిపోసాగారు. అండమాను శిక్షాక్షేత్రానికి సమరయోధులను తరలిస్తున్న ఆంగ్లేయాధికారులు భద్రతకు తగినంత సిబ్బందిని మాత్రం ఏర్పాటు చేసుకోలేదు. ఆ కారణంగా అండమానులో సాగుతున్న నిర్మాణాలకు అవసరమైన కలపను మాత్రమే కాకుండా ఆహారం-ఆహార్యానికి అవసరమగు సామగ్రిని సమీకరించడానికి అడవి లోపలికి వెడుతున్న సమరయోధులు, ఆంగ్లేయాధికారులు, శిక్షా క్షేత్రం భద్రతా దళాల మీద ఆదిమజాతి ప్రజలు అడపాదడపా దాడులు చేస్తూ వచ్చారు.

## చిరస్మరణీయం 'అబెర్‌దీన్ పోరాటం'

అండమాను దీవులను కొద్దికొద్దిగా ఆక్రమించుకుంటున్న ఆంగ్లేయాధికారుల మీద చిన్నపాటి దాడుల స్థాయి నుండి శిక్షాక్షేత్రం మీద భారీ స్థాయి పోరాటానికి ఆదిమజాతుల ప్రజలు సిద్ధమయ్యారు. ఆవాసాల నిర్మాణం కోసం అవసరమగు సామగ్రి సమకూర్చేందుకు పనుల మీద అడవుల్లోకి వెడుతున్న సమరయోధుల మీద స్థానిక జనులు దాడులు చేయడం తొలుత నుండి ఆరంభమయ్యింది. ఆ దాడులకు ప్రతిగా ఆంగ్లేయాధికారులు కూడా దాడులు జరిపారు. ఆ కారణంగా 1859 మే 14న ఆదిమ జాతుల ప్రజలు అండమాను శిక్షాక్షేత్రం మీద భారీ దాడికి అన్ని విధాలుగా సిద్ధమయ్యారు. చివరకు మే 16 సాయంత్రానికి అబెర్‌దీన్‌కు రెండు మైళ్ళదూర ప్రాంతానికి చేరుకుని ఆ రాత్రికి అక్కడ తిష్టవేశారు. ఆ మరుసటి రోజు అనగా మే 17న శిక్షా క్షేత్రం, ఆంగ్లేయుల ఆవాసాలు, ఇతర కార్యాలయాల మీద దాడి చేయడానికి నిర్ణయించుకున్నారు.

ఈ దాడికి జరుగుతున్న ఏర్పాట్ల సమాచారాన్ని 'తిరుగుబాటుదారులు / దోషులు'గా 1858లో అండమాను జైలుకు పంపబడిన తొలిజట్టుకు చెందిన దూథ్‌నాథ్

తివారి (Dudhnath Tiwari) ఆంగ్లేయాధికారి డాక్టర్ వాకర్‌కు తెలియబర్చాడు. ఆ విధంగా లభించిన ముందస్తు సమాచారంతో అప్రమత్తమయ్యి 1859 మే 17న అబెర్‌దీన్ (Aberdeen), ఆల్టా పాయింట్ (Alta Point) వద్ద ఆదిమజాతి జనులతో సాగిన పోరాటంలో ఆంగ్ల అధికారులు, సిబ్బంది చావు తప్పి కన్ను లొట్టబోయినట్టుగా బ్రతికి బయటపడ్డారు.

అండమాను చరిత్రలో ఈ పోరాటం 'అబెర్‌దీన్ పోరాటం' (Battle of Aberdeen) గా ప్రసిద్ధికెక్కింది. మాతృభూమిని మెల్లమెల్లగా ఆక్రమించుకుంటున్న ఆంగ్ల ప్రభుత్వాధికారుల నుండి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం అండమాను ఆదిమజాతి జనులు విల్లు-బాణాలను ఎక్కుపెట్టి ఆంగ్లేయుల తుపాకిగుళ్ళ వర్షాన్ని లెక్కచేయక అత్యంత ధైర్య సాహసాలతో ఎదుర్కొన్నారు. ఆ కారణంగా 'అబెర్‌దీన్ పోరాటం' పట్ల గౌరవాన్ని ప్రకటిస్తూ 1994 ఆగస్టు 15న ప్రస్తుతం అండమానులోని వాటర్ స్పోర్ట్ కాంప్లెక్స్ (Water Sports Complex) సమీపాన భారత ప్రభుత్వం ప్రత్యేక స్మారక స్థూపం ఏర్పరిచింది.

## ప్రముఖ స్వాతంత్ర్యసంగ్రామ యోధులు

ఆంగ్లేయుల నుండి మాతృభూమి విముక్తి ఆశిస్తూ 1857లో భారతదేశం అంతటా ఉప్పెనలా వెల్లువెత్తిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని అండమాను జైలుకు తరలించబడిన యోధులలో ప్రముఖులు మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది. భారతదేశం అంతటా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం ప్రజ్వరిల్లడానికి కారణమయిన 'ఫత్వా-ఏ-జిహద్' (Fatwa-e-Jihad) ను తానే స్వయంగా సృష్టించి విడుదల చేశానని న్యాయస్థానంలో విస్పష్టంగా ప్రకటించిన ఆయనను ఆంగ్లేయులు అండమాను జైలుకు తరలించగా ఆయన అండమానులో చివరిశ్వాస విడిచారు.

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా వివిధ ప్రాంతాలలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో ప్రముఖ పాత్ర నిర్వహించి అండమానుకు తరలించబడి అండమానులో కన్నుమూసిన యోధులలో అవధ్ మహారాణి బేగం హజరత్ మహల్‌తో కలసి పోరాడిన నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ (Nawab Ali Mohammad Khan), అలహాబాదులో స్వతంత్ర్య రాజ్యస్థాపన చేసి అంగ్లేయులను అలహాబాదు రాజ్య పరగణా నుండి తరిమికొట్టిన మౌల్వీ లియాఖత్ అలీ ఖాన్ కూడా ఉన్నారు.

అండమాను జైలు అధికారిగా స్వాతంత్ర్య సమరయోధుల మీద అలవికాని కాఠిన్యాన్ని ప్రదర్శిస్తున్న డాక్టర్ వాకర్ మీద జరిగిన దాడిలో ప్రధాన పాత్ర పోషించిన నుజ్జర్ మొహమ్మద్, ఆంగ్లేయుడి అనుచిత ప్రవర్తనకు సమాధానంగా విరుచుకపడిన బండా

సంస్థానానికి అధినేత నవాబు అలీ బహదూర్ ప్రధానమంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ తదితర ప్రముఖులు అండమాను శిక్షాక్షేత్రంలో అంతిమశ్వాస విడిచారు. ఈ విధంగా దర్వేష్ అలీ ఖాన్, ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి, బహు భాషా పండితుడు ఖుతుబ్ షాహ్, ఉర్దూ కవి. మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోహాబాది లాంటి పలువురు ప్రముఖులను ఆంగ్లేయులు అండమానుకు తరలించి స్వస్థలాలు, స్వజనుల నుండి వారిని శాశ్వతంగా దూరం చేశారు.

## డాక్టర్ వాకర్ నిష్క్రమణ

అబెర్‌దీన్ పోరాటం పర్యవసానంగా డాక్టర్ వాకర్ 1859 అక్టోబర్ మూడున రాజీనామా చేశాడు. ఆ తరువాత డాక్టర్ వాకర్ స్థానంలో అండమాను శిక్షాక్షేత్రానికి అధికారులుగా వచ్చిన ఆంగ్లేయుల వ్యవహార సరళిలో మొత్తం మీద కొంత కాఠిన్యత తగ్గినా ఆంగ్లేయులను భరతగడ్డ మీద నుండి తరిమేయాలని కంకణం కట్టుకుని పోరాటాలు చేస్తున్న స్వాతంత్ర్య సమరయోధుల పట్ల డాక్టర్ వాకర్ అనుసరించిన అమానుష చర్యలు మాత్రం యథావిధిగా కొనసాగుతూ వచ్చాయి.

## ఆంధ్రప్రదేశ్ / తెలంగాణా నుండి అండమానుకు

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ / తెలంగాణారాష్ట్రాలలో కూడా అనాడు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా పోరాటాలలో పాల్గొన్న పలువుర్ని ఆంగ్లేయ ప్రభుత్వం అండమాను జైలుకు పంపింది. తెలంగాణ రాష్ట్ర రాజధాని సుప్రసిద్ధ హైదరాబాద్ నగరం నివాసి అయినటువంటి మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ (Moulvi Syed Alla-ud-Din) 1857 జూలై 17న హైదరాబాదులోని ఆంగ్లేయుల రెసిడెన్సీ మీద జరిగిన దాడికి నాయకత్వం వహించారు. ఆ తరువాత అరెస్టయిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ మీద విచారణ జరిపిన ఆంగ్లేయ–నిజాం న్యాయస్థానం యావజ్జీవిత కారాగారశిక్ష విధిస్తూ 1860లో అండమానుకు తరలించారు. 1889 వరకు అండమానులో గడిపిన మౌల్వీ అల్లావుద్దీన్ తన విడుదలను కోరుతూ ఇటు నిజాం ప్రభుత్వానికి అటు ఆంగ్లేయ ప్రభుత్వానికి పలు విజ్ఞప్తులు పంపుకున్నా ఫలితం లేకుండా పోయింది. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లలో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ వివరాలు ఉన్నాయి).**

మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ మాత్రమే కాకుండా నిజాం సంస్థానానికి చెందిన పలు సైనిక స్థావరాలలోని స్వదేశీ సైనిక యోధులు కూడా ఆంగ్లేయ–నిజాం ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగస్వాములయ్యారు. ఆనాటి నిజాం

సంస్థానం పరిధిలోని ప్రస్తుత మహారాష్ట్ర రాష్ట్రంలో భాగంగా ఉన్న ఔరంగబాద్ సైనిక స్థావరంలో 1857 జూన్ 12న తిరుగుబాటు జరిగింది. ఆంగ్లేయుల జోక్యం, ఆధిపత్యం నుండి స్వేచ్ఛ-స్వాతంత్ర్యం ఆకాంక్షిస్తున్న చిద్దాఖాన్ (Chidda Khan) నాయకత్వంలో తిరుగుబాటు పతాకాన్ని ఎగుర వేసారు. ఆ తిరుగుబాటు సందర్భంగా జరిగిన కాల్పులు, పోరాటంలో హైదరాబాదు మొదటి అశ్విక దళానికి చెందిన సయ్యద్ అహ్మద్ (Syed Ahmed) చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా సయ్యద్ అహ్మద్ తదితరులను ఆంగ్ల-నిజాం సైన్యాలు 1858లో నిర్బంధించాయి. అనంతరం విచారణ జరిపి సయ్యద్ అహ్మద్ ఆయన సహచరులయిన మరో 16 మంది తిరుగుబాటు యోధులకు యావజ్జీవిత కారాగారశిక్ష విధించి అండమాను జైలుకు తరలించమని న్యాయస్థానం తీర్పు ఇచ్చినందున పోరాట యోధులు సయ్యద్ అహ్మద్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పశ్చిమగోదావరి జిల్లాలోని యానాం (Yanam) ప్రాంతానికి చెందిన అన్నదమ్ములు హుసైన్ షాహ్ ఫకీర్, యతీం షా ఫకీర్ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో తమదైన పాత్ర నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, కృష్ణా జిల్లా, మచిలీపట్నం అప్పటి మసూలిపట్నంలో (Masulipatnam) 1857 జూలై మాసంలో మచిలీపట్నం సిపాయీలు, ఆంగ్ల ప్రభుత్వ పోలీసులు, సిపాయీలు కవాతు నిర్వహించు కవాతు మైధానం (Parade Ground) ఎదురుగా ఆంగ్లేయుల మీద తిరుగుబాటుకు, ధిక్కారానికి ప్రతీకగా ఆకుపచ్చ రంగు పతాకాన్ని (Green Flag) ఎగుర వేశారు. స్వదేశీ యోధుల తిరుగుబాటుకు చిహ్నంగా భావిస్తున్న ఆకుపచ్చ రంగు పతాకాన్ని ఎగురవేయడం మాత్రమే కాదు, 'ఆంగ్లేయులను నరికి వేయండి' (Slaughter the English) అంటూ హిందూస్థానిలో నినాదం రాసిన ప్లకార్డు (Placard) కూడా ఆ ఆకుపచ్చ రంగు పతాకం కర్రకు కట్టి ఉంచారు. (The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Volumes I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, Page. 147).

ఈ దృశ్యం ఆంగ్లేయాధికారుల మదిలో తీవ్ర కలవరానికి, భయానికి కారణం అయ్యింది. సమరయోధుల సాహసానికి ఆంగ్లేయ ఉన్నతాధికారులు కూడా ఆశ్చర్యపోయారు. అది కూడా పోలీసులు / సిపాయిల కవాతు నిర్వహించు మైదానంలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జెండాను ఎగుర వేయడం, ఆంగ్లేయులను చంపమంటూ బహిరంగంగా పిలుపు ఇవ్వడాన్ని ఆంగ్లేయాధికారులు సహించలేక పోయారు. ఆ చర్యకు పాల్పడిన వ్యక్తులను పట్టుకుని తమకు అప్పగించిన్నట్టయితే 500 రూపాయల బహుమానం ఇస్తామని ఆంగ్ల ప్రభుత్వం ప్రకటించింది. అరెస్టుల పర్వం ముమ్మరంగా సాగి హుసైన్

షాహ్ ఫకీర్, యతీం షా ఫకీర్ లను నిర్బంధించిన ఆంగ్ల ప్రభుత్వం ఇరువురికి శిక్షలు విధిస్తూ అండమాను జైలుకు తరలించింది. **(ఈ ఇరువురి యోధుల వివరాలు ఈ పుస్తకంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' లో ఉన్నాయి.)**

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల స్మారక స్థూపం

మాతృభూమి విముక్తి కోసం తమ ధన, మాన, ప్రాణాలను బలిపెట్టి ఆంగ్లేయ బలగాల మీద తిరగబడిన 1857 నాటి భారత ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుల స్మరణలో అండమానులో స్మారక స్థూపం ఏర్పాటయ్యింది. భారత ప్రథమ స్వాతంత్య సంగ్రామం ఆరంభమయ్యి వంద సంవత్సరాలు పూర్తయిన సందర్భాన్ని పురస్కరించుకుని 1957 ఆగస్టు 15న అండమానులోని జింఖానా మైదానం సమీపంలోని మరినా పార్కులో సెల్యులర్ జైలు (Cellular Jail) వద్ద ఈ స్మారక స్థూపం నిర్మాణమయ్యింది. ఆనాటి మన స్వాతంత్ర్య సంగ్రామ వీరులను స్మరిస్తూ, 'భారతదేశం లోని వివిధ రాష్ట్రాల నుండి 1857 నాటి జాతీయ విప్లవంలో పాల్గొని పరాయి ప్రభుత్వంచే అండమాను దీవులకు తరలించబడిన యోధుల పవిత్ర స్మృతిలో' (In hallowed memory of those heroes who participated in the National Revolution of 1857 from different states of India and were deported to Andaman Islands by an alien government) అని గౌరవాన్ని ప్రకటిస్తూ శిలా ఫలకాన్ని రూపొందించి ప్రతిష్టించారు.

## సమరయోధుల సమాచార లేమి

అండమానుకు ఎంతమంది ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులను తరలించారు, వారెవరెవరన్న సమగ్ర వివరాలు Directorate of Youth Affairs, Sports and Culture , Andaman & Nicobar Administration, Port Blair, Andaman వద్ద కూడా లేవు. ఈ విషయాన్ని Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Administration, Port Blair, Andaman 1998లో స్వయంగా ప్రచురించిన Unsung Heroes of Freedom Struggle in Andamans Who's Who గ్రంథం వెల్లడిస్తుంది.

ఈ గ్రంథంలోని సమాచారాన్ని కూర్చి, ఎడిటింగ్ (Compilation and Editing ) చేసిన రషిదా ఇక్బాల్ (Rashida Iqbal) ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'Unfortunately the number of Mutineers of 1857 transported to the Andaman is not exctly known' (Page No. 14) అంటూ తన Introduction లో స్పష్టం చేశారు. ఆ కారణంగా పలువురు స్వాతంత్ర్య సమరయోధులు రాసిన గ్రంథాలు, అండమానులో స్థిరపడిన సమరయోధుల కుటుంబీకులు, వారసులు వెల్లడించిన వివరాలు, పరిశోధకులు, రచయితలు తమ

గ్రంథాలలో పేర్కొన్న వివరాల ద్వారా మాత్రమే అండమానుకు తరలించబడిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వీరుల వివరాలు కొంతలో కొంత తెలుస్తున్నాయి.

## అండమాను జైలుకు మహిళా ఖైదీల రాక

అండమానుకు తొలుతగా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధులను జట్లు జట్లుగా పంపటంతో పాటు పలు సామాజిక నేరాలకు పాల్పడిన ఇతర కరడుగట్టిన నేరస్థులను, శిక్షలు విధించబడిన సంఘవ్యతిరేక శక్తులను కూడా అండమానుకు పంపడం ఆరంభమయ్యింది. అండమాను కంటె ముందుగా పలు ఇతర ప్రాంతాలలో ఆంగ్ల ప్రభుత్వం ఏర్పాటుచేసిన శిక్షాక్షేత్రాల నుండి కూడ నేరస్థులను సువిశాల అండమాను శిక్షాక్షేత్రానికి పంపసాగారు. ఈ మేరకు ఇటు స్వాతంత్ర్య సమరయోధులు, అటు కరడుగట్టిన నేరస్థులు అండమాను జైలుకు జట్లు జట్లుగా తరలించబడ్డారు.

1862 నుండి మహిళా 'తిరుగుబాటుదారులు / దోషులు' కూడా అండమాను శిక్షాక్షేత్రానికి తరలించడం ఆరంభమయ్యింది. మహిళకు ప్రత్యేకమైన బ్యారెక్స్ ఏర్పాట్లు చేశారు. ఈ మహిళలను శిక్షాకాలం తరువాత స్వయంపోషకులుగా (Self Supported) ఆంగ్లేయాధికారుల అనుమతి పొందిన పురుషులు వివాహం చేసుకోడానికి అధికారులు అనుమతించారు. అండమానుకు తరలించబడిన మహిళా 'తిరుగుబాటుదారులు / దోషులు' వారి శిక్షాకాలం పూర్తయ్యాక వారిని ఇష్టమొచ్చిన వారిని వివాహం చేసుకోడానికి ఆంగ్ల ప్రభుత్వం అనుమతించడం మాత్రమే కాకుండా అటువంటి జంటలు అండమానులో స్థిరపడడానికి తగిన విధంగా ప్రోత్సహించింది.

## అండమాను శిక్షా క్షేత్రానికి వహాబీ యోధులు

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధుల జట్ల తరువాత ఆంగ్లేయ ప్రభుత్వం వహాబీ యోధులను కూడా అండమానుకు తరలించడం ఆరంభించింది. ఆంగ్లేయ వ్యతిరేకతను బాగా పుణికి పుచ్చుకున్న వహబీ ఉద్యమానికి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని రాయబరేలి జిల్లాకు చెందిన సయ్యద్ అహమ్మద్ బరేల్వి (1786-1831) ఆద్యులు. ఆయన 1831లో కన్నుమూసాక ఆయన ప్రధాన శిష్యవర్గం మహమ్మద్ విలాయత్ అలీ (1790–1854), మహమ్మద్ ఇనాయత్ అలీ (0–1858) తదితరులు ఆంగ్లేయ వ్యతిరేక పోరాటాన్ని కొనసాగిస్తూ రంగం మీదకు వచ్చారు. ఈ సోదరద్వయం సితానా (Sitana) కార్యక్షేత్రంగా వహబీ భావజాలాన్ని మరింత విస్తృతపర్చడం మాత్రమే కాకుండా బీహారు రాష్ట్రం పాట్నా ప్రధాన కార్యస్థానం చేసుకుని ఇతర ప్రాంతాలకు వహాబీ ఉద్యమాన్ని విస్తరింపజేశారు.

## 1865 నుండి తరలింపు

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా వహాబీయోధులు తమ కార్యకలాపాలను విస్తృతం చేసేకొద్దీ ఆంగ్ల ప్రభుత్వం వారిని త్రీవ నిర్బంధాలకు గురిచెయ్యడం, వివిధ నేరారోపణలతో కేసులు, కుట్రకేసులు నమోదు చేయడం ఆరంభించింది. ఈ విధంగా ఆంగ్ల ప్రభుత్వం వహాబీ యోధుల మీద నమోదు చేసిన కేసులలో పాట్నా కుట్ర కేసు, రాజ మహల్ కుట్ర కేసు, అంబాలా కుట్ర కేసు, రాజాషాహి కుట్రకేసు, అజిమాబాద్ కుట్ర కేసు, మాల్దా కుట్ర కేసు లాంటివి ప్రధానమైనవి. ఈ కేసులలో నిందితులుగా పేర్కొన్న వహాబీ వీరులకు పలు రకాల కఠిన కారాగార శిక్షలు విధిస్తూ అండమానుకు తరలించవలసిందిగా ఆంగ్ల న్యాయస్థానాలు జారీచేసిన ఆదేశాల మేరకు అండమాను శిక్షాక్షేత్రానికి తరలింపు కార్యక్రమం 1865 నుండి ముమ్మరంగా సాగింది.

ఆంగ్ల న్యాయస్థానాల ఆదేశాల మేరకు భారీ సంఖ్యలో వహాబీ వీరుల తరలింపు ఆరంభమయినప్పటికి వహాబీలకు సంబంధించిన పూర్తి సమాచారం అందుబాటులో లేదు. Directorate of Youth Affairs, Sports and Culture Andaman & Nicobar Administration, Port Blair, Andaman వెల్లడిస్తున్న వివరాలతోపాటుగా The Silent Past of Andamans - Few Freedom Fighters of 1857 (Ahmad Mujtaba, Port Blair, Andaman, 2005). తదితర గ్రంథాల సమాచారం వలన అండమాను జైలుకు తరలించబడిన వహాబీ యోధుల వివరాలు కొంతలో కొంత తెలుస్తున్నాయి.

## అండమాను జైలుకు తరలిన వహాబీ ప్రముఖులు

అండమానుకు తరలించబడిన ప్రముఖ వహాబీ యోధులలో మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి (Moulana Mohammad Jaffar Thanesari) పేరెన్నికగలవారు. ఆయన విద్యాధికుడు మాత్రమే కాకుండా ధార్మిక పండితులు, బహుభాషాకోవిదులు. ఆయన పట్ల ఆంగ్లేయాధికారులు తొలుత రాక్షసంగా వ్యవహరించారు. ఆయనలోని విద్వత్తును బహు భాషల్లో ఆయనకు గల ప్రతిభను గ్రహించాక ఆయనకు కొన్ని సదుపాయాలు కల్పించి సంక్లిష్ట సాంకేతిక సమాచారం గల పలు గ్రంథాలను ఆయన ద్వారా అనువాదం చేయించుకున్నారు. స్వయంగా ఉర్దూ-అరబిక్ భాషలను అధికారులు చెప్పించుకున్నారు.

ఆ రోజుల్లో పర్షియన్, ఉర్దూ, అరబిక్ భాషలు పాలక వర్గాలలో బాగా చలామణిలో ఉన్నందున ఆ భాషలన్నీ తెలిసిన పండితులు మౌల్వీ యహ్యా అలీ, మున్షీ గులాం నబి, అబ్దుల్ రహీం అజామాబాది తదితరుల ద్వారా ఆంగ్లేయాధికారులు భాషాపరమైన సమస్యలను

పరిష్కరించుకున్నారు. ఈ క్రమంలో వహాబీ యోధులు అబ్దుల్ గఫార్, అబ్దుల్ రహీం అజిమాబాది, మున్షీ గులాం నబి, అబ్దుల్ రహీం అజామాబాది తదితరులు శిక్షాకాలం తరువాత విముక్తమయ్యి స్వస్థలాలు చేరుకున్నారు. మౌల్వీ అహ్మదుల్లాహ్, అమీరుద్దీన్ మౌల్వీ. మొహ్మద్ హుసైని, మహమ్మద్ షేర్ అలీ అఫ్రిది, మౌల్వీ యహ్యా అలీ తదితర యోధులు అండమాను జైలులోనే కన్నుమూసారు.

## ప్రతీకారం తీర్చుకున్న షేర్ అలీ

భారత వాయవ్యసరిహద్దు ప్రాంతం నుండి విచ్చేసిన సామాన్య వహాబీ కార్యకర్త మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రిది (Mahammad Sher Ali Khan Afridi) ఒక అసాధారణ సంఘటనకు సూత్రధారై చరిత్ర సృష్టించారు. 1872 ఫిబ్రవరి 8న బ్రిటిష్ వైశ్రాయ్ లార్డ్ మేయో (Lord Mayo) అండమాను శిక్షాక్షేత్రం సందర్శనకు వచ్చిన సందర్భాన్ని ఉపయోగించుకున్న షేర్ అలీ, ఆ ఆంగ్లేయుడిని అంతం చేసి సంచలనం సృష్టించారు. ఆంగ్ల న్యాయస్థానం షేర్ అలీకి మరణదండన విధించింది. 1872 మార్చి 11న వైపర్ ఐలాండ్‌లోని Hanging House లో ఉరిశిక్షను నవ్వుతూ స్వీకరించిన షేర్ అలీ అఫ్రిది భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో తనకంటూ ప్రత్యేక స్థానం ఏర్పర్చుకుని భారతీయ విప్లవకారులకు స్ఫూర్తిదాయకమయ్యారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లలో మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రిది వివరాలు ఉన్నాయి)**

## ప్రజోద్యమ యోధులు

ఆ తరువాతి కాలంలో భారతదేశంలోని పలు ప్రాంతాల నుండి విప్లవోద్యమాలు పుట్టుకొచ్చాయి. ఈ ఉద్యమాలలో ప్రధానంగా మహారాష్ట్రకు చెందిన వాసుదేవ బల్వంత పాడ్కే (Vasudev Balwant Phadke) లాంటి ఉద్యమనేతలు కొంత కాలం ఆంగ్లేయులను తమ విప్లవకరచర్యలతో ఆటపట్టించారు. ఆయన మార్గదర్శకత్వంలో ఉద్యమించిన పలువురు ఉద్యమకారులను ఆంగ్లేయ ప్రభుత్వం నిర్బంధించి అండమాను శిక్షాక్షేత్రానికి పంపింది. ఆ తరువాత మణిపూరు ప్రజల తిరుగుబాటు (Manipur Revolt), బర్మా రైతాంగ పోరాటాలు (Tharawadda Revolt) ఆంగ్లేయులను కలవరపెట్టాయి. ఈ తిరుగుబాటు / పోరాటాలను తీవ్రంగా అణిచివేసిన ఆంగ్ల ప్రభుత్వం తిరుగుబాటు యోధులను నిర్బంధించి, సుదీర్ఘ కారాగార శిక్షలు విధించి అండమాను జైలుకు తరలించింది. ప్రజోద్యమ యోధులను ప్రజలకు కడు దూరంగా అండమాను శిక్షాక్షేత్రానికి పంపి తిరుగుబాటు / పోరాటాల తీవ్రతను నియంత్రణకు ఆంగ్లేయ ప్రభుత్వం విఫల ప్రయత్నాలు సాగించింది.

## ఆలోచనలో పడ్డ ఆంగ్ల ప్రభుత్వం

అండమాను జైలు తొలి పర్యవేక్షణాధికారి డాక్టర్ వాకర్ మీద 1859లో జరిగిన దాడి, అండమాను చరిత్రలో 'అబెర్‌దీన్ పోరాటం' (Battle of Aberdeen) గా ప్రసిద్ధికెక్కిన అండమాను ఆదిమ జాతి జనుల పోరాటం, ఆ తరువాత 1872లో బ్రిటీష్ వైస్రాయ్ లార్డ్ మేయో (Lord Mayo) హత్యోదంతాల తరువాత అండమాను జైలులో ఉంటున్న 'తిరుగుబాటుదారులు / నేరస్థులు' తదితర అంశాల మీద ఆంగ్ల ప్రభుత్వం ఆలోచనలో పడింది. అండమాను జైలులో అధికారులు ఎంత కఠినంగా ఉంటున్నా గాడి తప్పుతున్న క్రమశిక్షణ 'తిరుగుబాటుదారులు / దోషులు', అండమాను శిక్షాక్షేత్రం నిర్వహణ తదితర అంశాలను అధ్యయనం చేసి శిక్షాక్షేత్రం నిర్వహణను మరింత పటిష్టం చేయడానికి ఆంగ్ల ప్రభుత్వం ఒక అధికారుల కమిటీని అండమానుకు పంపింది.

## క్రౌర్యం పెంపుదలకు తొలి సూచన

ఆంగ్లేయాధికారులు Sir Charles James Lyall, Dr . Alfred Swain Letherbridge లతో కూడిన కమిటి 1899లో అండమాను విచ్చేసింది అండమాను శిక్షాక్షేత్రంలో అమలవుతున్న Management of Penal Settlemnet తోపాటుగా Convict Management ను అధ్యయనం చేసింది. శిక్షాక్షేత్రంలో అధికారులు అమలు చేస్తున్న శిక్షల కాఠిన్యం సరిపోవటం లేదని, శిక్షలు మరింత కఠినంగా ఉండాలని, నేరస్థులను భయకంపితుల్ని చేసి మళ్ళీ అటువంటి నేరం చేయడానికి భయపడే స్థాయి శిక్షలు విధించాలని, ఆ శిక్షలు అతి క్రూరంగా ఉండాలని అధికారుల కమిటీ నొక్కి చెప్పింది. అండమాను జైలు కంటె ఉరిశిక్ష మంచిదన్న అభిప్రాయం స్వాతంత్ర్య సమరయోధులలో కలిగే విధంగా ఆంగ్లేయాధికారులు చర్యలు తీసుకోవాలని, స్వాతంత్ర్య సమరయోధుల పట్ల అండమాను శిక్షాక్షేత్రం సిబ్బంది తమ క్రౌర్యం మోతాదును మరింతగా పెంచాలని కమిటీ సూచించింది.

## నరకం లాంటి బందిఖానా నిర్మాణానికి సిఫారస్సు

అండమానుకు తరలించబడిన 'తిరుగుబాటుదారులు / దోషుల'ను బ్యారెక్స్ లలో కలివిడిగా ఉంచకుండా, వారెవ్వరూ మరెవ్వరినీ కనీసం ఆరు మాసాల పాటు కలవడానికి వీలు లేకుండా ఉండేందుకు ప్రత్యేక ఏకాంత గదులతో కూడిన (Solitary Confinement Cells) ఏర్పాటు చేయాలని, ఆ ఏకాంత గదులలో వారిని నిర్బంధించి మానసికంగా - శారీరకంగా వారిని కుంగుబాటుకు గురిచేయ్యాలని సలహా ఇచ్చింది. మానవమాత్రునికి అలవికానంత అత్యంత కఠినమైన పనిని వారికి అప్పగించి, అప్పగించిన పని పూర్తి

చేయడంలో విఫలం అయినట్టయితే వారిని తీవ్రంగా శిక్షించి పూర్తిగా లొంగ దీసుకోవాలని కమిటీ సూచించింది. అండమాను శిక్షాక్షేత్రం లోని వైపర్ ఐలాండ్ (Viper Island) లో తప్ప మిగిలిన చోట్ల ఒపెన్ జైళ్ళ (Open Jails) లాంటి బ్యారెక్స్‌లలో మాత్రమే 'తిరుగుబాటు దారులు / దోషుల'ను నిర్బంధించి ఉంచుతున్నందున విధించిన శిక్ష యొక్క కాఠిన్యం వారి అనుభవంలోకి రావటం లేదని, శిక్షను శిక్షగా మాత్రమే కాకుండా అది మరింత కఠినంగా అమలు చేయడానికి అవసరమగు ఏర్పాట్లు, నూతన నిర్మాణాలు చేపట్టాలని, నిబంధనలు, నిషిద్ధాలు ఖచ్చితంగా అమలు చేయాలని 1890 ఏప్రిల్‌లో CJ Lyall, AS Letherbridge కమిటీ ఆంగ్ల ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది.

## సెల్యులర్ జైలు నిర్మాణం

ఆ కమిటీ సూచనల మేరకు అండమానులోని అబెర్‌దీన్ గ్రామంలో భాగమయిన అట్లాంటా పాయింట్ (Atlanta Point) వద్ద సరికొత్త జైలు నిర్మాణానికి ఆంగ్ల ప్రభుత్వం పూనుకుంది. ఈ నిర్మాణంలో ఏకాంత గదులను (Solitary Cells) ఏర్పాటు చేయాలన్న ఆలోచనకు అనుగుణంగా స్టార్ ఫిష్ (Star Fish) కు ఉన్న టెంటికిల్స్ (Tentacles) రూపంలో ఏడు వరుసల బారు కలిగిన విభాగాలతో (Wings) మూడు అంతస్థుల (Floors) ఎరుపు-గోధుమ (Red-Brown) వర్ణం ఇటుకలతో భారీ కాంక్రీట్ నిర్మాణం 1896లో ఆరంభమయ్యి 1906లో పూర్తయ్యింది. ఈ జైలులో ఆరు వందల తొభైఆరు మంది 'స్వాతంత్ర్య సమరయోధుల'ను గదిలో ఏకాంతంగా బంధించి పెట్టడానికి వీలుగా 696 ప్రత్యేక ఏకాంత గదుల (Cells) ఏర్పాటు జరిగింది. ఆ కారణంగా ఈ జైలు 'సెల్యులర్ జైలు' (Cellular Jail) గా పిలువబడింది. ఈ జైలులోని ఏకాంత గదులను 'స్వాతంత్ర్య సమరయోధుల'కు ఇబ్బందికరమైన రీతిలో ఉద్దేశ్యపూర్వకంగా నిర్మించారు. ఒక్కొక్క గది పదమూడున్నర అడుగుల పొడవు, ఏడున్నర అడుగుల వెడల్పుతో గది వెనుక గోడకు తొమ్మిది అడుగుల ఎత్తున, ఒక అడుగు పొడవు, మూడు అడుగుల వెడల్పుతో వెంటిలేటర్ (Ventilator) నిర్మించారు. గదికి బలమయిన ఇనుప ఊచల తలుపు బిగించారు.

ఈ జైలుకు సంబంధించిన ఏడు బారు గదుల వరసలను (Wings) కలుపుతూ మధ్యలో మూడు అంతస్థులు (Floors) గల ప్రత్యేక Central Tower ను ఏర్పాటు చేశారు. ఈ Central Tower కు ఏడు బారు గదుల విభాగాలు అనుసంధానమై ఉంటాయి. ఈ Central Tower గుండా బారు గదుల వరుసల్లోకి వెళ్ళవచ్చు. ఆ కారణంగా Central Tower నుండి అండమాను శిక్షాక్షేత్రం భద్రతా సిబ్బంది ఆరు వందల తొంభయి ఆరు (696) ఏకాంత గదుల మీద సునాయాసంగా నిఘా ఉంచగలిగేలా ఆ Central Tower ను

ప్రత్యేకంగా రూపొందించారు. ఈ జైలులోని ఏడు బారు విభాగాల (Wings) లోని ఏకాంత గదుల (Cells) నిర్మాణం ప్రత్యేకంగా ఉండటం కాకుండా 'స్వాతంత్ర్య సమరయోధులు / దోషులు' శబ్దం ద్వారా గానీ, సంజ్ఞ ద్వారా గానీ మరే విధంగాను ఒకరికొకరు సమాచార మార్పిడి చేసుకోవడం కాదు కదా కనీసం చూసుకునేందుకు కూడా వీలు లేకుండా నిర్మాణపరమైన జాగ్రత్తలు తీసుకున్నారు. ఒక వరుసలోని ఉన్న గదుల ముందు భాగానికి మరొక వరుసలో ఉన్న గదుల వెనుక భాగం మాత్రమే కన్పించేలా నిర్మాణం జరగటం వలన సెల్యులర్ జైలులో ఏ ఏకాంత గదిలో ఎవరు ఉన్నారో, ఏమిటో జైలులోని మిగతా వారికి ఏమాత్రం తెలియనంత కట్టుదిట్టమయిన పరిస్థితి.

ఈ పకడ్బందీ ఏర్పాటు వలన వినాయక్ దామోదర్ సావర్కర్ (Vinayak Damodar Savarkar, 1883-1966) అండమాను సెల్యులర్ జైలులో ఉన్నప్పుడు ఆయన సోదరులు గణేష్ దామోదర్ సావర్కార్ / బాబారావు సావర్కార్ (Ganesh Damodar Savarkar / Babarao Savarkar, 1879-1945) కూడా అదే సెల్యులర్ జైలులో ఉన్నారు. అన్నదమ్ములు ఇరువురు ఒకే జైలులో ఉన్న విషయం తొమ్మిది మాసాల తరువాత గాని వారిరువురికి తెలియ రాలేదు. (Andaman and Nicobar Islands, BR Tamta, National Book Trust, India, 1991, Page. 33). ఈ విషయాన్ని వినాయక్ దామోదర్ సావర్కర్ తన My Transportation for Life గ్రంథంలో I See My Elder Brother అను శీర్షికన ఒక ప్రత్యేక అధ్యాయం కేటాయించి మరీ ఆ విశేషాలను వెల్లడించారు.

## స్వాతంత్ర్య సమరయోధులచే బండ చాకిరి

ఈ సెల్యులర్ జైలు (Cellular Jail) నిర్మాణానికి అండమాను దీవులలోని వివిధ జైళ్లల్లోని 'స్వాతంత్ర్య సమరయోధుల'ను నిర్మాణ కూలీలుగా మార్చి అరకొర పరిహారం చెల్లిస్తూ, గంటల తరబడి పని చేయించుకుంటూ బండ చాకిరికి గురిచేశారు. అండమాను లోని Viper Island, Navy Bay, Phoenix Bay, Brichugunj, Dundas Point లలో ఉన్న 600 మంది 'స్వాతంత్ర్య సమరయోధుల'ను సెల్యులర్ జైలు నిర్మాణ పనులలో పూర్తిగా వినియోగించుకున్నారు. ఆ సెల్యులర్ జైలు నిర్మాణానికి అవపరమయిన చిన్న రాతి ముక్కల (Stone Chips) కోసం ఇరవైవేల ఘనపు అడుగుల పరిమాణానికి సరిపడ పెద్ద పెద్ద బండరాళ్ళను 'స్వాతంత్ర్య సమరయోధుల' చేత పగులగొట్టించి చిన్న చిన్న ముక్కలు (Chips) చేయించారు. ఆంగ్ల ప్రభుత్వ నిర్ణయం మేరకు ఈ జైలు నిర్మాణం త్వరితగతిన పూర్తి చేయాలనుకున్న ఆంగ్లేయాధికారులు ప్రణాళిక మేరకు 'స్వాతంత్ర్య సమరయోధుల' చేత



CELLULAR JAIL constructed between 1896 to 1906 at Andaman. Built in the Shape of Star Fish with its Seven Tentacles and Three Floors, which can be Supervised from the Center Tower of the Jail.

వెట్టిచాకిరి చేయించారు. ఈ నిర్మాణానికి మొత్తం మీద ఐదు లక్షల పదిహేడు వేల మూడు వందల యాభై రూపాయలు ఖర్చు అయినట్టు ఆంగ్ల ప్రభుత్వ దస్త్రాలు వెల్లడించాయి.

## సెల్యులర్ జైలుకు మొదటి జట్టు రాక

అండమానులోని సెల్యులర్ జైలు పూర్తి స్థాయిలో 1906లో నిర్మాణం అయ్యాక మొదటి సారిగా అరబిందో ఘోష్ (1872–1950) తమ్ముడు, విప్లవకారుడు, అలీపూర్ బాంబు కేసు నాయకుడు బీరేంద్ర కుమార్ ఘోష్ (Birindra Kumar Ghosh, 1880–1959) నాయకత్వం లోని ఆరుగురు స్వాతంత్ర్య సమరయోధుల జట్టు 1909-10 ప్రాంతంలో అండమానుకు చేరుకుంది. ఈ బృందంలో బీరేంద్ర కుమార్ ఘోష్ తోపాటుగా ఉల్లాస్కర్ దత్తా (Ullaskar Datta), హేము చంద్ర దాస్ (Hemu Chandra Das), హృషికేష్ కంజిలాల్ (Hrishkesh Kanjilal), ఇందు భూషణ్ రాయ్ (Indu Bhushan Roy), బిభూతి భూషన్ సర్కార్ (Bibhuti Bhushan Sarkar), అభినాష్ చంద్ర భట్టాచార్య (Abhinash Chandra Bhattacharya) లు ఉన్నారు. ఈ విప్లవకారులలో బీరేంద్ర కుమార్ ఘోష్ రచన The Tale of My Exile, ఉల్లాస్కర్ దత్తా రాసిన Twelve Years of Prision Life, వినాయక్ దామోదర్ సావర్కర్ రచన My Transportation for Life గ్రంథాలలో అండమానులోని సెల్యులర్

జైలులో Political Prisoners ఎదుర్కొన్న కడగండ్లలను, జైలులో స్వాతంత్ర్య సమరయోధులు చవి చూడాల్సి వచ్చిన వివక్షను, చేయాల్సిన అలవికానంత పనిభారాన్ని, సెల్యులర్ జైలు అధికారుల దుష్ప్రవర్తన, తాము గురైన శిక్షల గురించి చాలా విపులంగా వివరించారు.

## 'నా మాటే శాసనం ... నేనే ఇక్కడ సర్వస్వం'

అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించబడిన 'స్వాతంత్ర్య సమరయోధులు / దోషుల'ను జైలులో అడుగుపెట్టీ పెట్టక ముందే భయోత్పాతానికి గురిచేసి మానసికంగా లొంగ దీసుకోవానే లక్ష్యంగా జైలు అధికారుల ప్రసంగాలు సాగేవి. ఆనాటి అండమాను సెల్యులర్ జైలు అధికారి డేవిడ్ బారి (David Barry) చేసిన అలాంటి ప్రసంగాన్ని వినాయక్ దామోదర్ సావర్కర్ తన My Transportation for Life గ్రంథంలో ఉటంకించారు. ఆ ఉటంకింపు ఇలా సాగిందిః 'ఖైదీల్లారా వినండి, విశ్వంలో ఒక్కడే ఒక్కడు సర్వేశ్వరుడు. ఆయన పైనున్న స్వర్గంలో ఉంటాడు. కానీ పోర్టు బ్లయర్‌లో ఇద్దరు ఉంటారు. ఒకరు స్వర్గంలోని అధినేత, మరొకరు భూమి మీద అధినేత. అవును, పోర్టు బ్లయర్‌లో భూమి మీది అధినేత ఉంటారు. ఆ అధినేతను నేనే. నీవు స్వర్గానికి వెళ్ళినప్పుడు స్వర్గాధినేత నీకు బహుమతి ప్రసాదిస్తాడు. కానీ పోర్టు బ్లయర్ సర్వేశ్వరుడు నీకు ఇక్కడే, ఇప్పుడే బహుమతులు ఇస్తాడు. కనుక ఖైదీల్లారా సక్రమంగా నడుచుకోండి. మీరు నాకు వ్యతిరేకంగా మా ఉన్నత అధికారులకు ఫిర్యాదు చేసినా చివరకు నా మాటే నెగ్గుతుంది. నా నిర్ణయాలు నావి. జాగ్రత్తగా మసలుకోండి'. (My Transportation for Life, Veer Savarkar, Prabhat Prakashan, New Delhi, 2020, Page 121). ఈ విధంగా పోర్టు బ్లయర్ మొత్తం తన ఆధీనంలోనే ఉంటుంది కనుక ఇక్కడి అందరూ తన చెప్పుచేతల్లో మాత్రమే ఉండాలంటూ 'స్వాతంత్ర్య సమరయోధుల'ను ఉద్దేశించి జైలు అధికారి డేవిడ్ బారి హెచ్చరికలు జారీచేసేవాడు.

## భగవంతుడు కూడా ఈ జైలు సమీపానికి రాలేడు

ఈమేరకు David Barry హెచ్చరికలను కొద్దిపాటి మార్పులు-చేర్పులతో అలీపూర్ బాంబు సంఘటన కేసులో నాయకుడు, విప్లవకారుడు బీరేంద్ర కుమార్ ఘోష్ (1880 – 1959) తన The Tale of My Exile గ్రంథంలో (Page . 44-45) పేర్కొన్నారు. అండమాను సెల్యులర్ జైలు అధికారి డేవిడ్ బారి హెచ్చరికలను ఆయన ప్రస్తావిస్తూ, 'మీ చుట్టూ ఉన్న ప్రహరిగోడ చూడండి. అది అంత తక్కువ ఎత్తులో ఉన్నదెందుకో తెలుసా? ఎందుకంటె ఈ ప్రాంతం నుండి తప్పించుకోవడం అసాధ్యం. ఈ ప్రాంతాన్ని వెయ్యి మైళ్ళ దూరం వరకు సముద్రం చుట్టి ఉంటుంది. అడవిలో పందులు, అడవి పిల్లులు తప్ప మరొక జంతువు

మీకు కన్పించదు. ఇది నిజం, కానీ జంగ్లీలు / జర్రావాల్లాలు (Janglis or Jarrawalls ) అని పిలువబడుతున్న అడివి మనుషులు ఉన్నారు. ఒకవేళ ఎవరయినా వారి కంట పడితే చాలు తమ పదునైన తమ బాణాలతో మిమ్మల్ని చంపడానికి ఏమాత్రం సందేహించరు. మీరు నన్ను చూస్తున్నారా? నా పేరు డేవిడ్ బారీ (David Barry). సాదాసీదాగా ఉండేవారికి, సూటిగా మాట్లాడేవారికి నేను అత్యంత విధేయత గల సేవకుడ్ని. అడ్డగోలుగా ప్రవర్తించేవారికి నేను వారికంటె ఎక్కువ అడ్డగోలువాడిని. మీరు నన్ను ధిక్కరిస్తే భగవంతుడు మీకు సహాయ పడవచ్చేమో కాని, నేను మాత్రం కాదన్నది ఖచ్చితం. కానీ ఆ భగవంతుడు పోర్టు బ్లయర్‌కు మూడు మైళ్ళ దూరం వరకు కూడా ఏమాత్రం చేరుకోలేడు.' అని నమోదు చేశారు. ఈ మేరకు జట్లు జట్లుగా సెల్యులర్ జైలుకు తరలించబడిన స్వాతంత్ర్య సమరయోధులకు క్రమం తప్పక హెచ్చరికలు జారీచేయడం అత్యంత క్రూరుడిగా సుప్రసిద్ధుడయిన జైలు అధికారి డేవిడ్ బారీకి నిత్యకృత్యం.

## ప్రమాదకర వ్యక్తులుగా ముద్రలు

'స్వాతంత్ర్య సమరయోధుల పట్ల అండమాను శిక్షాక్షేత్రంలోని ఆంగ్లేయాధికారులు అత్యంత అమానుషంగానూ, అత్యంత కఠినంగా వ్యవహరించారు. భారత స్వాతంత్ర్య సమరయోధులను కరడుకట్టిన నేరస్థుల కంటె ప్రమాదకరమైన ఖైదీలు (Dangerous Prisoners) గా ముద్రలు వేశారు. ఆ ప్రకారంగా సమరయోధులను ప్రత్యేకంగా గుర్తించడానికి అంగ్లంలోని 'డి' (D) అక్షరం స్పష్టంగా కన్పించేలా తయారు చేసిన ప్రత్యేక చెక్క ముక్కలను సమరయోధుల మెడల్లో వ్రేలాడదీశారు. ఆంగ్లేయాధికారులు అక్కడితో ఆగకుండా శరీరాన్ని కప్పుకునేందుకు సమర యోధులకు ఇచ్చే చాలీ చాలని గోగునార బట్టల మీద కూడా 'డి' (D) అక్షరం ప్రత్యేకంగా ముద్రించారు.

ఈ విషయాన్ని సమరయోధులు ప్రస్తావిస్తూ తాము రాజకీయ ఖైదిలమన్నప్పుడల్లా You are not Political Prisoners అంటూ జైలు అధికారి డేవిడ్ బారి సమరయోధుల మీద క్రూరంగా విరుచుక పడుతూ పూనకం వచ్చినవాడిలా ప్రవర్తించేవాడని వినాయక్ దామోదర్ సావర్కర్ తన My Transportation for Life (Page 108-109) గ్రంథంలో వివరించారు. ఆ ఆంగ్లేయుడు డేవిడ్ బారి మరింత ముందుకు సాగి దుర్భాషలాడుతూ, అత్యంత నీచంగా ప్రవర్తిస్తూ సమరయోధులను Despicable Lot (నీచులు), Vagrant wretches (దౌర్భాగ్యులు), Scum of the society (నికృష్టులు) అని తూలనాడుతూ అనుచితంగా వ్యవహరించేవాడు. (Andaman and Nicobar Islands (A Saga of Freedom Struggle), RVR Murthy, Kalpaz Publications, Delhi, 2011, Page.101).

## సమరయోధుల పట్ల అమానుష ప్రవర్తన

స్వాతంత్ర్య సమరయోధులలో యావజ్జీవ కారాగారశిక్షకు గురయిన వారి పట్ల ఆంగ్లేయాధికారులు అత్యంత దారుణంగా వ్యవహరించారు. రాజకీయ ఖైదీలుగా సమర యోధులకు ఇవ్వాల్సిన మినహాయింపులు, కల్పించాల్సిన సౌకర్యాల విషయంలో జైలు అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరించటం వలన సమరయోధులు వర్ణించనలవికాని నరకయాతనలు అనుభవించారు. ఈ జైలుకు పంపబడిన సంఘవిద్రోహక శక్తులు, వ్యక్తులు, కరడుగట్టిన నేరస్థులకు జైలులో తగినంత స్వేచ్ఛనిచ్చి సమరయోధులను మాత్రం రాచిరంపాన పెట్టారు. ఈ దుస్థితిని విప్లవకారుడు, అలీపూర్ బాంబు కేసు నాయకుడు బీరేంద్ర కుమార్ ఘోష్ (1880 – 1959) తన The Tale of My Exile గ్రంథంలో ప్రస్తావిస్తూ, Ordinary Prisioners after finishing their day's work, bathe and sit down in file and get themselves served. But we had no such liberty (Page.49) అంటూ మన స్వాతంత్ర్య సమరయోధుల దుస్థితిని ఏకరువు పెట్టగా వినాయక్ దామోదర్ సావర్కర్ తన My Transportation for Life గ్రంథంలో అధికారుల రాక్షసత్వం, సమరయోధులు అనుభవించిన నరక యాతనలను, జైలులోని దుర్భర పరిస్థితులను దృశ్యాత్మకంగా విశదీకరిస్తూ అండమాను లోని సెల్యూలర్ జైలును మృత్యుకోరలు (Jaws of Death) అని అభివర్ణించారు.

జైలులో సమరయోధులు ఒకరితో మరొకరు మాట్లాడుకునే అవకాశం లేకుండా కఠినమయిన ఆంక్షలు విధించారు. సూర్యోదయం నుండి సూర్యాస్తమం వరకు జైలులోని కార్యకలాపాల సందర్భంగా ఒకరికొకరు ఎదురెదురు పడ్డా పెదవి విప్పడానికి గాని, కనీసంగా సంజ్ఞలతో పలకరింపు గాని లేకుండా నిషేధించారు. భోజనం సమయంలో, స్నానం సమయంలో ఒకవేళ ఎవ్వరైనా సాహసించి సంజ్ఞలు చేసినా, చిన్నపాటి శబ్దం చేసినా, ఆ సంజ్ఞ/శబ్దం చేసినట్టుగా కాపలాగా ఉన్న జమెదారుకు చిన్నపాటి అనుమానం కలిగినా కూడా సమర యోధులు పలు కఠిన శిక్షలకు గురికావాల్సిన వచ్చేది. ఈ శిక్షలలో ప్రధానంగా జైలు గదిగోడ వైపుకు తిరిగి బేడీలు వేసిన చేతులను పైకెత్తి వారం రోజులపాటు కలదకుండా నిల్చోవాల్సి వచ్చేది. ఈ క్రూర శిక్ష గురించి వినాయక్ దామోదర్ సావర్కర్ తన My Transportation for Life (Page.110) గ్రంథంలో వివరించారు.

## హిందువుల వంట గది - ముస్లింల వంటగది

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో మతాలకు, కులాలకు, ప్రాంతాలకు అతీతంగా భారతీయులలో వ్యక్తమయిన ఐక్యతను చూసి భయపడిన ఆంగ్లేయులు ఆ ఐక్యతకు గండి



Our Freedom Fighters in Fetters in Cellular Jail at Andaman

కొట్టాలని పలు విచ్ఛిన్నకర చర్యలను అమలుపర్చసాగారు. ఆ చర్యల కొనసాగిస్తూ నూతనంగా నిర్మించిన సెల్యులర్ జైలులో కూడా ఖైదీలను మతం పేరుతో విడగొట్టు చర్యలకు పాల్పడ్డారు. అండమాను జైలుకు తరలించబడిన 'స్వాతంత్ర్య సమరయోధుల'లో హిందువులు, ముస్లింలు తదితరులు ఉన్నందున వారి మధ్య ఎటువంటి ఐక్యతకు అవకాశం ఇవ్వరాదన్న ఆలోచనతో, వారిని విడదీసి ఉంచాలన్న నిర్ణయం మేరకు ఈ చర్యలు చేపట్టారు.

ఈ సెల్యులర్ జైలులో ముస్లింలకు ఒక వంట గదిని, హిందువులకు మరొక వంట గదిని ఏర్పాటు చేసి, వాటికి 'హిందూ వంటగది (Hindu Kitchen ), ముస్లిం వంటగది (Muslim Kitchen)' అని నామకరణం చేశారు. ఆహార నియమాలను బట్టి శాకాహారులు, మాంసాహారులు కోసం వేర్వేరు వంట గదులు ఏర్పాటు చేయకుండా హిందూ వంటగది–ముస్లిం వంటగది అంటూ మతాల వారిగా వేర్వేరు వంట గదులు ఏర్పాటు చేసి ఆంగ్లేయులు తమ కుయుక్తిని బయట పెట్టుకున్నారు. (The Heroes of Cellular Jail, S N Aggarwal, Rupa Publications, New Delhi, 2018, Page 56)

జైలు అధికారి డేవిడ్ బారి అంతటితో ఆగకుండా జైలుకు చేరుకున్న దోషులు / సమరయోధులలో హిందూ–ముస్లిం భేదాలను కల్పించి తద్వారా కూడా రెండు సమూహాల

మధ్య వైషమ్యాలు పెరగడానికి ప్రయత్నాలు చేసాడు. ఒకరి మీదకు మరొకరిని రెచ్చగొట్టి తన పబ్బం గడుపుకున్నాడు. (Andaman and Nicobar Islands (A Saga of Freedom Struggle), RVR Murthy, Kalpaz Publications, Delhi, 2011, Page.105). జైలు అధికారి డేవిడ్ బారి చర్యల మూలంగా ఏర్పడిన వైషమ్యాల నేపథ్యంలో వినాయక్ దామోదర్ సావర్కర్ తన My Transportation for Life, బీరేంద్ర కుమార్ ఘోష్ తన The Tale of my Exile (Twelve Years in the Andaman) గ్రంథంలో ఈ వైరుధ్యాలను, వైషమ్యాలను, ఆంగ్లేయ అధికారుల, వ్యక్తుల ప్రవర్తనలను పలు సందర్భాలలో సవివరంగా ప్రస్తావించారు.

## భయంగొలిపే బహిరంగ ఏర్పాట్లు

అండమాను జైలులో అడుగుపెట్టగానే 'స్వాతంత్ర్య సమరయోధులు / దోషులు భయానక మానసిక స్థితికి గురయ్యేలా తగిన ఏర్పాట్లు చేశారు. సెల్యులర్ జైలు స్వరూపం కూడా భయంగొల్పే విధంగా ఉండటం మాత్రమే కాకుండా స్వాతంత్ర్య సమరయోధుల మనోస్థైర్యాన్ని దెబ్బతీసేలా ఆంగ్లేయాధికారుల ప్రవర్తన కూడా భయం గొలిపేలా సాగింది. బహిరంగంగ కొరడా దెబ్బల శిక్షలను అమలుపర్చడానికి ప్రత్యేకంగా ఇనుముతో తయారు చేయించిన ఫ్లొగింగ్ స్టాండ్ (Flogging Stand) అందరికి దర్శనమిచ్చేలా జైలులోని బహిరంగ ప్రదేశంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. ఆ తరువాత మరోవైపున ఒక్కసారిగా ముగ్గురిని ఉరి తీయడానికి వీలుగా ఏర్పాటు చేసిన ప్రత్యేక ఉరిశిక్ష గదులు, ఆ పక్కనే ఉరిశిక్ష విధించబడిన బందీలను ఉరిశిక్ష విధింపుకు ముందుగా ఒంటరిగా ఉంచడానికి ఏకాంత గదులు నిర్మించారు. ఆ తరువాత బందీలను చిత్రహింసల పాల్జేయడానికి ఉపయోగించు పలు రకాల ఆయుధాలు, ఇతర ఉపకరణాలు. ఇనుప సంకెళ్ళు, బేడీలు బహిరంగంగా కన్పించేట్టు ఏర్పాటు చేసి జైలులోకి అడుగుపెట్టీ పెట్టక ముందే 'స్వాతంత్ర్య సమరయోధుల'ను భయానికి గురిచేసేలా, మానసికంగా కుంగదీసేలా నిర్మాణాలు, నిర్మాణపరమైన ఏర్పాట్లతో ఆంగ్లేయాధికారులు పలు చర్యలు చేపట్టారు.

## చిన్నపాటి గదుల్లో సమరయోధుల దుర్భరస్థితి

అండమాను సెల్యులర్ జైలులోని ఏకాంత గదుల్లో (Solitary Cells) బంధించబడిన స్వాతంత్ర్య సమరయోధులు దారుణ పరిస్థితులను అనుభవించారు. సాయంత్రం ఐదు గంటల నుండి ఉదయం ఆరు గంటల వరకు స్వాతంత్ర్య సమరయోధులు బేడీలు-సంకెళ్ళతో గదిలోని చాలీ చాలని మంచం మీద గడపాల్సి వచ్చింది. ఆరోగ్యం చెడినా పట్టించుకునేవారెవ్వరూ ఉండరు. దాహం వేసి నాలుక పిడచకట్టుకుని పోతున్నా, ప్రాణ సంకటం ఏర్పడినా బందీల గోడు ఎవ్వరూ వినరు.

చివరకు మలమూత్రాదులను కూడా వారికిచ్చిన ముంతల్లో విసర్జించాలి. రాత్రి గడిచి తెలవారిన తరువాత మాత్రమే జైలులోని బాధిత సమరయోధుల గురించి ఆలోచించేది. సమరయోధుల ఆరోగ్య పరిస్థితి బాగోలేక జైలు అధికారికి సంబంధిత డాక్టర్ అనుమతి ఇచ్చినా జైలర్ కాదూ, కూడదంటూ అసుపత్రికి పంపకుండా సమరయోధులను హింసించడం సెల్యులర్ జైలులో సర్వ సాధారణ విషయం అయ్యింది. స్వాతంత్ర్య సమరయోధులకు అందించాల్సిన తిండి, బట్ట చివరకు తాగు నీరు విషయంలో కూడా ఆంగ్ల అధికారులు అమానుషంగా వ్యవహరించారు.

స్వాతంత్ర్య సమరయోధులు ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు కాబట్టి స్వాతంత్ర్య సమరయోధుల పట్ల ఆంగ్లేయాధికారులు తమ ఆక్రోశాన్ని వ్యక్తంచేస్తూ అత్యంత నాసిరకం తిండి పెడ్తూ లేనిపోని ఆంక్షలను అడ్డుపెట్టుకుని సరిపడ తిండి కూడా పెట్టకుండా ఖాళీ కడుపులతో వారిన మాడ్చారు. చివరకు చాలీచాలని సైజులో గోగునార బట్టలను అందించి సర్దుకోమన్నారు. ప్రకృతి అవసరాలను కూడా అధికారుల ఆజ్ఞలు, అనుమతుల మేరకు నిర్దేశిత సమయాలలో, నిర్దేశిత విధానాలతో, అరకొర సౌకర్యాలతో మాత్రమే తీర్చుకోవాల్సిన భయానక, దుర్భర దుస్థితి. అన్న పానీయాలకు మాత్రమే కాకుండా స్నానపానాదులకు కూడా కనీస నీటి లభ్యత ఉండేది కాదు. జైలు నిబంధనల మేరకు చాలీచాలని గోచి (లంగోటి) గుడ్డతో మూకుమ్మడిగా చాలీచాలని నీటితో బహిరంగ స్నానాలు చేయాల్సిన అమానవీయ పరిస్థితులను సమరయోధులు అనుభవించారు.

## శిక్షాక్షేత్రం-శిక్షాస్మృతి

అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడు 'స్వాతంత్ర్య సమరయోధులు / దోషుల'కు ప్రత్యేక శిక్షాస్మృతి అమలవుతుంది. ఆంగ్ల న్యాయస్థానాల ద్వారా యావజ్జీవిత కారాగారశిక్ష విధించబడి అండమానులోని సెల్యులర్ జైలుకు పంపబడిన 'స్వాతంత్ర్య సమరయోధులు / దోషులు' మొదటి ఆరు మాసాలు ఎవ్వరిని కలువకుండా ఏకాంతంగా గదులలో బంధించి ఉంచుతారు. క్రమశిక్షణ అత్యంత కఠినంగా అమలుపర్చినప్పటికి పనిభారం కష్టతరంగా ఉండదు. ఆరు మాసాల తరువాత అండమాను దీవులలోని ఇతర జైళ్ళకు 18 మాసాల పాటు తరలిస్తారు. ఈ 18 నెలలు క్రమశిక్షణ విషయంలో కాస్త వెసులుబాటు కల్పించినా పని భారం మాత్రం కష్టంగా ఉంటుంది. ఆ తరువాత మూడు ఏండ్ల పాటు బ్యారెక్స్‌లో యావజ్జీవిత ఖైది గడపాలి. ఈ మూడేళ్ళు పనిచేయడానికి ఖైదీని బయటకు పంపినా అతని మీద నిశిత నిఘా ఉంటుంది కాగా రాత్రిపూట బ్యారెక్స్‌లో బంధించి తాళాలు వేస్తారు. ఆ విధంగా మూడు సంవత్సరాలు గడిచాక మరో ఐదు ఏండ్ల పాటు కూలీ చేసే ఖైదీ (Labouring

Convict) గా జైలు నిబంధనల మేరకు నడుచుకోవాలి. ఈ మేరకు మొత్తం మీద మంచి ప్రవర్తనతో పదేండ్ల శిక్షాకాలాన్ని గడిపిన తరువాత ఆ ఖైదీని ఇతర పనులు చేయడానికి Ticket of Leave అని పిలువబడే అనుమతి పత్రం లభిస్తుంది. ఈ Ticket of Leave లభించాక అధికారులకు ముందస్తు సమాచారం, అనుమతితో అండమానులో ఏర్పడిన గ్రామాలలో జీవనం సాగించవచ్చు గాని పూర్తి స్వేచ్ఛ మాత్రం లభించదు, పౌరహక్కులు ఉండవు. ఆ ఖైదీ తాను నివసిస్తున్న గ్రామం వదలి మరో చోటకు వెళ్ళరాదు. ఈ మేరకు 20 నుండి 25 ఏండ్లు అండమాను శిక్షాక్షేత్రంలో గడిపిన తరువాత ప్రవర్తనాపరమైన అభ్యంతరాలు ఏమీ లేనట్టయితే అటువంటి ఖైదీ అండమాను శిక్షాక్షేత్రం నుండి విముక్తి పొందడానికి అవకాశాలు ఉన్నాయి. (Cellular Jail (Cells Beyond Cells), Priten Roy and Swapnesh Choudhury, Farsight Publishers & Distributors, Delhi, 2016, Page. 26).

## అలవికానంత పనిభారం

సూర్యాస్తమయంతో ఇరుకు గది (Cell) లో ఇరుకు మంచం (Narrow Cot) మీద రాత్రంతా గడిపిన 'సమరయోధులు / దోషులు' సూర్యోదయంతోపాటుగా ఖచ్చితంగా మేల్కోవాలి. ఆ తరువాత క్రమశిక్షణాయుతంగా కవాతు లాగా అధికారుల ఆజ్ఞల మేరకు కాలకృత్యాలు తీర్చుకోవాలి. అనంతరం రుచి–పచి లేని గంజి తాగి జైలు అధికారి అప్పగించిన పని, ఇతర వివిధ పనులను పూర్తి చేయడానికి ఉపక్రమిస్తారు. ఆంగ్లేయాధికారుల నిర్దేశితాల ప్రకారంగా జైలులో ఖైదీలు చేయాల్సిన పనులు చాలా ఉంటాయి. ఆ వివిధ రకాల పనులలో 1 కొబ్బరి నూనె, ఆవనూనె మిల్లు (Coconut and mustard oil mills) లో నూనె తీసేపని, 2. కొబ్బరి కాయలు పగులగొట్టడం, పీచు వలవడం (Husking and opening coconuts), 3. కొబ్బరిని ఎండబెట్టటం (Drying copra), 4. కొబ్బరి పీచును నలగకొట్టి మెత్తపర్చడం (Coir pounding), 5. కొబ్బరి పీజుతో తాళ్ళ తయారి (Rope Making) లాంటి పనులు అత్యంత కష్టతరమైన పనులుగా సమరయోధులు పేర్కొన్నారు.

ఈ పని మానవమాత్రులకు సాధ్యం కాదని బీరేంద్ర కుమార్ ఘోష్ పేర్కొంటూ తన The Tale of My Exile గ్రంథంలో 'Herculean task' (Page. 53) అని పేర్కొన్నారు. ఉల్లాస్కర్ దత్తా తన Twelve Years of Prision Life అనే గ్రంథంలో 'మా గ్రామాల్లో ఆయిల్ మిల్లులకు ఎద్దులను ఉపయోగిస్తారు. అలా ఒక రోజుకు 16 పౌండ్లకు మించి ఆవ నూనె తీయలేరు. ఇక్కడ సెల్యులర్ జైలులో నాతో మరో ఇరువురిని ఉపయోగించి రోజుకు 80 పౌండ్ల కొబ్బరి నూనెను సాయంత్రంలోగా తీయాల్సి వచ్చిందని, పేర్కొన్నారు.



Model of Flagging stand erected out side the the Cellular Jail to create fear

వి.డి సావర్కార్ తన My Transportation for Life గ్రంథంలో వందలో ఒకరు మంచి దేహదారుఢ్యం కలిగిన వ్యక్తి మాత్రమే నిర్దేశిత 30 పౌండ్ల రోజువారి కోటా కొబ్బరి నూనెను తీయగలరని (Out of hundred only one with callous body could hardly complete his daily quota of thirty pounds of coconut oil (Page 112) అని అభిప్రాయపడ్డారు. ఈ కొబ్బరి నూనె తీసే పనిలో సమరయోధులు పడిన అష్టకష్టాలను My Transportation for Life ప్రత్యేక అధ్యాయం కేటాయిస్తూ, అందులో గానుగ చక్రాన్ని తిప్పేందుకు మమ్మల్ని జంతువుల్లా ఉపయోగించుకున్నారు ('We were to be yoked like animals to the handle that turned the wheel, Page.110) అని అక్కడి దుర్భర పరిస్థితులను వి.డి. సావర్కార్ సవివరంగాపేర్కొన్నారు.

## అమానుష శిక్షలు - ఆత్మహత్యలు

ఆంగ్లేయ అధికారుల ఆదేశాల మేరకు నిర్దేశిత పనులను నిర్దేశిత సమయంలోగా పూర్తి చేయాలి. అలా పూర్తి చేయలేకపోయినా, పని చేయడానికి నిరాకరించినా విధించే శిక్షల క్రమాన్ని ఆంగ్లేయాధికారి వివరించిన విధానాన్ని విప్లవకారుడు ఉల్లాస్కర్ దత్తా `తన Twelve Years of Prision Life ( Page. 62) గ్రంథంలో ఈ విధంగా పేర్కొన్నారు.

'...ఇక్కడ క్రమశిక్షణ ఎక్కువ. మీరు పని చేసేందుకు నిరాకరిస్తే ఎంతో కఠినంగా చర్యలు ఉంటాయి. అలా పని చేయడానికి నిరాకరించడం మొదటిసారి అయితే బేడీలు తగిలించి చేతులు పైకెత్తి నిల్చోబెడతారు. రెండోసారి అయినట్టయితే కాళ్ళు వంచేందుకు వీలులేకుండా 'బార్ ఫెట్టర్స్' అనేవి వేస్తారు. అవి కాళ్ళకు వేసిన బేడీల నుండి నిలువుగా ఇనుప కడ్డీ ఒకటి నడుముకు కలిపి కడతారు. మూడోసారి కూడా పనిచేయ నిరాకరిస్తే ఏమవుతుందో తెలుసా? నేను చెప్పేది జాగ్రత్తగా విని జాగ్రత్త పడు. ఈ జైలులో విధించే అత్యంత నికృష్ట శిక్ష – ముప్ఫై కొరడా దెబ్బలు. మరి ఆ ముప్ఫై కొరడా దెబ్బలు అంటే ఏంటో తెలుసా ? నీ ఒంటి మీద పడే ఒక్కొక్క కొరడా దెబ్బ నీ వంటి కండరాల్ని అంగుళం లోతుకు చీలుస్తుంది. మిమ్మల్ని సామాన్య దొంగవెధవల్లా చూస్తాం. మీరేదో పెద్ద మనుషుల బిడ్డలని మిమ్మల్ని నెత్తిన పెట్టుకోము..'.

(...Here the discipline is very strict and if you refuse to work, it will go very hard with you. The very first time you refuse, you will get standing handcuffs; the second time you will get bar fetters; and still if you continue to refuse a third time, do you know what you will get ? Mind what I say, and take care; you will get thirty lashes; the very worst kind of punishment that is meeted out in jail here, and do you know what those thirty lashes mean? Each lash that you will get, will cut into your flesh one inch deep! We will treat you like the ordinary Badmashes, and no consideration will be shown to you as sons of gentelman...)

జైలు అధికారులు నిర్దేశించిన పనిని నిర్దేశిత సమయంలోగా పూర్తి చేయడానికి జైలు జమేదారు మమ్మల్ని పరుగులెత్తించేవాడు. మాలో ఏమాత్రం అలసత్వం కన్పించినా నిర్దాక్షిణ్యంగా మా మీద కొరడా దెబ్బలు కురిపించేవాడు. పడిపోయినా, తడబడినా స్పృహ తప్పేలా కొట్టేవాడని జైలు క్రింది స్థాయి అధికారుల కిరాతకత్వాన్ని ఉల్లాస్కర్ దత్తా తన గ్రంథంలో వివరించారు (Page 62). జైలు అధికారులు కేటాయిస్తున్న అలవికానంత పనిభారాన్ని నిర్దేశిత సమయంలోగా పని పూర్తి చేయలేక పోయినప్పుడు జైలు అధికారుల కిరాతకత్వాన్ని భరించలేక, జైలు ఉన్నతాధికారి డేవిడ్ బారీ నుండి నిత్యం ఎదురయ్యే అసహ్యకర అవమానాలను సహించలేక సున్నిత మనస్కుడయి ఉల్లాస్కర్ దత్ మతిస్థిమితం కోల్పోగా, ఇందు భూషణ్ రాయ్ 1912 ఏప్రిల్ 29 న ఆత్మహత్య చేసుకున్నారు. భయానక చిత్రహింసలు, ఆంగ్లేయాధికారుల అమానవీయ ప్రవర్తన, అలవికాని ప్రకోపాన్ని తట్టుకోలేక, పనిభారం భరించలేక సగటున నెలకు ముగ్గురు ఆత్మహత్యలకు పాల్బడటం జరిగిందని

ప్రముఖ రచయిత Rabin Roy Chowdhury తన గ్రంథం Black Days in Andaman & Nicobar Islands (Page 67-68) లో సవివరంగా పేర్కొన్నారు.

## విప్లవకారులతో నిండిన సెల్యులర్ జైలు

అలీపూరు బాంబు కేసులోని విప్లవకారులు సెల్యులర్ జైలులో మొదటి జట్టుగా అడుగుపెట్టాక ఆ తరువాత భారతదేశం అంతటా విప్లవించిన వివిధ విప్లవ సంస్థలకు/ సంఘాలకు చెందిన విప్లవకారులను ఆంగ్ల ప్రభుత్వం పెద్ద ఎత్తున నిర్బంధించింది. ఆ విప్లవకారులకు జైలు శిక్షలు విధించి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించడంతో సెల్యులర్ జైలులో సమరయోధుల సంఖ్య అంతకంతకూ పెరుగుతూ వచ్చింది. ఆంగ్లేయుల తరిమివేత లక్ష్యంగా తమ ప్రాణాలను కూడా లెక్కచెయ్యక అన్ని శిక్షలకు సిద్ధపడ్డ విప్లవకారులు జైలు అధికారి డేవిడ్ బారీ అత్యంత కిరాతక చర్యల పట్ల నిరసన వ్యక్తంచేయడం ఆరంభించారు. ఆ నిరసనలు కాస్తా క్రమంగా నిరాకరణలు, సమ్మెలుగా పరిణామం చెంది డేవిడ్ బారీ ఆజ్ఞలను కూడా ఖాతరు చేయకుండా చివరకు నిరాహారదీక్షల స్థాయి వరకు చేరుకున్నాయి. నిరాకరణలు-నిరాహారదీక్షలు-సమ్మెలు సందర్భంగా అధికారులు ఎన్ని రాక్షసచర్యలకు పాల్పడినా విప్లవకారులు మాత్రం పట్టుదలను విడువలేదు.

## విడుదలలు-తరలింపులు

అండమాను సెల్యులర్ జైలులో 'నేనే శాసనం' అంటూ విర్రవీగిన అధికారి డేవిడ్ బారీ ఆట కట్టించేందుకు జైలులో జరుగుతున్న అరాచకాలను బయటి ప్రపంచానికి తెలియ జేయడానికి విప్లవకారులు చేసిన పలు ప్రయత్నాలు చివరకు ఫలించాయి. డేవిడ్ బారీ రాక్షసక్రీడల గుట్టుకాస్తా రట్టయ్యి భారతీయులకు చేరడంతో ప్రజల, ప్రజాప్రతినిధుల నిరసన వెల్లువెత్తింది. ఆ నిరసనలకు తలవొగ్గిన ఆంగ్ల ప్రభుత్వం అండమానులోని సెల్యులర్ జైలు వ్యవహారాల పరిశీలనకు Sir Ronald Creddok ను నియమించింది. 1913 అక్టోబరులో సెల్యులర్ జైలును సందర్శించిన అతడు పలు సూచనలు-సిఫారస్సులు చేశాడు. ఆ సిఫారస్సులు-సూచనల మేరకు యావజ్జీవిత కారాగారశిక్ష విషయంలో 14 ఏండ్లు మంచి ప్రవర్తనతో గడిపిన రాజకీయ ఖైదీల (Political Prisoners) విడుదల / భారత ప్రధాన భూభాగంలోని జైళ్ళకు తరలింపు కార్యక్రమం 1914 మే 23న ఆరంభమయ్యి 1914 సెప్టెంబరు 10 నాటికి పూర్తయ్యింది. ఆ తరువాత గతంలోలా కాకుండా జైలులోని రాజకీయ ఖైదీలకు సదుపాయాలు, సౌకర్యాలు కల్పించడానికి ఆంగ్ల ప్రభుత్వం అంగీకరించింది. (The Heroes of Cellular Jail, S N Aggarwal, Rupa Publications, Newdelhi, 2018, Page.143). అండమాను శిక్షాక్షేత్రంలో చోటు చేసుకున్న ఈ మార్పులు భారత స్వాతంత్ర్య సమరయోధుల నైతిక విజయానికి చిహ్నం.

## గదర్ యోధుల తరలింపు

అండమాను సెల్యులర్ జైలుకు రాజకీయ ఖైదీలను పంపరాదని ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం మేరకు ఆచరణాత్మక చర్యలకు అధికారులు పూనుకుంటుండగా 1915 నుండి స్వాతంత్ర్య సమరయోధుల విప్లవకర చర్యలు ఊపందుకున్నాయి. 1914 జూలై 28న ఆరంభమయిన ప్రథమ ప్రపంచ యుద్ధం నేపథ్యంలో మాతృభూమి నుండి ఆంగ్ల పాలకులను తరిమివేయడానికి ఇది మంచి తరుణంగా భావించిన భారతీయులతో 1913 జూలై 15న అమెరికాలో ఏర్పడిన గదర్ పార్టీ (Ghadar Party) ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక చర్యలకు శ్రీకారం చుట్టింది. గదర్ పార్టీ ఆదేశాల మేరకు ఆంగ్లేయ వ్యతిరేక ప్రచారం–ఆంగ్ల ప్రభుత్వంతో పోరాటం నిర్వహించేందుకు గదర్ వీరులు వివిధ మార్గాల ద్వారా మాతృభూమిని చేరుకోవడం ఆరంభించారు. ఆంగ్ల ప్రభుత్వ గూఢచారులు ఎంత అప్రమత్తంగా ఉన్నా వారి కన్నుగప్పి స్వంత గడ్డను చేరుకున్నారు. స్వస్థలాలకు చేరుకున్న గదర్ పార్టీ యోధులు ఇటు ప్రజలలోనూ అటు బ్రిటిష్ భారత సైన్యంలోని స్వదేశీ సైనికులలోనూ ఆంగ్లేయ వ్యతిరేకత నూరిపోస్తూ ఆంగ్ల ప్రభుత్వం మీద పోరుకు ప్రజలను సిద్ధం చేయసాగారు. ఆ ప్రమాదాన్ని పసిగట్టిన ఆంగ్ల ప్రభుత్వం గదర్ యోధుల మీద తీవ్రంగా విరుచుక పడింది. గదర్ వీరులను అసంఖ్యాకంగా అరెస్టు చేసి, వివిధ ప్రాంతాలలో విచారణలు జరిపి కాల్చివేతలు, ఉరిశిక్షలకు ఆదేశాలిచ్చింది. అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించింది.

1915 ఏప్రిల్ లో గదర్ యోధులు అలీ అహ్మద్ సిద్ధిఖీ, ఫియాన్ అలీ, ముజ్తబా హుసైన్‌లను అరెస్టు చేసి వారి మీద చారిత్రక 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' ('Second Mandalay Conspiracy'Case) నమోదు చేసింది. ఆ కేసులో 1917 జూలై ఆరున అలీ అహ్మద్ సిద్ధిఖీ తదితరులకు మరణ దండన విధించి, ఆ శిక్షను కాస్తా ఆజన్మాంత కారాగారవాసంగా మార్చింది. చివరకు 1918 ఫిబ్రవరి 11న అలీ అహ్మద్ సిద్ధిఖీని మాండలే జైలు నుండి అండమాను జైలుకు తరలించారు. **(ఈ పుస్తకం ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అలీ అహ్మద్ సిద్ధిఖీ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

## సమర యోధుల తరలింపు

భారతీయుల పాలిట రాక్షస చట్టంగా ఆవిర్భవించిన 1919 నాటి రౌలత్ చట్టానికి వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో భాగంగా సుప్రసిద్ధమయిన అమృతసర్ ఎలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్ (Amrithsar Alliance Bank and National Bank) చర్యలో పాల్గొన్న సమరయోధులు దీనా (Deena). జలాలుద్దీన్ (Jalaluddin) సంధీ (Sandhi), మొహమ్మది



జైలుకు తరలించబడుతున్న మలబారు మోప్లా ప్రజానీకం

(Mohammadi). మెహరుద్దీన్ (Meharuddin) తదితరుల మీద ఆంగ్ల ప్రభుత్వం విచారణ జరిపి కారాగారశిక్షలు విధించి అండమాను జైలుకు తరలించింది. ఈ కోవలోనే 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' ('Second Mandalay Conspiracy' Case) నిందితులుగా ఉత్తరప్రదేశ్ చెందిన మొహమ్మద్ హుసైన్ ముజ్తబా (Mohammad Hussain Mujtaba) పంజాబ్ కు చెందిన సాధిఖ్ (Sadiq) ల మీద విచారణ సాగింది. ఈ ఇరువురు యోధులను కూడా ఆంగ్ల ప్రభుత్వం అండమానుకు పంపింది. భారత వాయవ్యసరిహద్దు ప్రాంతం నివాసి మొహమ్మద్ ఆక్రం ఖాన్ (Mohammed Akram Khan) ను అమృతసర్‌లో జరిగిన ఆంగ్లేయాధికారి ఇస్‌డన్ (Isdon) హత్యకేసులో నిందితునిగా పేర్కొన్న ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు జైలు శిక్షను విధించి అండమాను జైలుకు పంపాల్సిందిగా ఆదేశించింది. పంజాబీ యోధులు అల్లావుద్దీన్ (Alla-ud-Din), నాదిర్ అలీ షాహ్ (Nadir Ali Shah) తదితరుల మీద ఆంగ్లేయాధికారులు Kasoor Supplementary Riot Case -77 నమోదు చేసి విచారణ జరిపి అండమాను జైలుకు పంపారు. పంజాబ్ రాష్ట్రం నివాసి సాధిఖ్ (Sadiq) ని ఆంగ్ల ప్రభుత్వం 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' ('Second Mandalay Conspiracy' Case) లో నిందితునిగా పేర్కొంది. ఈ కేసులో సాధిఖ్ (Sadiq), మొహమ్మద్ హుసైన్ ముజ్తబా (Mohammad Hussain Mujtaba) లకు న్యాయస్థానం కారాగార శిక్షలను విధించి

అండమాను తరలింపుకు ఆదేశించింది. ఆ ఆజ్ఞల మేరకు మొహమ్మద్ హుసైన్ ముజ్తబా. సాధిఖ్ లు సెల్యులర్ జైలులో బందీలయ్యారు. **(ఈ పుస్తకం ఏడవ విభాగంలో ఈ పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు ఉన్నాయి)**

## సమరయోధుల భౌతిక ప్రతిఘటన ఆరంభం

గదర్ వీరులకు తోడుగా బెంగాల్, పంజాబ్, గుజరాత్ తదితర రాష్ట్రాల నుండి పలువురు విప్లవకారులు అండమానుకు చేరుకున్నారు. ఆత్మగౌరవానికి ఎటువంటి భంగం కలిగినా ఏమాత్రం సహించని రాజకీయ ఖైదీలు/స్వాతంత్ర్య సమరయోధులు జైలు అధికారుల ఆగడాలకు ధీటుగా భౌతిక సమాధానాలు ఇవ్వసాగారు. పంజాబ్ నుండి విచ్చేసిన విప్లవయోధులలో ఒకరయిన పండిత పరమానంద (Pandit Paramanda) పట్ల జైలు అధికారి డేవిడ్ బారీ అనుచితంగా వ్యవహరించడంతో ఆగ్రహించిన ఆయన అతగాడి పొట్టలో కాలితో గట్టిగా తన్నడంతో ఆ ఆంగ్లేయుడు కూర్చున్న కుర్చీతోసహా వెనక్కు విరుచుక పడిపోయాడు. అప్పటి నుండి, ' There are only two Gods for you, one above and one below i.e. me. No one has seen the God above, but here I am physically before you. If you defy my authority you can not survive ' అని విర్రవీగుతూ, ప్రతి చిన్న విషయానికి సమరయోధుల మీద కిరాతకంగా విరుచుకపడిన చరిత్ర కలిగిన డేవిడ్ బారీ ఆగ్రహంతో రగిలిపోతూ ప్రతీకారచర్యలకు పూనుకున్నాడు. అయినా జైలు అధికారుల నుండి ఎదురు కానున్న భయంకర ప్రతీకార చర్యలను ఏమాత్రం ఖాతరు చేయకుండా అధికారుల అక్రమ చర్యలను ప్రతిఘటిస్తూ సమరయోధులు సంచలనాలకు కారణమయ్యారు.

## ప్రజాందోళనలతో దిగివచ్చిన ఆంగ్ల ప్రభుత్వం

జైలు అధికారుల రాక్షస చర్యలను ప్రతిఘటిస్తూ సమరయోధులు కూడా నిరసనదీక్షలు-నిరాహారదీక్షలు-సమ్మెలకు దిగటం, అధికారుల కిరాతక చర్యల చరిత్రను, చట్టాలను ఉల్లంఘిస్తున్న తీరుతెన్నుల సమాచారాన్ని సముద్రం దాటించి ప్రజలకు, పత్రికలకు చేర్చసాగారు. ఆ విధంగా అండమాను జైలు సరిహద్దులు దాటిన సమాచారం పత్రికలకు. ప్రజలకు చేరటంతో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల నిరసన వెల్లువెత్తింది. అండమాను జైలులోని సమరయోధులను భారతదేశం ప్రధాన భూభాగానికి రప్పించాలని, మృత్యు కుహరంలా మారిన సెల్యులర్ జైలును, అసలు అండమాను శిక్షాక్షేత్రాన్ని పూర్తిగా మూసివేయాలని ప్రజలు, ప్రజాప్రతినిధులు డిమాండ్ చేయసాగారు. ప్రజాందోళన హోరును తట్టుకోలేక పోయిన ఆంగ్ల ప్రభుత్వం భారతదేశంలోని జైళ్ళ నిర్వహణా వ్యవహారాల మీద

నివేదిక సమర్పించేందుకు The Indian Jails Committee ని ఆదేశించింది. ఆ ఆదేశాల మేరకు The Indian Jails Committee అధ్యక్షుడు Sir Alexzander Cardew అండమాను జైలును 1920 జనవరిలో సందర్శించి విచారణ సాగించాడు. అనంతరం రాజకీయ ఖైదీలను అండమాను జైలుకు తరలించడాన్ని నిషేధించాలని, అండమాను జైలులో ఉన్న సమర యోధులను భారత ప్రధాన భూభాగంలోని జైళ్ళకు రప్పించాలని, అండమానులోని శిక్షాక్షేత్రాన్ని (Penal Settlement) మూసివేయాలని The Indian Jails Committee సూచించింది. ఆ కమిటీ రిపోర్టును ఆంగ్ల ప్రభుత్వం ఆమోదిస్తూ 1921 మార్చి 11న ప్రకటించింది. ఆ తదుపరి రాజకీయ ఖైదీలను అండమాను జైలుకు పంపడం నిలిపివేసి, సెల్యులర్ జైలులోని రాజకీయఖైదీలు అందరిని భారతదేశం ప్రధాన భూభాగానికి రప్పిండం ఆరంభించింది.

## మాట తప్పిన ఆంగ్ల ప్రభుత్వం

1915లో మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికా నుండి భారతదేశం వచ్చి జాతీయోద్యమ పగ్గాలు చేపట్టాక 1920 సెప్టెంబర్ నాలుగున ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమానికి పిలుపు నిచ్చారు. తన మార్గంలో ఉద్యమం సాగినట్టయితే ఏడాదిలోగా స్వరాజ్యం సాధించి పెడతానని మహాత్ముడు సెలవివ్వడంతో విప్లవకారులు తమ అస్త్రశస్త్రాలను పక్కనపెట్టి ఆయనను అనుసరించారు. ఆ తరువాత ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమం ఉధృతంగా సాగుతున్నప్పుడు 1922 ఫిబ్రవరి నాలుగున జరిగిన చౌరీచౌరా హింసాత్మక సంఘటన వలన గాంధీజీ ఆ ఉద్యమమాన్ని విరమిస్తున్నట్టు ప్రకటించారు. ఆ చర్యతో కినిసిన విప్లవకారులు తిరిగి తమదైన మార్గంలో అస్త్రశస్త్రాలను ధరించి ఆంగ్లేయ వ్యతిరేక పోరాటాలకు సిద్ధమయ్యారు. ఈ నేపథ్యంలో, 1922 సెప్టంబర్ 23న Abolition of the Transportation Bill ను Lesiglative Assembly లో ప్రవేశపెట్టి రాజకీయ ఖైదీలను అండమాను జైలుకు తరలించేది లేదంటూ అసెంబ్లీ సాక్షిగా ప్రకటించిన ఆంగ్ల ప్రభుత్వం తన నిర్ణయాన్ని తానే తుంగలో తొక్కి అండమాను శిక్షాక్షేత్రాన్ని యధాతథంగా కొనసాగిస్తూ రాజకీయ ఖైదీలను అండమానులోని జైలుకు తరలించడం పునఃప్రారంభించింది.

## మలబారు మోప్లా యోధుల పోరాటం

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం తరువాత, అంతటి స్థాయిలో ఆంగ్ల పాలనకు వ్యతిరేకంగా మోప్లాల పోరాటం సాగిందని, మలబారు మోప్లా యోధులు సాగించిన తిరుగుబాటు మీద పరిశోధనలు జరిపిన ప్రముఖ బ్రిటిష్ చరిత్రకారుడు Prof.Conrad Wood (" there was staged the most serious rebellion against British rule in India

since the Great Mutiny of 1857-58 " - THE MOPLAH REBELLION AND ITS GENSIES, PPH, 1987) చే ప్రశంసించబడిన మలబారు మోప్లా / మోపిల్లా (MOPLAH / MOPILLA) ల పోరాటం తనదంటూ ఒక ప్రత్యేక చరిత్రను సృష్టించుకుంది

1921 నాటికి మహాత్మాగాంధీ, మౌలానా షౌకత్ అలీ లాంటి ప్రముఖుల ప్రమేయంతో మలబారు మోప్లాలు జాతీయోద్యమంలో భాగమయ్యారు. మౌలానా షౌకత్ అలీ 'ప్రసంగాలు మోప్లాల నుంచి ప్రమాదం కొని తెచ్చేవిధంగా ఉన్నా'యని, ఆనాటి Chief Secretary of Madras to the Governmnet of India ఆంగ్లేయ ఉన్నతాధికారులకు పంపిన నివేదికలో పేర్కొన్నాడు. 1921 ఆగస్టు 20న తిరుంగాడి మసీదు (Thirungadi Mosque) సంఘటనతో విజృంభించిన మోప్లాలు అంగ్ల ప్రభుత్వం ఆధిపత్యాన్ని తుడిచిపెట్టి ఆరు మాసాల పాటు దక్షిణ మలబారు ప్రాంతాన్ని తమ ఆధిపత్యంలోకి తెచ్చుకున్నారు. అందుకు ప్రతీకారచర్యగా దక్షిణ మలబారు ప్రాంత ప్రజలు, మోప్లా యోధుల మీద విరుచుకపడిన ఆంగ్ల ప్రభుత్వం ఆ ప్రాంతాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకునేందుకు మరో ఆరు మాసాలు కష్టపడాల్సి వచ్చింది.

చరిత్రకారుడు Dr. Roland Miller సమాచారం ప్రకారంగా ఈ క్రమంలో సాగిన ఆంగ్లేయాధికారుల కిరాతకత్వానికి 10,000 మంది ప్రాణాలు కోల్పోయారు. ఆంగ్ల ప్రభుత్వం మాత్రం కేవలం 1000 మంది చనిపోయారని ప్రకటించింది. 1922 జనవరి నాటికి 2,266 మంది మోప్లాలను బ్రిటిష్ బలగాలు పొట్టన పెట్టుకున్నాయని మరొక అధికారిక నివేదిక తెలిపింది. బ్రిటిష్ అత్యున్నత అధికారి లార్డ్ రావిల్సన్ నివేదిక ప్రకారంగా నాలుగు వేల మంది తిరుగుబాటుదారులు మరణించగా, 169 మంది సైనికులు హతమయ్యారు. ఆంగ్ల ప్రభుత్వ ఆధిపత్యాన్ని తొడగొట్టి సవాల్ చేసిన మలబారు మోప్లాలను పూర్తిగా తుడిచిపెట్టాలని నిర్ణయించిన ఆంగ్ల అధికారులు సుమారు 50,000 మందిని ఆరెస్టు చేయగా, 14,000 మంది మీద సైనిక విచారణ సాగించింది. ఆ విచారణల పర్యవసానంగా మొత్తం మీద 8050 మందిని వివిధ ప్రాంతాల జైళ్ళకు తరలించినట్టు తెలుస్తుంది.

## మలబారు మోప్లా యోధుల తరలింపు

అండమాను శిక్షాక్షేత్రాన్ని మూసివేస్తున్నట్టు, రాజకీయ ఖైదీలను ఇకనుండి అండమానుకు తరలించబోమని ప్రకటించిన ప్రభుత్వం తన నిర్ణయాన్ని మార్చుకుని మలబారు మోప్లాలను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించడానికి సిద్ధపడింది. ఆ నిర్ణయం మేరకు 1923 జూలై నాటికి 1235 మంది మలబారు మోప్లాలను అండమానుకు తరలించామని,



అండమానుకు తరలించబడుతున్న మలబారు మోప్లాయోధులు

72 మంది సెల్యులర్ జైలులో ఉన్నారని, 40 మంది వ్యవసాయం చేసుకోడానికి అనుమతి పొందారని State of India కు చెందిన Under Secretary Mr. Earl Winternton, House of Commons లో Member of the Parliamnet Mr. J. Hope Simpson సంధించిన ప్రశ్నకు సమాధానంగా 1923 జూలై 16న చెప్పారు. (The Moplah Rebellion and Andamans, Article By PK Zubair Ahmed, Editor: The Light of Andamans, Sunday, September, 2, 2012)

ప్రముఖ చరిత్రకారుడు Dr. Roland Miller తన గ్రంథం Mopilla Muslims of Kerala, (Page.149) లో 4,500 మంది మోప్లాలను అండమాను జైలుకు తరలించడానికి గాను 1500 మందికి మాత్రమే సరిపడే బళ్ళారి జైలుకు ముందు పంపారని, అక్కడి నుండి అత్యధికులను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారని వెల్లడించారు. ఈ విధంగా వేల సంఖ్యలో మోప్లాలను అండమానుకు తరలించినట్టు అధికారిక నివేదికలు, అనధికారిక గణాంకాలు, అధికారుల ప్రకటనలు చెబుతున్నా Directorate of Youth affairs, Sports and Culture, Andman & Nicobar Administration వెల్లడిస్తున్న సంఖ్య మాత్రం వందల సంఖ్య దాటకపోవడం విచిత్రం.

ఆంగ్ల న్యాయస్థానాలు, ప్రత్యేక న్యాయస్థానాలు, సైనిక న్యాయస్థానాలు విధించిన కారాగారశిక్షల అమలుకు అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడిన మోప్లా యోధులను తొలుత కొంత కాలం సెల్యులర్ జైలులో నిర్బంధించారు. ఆ తరువాత అండమాను శిక్షాక్షేత్రంలోని బందీల బ్యారెక్స్‌కు తరలించారు. భారతదేశంలో ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వెల్లువెత్తుతున్న ఆందోళనలు, ముమ్మరంగా సాగుతున్న విప్లవకారుల ప్రతీకార చర్యల ఫలితంగా నిర్బంధించబడిన, శిక్షలు విధించబడిన రాజకీయ ఖైదీలను బంధించి ఉంచేందుకు భారతదేశంలో జైళ్ళు సరిపోలేదు. అటు చూస్తే సెల్యులర్ జైలులో గదుల లేమి. అందువలన అండమాను శిక్షాక్షేత్రంలో ఆంక్షలతో కూడిన స్వేచ్ఛనిచ్చి Self Supports గా మోప్లాలకు ప్రత్యేక సదుపాయాలు కల్పించడానికి ఆంగ్ల ప్రభుత్వం పూనుకుంది. ఈ మేరకు టిక్కెట్ ఆఫ్ అగ్రికల్చర్ (Ticket of Agriculture). టిక్కెట్ ఆఫ్ బిజినెస్ (Ticket of Business), టిక్కెట్ ఆఫ్ లీవ్ (Ticket of Leave), టిక్కెట్ ఆఫ్ సెల్ఫ్ సపోర్ట్ (Ticket of Self Support) అంటూ ప్రత్యేక అనుమతులు జారీచేసి మలబారు మోప్లా యోధులతో అండమానులో గ్రామాల ఏర్పాటుకు, ఉన్న గ్రామాల అభివృద్ధికి పలు చర్యలు తీసుకుంది. ఆయా చర్యలను అమలు పర్చి, ప్రచారం చేసి భారత ప్రధాన భూభాగంలోని తమ కుటుంబాలను కూడా అండమానుకు రప్పించుకోడానికి మోప్లాలను ప్రోత్సహించింది.

## అండమానులో కేరళ గ్రామాలు

ఒక వర్షపాతం తప్ప మలబారు ప్రాంతంతో పోలిస్తే అండమాను దీవులలోని వాతావరణంలో పెద్దగా మార్పు లేనందున జైలు శిక్షలు విధించబడిన మోప్లాలు తమకు అండమానులో లభించే పాక్షిక స్వేచ్ఛను, కుటుంబాల సహచర్యాన్ని అనుభవించడానికి ముందుకు వచ్చారు. ప్రభుత్వం కూడా అవసరమైన మౌలిక సదుపాయాలు కల్పించడం వలన అండమాను దీవులలోని పలు గ్రామాలలో మోప్లాలు కుటుంబాలతో సహా స్థిరపడ్డారు. ఆ విధంగా అండమానులో స్థిరపడడానికి సంసిద్ధులయిన మోప్లాలు అండమానులోని వివిధ ప్రాంతాలలో నూతన గ్రామాలను ఏర్పాటు చేసుకుని అక్కడి భూములను సాగులోకి తెచ్చుకుని వాటిని వ్యవసాయ భూములుగా మార్చుకుని వ్యవసాయాన్ని అభివృద్ధి చేశారు.

అండమానులో మలబారు మోప్లాలు స్వయంగా ఏర్పాటు చేసుకున్న నివాస ప్రాంతాలకు కేరళ రాష్ట్రంలోని తమ స్వంత గ్రామాల పేర్లను పెట్టుకున్నారు. ఆ కారణంగా Herbertabad, Muslim Basthi, Hashmatabad, Hobadpur, Tusonabad, Mallapuram, Calicut, Gobhang, Prothropore లాంటి గ్రామాలు అండమానులో కూడా కన్పిస్తాయి. (The Moplah Rebellion and Andamans, Article By PK Zubair Ahmed, Editor :

The Light of Andamans, Sunday, September, 2, 2012). ఈ పేర్లు మాత్రమే కాకుండా Mannarghat, Knappuram, Manpur, Manjeri, Wandor, Tirur, Nilambar లాంటి కేరళ రాష్ట్రం గ్రామాల పేర్లు అండమానులోనూ కన్పిస్తాయి. (History of School Education in Andaman & Nicobar Islands, M.Ahmed Mujtaba (Alig), Insha publications, Kolkata, 2015, Page 72). మద్రాసు ప్రభుత్వం (Govt of Madras) అభ్యర్థన మేరకు 1922 అక్టోబర్ మాసంలో ఆరంభమయిన మోప్లా కుటుంబీకుల తరలింపుల మీద ఆ తరువాతి కాలంలో ఇటు ప్రజల ఆందోళనలు అటు ప్రజాప్రతినిధుల నిరసనలు వెల్లువెత్తాయి. ఆ కారణంగా 1925 ఆగస్టు 25న నాటి Madras Legislative Council సమావేశం చేసిన రద్దు తీర్మానంతో ఆ తరలింపు కార్యక్రమాలకు ఆంగ్ల ప్రభుత్వం అధికారికంగా స్వస్తి పలికింది.

ఒకవైపున మలబారు మోప్లాలు సాయుధంగా ఆంగ్ల ప్రభుత్వాన్ని ఢీ కొడుతుంటే, మాతృభూమి విముక్తికి సాయుధపోరాటం మినహా మరో మార్గంలేదని నమ్మిన విప్లవకారులు, విప్లవోద్యమ సంస్థలు కూడా తమ విప్లవ కార్యచరణను మరింత చురుగ్గా ఆచరణలో పెట్టాయి. విజృంభించిన విప్లవకారుల విప్లవకర చర్యలతో ఆంగ్లేయ పాలకులలో వణుకు పుట్టింది. ఆ కాలాన్ని చరిత్రకారులు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 'అగ్నియుగం'గా పిలిచారు. అగ్నియుగం ఉధృతిని అరికట్టడానికి ఆంగ్ల ప్రభుత్వం విప్లవ సంస్థల మీద రాక్షసంగా విరుచుక పడి విప్లవకారులను పలు కఠినశిక్షలకు గురి చేసింది.

## కదం తొక్కిన విప్లవోద్యమ యోధులు

ఆంగ్ల ప్రభుత్వ శిక్షలకు వెరవని విప్లవోద్యమకారులు 1932-38 మధ్య కాలంలో నిర్వహించిన ప్రత్యక్ష చర్యలు, దాడులు, కాల్పుల సంఘటనలు వివిధ కేసులుగా నమోదయ్యాయి. ఆ కేసుల్లో నిందితులకు ఆంగ్లేయ న్యాయస్థానాలు ఉరిశిక్షలు విధించడం, చివరకు కఠినకారాగార శిక్షలకు విధించి అండమాను జైలుకు తరలించాల్సిందిగా తీర్పులు ప్రకటించాయి. ఆ తీర్పుల మేరకు అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు రాజకీయ ఖైదీలను తరలించేది లేదన్న ఆంగ్ల ప్రభుత్వం మలబారు మోప్లా యోధుల తరలింపుతో ఆరంభించి విప్లవకారులను కూడా జట్లు జట్లుగా అండమానుకు పంపటం ఆరంభించింది.

అండమాను లోని సెల్యులర్ జైలుకు తరలించబడిన విప్లవకారులు / సమర యోధులు / రాజకీయ ఖైదీలు (Political Prisoners) చట్టవిరుద్ధంగా వ్యవహరిస్తున్న జైలు అధికారులకు వ్యతిరేకంగా ఉద్యమించారు. చట్టం ప్రకారంగా అధికారులు ఏర్పాటు చేయాల్సిన కనీస సౌకర్యాలు-సదుపాయాలను డిమాండ్ చేస్తూ విప్లవకారులు / సమర యోధులు / రాజకీయ ఖైదీలు నిరసనలు, నిరాహారదీక్షలు, సమ్మెలకు పూనుకున్నారు. ఆ

ఆందోళన కార్యక్రమాలను నిలువరించేందుకు ఆంగ్లేయాధికారులు కిరాతక చేష్టలకు పాల్పడ్డారు. ఆ రాక్షస చేష్టలు పలువురు నిరాహారదీక్షాపరుల ప్రాణాలను కూడా హరించాయి. 1933 జనవరిలో దిగివచ్చిన ఆంగ్లేయాధికారులు ఇచ్చిన హామీలతో ఆందోళన విరమించారు. ఆనాడు జైలు అధికారులు ఇచ్చిన హామీల అమలు కాకపోవడంతో మూడు మాసాల తరువాత 1933 మే 12న నిరాహార దీక్షలు మళ్ళీ ఆరంభమయ్యాయి. ఆ దీక్షలను భగ్నం చేయడానికి జైలు అధికారులు బలవంతంగా ఆహార పదార్ధాలు ఎక్కించడానికి దీక్షాపరుల గొంతుల్లోకి రబ్బరు పైపులు ఎక్కించి అత్యంత పాశవికంగా వ్యవహరించారు.

ఆంగ్లేయాధికారుల అమానుష చర్యలను వ్యతిరేకించిన విప్లవయోధులు మహావీర్ సింగ్ (Mahavir Singh) 1933 మే 17న , మోహన్ కిషోర్ నామదాస్ (Mohan Kishore Namdas) 1933 మే 26న ఆంగ్లేయాధికారుల చిత్రహింసలకు ప్రాణాలు కోల్పోయారు. ఆ తరువాత మరో విప్లవకారులు మోహిత్ మొయిత్రా (Mohit Moitra) 1933 మే 28న ప్రాణాలు విడిచారు. అండమాను శిక్షాక్షేత్రంలో సాగుతున్న ఆంగ్లేయాధికారుల కిరాతక చర్యల వివరాలు సెల్యులర్ జైలు గోడలు దాటుకుని, అండమాను సరిహద్దులకు చేరి, అక్కడి నుండి అలవోకగా సముద్రాన్ని లంఘించి భారత ప్రధాన భూభాగంలో గల వార్తా పత్రికల్లో సంచలన కథనాలయ్యాయి. సమరయోధుల పట్ల ఆంగ్లేయాధికారులు సాగిస్తున్న ఘోరకృత్యాల చరిత్రను ప్రజలకు విపులంగా తెలిపాయి. ఆ సమాచారంతో ప్రజలు, జాతీయోద్యమ నేతలు తీవ్రస్థాయిలో ఆంగ్ల ప్రభుత్వం మీద మండిపడుతూ ఆందోళనలకు దిగారు. ఆ పరిస్థితులలో రాజకీయ ఖైదీల సమస్యల పరిష్కారానికి ఆంగ్లేయాధికారులు ఆశ్వాసన ఇవ్వడంతో 1933 జూన్ 26న నిరాహారదీక్షల విరమణ జరిగింది.

## మాట తప్పిన ఆంగ్లేయాధికారుల రాక్షసత్వం

ఆ ఆశ్వాసనను కూడా ఆంగ్లేయాధికారులు మరో మారు తప్పడంతో ఆగ్రహించిన రాజకీయ ఖైదీలు (Political Prisoners) ఆంగ్లేయ ఉన్నతాధికారులకు మహాజర్లు అందజేసినా ఎటువంటి ప్రయోజనం లేకుండా పోయింది. చివరకు తమ డిమాండ్లను అంగీకరించి సమస్యలను పరిష్కరించక పోయినట్టయితే మళ్ళీ సమ్మెకు, నిరాహార దీక్షలకు పూనుకుంటామని చివరి హెచ్చరిక చేస్తూ 23 జూలై 1937న అల్టిమేటం ఇచ్చారు. ఆంగ్ల ప్రభుత్వం నుండి ప్రతిస్పందన కరువు కావడంతో 183 మంది రాజకీయ ఖైదీలు 1933 జూలై 24న సామూహిక నిరాహారదీక్షకు పూనుకున్నారు. అతి త్వరలో మరికొంత మంది దీక్షాపరులు వారితో చేరడంతో మొత్తం నిరాహారదీక్షాపరుల సంఖ్య 230 అయ్యింది. 1937 జూలై 30 న రాజకీయ ఖైదీల నిరాహారదీక్షల విషయం స్వయంగా ఆంగ్ల ప్రభుత్వం వెల్లడించడంతో

భారతావని అంతటా ప్రజాగ్రహజ్వాలలు ఆకాశాన్నంటాయి. భారత ప్రధాన భూభాగంలో గల జైళ్ళలోని రాజకీయ ఖైదీలు కూడా సెల్యులర్ జైలులోని రాజకీయ ఖైదీల పోరాటానికి సంఘీభావం తెలుపుతూ నిరాహార దీక్షలకు పూనుకున్నారు.

ఆ అనూహ్య పరిస్థితులు ఆంగ్ల ప్రభుత్వాన్ని తీవ్ర ఆందోళనకు గురిచేశాయి. అయినా న్యాయమయిన ఆ డిమాండ్లను పరిష్కరించ పూనుకోలేదు. ఆంగ్లేయాధికారుల నిర్లక్ష్యానికి, నిరంకుశత్వానికి నిరసనగా తమ డిమాండ్ల సాధనకు రాజకీయ ఖైదీలు స్థిరనిశ్చయంతో ముందుకు సాగుతున్నందున జాతీయోద్యమ నాయకులు మహాత్మాగాంధీ, ఫజులుల్ హఖ్, జవహర్‌లాల్ నెహ్రూ, రవీంద్రనాధ్ ఠాగూర్ దీక్షలు విరమించమని కోరుతూ దీక్షాపరులకు విజ్ఞప్తి చేశారు. ఆంగ్ల ప్రభుత్వంతో తాము మాట్లాడి సమస్యల పరిష్కారానికి కృషి సల్పగలమని భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు హామీలు ఇస్తూ నిరాహార దీక్షలు విరమించాల్సిందిగా తమ లేఖలు, ప్రకటనల ద్వారా కోరసాగారు.

అటు అండమానులో ఇటు భారత ప్రధాన భూభాగంలోని జైళ్ళల్లో సాగుతున్న రాజకీయ ఖైదీల ఆందోళనకు ప్రజలలో, జాతీయోద్యమ నాయకులలో లభిస్తున్న ఆదరణను, మారుతున్న రాజకీయ పరిస్థితులను గమనించిన ఆంగ్ల ప్రభుత్వం దిగివచ్చింది. రాజకీయ ఖైదీలు ఆ నిరాహారదీక్షలు, సమ్మె విరమించుకున్నట్టయితే డిమాండ్ల అమలుకు సిద్ధమని ప్రభుత్వం 1937 ఆగస్టు 12న సానుకూల ప్రకటన జారీ చేసింది.

ఆ అనుకూల పరిణామంతో భారత జాతీయ కాంగ్రెస్, జాతీయోద్యమ నాయకులు ఆందోళనను విరమించుకోవాల్సిందిగా మరోమారు విజ్ఞప్తులు చేశారు. ఆంగ్ల ప్రభుత్వ ఆశ్వాసన, జాతీయోద్యమ నాయకుల విజ్ఞప్తి మేరకు సమ్మె, నిరాహార దీక్షలతో కూడిన ఆందోళనను 36 రోజుల తరువాత అండమాను సెల్యులర్ జైలులోని రాజకీయ ఖైదీలు విరమించుకోగా, అండమాను జైలులోని రాజకీయ ఖైదీల పోరాటానికి సంఘీభావంగా భారత ప్రధాన భూభాగంలోని జైళ్ళల్లో ఆందోళన సాగిస్తున్న రాజకీయ ఖైదీలు కూడా 1937 ఆగస్టు 30న తమ ఆందోళనలను విరమించుకున్నారు.

## అండమాను నుండి తరలింపు ఆరంభం

అటు అండమానులో ఇటు భారత ప్రధాన భూభాగంలో రగులుకున్న ఆందోళనల మూలంగా దిగివచ్చిన ఆంగ్ల ప్రభుత్వం అండమాను జైలులోని రాజకీయ ఖైదీలను భారత ప్రధాన భూభాగానికి తరలించేందుకు అంగీకరించింది. ఈ వాతావరణానికి 1937 నాటి ఎన్నికలు మరింత సానుకూల పరిస్థితులను తెచ్చిపెట్టాయి. 1937 నాటి ఎన్నికల ఫలితంగా

భారత జాతీయ కాంగ్రెస్ ఏడు ప్రాంతాల (Provinces) లో మంత్రివర్గాలు ఏర్పాటుకు సిద్ధపడింది. ఆ తక్షణమే అండమాను జైలులోని రాజకీయ ఖైదీలను అండమాను సెల్యులర్ జైలు నుండి భారత ప్రధాన భూభాగానికి తరలించాలన్న డిమాండ్‌ను పునరుద్ఘాటించింది. ఆ కారణంగా ఆంగ్ల ప్రభుత్వం అండమాను జైలులోని రాజకీయ ఖైదీల తరలింపుపై ఎట్టకేలకు 1937 సెప్టంబరు 14న ఉత్తర్వులు జారీ చేసింది.

ఆ ఉత్తర్వుల ప్రకారం అండమాను జైలు నుండి రాజకీయ ఖైదీలను తరలింపు కార్యక్రమం 1937 సెప్టంబర్ 14న ఆరంభమయ్యి 1938 జనవరి 18 నాటికి ముగిసింది. ఈ చర్యతో 'కాలాపానీ' అను అప్రతిష్మాత్మక నామవాచకంతో స్వాతంత్ర్య సమరయోధులు, రాజకీయ ఖైదీల పాలిట 'మృత్యుకుహరం'గా, 'నరక కూపం'గా, 'మృత్యుగృహం'గా అపఖ్యాతిని మూటగట్టుకున్న అండమాను సెల్యులర్ జైలు చరిత్ర ముగిసినా, ఆ సెల్యులర్ జైలు కథ మాత్రం ఇంకా పూర్తిగా కంచికి చేరలేదు. 1938లో అండమాను శిక్షాక్షేత్రం నుండి రాజకీయ ఖైదీల చివరి జట్టు తరలింపు జరిగినా పలు ఇతర నేరాలకు పాల్పడిన నేరస్థులు మాత్రం ఇంకా సెల్యులర్ జైలు నిర్బంధంలో ఉండి పోయారు.

## అండమాను ను ఆక్రమించుకున్న జపాన్ సైన్యం

1939 సెప్టెంబర్ ఒకటిన బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) జపాన్ అక్షరాజ్యాల (Axis Powers) మధ్యన ఆరంభమైన ద్వితీయ ప్రపంచ యుద్ధం తొలిదశలో మిత్రరాజ్యాల మీద విజయపతాక ఎగరేసిన జపాన్, ఆనాటికి బ్రిటన్ స్వాధీనంలో ఉన్న రంగూన్‌ను ఆక్రమించుకుంది. అటునుండి జపాన్ సైనిక బలగాల అండమాను-నికోబారు దీవుల దిశగా రానున్న విషయాన్ని ముందుగా ఊహించిన బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) ఉన్నత సైన్యాధికారుల ఆదేశాల మేరకు ఆంగ్ల సైన్యం అండమాను-నికోబారు దీవులను ఆఘమేఘాల మీద ఖాళీచేసింది.

ఆంగ్ల సైన్యం నుండి ఎటువంటి ప్రతిఘటన లేకుండానే 1942 మార్చి 23న పోర్టు బ్లేయర్ (Port Blair) లోకి ప్రవేశించిన జపాన్ సైన్యం అండమాను-నికోబారు దీవులను సునాయాసంగా స్వాధీనపర్చుకుంది. అనంతరం 'మా శత్రువు శత్రువులు మా మిత్రులు' అని ప్రకటించిన జపాన్ సైన్యం, బ్రిటన్ ను తమ శత్రువుగా పరిగణిస్తున్న భారతీయులు తమకు మిత్రులంటూ అండమాను-నికోబారు వాసుల స్నేహహస్తం కోరుతూ సెల్యులర్ జైలులోని బందీలందరిని విడుదల చేసింది. అండమాను-నికోబారు దీవులలోని ప్రజానీకాన్ని మంచి చేసుకోడానికి ఆసియా ఆసియా వారిదే (Asia for the Asians) అని ప్రకటించింది.



1937 సెప్టంబరు 14న నాటి ఆంగ్ల ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం అండమాను జైలు నుండి సమరయోధులు తరలింపు కార్యక్రమం 1937 సెప్టంబర్ 14న ఆరంభమయ్యి 1938 జనవరి 18 నాటికి ముగిసింది. ఆ సందర్భంగా జైలు నుండి విముక్తమవుతున్న సమరయోధులు

## ఆదిలోనే జపాన్ సైన్యం అక్రమాలకు ప్రజాప్రతిఘటన

ప్రతిఘటన లేకుండా అండమానును ఆక్రమించుకున్న సంతోషంలో జపాన్ సైన్యాధికారులు తమ సైనికులకు మరుసటి రోజున సైనిక క్రమశిక్షణను సడలించి ఆనందించడానికి ఆటవిడుపు కల్పించారు. ఆ అవకాశంతో రెచ్చిపోయిన జపాన్ సైనిక మూకలు అండమాను గ్రామాల మీద పడ్డాయి. అందినంతకాడికి సొంతం చేసుకుంటూ గ్రామస్తులను భయభ్రాంతుల్ని చేస్తూ అమానుషంగా వ్యవహరించసాగాయి. జపాన్ సైనికులు మహిళల పట్ల అసహ్యసంగా, అవమానకరంగా, అశ్లీలంగా ప్రవర్తించ సాగారు. ఆ కిరాకత చర్యలను సహించలేక అండమానులోని అబెర్‌దీన్ (Aberdeen) గ్రామం బిడ్డడు, మున్షీ జుల్ఫీఖార్ అలీ (Munshi Zulfiquer Ali) జపాన్ సైనికులను తుపాకితో ఎదుర్కొన్నాడు. ఆ కారణంగా ఆయనను బహిరంగ ప్రదేశంలో గ్రామస్తులందరి సమక్షంలో 26 మార్చి 1942న భయంకం చిత్రహింసల పాల్జేసి జపాన్ సైనిక మూకలు కాల్చి చంపేసాయి. ఆ యువకిశోరం మున్షీ జుల్ఫీఖార్ అలీ హత్యాకాండతో ఆరంభమయిన జపాన్ సైనికుల అక్రమాలకు, అఘాయిత్యాలకు, అక్రమ నిర్బంధాలకు, చిత్రహింసలకు, భయానక హత్యలకు, అమానుష సామూహిక హత్యాకాండకు ఇక అంతుపొంతు లేకుండా పోయింది.

## అండమాను లో త్రివర్ణ పతాకం

ఈ దుశ్చర్యలు అలా సాగుతుండగా, ఆంగ్లేయుల నుండి స్వాధీనం చేసుకున్న అండమాను-నికోబారు దీవులను భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధులు నేతాజీ సుభాష్ చంద్ర బోస్ ఆధ్వర్యంలో ఏర్పడిన 'ఆజాద్ హింద్ ప్రభుత్వం' (Azad Hind Government) పరం చేస్తున్నట్టుగా జపాన్ ప్రధాని 1943 అక్టోబర్ 28న టోకియోలో ప్రకటించారు. అండమాను-నికోబారు దీవులకు సంబంధించిన విదేశీ, భద్రతా వ్యవహారాలు (Foreign and Defence affairs) మినహా పాలనా వ్యహారాలను ఆజాద్ హింద్ ప్రభుత్వానికి జపాన్ ప్రభుత్వం అప్పగించింది. 1943 డిసెంబరు 29న నేతాజీ అండమాను వచ్చారు. ఆ మరుసటి రోజున త్రివర్ణ పతాకాన్ని ఆయన ఎగురవేసారు. అండమాను-నికోబారు దీవులకు 'షహీద్-స్వరాజ్' (Shaheed -Swaraj) అని ఆజాద్ హింద్ ప్రభుత్వాధినేత నామకరణం చేశారు. అండమానులో ఆయన మూడు రోజుల పాటు ఉన్నారు. ప్రపంచయుద్ధం ఆరంభం అయ్యాక, అండమాను-నికోబారు దీవులను జపాన్ ఆక్రమించుకున్నాక, ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సర్వత్రా క్రియాశీలకమయిన భారతీయ విప్లవకారులు అండమాను-నికోబారు దీవులలో కూడా చురుకైన పాత్ర నిర్వహించడానికి పూనుకున్నారు.

## విప్లవ సంఘాల, పోరాట సంస్థల రంగప్రవేశం

ప్రముఖ విప్లవకారుడు రాష్ బిహారి బోస్ మార్గదర్శకంలో టోకియో కార్యక్షేత్రంగా రూపు దిద్దుకున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) బర్మా నుండి అండమాను దీవులకు చేరుకుంది. బ్రిటిష్ భారతసైన్యంతో బర్మా యుద్ధక్షేత్రంలో పోరాడుతున్న నేతాజీ సుభాష్ చంద్రబోస్ నాయకత్వంలోని భారత జాతీయసైన్యం (Indian National Army) కూడా అండమాను దీవులకు విస్తరించింది. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు, వహాబీ యోధులు, విప్లవకారులు, మలబారు మోప్లా యోధులు తదితర పోరాటయోధుల సంతతితో సంఖ్యాబలం పెంచుకున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్', 'భారత జాతీయసైన్యం' సంఖ్యాపరంగా అండమాను -నికోబారు దీవుల్లో బలోపేతమయ్యాయి. ఆ క్రమంలో అండమాను-నికోబారు దీవుల్లోని వివిధ ప్రాంతాలలో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్', 'భారత జాతీయసైన్యం' శాఖలు ఏర్పడి చురుగ్గా వ్యవహరించసాగాయి. ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న భారత జాతీయసైన్యం, 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' అండమాను-నికోబారు దీవుల్లోని ప్రజలను ప్రధానంగా యువకులను, పెద్దలను కూడా పెద్దఎత్తున ఆకర్షించాయి.

'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) లో అండమాను-నికోబారు దీవులలోని విద్యాధికులు ఎక్కువ సంఖ్యలో భాగస్వాములయ్యారు. ప్రధానంగా ఉపాధ్యాయులు 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' విస్తరణ కార్యకలాపాలలో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా బర్మా కార్యక్షేత్రంగా పోరాడుతున్న భారత జాతీయసైన్యానికి పూర్తి స్థాయి మద్దతు పలుకుతూ అవసరమగు ఆర్థిక-అంగ బలాన్ని అందించడానికి స్థానిక 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నాయకులు పూనుకున్నారు.

అండమాను-నికోబారు దీవులలోని విద్యాధికులు ఏవిధంగానయితే 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' లో చురుకైన పాత్రను చేపట్టి ఆ సంస్థ విస్తరణకు, బలోపేతం కావడానికి తోడ్పడ్డారో అదే తరహాలో భారత జాతీయ సైన్యం (Indian National Army) విస్తరణ, బలోపేతం కావడానికి అండమాను-నికోబారు ప్రజలు సహాయపడ్డారు. ప్రధానంగా యువత భారత జాతీయ సైన్యంలో బాగా ఉత్సాహం చూపింది. ఆ కారణంగా స్థానికంగా భారత జాతీయసైన్యం శాఖలు బాగా ఏర్పడ్డాయి. ఆ శాఖలలోని సైనిక యోధులు బర్మా యుద్ధక్షేత్రానికి తరలివెళ్ళడానికి తహతహలాడినప్పటికి అప్పటి పరిస్థితులు అనుకూలంగా లేనందున అండమాను-నికోబారు దీవులలోని తమ తమ కార్యాలయాలలో సైనిక కవాతులు నిర్వహిస్తూ యుద్ధరంగం చేరడానికి సదా సన్నద్ధంగా నిలిచారు.

## జపాన్ సైనిక మూక అమానుషాలు ఆరంభం

బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) నుండి ఎటువంటి ప్రతిఘటన లేకుండా అలవోకగా అండమాను దీవులను స్వాధీనం చేసుకున్న జపాన్ సైన్యాలకు అంగ్ల ప్రభుత్వ సైనిక బలగాల నుండి ఇక్కట్లు ఆరంభమయ్యాయి. అండమాను-నికోబారు దీవుల చుట్టూ తమ అస్త్ర-శస్త్రాలను మోహరించిన బ్రిటిష్ సైన్యం అండమానులో తిష్టవేసిన జపాన్ సైన్యానికి ఆయుధాలు-ఆహార సరఫరా అయ్యే మార్గాల (Supply Lines) మీద దృష్టి సారించి, ఆకస్మికంగా దాడులు చేస్తూ జపాన్ సైనిక వర్గాలకు చికాకు పర్చసాగాయి. అవిచ్ఛిన్నంగా సాగుతున్న ఆ చర్యలతో తీవ్ర అసహనానికి గురయిన జపాన్ సైన్యాధికారులు తమకు ఏర్పడిన భాషాపరమయిన ఇబ్బందుల వలన ఆంగ్ల భాష తెలిసిన ప్రజలను, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, ఇండియన్ నేషనల్ ఆర్మీ సభ్యులను అనుమానపు దృక్కులతో చూడటం ఆరంభించారు. ఆంగ్ల భాష ఎరిగిన, ప్రజలలో బాగా పలుకుబడి కలిగిన వ్యక్తులను కూడా ఏమాత్రం వదలి పెట్టకుండా వారందరిని బ్రిటిష్ ప్రభుత్వ ఏజెంట్లుగా, మద్దతు దారులుగా. గూఢచారులుగా జపాన్ సైన్యాధికారులు అనుమానించసాగారు.

## అనుమానం పెనుభూతమయ్యింది

ప్రపంచయుద్ధంలో పరాజయ పరంపరల వార్తలను అందుకుంటున్న జపాన్ సైన్యాధికారులను మరింత భయభ్రాంతుల్ని చేస్తూ బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) సైన్యాలు అండమాను-నికోబారు దీవుల వెంట అటు ఆకాశం మార్గం, ఇటు సముద్ర మార్గం నుండి ఆకస్మిక దాడులు చేసి జపాన్ సైన్యాధికారులకు దిక్కుతోచని పరిస్థితి కల్పించాయి. ఆ పరిస్థితికి తోడు ఆంగ్ల భాష రాని జపాన్ సైన్యాధికారులకు అండమాను-నికోబారు దీవులలోని పరిస్థితులను అవగతం చేసుకోవడం కనాకష్టమయ్యింది. ఆ కారణంగా జపాన్ సైన్యాధికారులు ప్రతి ఒక్కరిని అనుమానించసారు. ప్రధానంగా ఆంగ్ల బాష తెలిసి వారి పట్ల అధికారుల అనుమానుం పెనుభూతంగా మారింది. ప్రజలను, మేధావులను, ప్రభుత్వ ఉద్యోగులను మాత్రమే కాకుండా జపాన్ సహకారంతో ఏర్పడి విస్తరిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League), భారత జాతీయ సైన్యం (Indian National Army) లోని ప్రతి ఒక్కరినీ అనుమానించ సాగారు. చివరకు ఈ అనుమానం అండమాను-నికోబారు దీవులలోని ప్రజలకు పెనుభూతంగా మారింది.

## గూఢచర్యం ఆరోపణలతో నిర్బంధకాండ

ఆ కారణంగా ఏమాత్రం చిన్న అనుమానం కలిగినా అండమాను-నికోబారు ప్రజల పట్ల అత్యంత భయానకంగా జపాన్ సైన్యాధికారులు వ్యవహరించడం ఆరంభించారు. అండమాను-నికోబారు దీవుల్లోకి భారీ సంఖ్యలో వచ్చి చేరిన జపాన్ సైనికులకు ఆహారం అవసరమయ్యింది. అండమాను ప్రజలకు కూడా ఆహార పదార్ధాలు అందించాల్సిన భాధ్యత జపాన్ సైన్యాధికారుల మీద పడింది. ఆ సంక్లిష్ట పరిస్థితులలో ఆయుధాలు-ఆహార సరఫరా మార్గాలను (Supply Lines) ఆంగ్ల సైన్యాలు విచ్ఛినం చేయసాగాయి. ఆ విచ్ఛితిని నివారించ లేక ఆత్మరక్షణలో పడిపోయిన జపాన్ సైన్యాధికారులు 'ఆంగ్లేయుల పక్షాన గూఢచర్యం' సాకుతో అండమాను ప్రజల, ప్రధానంగా విద్యావంతుల మీద తమ అక్కసు తీర్చుకోవడం ఆరంభించారు. బ్రిటన్ మిత్రరాజ్యాలు (Allied Powers) తరుచూ చేస్తున్న ఆకస్మిక విమాన దాడుల వలన జపాన్ సైనిక వర్గాలలో ఏర్పడిన భయానక మానసిక స్థితి వారిని మరింత అయోమయానికి గురిచేసింది. జపానీయులు తమ ప్రధాన శత్రువును ఏమీ చేయలేక తొలుత 'మా శత్రువు శత్రువు మా మిత్రులు' అంటూ ప్రకటించి ప్రచారం చేసిన జపాన్ సైనిక బలగాలు అండమాను-నికోబారు ప్రజలను అనుమానిస్తూ నిర్బంధాలకు, చిత్రహింసలకు, కాల్చివేతలకు, సామూహిక హత్యాకాండలకు కూడా గురి చేయసాగారు.



గూఢచర్యానికి పాల్పడుతున్నారన్న అసత్య అభియోగం మీద 1943 మార్చి 30న జపాన్ సైనిక బృందం దుగ్నాబాద్ (Dugnabad) వద్ద కాల్చి చంపిన ఏడుగురు అమరవీరుల స్మరణలో ఏర్పాటు చేసిన స్మారక స్థూపం

## హత్యాకాండల పర్వం ఆరంభం

1943 జనవరి 22న అండమాను ప్రజల మీద ప్రథమ గూఢచర్యం కేసు (First Spy Case) నమోదయ్యింది. జపాన్ సైనిక వ్యవహారాల మీద గూఢచర్యం సాగిస్తున్నారన్న నేరారోపణల మీద అండమాను ప్రజలను పెద్ద సంఖ్యలో నిర్బంధించి సెల్యులర్ జైలుకు తరలించారు. ఆ తరువాత పోలీసు విభాగానికి చెందిన ఇత్తర్ సింగ్ (Itter Singh), సైనిక విభాగానికి చెందిన ఛోటా సింగ్ (Chotta Singh), ఆంగ్ల ప్రభుత్వం నుండి మాత్రమే కాకుండా జపాన్ సైనిక పాలనా వ్యవస్థ నుండి కూడా పదోన్నతులు పొందిన సుబేదార్ మేజర్ సుభా ఖాన్ (Subedar Major Subha Khan), ఉన్నతాధికారి గోపాల కృష్ణ (Gopala Krishna), పోలీసు విభాగం అధికారి నారాయణ రావు (Narayana Rao), ప్రభుత్వ వాతావరణ విభాగం (Meteorogical Departmennt) అధికారి యం. అబ్దుల్ ఖాలిఖ్ (M. Abdul Khalique), ప్రభుత్వ వైద్యాధికారి డాక్టర్ సురేంద్ర నాథ్ నాగ్ (Dr Surendra Nath Nag) లాంటి ప్రముఖులను జపాన్ సైన్యాధికారులు అరెస్టు చేశారు. బ్రిటిష్ ప్రభుత్వంలో మాత్రమే కాకుండా ప్రస్తుత జపాన్ సైనిక పరిపాలనా వ్యవస్థలో కూడా ఉన్నత పదవులను చేపట్టి జపాన్ సైన్యాధికారులకు సహకరిస్తున్న ప్రముఖ అధికారులను కూడా జపాన్ సైనికులు

నిర్బంధించి సెల్యులర్ జైలులో సామాన్య బందీలుగా పడెయ్యడంతోపాటుగా, తీవ్ర చిత్రహింసలకు గురిచెయ్యడంతో అండమాను ప్రజలు నివ్వెరబోయారు.

ఆ ఏడుగురు ప్రముఖుల నుండి ఆంగ్లేయ ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం రాబట్టేందుకు జపాన్ సైన్యాధికారులు విఫల ప్రయత్నాలు చేసారు. చిత్రహింసలు పెట్టారు. మూడు మాసాల చిత్రహింసల పర్వం తరువాత 1943 మార్చి 30న సెల్యులర్ జైలు నుండి ఆ ఏడుగురిని అండమానులోని దుగ్నాబాద్ (Dugnabad) ప్రాంతానికి తరలించారు. అండమాను ప్రజల నుండి Seven Martyrs of Dugnabad గా గౌరవాభిమానాలు పొందిన ఆ ఏడుగురు ప్రముఖులను జపాన్ సైన్యాధికారులు దుగ్నాబాద్ వద్ద తమ Firing Squad ద్వారా నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపించారు. (Saat Mashoor Hastiyon Ki Shahadet Dignabad mein (Hindi), M. Ahmad Mujtaba, Insha Publications, Kolkata, 2019).

జపాన్ సైన్యాధికారుల దాష్టీకానికి బలైనటువంటి సుబేదార్ మేజర్ సుభాఖాన్, యం.అబ్దుల్ ఖాలిఖ్‌తో పాటుగా మిగిలిన ఐదుగురి ఆనాటి అమరత్వం స్మరణకు వచ్చేలా అండమాన్ ప్రజలు దుగ్నాబాద్ వద్ద ఏడుగురు అమరవీరుల దుగ్నాబాద్ స్మారక స్థూపాన్ని (Seven Martyrs of Dugnabad Memorial) నిర్మించుకుని ఈనాటికీ ఆమర వీరుల పట్ల గౌరవప్రపత్తులను వ్యక్తంచేస్తూ ప్రజలు స్మరించుకుంటున్నారు.

## హోంఫ్రె గంజ్ కిరాతకం

భయానక దుగ్నాబాద్ హింసాకాండ తరువాత రెండవ గూఢచర్యం కేసు (Second Spy Case) ను జపాన్ సైన్యం నమోదు చేసింది. ఈ గూఢచర్యం కేసులో అండమానుకు చెందిన సుమారు ఆరువందల మంది సామాన్య ప్రజలను, పలువురు ప్రముఖులను 1943 అక్టోబర్-నవంబరు మాసాలలో వివిధ దఫాలుగా అరెస్టు చేసింది. అలా అరెస్టు చేసిన వారందర్ని అండమానులోని సెల్యులర్ జైలులో నిర్బంధించింది. యథాప్రకారంగా జపాన్ సైన్యానికి వ్యతిరేకంగా ఆంగ్లేయ బలగాలతో చేతులు కలిపి జపాన్ సైనికుల మీద గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఆరోపించింది. ఆ మేరకు వారందరి నుండి ఒప్పుదల వాంగ్మూలాలు రాబట్టేందుకు వారిని చిత్రహింసలకు గురిచేసింది. చివరకు గూఢచర్యానికి పాల్పడుతున్నారన్న ఆరోపణలను 44 మంది మీద ఖరారు చేసింది.

ఆ తరువాత పోర్టుబ్లెయర్‌కు పదహారు కిలోమీటర్ల దూరంలో ఉన్న హోంఫ్రే గంజ్ (Homfrey Gunj) ప్రాంతానికి 1944 జనవరి 30న వారందరిని తరలించింది.

అక్కడ వారిచేత చేత ఆంగ్ల అక్షరం ' L ' ఆకారంలో పెద్ద గోతిని తవ్వించి, ఆఘమేఘాల మీద తమ కాల్పుల దళాన్ని (Firing Squad) జపాన్ సైన్యాధికారులు హోంఫ్రే గంజ్ ప్రాంతానికి రప్పించారు. ఆ కాల్పుల దళం వచ్చాక 44 మంది అండమాను ప్రముఖులను ఒక వరుసలో నిల్చోబెట్టారు. ఆ విధంగా నిలబెట్టబడిన ప్రముఖులకు అభిముఖంగా నిలబడిన కాల్పుల దళం అతి సమీపం నుండి అండమాను ప్రముఖుల మీద ఒక్కసారిగా కాల్పులు జరిపి వారందరిని బలి తీసుకుంది.

ఈ మేరకు జపాన్ సైన్యం ద్వారా సామూహిక హత్యాకాండకు గురయిన 44 మంది అండమాను ప్రముఖులలో యం. అబ్దుల్ జలీల్ (M Abdul Jalil), ఫజర్ బేగ్ (Fazar Baig), ఫర్జంద్ అలీ (Farzand Ali), ఫజల్ హుసైన్(Fazal Hussain), గులాం సర్వర్ (Gulam Sarwar), మీర్ ఆలం (Mir Alam), మొహమ్మద్ ఖాన్ (Mohammed Khan), నూర్ హుసైన్ మాలిక్ (Noor Hussain Mallik), నూర్ అహ్మద్ (Noor Ahmed), నూర్ మాహి (Noor Mahi) లు ఉన్నారు. ఆనాడు జపాన్ సైన్యం రాక్షసకాండకు బలయిన 44 మంది అమరయోధుల స్మరణలో 1978 జనవరి 30న స్వతంత్ర భారత ప్రభుత్వం హోంఫ్రే గంజ్ (Homfrey Gunj) లో ఒక ప్రత్యేక స్మారక స్థూపాన్ని నిర్మించింది. (Memories of Andaman & Nicobar Islands, M. Ahmed Mujtaba (Alig), Insha publications, Kolkata, 2013, Page. 111-116)

## హ్యేవ్‌లాక్ రాక్షసకాండ

ప్రపంచ యుద్ధంలో బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) విజయ పరంపర ముమ్మరం అవుతున్న కొద్దీ జపాన్ వెనకడుగు వేయసాగింది. ఆ సానుకూల పరిస్థితులలో విజృంభించిన ఆంగ్లేయ సైన్యాలు అండమానులో గల జపాన్ సైన్యాల సరఫరా మార్గాల (Supply Lines) ను విచ్ఛిన్నం చేయడంతో అండమాను-నికోబారు దీవులలో ఆహార ధాన్యాల తీవ్ర కొరత ఏర్పడింది. ఆ సమస్యను అధిగమించడానికి ప్రత్యామ్నాయ మార్గాలను కనుగొనటంలో జపాన్ సైన్యాధికారులు విఫలమయ్యారు. ఆ కారణంగా ఇటు తమ జపాన్ సైనికదళాలలకు, అటు ఆకలి గొన్న అండమాను-నికోబారు ప్రజలకు ఎదురవుతున్న ఆహార కొరతను పరిష్కరించడానికి అండమాను-నికోబారు దీవులలోని జనాభా సంఖ్యను తగ్గించడం మినహా మరో మార్గం లేదన్న అవివేక, అహేతుక నిర్ణయాలను జపాన్ సైన్యాధికారులు తీసున్నారు. ఆ అసంబద్ధ నిర్ణయాలను అమలుకు గగుర్పాటుకు గురిచేసే రాక్షసచర్యలకు జపాన్ సైన్యాధికారులు పాల్పడ్డారు.

అండమానులోని అబెర్‌దీన్ చుట్టుప్రక్క గ్రామాలకు చెందిన సుమారు 700 మందిని ఉద్యోగాలు, మంచి భవిష్యత్తు కల్పిస్తామన్న హామీలతో స్వగ్రామాల నుండి తరలించారు. అలా తరలించిన ప్రజలను 1945 ఆగస్టు నాల్గున మూడు రవాణా పడవల్లో సముద్రంలోకి తీసుకెళ్ళారు. పోర్టుబ్లెయర్ నుండి 50 కిలోమీటర్ల దూరంలో ఉన్న హ్యావ్‌లాక్ దీవి (Havelock Island) సమీపానికి చేరుకున్న తరువాత మూడు రవాణా పడవలను సముద్రం మధ్యలోఆపి. అక్కడిక్కడ సముద్రంలోకి దూకమంటూ పడవల్లోని ప్రజలకు జపాన్ సైన్యాధికారులు ఆజ్ఞాపించారు. అసలు ఏం జరుగుతుంతో అర్ధంకాక, ఏం చేయాలో తెలియక తీవ్ర ఆందోళన, అయోమయంలో కొట్టుమిట్టాడుతున్న ప్రజల మీదకు జపాన్ సైనికులు క్రూరంగా విజృంభించారు. ప్రజలను పడవల్లో నుండి సముద్రంలోకి దూకమంటూ తుపాకి మడమలతో కొడుతూ, బాయ్‌నెట్‌లతో దారుణంగా పొడుస్తూ, కాదంటే కాల్చివేస్తామని బెదిరిస్తూ పడవల్లోని ప్రజలను సముద్రంలోకి బలవంతంగా తోసివేసారు. జపాన్ సైన్యాధికారుల ఆ భయంకర రాక్షసకాండ వలన హ్యావ్‌లాక్ దీవి వద్ద వందల సంఖ్యలో ప్రజలు జలసమాధి అయ్యారు. (Black Days in Andaman & Nicobar Islands, Rabin Raychowdhury, Manas Publications, New Delhi, 2004. Page. 188).

జపాన్ సైన్యం చేత బలవంతంగా సముద్రంలోకి త్రోసివేయబడినా కూడా మృత్యువు కోరలకు చిక్కకుండా బతికి బయట పడి తీరం చేరుకున్న ఒకరిద్దరిలో ఒకరయిన సౌదాగర్ అలీ (Saudagar Ali) వలన హ్యావ్‌లాక్ దీవి దుస్సంఘటన, వందలాది ప్రజల జలసమాధి విషయాలు బహిర్గతమయ్యాయి. అన్నం పెట్టించమన్న నేరానికి అండమాను ప్రజల మీద జపాన్ సైన్యాధికారులు సాగించిన రాక్షసకృత్యం గుట్టు కాస్తా మృత్యుంజయుడు సౌదాగర్ అలీ సాహసం వలన రట్టయ్యింది. (Cellular Jail of Andaman and Nicobar Islands, Amit Rai Jain, Shree Publishers & Distributors, New Delhi, 2017, Page. 177).

ఈ హ్యావ్‌లాక్ దీవి దురంతాన్ని రచయిత Mr. Rabin Raychowdhury తన Black Days in Andaman & Nicobar Islands గ్రంథంలో సవివరంగా పేర్కొన్నారు. ప్రజలను మభ్యపెట్టి రవాణా పడవల్లో సముద్రంలోకి తీసుకెళ్ళి పడవల్లోంచి సముద్రంలోకి బలవంతంగా తోసివేసారని వివరించారు. ఆ తరువాత మరొక రచయిత Mr. Amit Rai Jain తన Cellular Jail of Andaman and Nicobar Islands గ్రంథంలో (Page. 176) ప్రజలను రవాణా విమానాల్లో (Transport Aircrafts) సముద్రంలోకి తీసుకెళ్ళి ఆ రవాణా విమానాల నుండి బలవంతంగా సముద్రంలోకి త్రోసివేసారని పేర్కొన్నారు. ప్రజలను అలా తరలించడానికి జపాన్ సైన్యాలు ఉపయోగించిన రవాణా సాధనాలు పడవలా? లేక

విమానాలా? అన్నది సందేహాస్పదంగా ఉన్నప్పటికి ఏడు వందల మంది అమాయకుల ప్రాణాలను జపాన్ సైన్యాలు బలి తీసుకున్నది మాత్రం పచ్చినిజమని చరిత్ర చెబుతుంది.

## తార్‌ముగ్లి పైశాచికత్వం

ఆకలిగొన్న అండమాను ప్రజానీకం సమస్యకు అకలిగొన్న వారిని నిర్మూలించడమే పరిష్కార మార్గమని నిర్ణయానికొచ్చిన జపాన్ సైన్యాధికారులు పైశాచిక హత్యాకాండలకు కూడా పూనుకున్నారు. హ్యావ్‌లాక్ రాక్షసకాండ ముగిసీముగియక ముందే అండమాను-నికోబారు దీవులలోని వివిధ గ్రామాల నుండి సుమారు 900 మంది ప్రజలను స్వగ్రామాల నుండి తరలించి, సైన్యం పహారాలో ఒక చోట నిర్బంధించి ఉంచారు. ఆ ప్రజలకు ఆహార పానీయాల కనీస సౌకర్యం కాదుకదా, ప్రకృతి అవసరాలు తీర్చుకునే అవకాశం కూడా కల్పించకుండా 24 గంటల పాటు నిర్బంధానికి గురిచేశారు. ఆ తరువాత 1945 ఆగస్టు 13న ఆ విధంగా నిర్బంధించిన ప్రజలందర్నీ సమీపంలోని తార్‌ముగ్లి దీవి (Tarmugli Island) వద్దకు పట్టుకెళ్ళారు.

ఆ తార్‌ముగ్లి దీవిలో పిల్లా-పాప, ముసలి-ముతకా, ఆడ-మగ, పెద్దా-చిన్నా అని చూడకుండా అందర్ని చెట్లకు కట్టివేశారు. కదలనివ్వకుండా చెట్లకు కట్టబడిన ప్రజలు ప్రాణభయంతో విలవిలలాడి పోతుండగా జపాన్ సైనికులు యమకింకరుల్లా వ్యవహరిస్తూ పిల్లాపాపలని కూడా చూడకుండా బందీల మీద యధేచ్ఛగా దాడి చేసారు. ఆ అభాగ్యుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తూ, తుపాకి బాయెనెట్‌లతో శరీరాలను తూట్లు పొడుస్తూ బాయ్‌నెట్ ప్రాక్టిస్ (Bayonet Practice) కు Targets గా ఉపయోగించుకున్నారు. ఆ బాయ్‌నెట్ ప్రాక్టిస్ వల్ల అమాయక నిర్బంధితుల దేహాలు రక్తసిక్తం అవుతున్నా జపాస్ సైనికులు మాత్రం ఏమాత్రం ఆగకుండా అత్యంత కిరాతకంగా వ్యవహరించారు. చివరకు ఆ నిస్సహాయులు, అకలిగొన్న అమాయక అండమాను ప్రజల మీద పెట్రోలు కుమ్మరించి ఒక్కుమ్మడిగా 900 మందిని సామూహిక దహనకాండకు గురిచేసి ప్రాణాలను హరించారు (Cellular Jail of Andaman and Nicobar Islands, Amit Rai Jain, Page. 177).

## మరో హత్యాకాండ ఏర్పాట్లు - విరమణ - పరుగులెత్తిన ప్రజలు

జపాన్ సైన్యం అంతటితో తమ కిరాతక హత్యాకాండలకు స్వస్తి పలుకలేదు. జపాన్ సైన్యాధికారుల అలోచనల మేరకు సాగుతున్న భయానక సామూహిక హత్యాకాండల పరంపరలో భాగంగా 1945 ఆగస్టు 14న మరొక సామూహిక హత్యాకాండకు ఏర్పాట్లు ఆరంభమయ్యాయి. ఆ ఏర్పాట్లలో భాగంగా వివిధ గ్రామాల నుండి వందలాదిగా ప్రజలను

తొలుత ఒకచోటుకు సమీకరించారు. అలా సమీకరించిన వారందరిని ఆఘమేఘాల మీద పోర్టు మౌంట్ (Port Mount) గ్రామానికి చేర్చారు. అలా పోర్టు మౌంట్‌కు చేర్చిన ప్రజలను గతంలోలా నిర్ధాక్షిణ్యంగా మృత్యువు ఒడి చేర్చేందుకు జపాన్ సైన్యాధికారులు తగు ఏర్పాట్లు ముమ్మరం చేసారు.

ఈలోగా ద్వితీయ ప్రపంచ యుద్ధంలో పూర్తి పరాజయం అంచుకు చేరుకున్న జపాన్ యుద్ధాన్ని విరమించుకుంది. జపాన్ నేతృత్వంలోని అక్షరాజ్యాలు (Axis Powers) బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) కు లొంగిపోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఆ సమాచారం అందుకున్న అండమానులోని జపాన్ సైన్యాధికారులు వెనక్కు తగ్గారు. అనంతరం ఆగస్టు 16న పోర్టు మౌంట్ వద్ద నిర్బంధించబడిన ప్రజలకు విముక్తి ప్రసాదించి, తమ తమ గ్రామాలకు వెళ్ళిపోవాల్సిందిగా జపాన్ అధికారులు ఆజ్ఞాపించారు. ఆ ఆదేశాలతో ఆశ్చర్యచకితులయిన ప్రజలు ఒకపక్కన జపాన్ సైన్యాధికారులు తమకు విముక్తి ప్రసాదించి వెళ్ళిపొమ్మని చెబుతున్నా కూడా గతకాలపు చేదు అనుభవాల దృష్ట్యా జపాన్ సైన్యాధికారుల వింత వైఖరి ప్రజలకు ఏమాత్రం నమ్మశక్యం కాలేదు.

భయానక మృత్యువు అనివార్యమని భావించి గజగజ వణికి పోతున్న ప్రజానీకానికి ఇదంతా నమ్మబుద్ధి కాలేదు. ఇది కలయా? నిజమా? అనుకుంటూ అండమాను-నికోబారు దీవులలోని ప్రజానీకం తమ తమ ఇళ్ళకు బయలుదేరారు. ఆ విధంగా స్వగ్రామాలకు బయలు దేరినా కూడా మృత్యువు జపాన్ సైనికుల రూపంలో ఎక్కడ వెంటాడి, వేధించి ప్రాణాలు హరిస్తుందో నన్న భయంతో ప్రతి ఒక్కరూ కంపించి పోతూ ప్రాణాలను అరచేత పట్టుకుని తమ తమ గ్రామాల దిశగా పరుగులెత్తారు.

ప్రపంచ యుద్ధంలో జపాన్ పరాజయం కారణంగా జపాన్ సైన్యాధికారులు తమను వదలి పెట్టారన్న వాస్తవాలు తెలియని ప్రజలు భయం...భయంగా స్వగ్రామాలు చేరుకున్నారు. జపాన్ పరాజయం వార్త అండమాను-నికోబారు దీవులకు మరి కాస్త ఆలశ్యంగా అందివుండి ఉంటే పోర్టు మౌంటుకు చేర్చబడిన అమాయక ప్రజల ప్రాణాలను జపాన్ సైన్యాధికారులు నిర్ధాక్షిణ్యంగా హరించేసేవారు. అండమాను -నికోబారు ప్రజానీకం అదృష్టం మేరకు ఆలశ్యం గానైనా ప్రపంచ యుద్ధంలో జపాన్ నాయకత్వంలోని అక్షరాజ్యాల పరాజయ వార్తలు అండమానంతా గుప్పుమనడంతో జపాన్ సైన్యాధికారులు ఆత్మరక్షణలో పడి పూర్తిగా వెనక్కు తగ్గి అమాయక అండమాను-నికోబారు ప్రజల మీద సాగిస్తున్న అత్యంత కిరాతక చర్యలకు స్వస్తి పలికారు.

## జపాన్ సైన్యాల లొంగుబాటు

బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) అక్షరాజ్యాల (Axis Powers) మధ్య 1939లో ఆరంభమయిన ద్వితీయ ప్రపంచ యుద్ధం 1945 చివరి నాటికి ముగియ వచ్చింది. ఈ యుద్ధంలో బ్రిటన్ మిత్రరాజ్యాలు తొలి దశలో వెనకడుగు వేసినప్పటికి ఆ తరువాతి కాలంలో పుంజుకుని పలు వరుస విజయాలు సాధిస్తూ ముందుకు పోవడం ఆరంభించాయి. ఆ కారణంగా అక్షరాజ్యాలు పరాజయ పరంపరలను చవి చూడటం క్రమంగా ముమ్మరం అయ్యింది. ఆ క్రమంలో జపాన్‌ను పూర్తిగా లొంగదీయడానికి 1945 ఆగస్టు ఆరున జపాన్‌లోని హిరోషిమా నగరం, ఆగస్టు తొమ్మిదిన జపాన్‌లోని నాగసాకి నగరం మీద బ్రిటన్ మిత్రరాజ్యాల కు చెందిన అమెరికా అణుబాంబులను ప్రయోగించింది. ఆ ప్రయోగంతో జపాన్ పరిస్థితి అతలాకుతలమయ్యింది. అణుబాంబు ప్రయోగంతో ప్రపంచ యుద్ధంలో పూర్తిగా వెనకడుగు వేసిన జపాన్ యుద్ధ విరమణకు అంగీకరిస్తూ బ్రిటన్ మిత్రరాజ్యాల ఎదుట సాగిలపడింది. చిట్టచివరకు 1945 అగస్టు 15న పూర్తి స్థాయిలో బ్రిటన్ లొంగుబాటును ప్రకటించింది. ఆ లొంగుబాటుతో ద్వితీయ ప్రపంచ యుద్ధం 1945 సెప్టెంబరు రెండు నాటికి బ్రిటన్ మిత్రరాజ్యాల విజయంతో పరిసమాప్తమయ్యింది.

## ఆంగ్లేయుల పునరాక్రమణ

జపాన్ పరాజయం వార్త అండమానులోని జపాన్ సైన్యాధికారులకు ముందుగా చేరినప్పటికి సమాచారాన్ని సైన్యాధికారులు వెల్లడి చేయలేదు. 1945 అగస్టు 21న జపాన్ సైన్యాధికారులు సమావేశం నిర్వహించి, ఆ సమావేశంలో జపాన్ పరాజయం సమాచారాన్ని అండమాను-నికోబారు దీవుల ప్రజలకు ఎరుకపరిచారు. ఆ తరువాత నుంచి జపాన్ సైన్యాధికారులు అండమాను-నికోబారు దీవులను ఖాళీ చేసి వెళ్ళిపోవడానికి తమ తట్టాబుట్టా సర్దుకోవడం ఆరంభించారు. చివరకు 1945 అక్టోబర్ ఏడున బ్రిటన్ మిత్రరాజ్యాల చెందిన అంగ్లేయ సైన్యాలు అండమానులో తిరిగి అడుగు పెట్టాయి. 1945 అక్టోబరు తొమ్మిదిన బ్రిటిష్ సైన్యాధికారుల సమక్షంలో అండమానులోని జపాన్ సైన్యాల లొంగుబాటు కార్యక్రమం సంపూర్ణమయ్యింది. చిట్టచివరకు అండమాను-నికోబారు దీవులు మూడున్నర ఏండ్ల తరువాత 1945 అక్టోబరు తొమ్మిదిన మరోమారు ఆంగ్లేయుల ఏలుబడిలోకి వచ్చాయి.

అండమాను-నికోబారు దీవులను పునరాక్రమించుకుని అన్ని కీలక ప్రాంతాలను తమ స్వాధీనంలోకి తీసుకున్న ఆంగ్ల సైన్యం, జపాన్ సైనికులందర్ని 'యుద్ధఖైదీలు'గా ప్రకటించి నిర్బంధంలోకి తీసుకుంది. ఆ విధంగా యుద్ధ ఖైదీలుగా మారిన జపాన్

సైన్యాధికారులను, జపాన్ సైనికులను ఆంగ్ల సైన్యాలు తమ యుద్ధఖైదీలను శిబిరాలకు తరలించాయి. మూడున్నర సంవత్సరాల పాటు జపాన్ సైన్యాధికారుల, జపాన్ సైనికుల భయానక - బీభత్సకర దాష్టికాలతో, సామూహిక హత్యాకాండలతో, ఆకలిదప్పులతో అల్లాడి, బెంబేలెత్తిపోయిన అండమాను-నికోబారు ప్రజానీకం జపాన్ సైనికులను ఈసడించుకుంటూ ఆంగ్ల సైన్యాలకు ప్రతి చోట స్వాగతం పలికారు.

## అండమాను శిక్షాక్షేత్రం మూసివేత

ఆంగ్ల సైన్యాలు అండమాను-నికోబారు దీవులను పునరాక్రమించుకోగానే పౌర పాలనా వ్యవస్థ మీద దృష్టిసారించాయి. అండమానులో అంగ్ల సైన్యాలు మళ్ళీ అడుగు పెట్టిన నాలుగు మాసాల తరువాత, 1946 ఫిబ్రవరి ఏడున బ్రిటిష్ ప్రభుత్వ ఉన్నతాధికారి అండమాను పౌర పాలనా వ్యవస్థ (Civil Admistration) బాధ్యతలను చేపట్టారు. ఆ వెంటనే ఆంగ్ల ప్రభుత్వం అండమాను శిక్షాక్షేత్రం మూసివేత నిర్ణయం తీసుకుంది. ఆ నిర్ణయంతో 1858 నుండి 1945 వరకు ఆంగ్లేయుల దృష్టిలో ప్రముఖ శిక్షాక్షేత్రం (Penel Settlement)గా ఖ్యాతిగడించి, భారతీయుల దృష్టిలో 'కాలాపాని' (Kalapaani) గా అపఖ్యాతిని మూట గట్టుకున్న అండమాను శిక్షాక్షేత్రం 87 ఏండ్ల తరువాత శాశ్వితంగా మూతపడింది.

## బందీల విడుదల

అండమాను శిక్షాక్షేత్రం మూసివేత నిర్ణయం తీసుకోగానే అ సమయానికి ఇటు శిక్షాక్షేత్రం, అటు సెల్యులర్ జైలులో ఉన్న వారందర్ని విడుదల చేయడానికి ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. 1942లో జపాన్ సైన్యాలు అండమాను శిక్షాక్షేత్రం, సెల్యులర్ జైలును స్వాధీనం చేసుకునే నాటికి ఉన్నటువంటి సుమారు 6000 బందీల శిక్షాకాలం ఇంకా పూర్తికానట్టయితే వారి పరిస్థితి ఏమిటన్న ప్రశ్న ఎదురయ్యింది. ఆ బందీలను ప్రధాన భూభాగంలోని జైళ్ళకు పంపాలా? లేక ఏంచేయాలన్న సందిగ్ధత ఎదురయ్యింది. ఆ ప్రశ్నకు, ఆ సందిగ్ధతకు సమాధానంగా ఆయా ప్రాంతీయ ప్రభుత్వాలు (Provincial Governmnets) స్పందిస్తూ బందీలకు న్యాయస్థానాలు విధించిన శిక్షాకాలం పూర్తికాకుండా ఇంకా మిగిలి ఉన్నట్టయితే మిగిలి ఉన్న శిక్షా కాలాన్ని పూర్తిగా రద్దు చేసి, సెల్యులర్ జైలులో ఉన్న వారందరిని విడుదల చేయడానికి అంగీకరిచటంతో బందీల విషయంలో అధికారులకు ఎదురైన సమస్య-సందిగ్ధత కాస్తా దూరమయ్యింది.

ఆ బందీలు తమ గ్రామాలకు తరలి వెళ్ళడానికి అనుమతిస్తూ అంగ్ల ప్రభుత్వం - ప్రాంతీయ ప్రభుత్వాలు స్వేచ్ఛను ప్రసాదించాయి. ఆ కారణంగా అండమాను శిక్షాక్షేత్రం,

సెల్యులర్ జైలు నుండి విముక్తి పొందిన 4,200 మంది బందీలు తిరిగి తమ స్వగ్రామాలకు చేరుకున్నారు. ఈ విధంగా అటు అండమాను శిక్షాక్షేత్రం-సెల్యులర్ జైలు మూసివేత, ఇటు బందీల విముక్తి ఒక్కసారిగా పూర్తయ్యాయి. 1942లో అండమాను శిక్షాక్షేత్రం-సెల్యులర్ జైలు నుండి జపాన్ సైన్యాధికారుల ద్వారా విముక్తి ప్రసాదించబడిన బందీల విషయంలో కూడా ఆంగ్ల ప్రభుత్వం-ప్రాంతీయ ప్రభుత్వాలు ఉదారంగా వ్యవహరించడం వలన వారికి కూడా పూర్తిగా విముక్తి లభించింది. అండమాను-నికోబారు దీవులలో స్థిరపడిన వారు, స్థిరపడదలచుకున్న వారు తప్ప మిగతా బందీలంతా అండమాను-నికోబారు దీవుల నుండి భారతదేశం ప్రధాన భూభాగంలోని తమ తమ స్వగ్రామాలకు సంతోషంగా తరలి వెళ్ళిపోయారు. (Black Days in Andaman & Nicobar Islands, Rabin Raychowdhury, Manas Publications, New Delhi, 2004, Page 251-52)

## యుద్ధ నేరాలకు - ఉరిశిక్షలు, శిక్షలు

ఆంగ్లేయ ప్రభుత్వం నుండి 1942లో అండమాను-నికోబారు దీవులను స్వాధీనం చేసుకున్న జపాన్ సైన్యం అమాయక అండమాను-నికోబారు ప్రజల మీద పలు దురంతాలకు పాల్పడింది. 1942 మార్చి 25న తొలుతగా మున్షీ జుల్ఫిఖార్ అలీ (Munshi Zulfiquer Ali) ని బహిరంగ హత్యాకాండకు గురిచేసిన జపాన్ సైనికులు ఆ తరువాత గూఢచర్యం అభియోగాల మీద పలువురిని దఫదఫాలుగా పొట్టన బెట్టుకున్నారు. జపాన్ సైన్యాధికారుల దాష్టీకాలను 1943 డిసెంబరు 29న అండమాను-నికోబారు దీవుల మూడు రోజుల పర్యటనకు వచ్చిన సుభాష్ చంద్రబోస్ దృష్టికి జపాన్ సైనికుల దారుణాలను అండమాను ప్రజలు చూచాయగా తీసుక వచ్చారు. అండమాను-నికోబారు దీవులను ఆజాద్ హింద్ ప్రభుత్వానికి అప్పగించినప్పటికీ ఆ దీవులకు సంబంధించిన విదేశీ, భద్రతా వ్యవహారాలను జపాన్ ప్రభుత్వం గుప్పెట్లో పెట్టుకున్నందున అండమాను-నికోబారు ప్రజలను ఏ విధంగానూ రక్షించలేని నిస్సహాయ స్థితిని 'ఆజాద్ హింద్ ప్రభుత్వం' ఎదుర్కోవాల్సి వచ్చింది.

1945లో ప్రపంచ యుద్ధం ముగిశాక జపాన్ సైన్యం దురాగతాలను యుద్ధనేరాలు (War Crimes) గా పరిగణిస్తూ సింగపూర్ (Singapore) లోని చాంగి (Changi) వద్ద ఏర్పాటు చేసిన యుద్ధనేరాల న్యాయస్థానం (War Crimes Tribunal) లో విచారణ జరిగింది. ఆ సందర్భంగా జపాన్ సైన్యాధికారుల, సైనికుల అమానుషత్వానికి తమ ఆప్తులను కోల్పోయిన, అఘాయిత్యాలకు గురైన అండమాను-నికోబారు దీవులకు చెందిన పలువురు పురుషులు-స్త్రీలు నిర్భయంగా జపాన్ సైనికులు, సైన్యాధికారులు సాగించిన ఘోర దురంతాలను సాక్ష్యాలతో సహా ట్రిబ్యునల్ ముందు ఏకరువు పెట్టారు.

ఈ సందర్భంగా గూఢచర్యం అభియోగం మీద దారుణ హత్యాకాండకు గురయిన అబ్దుల్ ఖాలిక్ (Abdul Khaliq) భార్య, భయానక చిత్రహింసలకు గురైన జైతున్ బీబీ (Zaitoon Bibi) న్యాయస్థానం (Tribunal) ఎదుట పలికిన సాక్ష్యం జపాన్ సైన్యాధికారులకు ప్రాణాంతకం అయ్యింది. ఆమె ఆనాడు జపాన్ సైనికుల క్రూరత్వానికి తన భర్త అబ్దుల్ ఖాలిక్ బలయిన తీరుతెన్నులను పూసగుచ్చినట్టుగా పేర్కొన్నారు. ఆ తరువాత జపాన్ సైనికులు తనను కూడా నిర్బంధించి తన పట్ల కూడా ఎంతటి క్రౌర్యాన్ని ప్రదర్శించింది, తాను శారీరకంగా, మానసికంగా జపాన్ సైనికుల భయంకర చిత్రహింసలకు ఎలా గురయ్యింది జైతున్ బీబీ సోదాహరణంగా వివరించారు.

ఈ విధంగా ఆనాటి ఘోర దురంతాలకు ప్రత్యక్ష్య సాక్షులు అయినటువంటి సౌదాగర్ అలీ (Soudagar Ali), హుసైన్ (Hussain), హబీబుర్ రహమాన్ (Hebibur Rahman) తదితరులు యుద్ధనేరాల న్యాయస్థానం ఎదుట జపాన్ సైన్యాల. సైన్యాధికారుల అకృత్యాలకు సజీవ సాక్ష్యాలుగా నిలిచారు. ఆ విచారణలో ఏడుగురు జపాన్ సైన్యాధికారులకు మరణశిక్షలు పడ్డాయి. మరికొందరు సైన్యాధికారులు, సైనికులు, మిలటరీ పోలీసులకు ఏడు సంవత్సరాల నుండి 25 సంవత్సరాల కఠినకారాగార శిక్షలు పడ్డాయి.

## అండమాను దీవులు మావంటే మావంటూ జగడం

అండమాను-నికోబారు దీవులు ఆంగ్లేయుల పాలన నుండి జపానీయుల పాలనకు, జపానీయుల పాలన నుండి తిరిగి ఆంగ్లేయుల పాలన క్రిందకు వచ్చాక, 1947 ఫిబ్రవరి 20న బ్రిటన్ ప్రధాని Clement Attlee 1948 జూన్ లోగా భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వనున్నట్టుగా ప్రకటించాడు. అప్పటి నుండి అండమాను-నికోబారు దీవులు తమ పరిధిలో ఉండాలంటే...తమ పరిధిలో ఉండాలంటూ మాటల జగడాలు, వాద ప్రతివాదనలు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో ఆరంభమయ్యాయి. అండమాను - నికోబారు దీవులు యుద్ధవ్యూహాల ప్రకారంగా Air Base, Naval Base ఏర్పాటుకు భౌగోళికంగా అత్యంత అనుకూలం కనుక బ్రిటన్ ఆధిపత్యంలో ఉండాలంటూ ఆంగ్లేయ సైన్యాధికారులు తమ ప్రతిపాదనలు ముందుకు తెచ్చారు. ఆ మీదట పలు విశ్లేషణలతో, వాద-ప్రతివాదనలతో బర్మా, ఆస్ట్రేలియా లాంటి దేశాలు, ఐక్య బెంగాల్ ఉద్యమ నేతలు, భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు, అఖిలభారత ముస్లింలీగ్ నేతలు రంగప్రవేశం చేసి అండమాను - నికోబారు దీవులు తమ రాజ్యాల పరిధిలో, తమ భూభాగాల ఆధిపత్యంలో మాత్రమే ఉండాలంటూ తమ తమ వాదనలతో రచ్చకెక్కారు. చివరకు అండమాను-నికోబారు

దీవులు భారతదేశం నుండి విడదీయడానికి వీలులేని ప్రాంతాలని 1947 జూలై 14న బ్రిటిష్ పార్లమెంటులో ప్రధానమంత్రి Clement Attlee చేసిన విస్పష్ట ప్రకటనతో ఆ రచ్చ కాస్తా ముగిసింది. అండమాను-నికోబారు దీవులు భారతదేశ అవిభాజ్య ప్రాంతాలుగా ప్రకటించబడి, భారతదేశపు భూభాగంగా నిలిచాయి.

## స్వాతంత్ర్య సంబరాల్లో అండమాను

భారతీయుల అపురూప త్యాగాల ఫలితంగా ఆంగ్లేయుల పెత్తనం నుండి 1947 ఆగస్టు 15న భారతదేశం స్వాతంత్ర్యం సాధించింది. ఆ శుభసందర్భంగా దేశంలోని ఇతర ప్రాంతాల ప్రజల్లా అండమాను దీవులలోని ప్రజలు కూడా స్వాతంత్ర్య సంబరాల్లో మునిగితేలారు. భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా 1858 నుండి 1939 వరకు అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడిన వేలాది స్వాతంత్ర్య సంగ్రామయోధుల అసమాన త్యాగాలకు ప్రబల సాక్ష్యంగా నిలచిన అండమాను శిక్షా క్షేత్రం, సెల్యులర్ జైలులో అండమాను -నికోబారు ప్రజల ఆనందోత్సవాలు మిన్నంటాయి. ఈ సందర్భంగా అండమాను-నికోబారు దీవుల చీఫ్ కమీషనర్ (Chief Commissioner) ఇనాముల్ మజిద్ (Inam-ul-Majid) ప్రథమంగా అండమానులోని జింఖానా గ్రౌండ్‌లో త్రివర్ణ పతాకాన్ని ఎగుర వేశారు. భారతదేశపు తొట్టతొలి స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలను 1947 ఆగస్టు 15న అండమాను దీవుల్లోని ప్రజానీకం ఘనంగా జరుపుకున్నారు.

అండమాను దీవుల్లోని పరిస్థితులకు భిన్నంగా నికోబారు దీవులలోని కొన్ని ప్రాంతాలలో బ్రిటన్ జాతీయ పతాకం యూనియన్ జాక్ (Union Jack) రెపరెపలాడటం ఆశ్చర్యం కల్గించిన అంశం. అండమాను-నికోబారు చీఫ్ కమీషనర్ Inam-ul-Majid స్థానంలో వచ్చిన ఇండియన్ సివిల్ సర్వీసస్ (Indian Civil Services) అధికారి ఏ.కె.ఘోష్ (A.K Ghose) 1949 జూలైలో నికోబారు దీవుల్లోని కొందుల్ (Kondul) ప్రాంతం సందర్శనకు వచ్చినప్పుడు నికోబారు దీవుల్లోని కొందుల్ లో మన జాతీయ పతాకానికి బదులుగా బ్రిటిష్ వారి Union Jack రెపరెపలాడటం చూసారు. ఈ విషయం గురించి ఆరా తీయగా 1947లో స్వాతంత్ర్యం లభించిన విషయం గానీ, Union Jack బదులుగా త్రివర్ణ పతాకాన్ని ఎగురవేయాల్సిన అవసరం గానీ నికోబారు దీవులలోని ప్రజల ఎరుకలో ఏమాత్రం లేదన్న చేదు వాస్తవం బహిర్గతం అయ్యింది. (Black Days in Andaman & Nicobar Islands, Rabin Raychowdhury, Manas Publications, New Delhi, 2004, Page. 272-273)

## అండమాను శిక్షాక్షేత్రంలోని దస్త్రాల ధ్వంసం

అండమాను శిక్షాక్షేత్రానికి 1858 మార్చి 10న చేరుకున్న ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధుల తొలి జట్టు నుండి 1945 తరువాత అండమాను శిక్షాక్షేత్రం శాశ్వతంగా మూసివేత వరకు అండమానుకు తరలించబడిన స్వాతంత్ర్య సమరయోధుల వివరాలను వీలయినంత వరకు ఇటు ఆంగ్లేయాధికారులు, అటు జపాన్ అధికారులు తమ దస్త్రాలలో నిక్షిప్తం చేసారు. కాని జపాన్ సైన్యం ద్వితీయ ప్రపంచ యుద్ధంలో భాగంగా 1942లో ఆంగ్లేయుల నుండి అండమాను-నికోబారు దీవులను హస్తగతం చేసుకున్నప్పుడు అండమాను శిక్షాక్షేత్రాన్ని ఖాళీ చేసిన ఆంగ్లేయ సైన్యాలు శిక్షాక్షేత్రం లోని తమ అధికారిక దస్త్రాలను ధ్వంసం చేసి వెళ్ళిపోయాయి.

ఆ తరువాత మూడున్నర సంవత్సరాల పాటు అండమాను శిక్షాక్షేత్రం జపాన్ సైన్యాధికారుల ఆధీనంలో ఉండిపోయింది. 1945 ఆగస్టు 15న ద్వితీయ ప్రపంచ యుద్ధంలో జపాన్ పరాజయం పాలయ్యింది. ఆ తరువాతి పరిణామాల మూలంగా 1945 అక్టోబరు తొమ్మిదిన ఆంగ్ల సైన్యం అండమానును తిరిగి స్వాధీనం చేసుకుంది. ఆంగ్ల సైన్యం మరలా అండమాను-నికోబారు దీవులను స్వాధీనం చేసుకోకునేలోగా అండమాను శిక్షాక్షేత్రంలోని అధికారిక దస్త్రాలను ఈసారి జపాన్ సైన్యం పూర్తిగా తగులపెట్టింది.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించిన తరువాత అండమాను -నికోబారు దీవులను ఖాళీచేస్తున్న ఆంగ్ల సైన్యాలు అండమాను శిక్షాక్షేత్రానికి సంబంధించిన అధికారిక దస్త్రాలను మరోమారు ధ్వంసం చేశాయి. ఆ విధంగా అటు జపాన్ సైన్యం, ఇటు ఆంగ్ల సైన్యం అండమాను శిక్షాక్షేత్రంలోని దస్త్రాలను పలుమార్లు విధ్వంసం చేసిన కారణంగా అండమాను శిక్షాక్షేత్రానికి తరలించబడిన స్వాతంత్ర్య సమరయోధుల సమగ్ర వివరాలను వెల్లడించగల అధికారిక దస్త్రాలు అందుబాటులో లేకుండా పోయాయి. ఈ చేదు నిజాన్ని Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, Andaman 2004లో ప్రచురించిన Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who గ్రంథం కూడా ధృవీకరించింది.

## చారిత్రక సెల్యులర్ జైలు ప్రస్తుత పరిస్థితి

1906లో ఏడు విభాగాల (Wings) తో ప్రత్యేక తరహాలో రూపు దిద్దుకున్న అండమాను లోని పోర్టు బ్లేయర్ వద్ద గల చారిత్రక సెల్యులర్ జైలు ప్రస్తుతం కేవలం

మూడు విభాగాలతో మాత్రమే మిగిలి ఉంది. 1941 జూన్ 26 న సంభవించిన భూకంపం (Earth Quake) వలన సెల్యులర్ జైలు పాక్షికంగా దెబ్బతింది. ఈ జైలుకు ప్రాణప్రదంగా భావించే ఏడు విభాగాల కేంద్రకం అయినటువంటి మూడు అంతస్థుల కేంద్ర బురుజు (Central Tower) బాగా దెబ్బతింది. ఈ కేంద్ర బురుజుతోపాటు, సెల్యులర్ జైలు ముందు భాగాన ఉన్న రెండు మినార్లు, ఏడవ విభాగం విధ్వంసం అయ్యాయి, చివరకు సెల్యులర్ జైలు భారీ కట్టడంలో కూడా పలుచోట్ల పగుళ్ళు కన్పించాయి.

1942లో జపాన్ సైన్యం అండమాను-నికోబారు దీవులను ఆక్రమించాక అత్యవసరమగు విమాన స్థావరం (Air Base) లాంటి పలు అత్యవసర కట్టడాల నిర్మాణాలను జపాన్ సైన్యాధికారులు చేపట్టారు. ఆ కట్టడాలకు అవసరమయిన ఇటుకలు, ఇనుము, రాళ్ళు అందుబాటులో ఉన్న సెల్యులర్ జైలులోని మూడవ, నాల్గవ విభాగాలను పూర్తిగా పడగొట్టి వినియోగించుకున్నారు. 1947 అగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక 1947-48లో సెల్యులర్ జైలు పరిస్థితుల మీద సర్వే జరిపిన అధికారుల కమిటి ఈ కట్టడం చాలా ప్రమాదకర స్థితిలో ఉందని (Unsafe) నిర్ధారిస్తూ నివేదిక ఇచ్చింది. ఆ తరువాత 1960లో అండమాను-నికోబారు పౌర పాలనా వ్యవస్థ (Civil Admistration) సెల్యులర్ జైలులోని మరో మూడు విభాగాలను పడగొట్టి గోవింద వల్లభ పంత్ వైద్యశాలను (Govind Ballabh Pant Hospital) నిర్మించింది. ఆ కారణంగా ఏడు విభాగాలు కలిగిన సెల్యులర్ జైలు కాలగమనంలో ఒక్కొక్క విభాగాన్ని కోల్పోతూ ప్రస్తుతానికి రెండు విభాగాలతో మాత్రమే మిగిలి ఉంది. (Cellular Jail (Cells Beyond Cells), Priten Roy and Swapnesh Choudhury, Farsight Publishers & Distributors, Delhi, 2016, Page117and 122).

## జాతీయ స్మారక చిహ్నంగా సెల్యులర్ జైలు

అండమాను - నికోబారు దీవులలో గల చారిత్రక సెల్యులర్ జైలు తన విభాగాలను ఒక్కొక్కటిగా కోల్పోతూ భౌతికంగా పూర్తిగా కనుమరుగయ్యే ప్రమాదం ఏర్పడింది. అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలులో సంవత్సరాల తరబడి శిక్షాకాలాన్ని గడిపిన స్వాతంత్ర్య సమరయోధులు ఆ చారిత్రక సెల్యులర్ జైలు పరిరక్షణకు పూనుకున్నారు. అందుకు గాను అంతా కలసి Ex-Andaman Political Prisoners' Fraternity Circle అను సంస్థను ఏర్పాటు చేసారు. ఆ సంస్థ ద్వారా సెల్యులర్ జైలు కట్టడాన్ని జాతీయ స్మారకం (National Memorial) గా ప్రకటించాలని భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఈ మేరకు Ex-Andaman Political Prisoners' Fraternity Circle నాయకులు చేసిన పలు ప్రయత్నాల ఫలితంగా

1963లో సెల్యులర్ జైలును జాతీయ స్మారక చిహ్నంగా ప్రకటించేందుకు ప్రభుత్వం అంగీకరించింది. ఆ తరువాత పదిహేను సంవత్సరాలు గడుస్తున్నా ప్రభుత్వ అంగీకారం మాత్రం కార్యరూపం ధరించలేదు. ఆ పరిస్థితులలో 1978 జూలైలో Ex-Andaman Political Prisoners' Fraternity Circle ప్రతినిధి బృందం అప్పటి రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి (Sree Neelam Sanjeeva Reddy), ప్రధానమంత్రి శ్రీ మొరార్జీ దేశాయి (Sree Morarji Desai) లను కలసి విన్నపాలు చేసింది. ఆ విన్నపాల మేరకు, Ex-Andaman Political Prisoners' Fraternity Circle నిరంతరం సాగించిన కృషి ఫలితంగా 1979 ఫిబ్రవరి 11న అండమానులోని సెల్యులర్ జైలును జాతీయ స్మారకం (National Memorial) గా భారత ప్రధానమంత్రి శ్రీ మొరార్జీ దేశాయి ప్రకటించి జాతి జనులకు అంకితం చేశారు.

## 'మృత్యుకుహరం' కాస్తా 'ముక్తితీర్థం' అయ్యింది

అండమాను శిక్షాక్షేత్రం, సెల్యులర్ జైలు అనగానే భారత స్వాతంత్ర్య సమర యోధులకు, భారతీయులకు చప్పున జ్ఞప్తికి వచ్చే అలనాటి 'మృత్యుకుహరం' కాస్తా ప్రస్తుతం 'ముక్తి తీర్థం'గా భాసిల్లుతోంది. అండమాను శిక్షాక్షేత్రం, సెల్యులర్ జైలులో ఆనాడు అష్టకష్టాలు పడిన స్వాతంత్ర్య సమరయోధులు అండమాను శిక్షాక్షేత్రం తమ, తమ సహచరుల అసమాన బలిదానాల కేంద్రం కనుక ఆనాడు 'మృత్యుకుహరం' అంటూ తాము జీవించి ఉన్నంతకాలం తూలనాడినా ఈనాడు మాత్రం 'ముక్తితీర్థం'గా గౌరవించసాగారు. ప్రధానంగా Ex-Andaman Political Prisoners' Fraternity Circle 'ముక్తితీర్థం' అను గౌరవ పదాన్ని పలు విధాలుగా బహుళ ప్రాచుర్యంలోకి తెచ్చింది.

ఆ క్రమంలో అలనాటి స్వాతంత్ర్య సమరయోధుల వారసులు, మాతృభూమి విముక్తి పోరాటంలో భాగంగా పలు భయానక బాధలు అనుభవించిన తమ పూర్వీకుల త్యాగాలను, ఆత్మబలిదానాలను గౌరవంగా స్మరించుకుంటూ అండమానును 'ముక్తితీర్థం'గా భావించి తరుచూ సందర్శించుకుంటూ తమ పెద్దలకు ఘనంగా స్మృత్యంజలి ఘటిస్తున్నారు. ఆ కారణంగా అలనాటి 'మృత్యుకుహరం' కాస్తా ప్రస్తుతం 'ముక్తితీర్థం' అయ్యింది.

## అండమాను-నికోబార్ దీవులు కేంద్రపాలిత ప్రాంతాలు

భారతదేశానికి స్వాతంత్ర్య లభించాక అండమాను-నికోబారు దీవులను భారత రాజ్యాంగం 'డి క్లాసు రాష్ట్రం' గా పరిగణించింది. ఈ దీవుల పరిపాలనా వ్యవస్థ రాష్ట్రపతి పరిధిలోకి చేర్చింది. 1956 నాటి రాష్ట్రాల పునర్విభజన సందర్భంగా నవంబరు ఒకటి

నుండి అండమాను-నికోబారు దీవులు కేంద్రపాలిత ప్రాంతాలయ్యాయి. అప్పటి నుండి కేంద్ర ప్రభుత్వ పర్యవేక్షణలో చీఫ్ కమీషనర్ (Chief Commissioner) తో ఆ దీవుల పాలనా వ్యవహారాల నిర్వహణ సాగింది. చివరకు 1982లో చీఫ్ కమీషనర్ పదవిని రద్దు చేసి, ఆ స్థానంలో లెఫ్టినెంట్ గవర్నర్ (Lieutenant Governor) పదవిని సృష్టించారు. 1982 నుండి లెఫ్టినెంట్ గవర్నర్ పాలనలో అండమాను-నికోబారు దీవులు ప్రపంచ ప్రఖ్యాత పర్యాటక కేంద్రంగా అశేష ప్రజావళిని ఆకర్షిస్తూ ప్రపంచ ప్రజలను ఎంతగానో అలరిస్తున్నాయి.



ఈ భాగంలో పొందుపర్చిన సమాచారం ప్రధానంగా

The Silent Past of Andamans - Few Freedom Fighters of 1857

Mr. Ahmad Mujtaba,

Aberdeen Bazar, Port Blair, Andaman Islands, 2005.

AND

Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who

Dr. Rashida Iqbal,

(Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, Andaman, 2004)

మరియు

పలు ఇతర గ్రంథాలు, అధికారిక దస్త్రాల నుండి

సేకరించిన విశేషాలను జతచేసి రూపొందించబడింది.

మాతృభూమిని బ్రిటిష్ వలసపాలకుల పాలన నుండి విముక్తం చేయాలన్న దృఢ సంకల్పంతో బ్రిటిష్ భారత సైన్యంలోని స్వదేశీ యోధులు 1857 మే 10న ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మీరట్‌లోని ఆంగ్లేయ సైనిక స్థావరంలోని ఆంగ్లేయ సైన్యాధికారులను మట్టుబెట్టి స్వదేశీయుల పాలన ఆకాంక్షిస్తూ ఢిల్లీ బయలుదేరారు. ఆ విధంగా ఢిల్లీకి బయలెల్లిన స్వదేశీ యోధులు జమునా నదిని పడవల వంతెన మీద దాటి **దీన్...దీన్** (Din...Din) అంటూ రణ నినాదం చేస్తూ ఎర్రకోటలో ప్రవేశించారు (Indian War of Independence 1857, V.D Savarkar, Abhishek Publications, Chandigarh, 2021, Page.115).

ఈ అనూహ్య పరిణామాలకు మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ తొలుత కొంత ఆశ్చర్య పోయినా ఆ తరువాత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ నాయకత్వం బాధ్యతలను చేపట్టారు. ఆ తరువాత ఆంగ్లేయుల మీద పోరాటానికి కదలి రావాల్సిందిగా ప్రజలను, సంస్థానాధీశులను, స్వదేశీ పాలకులను కోరుతూ ఒక ప్రకటన విడుదల చేశారు. ఆ ప్రకటనలో I have no desire left in me of ruling India after the expulsion of English, to my own personal aggrandisement (Indian War of Independence 1857, V.D Savarkar, Page.319) అని బహదూర్ షా జఫర్ తన అభిమతాన్ని స్పష్టం చేశారు.

ఆ లేఖ స్వదేశీ పాలకులను, స్వదేశీ సైనిక యోధులను కదలించింది. మౌలానా ఫజల్ యే హఖ్ ఖైరాబాది (Maulana Faz-lay-Haq Khairabadi) లాంటి ప్రముఖ ధార్మిక పండితులు 'ఫత్వా-ఏ-జిహద్' (Fatwa-e-Jihad) ద్వారా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట సాగాల్సిందిగా ఇచ్చిన పిలుపుకు ప్రజానీకం పెద్ద ఎత్తున స్పందించింది. ఈ సానుకూల ప్రతిస్పందనల ప్రభావం భారతావని అంతటా పెల్లుబికింది. ఆ ప్రభావంతో స్వదేశీ పాలకులు, సంస్థానాధీశులు ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులను త్రోసిరాజంటూ స్వతంత్ర రాజ్యాలను ప్రకటించుకుని, తామంతా చక్రవర్తి బహుదూర్ షా జఫర్ ప్రతినిధులమని స్వయంగా చెప్పుకొచ్చారు.

ఈవిధంగా భారతావని అంతటా అలుముకున్న పోరాటాలలో ముస్లిం జన సముదాయానికి చెందిన సమూహాలు కూడా పెద్దసంఖ్యలో పాల్గొన్నాయి. ఆ సంఖ్యాబలం కారణంగా, ఆంగ్లేయాధికారి Henry Mead ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల పాత్రను ప్రస్తావిస్తూ **ప్రస్తుత దశలో ఈ తిరుగుబాటును సిపాయిల తిరుగుబాటు అనడానికి వీలు లేదు. అది సిపాయీలతో మొదలయ్యింది గాని త్వరలోనే దాని అసలు స్వభావం బయట పడింది. అది 'ఇస్లామిక్ తిరుగుబాటు'** ( this rebellion, in its present phase, cannot be called a Sepoy Mutiny. It did begin with the Sepoys, but soon its true nature was revealed, it was an Islamic revolt.- **Muslims in India**, S.Abdul Hasan Ali Nadvi, Islamic Research and Publications, Lucknow, 1980, Page. 109) అని ప్రకటించాల్సి వచ్చింది.

ఈ అనూహ్య పరిణామాలతో తొలిదశలో ఖంగుతిన్న ఆంగ్లేయాధికారులు త్వరితగతిన తెప్పరిల్లి పాలనాధికారాన్ని రాబట్టుకోడానికి సిద్ధమయ్యారు. ఆ ప్రతికూల పరిణామాలకు ప్రధాన కేంద్రంగా నిలచిన ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకునేందుకు ఆంగ్ల పాలకులు వ్యూహాలు ఎత్తులు, ఎత్తుగడలు రచించారు. హిందూ-ముస్లింలు అంటూ ప్రజలలో విభజన తెచ్చేందుకు ఆంగ్లేయులు ప్రయత్నాలు చేయగా, ఆ కుయుక్తులను నమ్మశక్యం కాని విధంగా ప్రజలు వమ్ము చేశారు. 1857 నాటి పోరాటంలో పాల్గొన్న ఆంగ్లేయ సైనికాధికారి Holloway రాసిన Essays on Indian Mutiny గ్రంథంలో ఈ విషయాలను ప్రస్తావిస్తూ, **ఏదోఒక సమస్య మీద హిందూ ముస్లింల ఐక్యమౌతారన్న విషయాన్ని బ్రిటిషర్లు ఊహించలేక పోయారు. నిప్పు-నీరు లాంటి హిందూ-ముస్లింలు ఉమ్మడి సమస్యల మీద ఒక్కటికారని ఆంగ్లేయులలో ఉన్న భావనలు సరికాదని తేలింది. మన ఆధిపత్యాన్ని కూలద్రోయడానికి హిందూ-ముస్లిం మతస్థులు ఏకం కావడానికి ధార్మికవ్యవస్థల ప్రతినిధులు కూడా సంపూర్ణంగా అంగీకరిస్తూ అనుమతించారు** (Bahadur Shah II, Mahdi Husain, M N Publishers and Distributors, New Delhi, 1987, P.15) అని పేర్కొన్నాడు.

ఈ అనుభవాల నేపథ్యంలో ఆంగ్ల సైనికాధికారి John Coke 1857 తరువాత భవిష్యత్తులో భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వ పాలనావిధానం ఎలా ఉండాలో సూచిస్తూ **విభజించు-పాలించు విధానానికి అనుకూలంగా మతాలు, జాతుల మధ్యనున్న విభజన యథాతథంగా కొనసాగేలా, వీరెప్పుడూ ఐక్యం కాకుండా ఉండేలా మన ప్రయత్నాలు చాలా గట్టిగా ఉండాలి** (**Bahadur Shah II**, Mahdi Husain, M N Publishers and Distributors, New Delhi, 1987, P.15) అని మార్గనిర్దేశనం చేశాడు.

ఆ ప్రతికూల అనుభవాల నేపధ్యంలో ఆంగ్లేయాధికారులు భారీ సంఖ్యలో బ్రిటిష్ సైన్యాలను వివిధ ప్రాంతల నుండి రప్పించి ఢిల్లీని అన్ని వైపుల నుండి చుట్టుముట్టారు. ఒక పకడ్బంది వ్యూహం, అవసరానికి తగ్గట్టు ఎత్తుగడలతో శత్రువును ఎదురు దెబ్బతీయగల దృఢ సంకల్పం, పటిష్ట నాయకత్వం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి కరువయిన కారణంగా ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలకు 1857 సెప్టంబర్ 19న ఎర్రకోట దాసోహమన్నది. 1859 జూలై ఎనిమిది నాటికి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం సమసిపోయింది.

ఈ పరిణామాల నేపధ్యంలో ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు తొలుత ఢిల్లీ నుండి భయానక ఊచకోతను ఆరంభించి ఇండియా అంతటా కొనసాగించారు. ఊర్లకు ఊర్లు తగులబెట్టారు. పలు ప్రాంతాలలో విచారణ తంతు నిర్వహించి మూకుమ్మడి ఉరిశిక్షలు విధించారు, బహిరంగ కాల్చివేతలు జరిపారు. చివరకు సుదీర్ఘ కఠిన జైలు శిక్షలు విధించి ఇండియాలోని జైళ్ళు సరిపోక అండమాను జైలుకు పెద్ద సంఖ్యలో సమర యోధులను తరలించారు. ఆ యోధుల రికార్డు సక్రమంగా లేకపోవటం వలన ఆయా యోధుల వివరాలు పూర్తిగా తెలియటం లేదు. అందినంత సమాచారం మేరకు అండమాను జైలులో గడిపిన 1857 నాటి స్వాతంత్ర్య సమరయోధుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

**అబ్దుల్లా మొహియుద్దీన్ :** కర్నాటక రాష్ట్రం అప్పటి ధార్వార్ (Dharwar) ప్రస్తుత గదగ్ (Gadag) జిల్లా నార్‌గుండ్ (Nargund) నివాసి. తండ్రి మొహియుద్దీన్. 1857లో చారిత్రక నార్‌గుండ్ కోట ఉద్యోగిగా అబ్దులా మొహియుద్దీన్ (Abdulla Mohiuddin) బాధ్యతలు నిర్వహిస్తున్నారు. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచిన అబ్దుల్లా ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను, ఆయన సహచరులను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఆ తరువాత 1858 జూన్ 16న లెఫ్టినెంట్ కల్నల్ మాల్‌కం (Lt. Col. Malcolm) నేతృత్వంలో నార్‌గుండ్‌లో ఏర్పడిన న్యాయస్థానం అబ్దుల్లా మొహియుద్దీన్ కు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించింది. ఆ శిక్ష ప్రకారంగా ఆయనను, ఆయన సహచరులను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**అబ్దుల్ లతీఫ్ ఖాన్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మౌజాబారాహ్ (Mauza Barah) జిల్లా బులంద్‌సహర్ ప్రాంతం నివాసి. అయన సంపన్న భూస్వామి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో అబ్దుల్ లతీఫ్ ఖాన్ (Abdul Latheef Khan) తిరుగుబాటు చేస్తున్న స్వదేశీ సైనికుల పక్షం నిలిచారు. ఆంగ్లేయాధికారులతో, కంపెనీ సైనికులతో తలపడుతున్న స్వదేశీ

పోరాటయోధులకు అయన అన్ని విధాల సహాయసహకారాలు అందించారు. ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయన మీద రాజద్రోహం నేరం మోపి విచారణ తంతు జరిపి యావజ్జీవకారాగార శిక్ష విధించి అబ్దుల్ లతీఫ్ ఖాన్‌ను అండమాను తరలించారు.

**అక్బర్ అలీ :** 1857 రాజధాని లక్నోలోని కట్వాని (Katwani) ప్రాంతం నివాసి. ఆయన తండ్రి మొహమ్మద్ రోషన్. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారన్న ఆరోపణల మీద అక్బర్ అలీని ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరం ఆపాదించి ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు జరిపారు. చివరకు అక్బర్ అలీకి యావజ్జీవిత కారాగారశిక్షను విధిస్తూ అండమాను శిక్షాక్షేత్రానికి తరలించాల్సిందిగా న్యాయస్థానం ఆజ్ఞలు జారీచేసింది. ఆ తీర్పు ప్రకారంగా 1858 మే నాలుగున 75 ఏండ్ల వయస్కులయిన అక్బర్ అలీని ఆంగ్లేయాధికారులు అండమానుకు తరలించారు. అండమాను శిక్షాక్షేత్రం చేరుకున్న నాలుగేండ్ల కు అక్బర్ అలీ చివరి శ్వాస విడిచారు.

**అక్బర్ జమా సయ్యద్** : ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో బీహార్ రాష్ట్రానికి చెందిన వీరుడు అక్బర్ జమా విద్యావంతుడు. 1857 నాటి పోరాటంలో క్రియాశీలకంగా పాల్గొన్నారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం విఫలమయిన తరువాత ఆంగ్లేయ సైన్యాలు సయ్యద్ అక్బర్ జమా (Sayyad Akbar Zama), ఆయన సహచరుల మీద విరుచుకపడి అరెస్టు చేశారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ చేశారు. ఆంగ్లేయ న్యాయస్థానంలో ఆయనను దోషిగా నిలబెట్టి విచారణ నిర్వహించి, యావజ్జీవ కారాగారశిక్షను విధించి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. ఆ నిర్ణయం ప్రకారంగా 1866 జనవరిలో అండమాను చేరుకున్న ఆయనను అప్పటికే అక్కడకు చేరుకున్న వహాబి యోధులు స్వాగతం పలికారు. అండమానులో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, పండితులు, బహు భాషాకోవిదుడు మహమ్మద్ జాఫర్ అలీ థానేశ్వరి సహచర్యంలో సయ్యద్ అక్బర్ జమా గడిపారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అక్బర్ జమా సయ్యద్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**ఆగా :** ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలతో పోరాడినందుకు ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆగాను అరెస్టు చేసి ఆయన మీద రాజద్రోహం నేరం మోపి యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించారు. ఆ శిక్ష ప్రకారంగా ఆగా (Aga) ను అండమానుకు తరలించారు. ఆంగ్లేయాధికారులు ఆయనను అక్కడ జరుగుతున్న పనుల నిర్వహణకు 'గ్యాంగ్‌మన్'గా నియమించారు. ఆ అవకాశాన్ని వినియోగించుకుని 1858

ఏప్రిల్ 23న అండమాను దీవుల్లోని రోజ్ ఐలాండ్ నుండి తప్పించుకున్నారు. అలా తప్పించుకున్న ఆగా దురదృష్టవశాత్తు స్థానిక అండమాను-నికోబారు దీవులలో గల ఆదిమజాతి సమూహం చేతుల్లో చిక్కి హతమయ్యారు.

**అల్లావుద్దీన్ మౌల్వీ :** బీహార్ రాష్ట్రం పాట్నా జిల్లా వాసి. సమాజంలో మంచి పేరు ప్రతిష్టలు గలిగిన ధార్మిక విద్వాంసుడు. ప్రజాదరణ మెండుగా గల ఆయన ప్రజలకు మార్గదర్శకులుగా సుప్రసిద్ధులు. ఆంగ్ల వలసపాలకుల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టే విధంగా స్థానిక రాజకీయాలలో, రాజకీయ ఉద్యమాలలో ఆయన చురుగ్గా పాల్గొంటున్నారన్న ఆరోపణల మీద ఆంగ్లేయాధికారులు మౌల్వీ అల్లావుద్దీన్ (Maulvi Alla-ud-Deen) ను నిర్బంధించారు. ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక చర్యలకు పాల్పడుతున్నారని, ప్రజలను దౌర్జన్యాలకు పురికొల్పుతూ హింసను ప్రోత్సహిస్తున్నారంటూ ఆయన మీద పలు నేరారోపణలు చేశారు. ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవకారాగార శిక్ష విధించింది. ఆ తీర్పు మేరకు అంగ్లేయాధికారులు మౌల్వీ అల్లావుద్దీన్‌ను అండమానుకు తరలించారు.

**అలీ మొహమ్మద్ ఖాన్ నవాబ్ / మమ్మూఖాన్ :** ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాధికారులకు ముచ్చెమటలు పట్టించిన అవధ్ రాజమాత బేగం హజరత్ మహల్ సాగించిన పోరాటంలో నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ (Nawab Ali Mohammad Khan) ఆమెకు కుడిభుజంగా నిలిచారు. ఆ తరువాత పరిణామాల ఫలితంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు ఆయనను అరెస్టు చేసి యావజ్జీవ కారాగార శిక్షను విధించారు. ఆయనను అండమాన్ కు తరలించగా, అండమాను జైలులో ఆయన కన్నుమూసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అలీ మొహమ్మద్ ఖాన్ నవాబ్ / మమ్మూఖాన్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ :** మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ (Maulvi Syed Alla-ud-Din) 1824లో హైదరాబాద్‌లో జన్మించారు. ఆంగ్లేయ పాలకులకు వ్యతిరేకంగా 1857లో ఆరంభమైన పోరాటంలో ఆంగ్లేయ అధికారి అధికారిక నివాసం అయినటువంటి బ్రిటిష్ రెసిడెన్సీ (British Residency) మీద దాడి చేశారు. ఈ పోరాటం విఫలం కాగా తిరుగుబాటు దళాల మీద ఆంగ్ల సైన్యాలు విరుచుకు పడ్డాయి. మౌల్వీ అల్లావుద్దీన్ అరెస్టయ్యారు. అయన మీద విచారణ తంతు జరిపించి యావజ్జీవిత కారాగారశిక్షను విధించారు. ఆ శిక్ష మేరకు 1860 జనవరి 22న మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్‌ను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**అమీర్ ఖాన్ :** ప్రస్తుత తమిళనాడు రాష్ట్రంలోని అప్పటి మద్రాసు ప్రస్తుత చెన్నయ్ నగరం నివాసి. ఆయన తండ్రి లాల్ ఖాన్. ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభం కాగానే ఆయన ఆ విషయాలను ప్రజలలో విస్తృతంగా ప్రచారం చేస్తూ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడమంటూ ప్రజలను పోరాట దిశగా సిద్ధం చేయసాగారు. అందుకు ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి 1857 అక్టోబర్‌లో యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించారు. ఆ శిక్ష ప్రకారంగా 1857 అక్టోబర్ 13న అమీర్ ఖాన్‌ను థానా జైలుకు తరలించి అచ్చట నుండి అండమానుకు పంపించారు.

**అన్వర్ ఖాన్ పిరే ఖాన్ :** ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సమయంలో తిరుగుబాటు యోధులతో కలసి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అన్వర్ ఖాన్ పిరే ఖాన్ (Anwar Khan Piare Khan) స్వయంగా పోరాటంలో పాల్గొన్నారు. ఆగ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు 1857 ఆగస్టు 23న ఆయనను అరెస్టు చేసారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ చేసి విచారించి యావజ్జీవ జైలుశిక్షను ప్రకటించారు. ఆ మేరకు థానా జైలుకు పంపించి, ఆయన స్థిర-చర అస్తులను ఆంగ్ల ప్రభుత్వం జప్తు చేసింది. ఆ తరువాత అన్వర్ ఖాన్ పిరే ఖాన్‌ను ఆంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**బాబున్ జుమ్మల్ ఖాన్ :** ప్రస్తుత మహారాష్ట్ర రాష్ట్రంలోని ముంబాయి, అప్పటి బొంబాయి ప్రెసిడెన్సీ ప్రాంతంలోని సతారా నివాసి. 1857నాటి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం నాటికి బాబున్ జుమ్మల్ ఖాన్ (Babun Jummal Khan) వయస్సు 30 ఏండ్లు. సతార జైలు సిబ్బందిలో ప్యూన్‌గా ఉద్యోగం చేస్తున్నారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ భేరి మ్రోగగానే తిరుగుబాటుకు నాయకత్వం వహించిన సతార వీరుడు రంగో బాపూజి గుప్తే పక్షాన ఆయన చేరారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు. 1857 నవంబరు ఏడున ఆంగ్ల సైన్యాలకు ఆయన పట్టుబడ్డారు. బాబున్ జుమ్మల్ ఖాన్ చర్యల మీద విచారణ జరిపిన ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవ జైలుశిక్షను విధించింది. ఆ ప్రకారంగా బాబున్ జుమ్మల్ ఖాన్‌ను ఆంగ్ల ప్రభుత్వం అండమానుకు పంపించింది.

**బడే మియా :** కర్నాటక రాష్ట్రం అప్పటి ధార్వార్ (Dhrwar) ప్రస్తుత గదగ్ (Gadag) జిల్లా నార్‌గుండ్ (Nargund) నివాసి. బడే మియా (Bade Miya) వయస్సు 50 ఏండ్లు. తండ్రి అమీన్ సాహెబ్. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి బడే మియా ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. 1858 జూలై ఎనిమిదిన ఆంగ్లేయాధికారి లెఫ్టినెంట్

కల్నల్ మాల్కం ( Lt. Col. Malcolm) నేతృత్వంలో ప్రస్తుత బాగల్‌కోట్ (Bagalkot) జిల్లా లోని బాగల్‌కోట్ తాలూకా పరగణాలోని కాలాడాగి / కాలాడ్గి (Kaladagi or Kaladgi ) గ్రామంలో ఆనాడు ఏర్పడిన ఆంగ్ల న్యాయస్థానం బడే మియా మీద విద్రోహక చర్యల నేరారోపణలు చేసి విచారణ జరిపింది. అనంతరం బడే మియాకు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించింది. ఆ శిక్ష ప్రకారంగా బడే మియాను అండమానుకు తరలించారు.

**భాయి ఖాన్** : అప్పటి బొంబాయి ప్రెసిడెన్సీలోని ఖాందేష్ (Khandesh) ప్రాంతంలో భాగమైన యావల్ (Yawal) తాలూక, ప్రస్తుత మహారాష్ట్ర రాష్ట్రంలోని జలగావ్ (Jalgaon) జిల్లాలోని యావల్ మునిసిపల్ కౌన్సిల్ ప్రాంతానికి చెందిన యోధుడు భాయి ఖాన్. 1857 నాటి పోరాటంలో భాగంగా యావల్ ప్రాంతంలో ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో భాయి ఖాన్ (Bhai Khan) చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారులు భాయి ఖాన్‌ను అరెస్టు చేసి విచారణ జరిపి మరణ శిక్షను విధించారు. ఆ తరువాత ఆ శిక్షను యావజ్జీవ కారాగారవాసంగా ఉన్నత న్యాయస్థానం మార్చింది. ఆ మార్పు మేరకు 1858 అక్టోబర్ 29న భాయి ఖాన్ ను అండమానుకు తరలించారు.

**బుడన్‌యా పీర్ సాహెబ్** : కర్నాటక రాష్ట్రం నార్‌గుండ్ (Nargund) పరగణాలోని హావేరి (Haveri) జిల్లాలోని సోమాపూర్ (Somapur) గ్రామం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి బుడన్‌యా పీర్ సాహెబ్ (Budnya Peer Saheb) ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఆంగ్లేయాధికారి లెఫ్టినెంట్ కల్నల్ మాల్కం ( Lt. Col. Malcolm) నేతృత్వంలో ఏర్పడిన ఆంగ్ల న్యాయస్థానం బుడన్‌యా పీర్ సాహెబ్ మీద విద్రోహక చర్యల నేరారోపణలు చేసి విచారణ జరిపింది. 1858 జూన్ 28న పీర్ సాహెబ్‌కు ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించింది. ఆ శిక్ష ప్రకారంగా బుడన్‌యా పీర్ సాహెబ్ ను ఆంగ్లేయులు అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**చౌదరీ హష్మత్ అలీ** : ప్రస్తుత బీహార్ రాష్ట్రం సుందేల్లా (Sundella) ప్రాంతం నివాసి. ఆ ప్రాంతంలో సంపన్నులలో చౌదరీ హష్మత్ అలీ (Chaudary Hashmat Ali) ఒకరు. ప్రజలలో మంచి పలుకుబడి గలిగిన గౌరవనీయ వ్యక్తి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారులు ఆయనను నిర్బంధించారు. పలు నేరారోపణల మీద చౌదరీ హష్మత్ అలీ మీద కేసు నమోదు చేశారు. ఆ తరువాత ఆంగ్ల న్యాయస్థానం ఆయన మీద విచారణ జరిపి యావజ్జీవిత కారాగారశిక్ష

విధిస్తూ అండమాను జైలుకు తరలించాల్సిందిగా తీర్పు చెప్పింది. ఆ ప్రకారంగా ఆంగ్లేయాధికారులు చౌదరీ హష్మత్ అలీ అపార ఆస్తిపాస్తులను స్వాధీనం చేసుకుని ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా ఆంగ్లేయుల మీద తిరగబడి చౌదరీ హష్మత్ అలీ పోరాడిన తీరుతెన్నులను శ్లాఘిస్తూ ఈనాటికి కూడా బీహార్‌లోని సుందేల్లా తదితర ప్రాంతాల ప్రజానీకం ఆయన సంబంధించిన జానపదగీతాలను పాడుకుంటూ ఆ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుడు చౌదరీ హష్మత్ అలీ ధైర్యాన్ని, ఆయన సాహస కృత్యాలను ప్రశంసాపూర్వకంగా స్మరించుకుంటున్నారు.

**బిఖారి** : అప్పటి బొంబాయి ప్రెసిడెన్సీలోని ఖాందేష్ (Khandesh) ప్రాంతంలో భాగమైన యావల్ (Yawal) తాలూక ప్రస్తుత మహారాష్ట్ర రాష్ట్రంలోని జలగాంవ్ (Jalgaon) జిల్లాలోని యావల్ మునిసిపల్ కౌన్సిల్ ప్రాంతానికి చెందిన యోధుడు బిఖారి (Bikhari). 1857 నాటి పోరాటంలో భాగంగా యావల్ ప్రాంతంలో ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారుల ఆగ్రహానికి గురయ్యారు. 1858లో బిఖారిని అరెస్టు చేసి విచారణ జరిపి మరణ శిక్షను విధించారు. ఆ తరువాత ఆ శిక్షను యావజ్జీవిత కారాగారవాసంగా మార్చారు. ఆ మార్పు మేరకు 1858 అక్టోబర్ 29న ఆయనను అండమానుకు తరలించారు.

**దర్వేష్ అలీ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మొరాదాబాద్ (Moradabad) జిల్లా అమ్రోహా (Amroha) ప్రాంతం నివాసి. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా ఆంగ్లేయుల మీద పోరాడుతున్న అవధ్ రాణి మాత బేగం హజరత్ మహాల్ స్ఫూర్తితో దర్వేష్ అలీ ఖాన్ (Darwesh Ali Khan) అమ్రోహా ప్రజలను తిరుగుబాటుకు పిలుపునిచ్చారు. ఆ మేరకు కదలి వచ్చిన ప్రజలకు, స్వదేశీ సైనిక యోధులకు దర్వేష్ అలీ ఖాన్ నాయకత్వం వహించి అమ్రోహాలో ఆంగ్లేయ సైన్యాలను ఎదుర్కొన్నారు. 1857 మే 10న దర్వేష్ అలీ ఖాన్ నాయకత్వంలోని స్వదేశీ సైన్యాలు ఆమ్రోహాను స్వాధీనం చేసుకున్నాయి. ఆ చర్యతో ఆగ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు 1857 మే 22న ఆంగ్లేయ సైన్యాధికారి విల్సన్ (Willson) ను మొరాదాబాద్ కమీషనర్‌గా నియమించి తిరుగుబాటు యోధుల మీద చర్యలకు ఆదేశించారు. ఆ ఆదేశాల మేరకు తక్షణమే రంగంలోకి దిగిన ఆంగ్లేయాధికారి విల్సన్ భారీ బలగాలతో స్వదేశీ యోధుల మీద విరుచుకపడ్డాడు. అమ్రోహా పోరాటానికి నాయకత్వం వహించిన దర్వేష్ అలీ ఖాన్‌ను నిర్బంధించాడు. ఆయన మీద రాజద్రోహం, ప్రజలను రెచ్చగొట్టి తిరుగుబాటు చేయించారన్న ఆరోపణల మీద విచారణ జరిగింది. ఆంగ్ల న్యాయస్థానం దర్వేష్ అలీ ఖాన్‌కు మరణశిక్ష విధించి, ఆయన

ఆస్తిపాస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని తీర్పు చెప్పింది. ఉన్నత న్యాయస్థానం క్రింది న్యాయస్థానం విధించిన మరణశిక్షను యావజ్జీవిత కారాగారశిక్షగా మార్చి, అండమానుకు పంపమని ఆదేశించింది. ఆ తీర్పు మేరకు అండమానుకు పంపబడిన దర్వేష్ అలీ ఖాన్ చివరకు అండమాను శిక్షాక్షేత్రంలో కన్నుమూసారు.

**ఇబ్రాహీం హుసైన్** : మహారాష్ట్రలోని ప్రస్తుత బొంబాయి నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా దక్షిణ భారత దేశంలో ప్రజ్వరిల్లిన తిరుగుబాటులో ఇబ్రాహీం హుసైన్ (Ibrhim Hussain) భాగస్వామి అయ్యారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ మోపి ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు సాగింది. ఆ తరువాత ఆయనకు యావజ్జీవ కారగారవాసం ప్రకటిస్తూ న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తీర్పు ప్రకారంగా ఇబ్రహీం హుసైన్‌ను అండమానుకు తరలించారు.

**ఇనాయత్ అలీ** : బీహార్ రాష్ట్రం, ప్రస్తుత జెహనాబాద్ (Jehanabad) జిల్లా, షాదిపూర్ (Shadipur) గ్రామం నివాసి. ఆయన తండ్రి జాబొరాక్ అలీ (Jaborak Ali). బ్రిటిష్ సైన్యంలో ఇనాయత్ అలీ **అలియాస్** మున్నే ఖాన్ (Enayath Ali / Munnay Khan) సిపాయి. 1857 నాటి సమర శంఖారావం పూరించబడగానే ఇనాయత్ అలీ కూడా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట పట్టారు. కలందరాబాద్ (Kalanderabad) ప్రాంతంలో ఆంగ్ల సైన్యాలతో స్వదేశీ సైనికులు సాగించిన పోరాటంలో ఇనాయత్ అలీ కూడా భాగస్వామి అయ్యారు. ఆ కారణంగా 1858 మే ఐదున ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఆయన మీద రాజద్రోహం నేరం మోపి, ఆంగ్ల సైనిక న్యాయస్థానం విచారణ జరిపి అండమానుకు తరలించగా ఇనాయత్ అలీ అండమానులో చివరి శ్వాస విడిచారు.

**ఇనాయత్ అహ్మద్ కాకొరి, ముఫ్తి** : ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం దీవాహ్ (Deewah) అప్పటి అవధ్ రాజ్యంలోని గ్రామం దీవాహ్ (Deewah) లో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి (Mufthi Inayat Ahmed Kakori) 1813లో జన్మించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు. ఆగ్రహించిన ఆంగ్లేయులు ముఫ్తి ఇనాయత్ అహ్మద్ ను ఢిల్లీలో నిర్బంధించి విచారణ తంతు నిర్వహించి కారాగారవాస శిక్షను విధించారు. ఆ శిక్ష మేరకు ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. 1866లో జరిగిన ఒక ప్రమాదంలో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ అండమానులో మరణించారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకోరి వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**ఫక్రూ** : కర్నాటక రాష్ట్రం ధార్వార్ (Dharwar) జిల్లా నార్‌గుండ్ (Nargund) తహసీల్ నార్‌గుండ్ నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి ఫక్రూ (Fakru) ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. 1858 జూన్ 28న ఆంగ్లేయాధికారి లెఫ్టినెంట్ కల్నల్ మాల్‌కం ( Lt. Col. Malcolm) నేతృత్వంలో రాజద్రోహ నేరారోపణ మీద న్యాయవిచారణ జరిపి, యావజ్జీవిత కారాగారవాస శిక్ష ప్రకటించి ఆయనను అండమానుకు తరలించారు.

**మౌలానా ఫజలే హఖ్ ఖైరాబాది** : ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామ సమయాన విడుదలయిన చారిత్రాత్మక **'ఫత్వా-ఏ-జిహద్'** (Fatwa-e-Jihad) సృష్టికర్త మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది (Moulana Faz-lay-Haq Khairabadi). ఆయన 1796 ఏప్రిల్ ఏడున ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, సితాపూర్ (Sitapur District) జిల్లా, ఖైరాబాద్ (Khairabad) లో జన్మించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్న ఆయనను 1858 డిసెంబర్ మూడున నిర్బంధించారు. మౌలానా ఫజల్-ఏ-హఖ్ స్వయంగా ప్రకటించిన ఆ నేరాంగీకార వాంగ్మూలంతో 1859 మార్చి నాలుగున ఆయనను నేరస్తుడిగా ప్రకటిస్తూ ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు ఆయనను ఢిల్లీ నుండి ఆరు వందల మైళ్ళ దూరాన ఉన్న అండమాను శిక్షాక్షేత్రం తరలించారు 1859 అక్టోబర్ ఎనిమిదిన అండమాను చేరుకున్న మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది 1861 ఆగస్టు 18/19 న కన్నుమూసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మౌలానా ఫజలే హఖ్ ఖైరాబాది వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**ఫరాస్ ఖాన్ ఇమాం ఖాన్** : కర్నాటక రాష్ట్రం ధార్వార్ (Dharwar) జిల్లా నార్‌గుండ్ (Nargund) నివాసి. తండ్రి ఇమాం ఖాన్. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో ఫరాస్ ఖాన్ ఇమాం ఖాన్ (Faras Khan Imam Khan) పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేసి ఆయన ఆస్తులను జప్తు చేశారు. అనంతరం రాజద్రోహం నేరారోపణ మీద విచారణ జరిపి, యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించి అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**గులాం గౌస్** : ప్రస్తుత తమిళనాడు రాష్ట్రం రాజధాని చెన్నెయ్ (South Point) అప్పటి మద్రాసు లోని సౌత్ పాయింట్ (South Point) ప్రాంతం నివాసి. 1857లో

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడమంటూ మద్రాసు ప్రజలకు పిలుపునిస్తూ ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం ఆరంభించారు. ఆయన, ఆయన సహచరులు కలసి మద్రాసు పట్టణంలోని నిర్మాణాల గోడల మీద పోస్టర్లు అంటిస్తూ సహచరుడు షేక్ మన్నూతో సహా అరెస్టయ్యారు. మద్రాసు సుప్రీంకోర్టు విచారణ జరిపి యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించగా గులాం గౌస్‌ను ఆంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**గులాం హుసైన్** : ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం జౌనాపూర్ (Jaunpur) జిల్లా కేంద్రం జౌనాపూర్ పట్టణం అప్పటి అవధ్ రాజ్యంలోని జౌనాపూర్ పట్టణం నివాసి. బ్రిటిష్ పోలీసు విభాగంలో గులాం హుసైన్ (Gulam Hussain) ఉద్యోగి. స్వదేశీయుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయాధికారుల తీరుతెన్నులను స్వయంగా చూసిన ఆయన ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు బాట పట్టారు. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా బ్రిటిష్ పోలీసు విభాగంలోని తన సహచరులను ఆంగ్లేయ ప్రభుత్వ ఆదేశాలు, అధికారుల ఆజ్ఞలను ధిక్కరించమని ప్రచారం చేయసాగారు. ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టి పోరుబాటన నడవమని ఉద్బోధించ సాగారు. ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు గులాం హుసైన్ ను నిర్బంధించారు. ఆయనను పలు నేరాలలో దోషిగా పేర్కొంటూ కేసు నమోదు చేసి ఆంగ్ల న్యాయస్థానంలో నిలబెట్టారు. ఆ నేరారోపణల మీద ఆంగ్ల న్యాయస్థానం విచారణ జరిపి గులాం హుసైన్ కు కఠినకారాగార శిక్షను విధిస్తూ అండమాను శిక్షాక్షేత్రానికి పంపాల్సిందిగా తీర్పు చెప్పింది. ఆ మేరకు ఆంగ్లేయాధికారులు గులాం హుసైన్ ను అండమానుకు తరలించారు.

**గులాబ్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రం నిమార్ (Nimar) ప్రాంతం నివాసి. 1857లో ఆంగ్ల సైన్యాలకు వ్యతిరేకంగా మండలేశ్వర్ వద్ద జరిగిన పోరాటంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలమయ్యాక ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలు ఆయనను అరెస్టు చేయగా ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు గులాబ్ ఖాన్‌ను అంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. చివరకు గులాబ్ ఖాన్ అండమానులో కన్నుమూసారు.

**గులియా ముదేమియా** : కర్నాటక రాష్ట్రం ధార్వార్ (Dharwar) జిల్లా నార్‌గుండ్ (Nargund) నివాసి. తండ్రి ఇమాం ఖాన్. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి గులియా ముదేమియా (Gulia Mudemiya) ఆంగ్లేయ సైన్యాలతో పోరాడారు. ఆ కారణంగా

ఆంగ్లేయాధికారులు ఆయనను  అరెస్టు చేసి ఆస్తులను జప్తు చేశారు. అనంతరం రాజద్రోహం నేరారోపణ మీద విచారణ జరిపి, యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించి అండమాను జైలుకు తరలించగా. గులియా ముడేమియా జీవితం అండమానులో ముగిసింది.

**గుల్జార్ హుసైన్ :** మహారాష్ట్ర రాష్ట్రంలోని అప్పటి బొంబాయి (Bombay) ప్రస్తుత ముంబాయి (Mumbai) ప్రాంతం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా గుల్జార్ హుసైన్ (Gulzar Hussain)  పోరాడారు. ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి రాజద్రోహం నేరారోపణ మీద విచారణ సాగించారు. ఆంగ్ల న్యాయస్థానం 1857 ఆగస్టు 23న యావజ్జీవ కారాగారవాసం విధించింది. ఆ తీర్పు మేరకు తొలుత గుల్జార్ హుసైన్ ను థానా కారాగారానికి పంపి ఆ తరువాత అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**హకీం అబ్దుల్ హఖ్ :** ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామానికి ప్రధాన కార్యక్షేత్రంగా భాసిల్లిన ఢిల్లీ ప్రాంతం నివాసి. మొగల్ చక్రవర్తి బహుదూర్ షాహ్ జఫర్ ఆస్థానంలో హకీం అబ్దుల్ హఖ్ ( Hakim Abdul Haq) ప్రముఖుడు. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన చురుకైన పాత్రను నిర్వహించారు. ఆనాటి పోరాటంలో హకీం అబ్దుల్ హఖ్ తిరుగుబాటు యోధులకు సాధన-సంపత్తి అందించి, ఆహారం-ఆశ్రయం కల్పించి ప్రోత్సహించారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు హకీం అబ్దుల్ హఖ్ ను నిర్బంధించి రాజద్రోహం నేరారోపణ గావించారు. ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతు నిర్వహించి ఆయనకు యావజ్జీవకారాగార శిక్షను విధించింది. ఆంగ్లేయాధికారులు హకీం అబ్దుల్ హఖ్ ను అండమానుకు తరలించారు.

**హిదాయతుల్లా :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అవధ్ రాజ్యం నివాసి.  ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో హిదాయతుల్లా (Hidait-Ullah) తిరుగుబాటు యోధుల పక్షాన పోరాడారు. అవధ్ రాజ్యంలో రాజమాత బేగం హజరత్ మహల్ ఆంగ్లేయులతో సాగిస్తున్న పోరాటానికి పూర్తిగా మద్దతు తెలుపుతూ సహాయ సహకారాలను అందించారు. అందుకు ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను, ఆయన సోదరులు ఖిఫాయతుల్లాను (Kifaitullah) అరెస్టు చేసింది. ఆ ఇరువురి మీద రాజద్రోహం నేరం మోపి విచారణ నిర్వహించింది. చివరకు అన్నదమ్ములు ఇరువురికి 14 ఏండ్ల కారాగారవాస శిక్షను న్యాయస్థానం ప్రకటించింది. ఆంగ్ల న్యాయస్థానం ఆదేశాల మేరకు ఆయనను ఆంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**హుసైన్ ఖాన్ :** అప్పటి అవధ్ రాజ్యంలోని ఆగ్రా, ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఆగ్రా జిల్లాలోని చారిత్రక ఆగ్రా నగరం నివాసి. ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధ్వర్యంలోని పోలీసు విభాగంలో హుసైన్ ఖాన్ (Hussain Khan) ఉద్యోగి. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో స్వదేశీయుల పట్ల కిరాతకంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయ సైనికాధికారుల తీరుతెన్నులను చూసి ఆయన తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. బ్రిటిష్ పోలీసు విభాగంలోని తన సహచరులను ఆంగ్లేయాధికారుల క్రూరచర్యలను నిరసించ వలసిందిగా, ఆంగ్లేయుల ఆజ్ఞలను ధిక్కరించవలసిందిగా హుసైన్ ఖాన్ కోరారు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు పోరాడవలసిందిగా ఉద్బోధించారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారులు హుసేన్ ఖాన్‌ను అరెస్టు చేసి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**హుసైన్ హటేలా :** కర్నాటక రాష్ట్రం నార్‌గుండ్ (Nargund) పరగణాలోని ధార్వార్ జిల్లా నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి, ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో హుస్సేన్ హటేలా (Hussain Hatela) పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించగా హుస్సేన్ హటేలా ను అండమానుకు తరలించారు.

**హుసైన్ ఇబ్రహీం :** ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా పోరాడారు. ఆయనను అరెస్టు చేసి రాజద్రోహం నేరారోపణ మీద విచారణ జరిపి 1857 ఆగస్టు 23న యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించారు. అనంతరం ఆయనను థానా కారాగారానికి తరలించి అటునుండి అండమాను శిక్షాక్షేత్రానికి పంపారు.

**హుసైన్ గుల్జార్ :** ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా పోరాడారు. ఆయనను అరెస్టు చేసి రాజద్రోహం నేరారోపణ మీద విచారణ సాగించి 1857 ఆగస్టు 23న యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించారు. అనంతరం ఆయనను థానా కారాగారానికి తరలించి అటునుండి అండమానుకు పంపారు.

**హుసైన్ షాహ్ ఫకీర్ - యతీం షాహ్ ఫకీర్ :** ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పశ్చిమగోదావరి జిల్లా, అప్పటి మచిలీపట్నం పరగణాలోని యానాం ప్రాంతానికి చెందిన యోధులు. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో జరిగిన కార్యకలాపాలలో ఈ ఇరువురు క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఆంగ్లేయాధికారులకు భయంగొలిపే చర్యలకు శ్రీకారం చుట్టారు. ఆ కారణంగా 1857

సెప్టెంబర్ తొమ్మిదిన తిరుగుబాటు యోధులు హుసైన్ షాహ్ ఫకీర్ (Hussain Shah Fakir), యతీం షాహ్ ఫకీర్ (Yatim Shah Fakir) ను నిర్బంధించారు. ఆ తిరుగుబాటు యోధుల మీద రాజద్రోహం నేరం ఆపాదించి విచారణ తంతు జరిపిన ఆంగ్ల న్యాయస్థానం హుసైన్ షాహ్ ఫకీర్, యతీం షాహ్ ఫకీర్ లకు యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించింది. ఆ శిక్ష మేరకు ఆ ఇరువురిని అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో హుసైన్ షాహ్ ఫకీర్-యతీం షాహ్ ఫకీర్‌ల వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**జహందా షాహ్ :** అప్పటి అలహాబాద్ (Allahabad) పట్టణం, ఇప్పటి ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ప్రయాగరాజ్ / అలహాబాద్ (Prayagraj / Allahabad) నగరం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా మౌల్వీ లియాఖత్ అలీ సాగించిన పోరాటంలో ఆయన పాల్గొన్నారు. ఆ పోరాటం సమసిపోయిన తరువాత లియాఖత్ అలీ తోపాటుగా జహందా షాహ్ (Jahanda Shah ) ను ఆంగ్లేయులు అరెస్టు చేసారు. అనంతరం ఆయన మీద రాజద్రోహం నేరారోపణ మోపి విచారణ సాగించి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించి 1868లో మౌల్వీ లియాఖత్ అలీ తోపాటుగా జహందా షాహ్‌ను కూడా ఆంగ్లేయులు అండమానుకు పంపారు.

**కల్లూ ముబారక్ :** ప్రస్తుత మహారాష్ట్ర రాజధాని ముంబాయి నగరం అప్పటి బొంబాయి రెసిడెన్సీ (Bombay Residency) నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఆ కారణంగా 1857 ఆగస్టు 23న కల్లూ ముబారక్ (Kallu Mubarak) ను ఆంగ్ల అధికారులు అరెస్టు చేయగా ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతును నిర్వహించింది. అనంతరం 1857 ఆగస్టు 23న ఆయనకు యావజ్జీవ కారాగారశిక్షను విధిస్తూ న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తీర్పు మేరకు కల్లూ ముబారక్ ను తొలుత థానా జైలుకు పంపిన ఆంగ్లేయాధికారులు అక్కడి నుండి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**కల్లూ రెహమాన్ :** ప్రస్తుత మహారాష్ట్ర రాజధాని ముంబాయి నగరం నివాసి అప్పటి బొంబాయి రెసిడెన్సీ (Bombay Residency) ప్రాంతం నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. 1857 ఆగస్టు 23న ఆంగ్లేయాధికారులు కల్లూ రెహమాన్ (Kallu Rehaman) అరెస్టు చేశారు. 1857 ఆగస్టు 23న ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవ కారాగారశిక్షను విధించింది. ఆ తరువాత ఆయనను తొలుత థానా జైలుకు పంపి అక్కడి నుండి అండమానుకు తరలించారు.

**కల్లూ** : ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొన్న కల్లూ (Kallu) ను ఆంగ్లేయ అధికారులు అరెస్టు చేసి విచారణ తంతును నిర్వహించి యావజ్జీవ ఖైదును శిక్షగా విధించారు. ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేశారు. ఆ తరువాత ఆయనను అండమానుకు తరలించారు. అండమాను చేరుకున్న కల్లూ అండమాను శిక్షాక్షేత్రం లోని పోర్టు బ్లయర్ (Port Blair) జైలులో కన్ను మూసేంతవరకు 'ఖైదీ నం.1332' గా పరిగణించబడ్డారు.

**కల్లూ రజియా** : మహారాష్ట్రలోని నాసిక్ జిల్లాలోని పెంత్ (Penth) నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సందర్భంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్నారు. ప్రధానంగా 1857 డిసెంబర్ ఆరున మామ్లత్‌దార్ కార్యాలయం (Mamlatdar Office) మీద జరిగిన దాడిలో కల్లూ రజియా (Kallu Rajiya) ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఆంగ్లేయాధికారులు అరెస్టు చేసి యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించారు. అనంతరం కల్లూ రజియా ను అండమాకు తరలించారు.

**కరీం రెహమాన్** : బొంబాయి రెసిడెన్సీ ప్రాంతానికి చెందిన కరీం రెహమాన్ (Karim Rehman) ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఆ తదుపరి పరిణామాల ఫలితంగా ఆంగ్లేయాధికారులు ఆయనను నిర్బంధించి యావజ్జీవ ఖైదు శిక్షను ప్రకటించారు. 1857 ఆగస్టు 23న ఆయన ఆస్తిపాస్తులను జప్తుచేసి ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**కరీం ఖాన్** : మహారాష్ట్ర లోని కొల్హాపూర్ (Kolhapur) జిల్లా కొల్హాపూర్ నివాసి. ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక బలగాలలో 27వ స్థానిక పదాతిదళం సిపాయిగా పనిచేసారు. 1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రజ్వరిల్లగా తిరుగుబాటు యోధులలో ఒకరుగా కరీం ఖాన్ (Karim Khan) పాల్గొన్నారు. ఆ తరువాత తిరుగుబాటు జరుగుతున్న ఇతర ప్రాంతాల తిరుగుబాటు యోధులతో సంబంధాలు ఏర్పర్చుకుని ఆంగ్లేయ సైనిక బలగాలకు వ్యతిరేకంగా స్వదేశీ సైనిక యోధులతో కలసి పోరుబాటన సాగారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సమసిపోయాక ఆంగ్లేయ సైన్యాలు ఆయనను అరెస్టు చేసి సైనిక విచారణ నిర్వహించాయి. 1857 నవంబర్ 28న ఆంగ్లేయ సైనిక న్యాయస్థానం ఆయనకు యావజ్జీవ ఖైదును శిక్షగా విధిస్తు తీర్పు చెప్పింది. ఆయనను కొంతకాలం థానా (Thana) జైలులో బంధించి ఉంచి అటునుండి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**ఖుతుబ్ షాహ్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బరేలి (Bareilly) జిల్లా బరేలి ప్రాంతం నివాసి. ఈ చారిత్రక ప్రాంతం ఆనాడు అవధ్ (Oudh) రాజ్యంలో భాగం. భారత ప్రథమ

స్వాతంత్ర్య పోరాటంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలను ఎదురొడ్డి పోరాడిన స్వదేశీ యోధుల గడ్డ బరెలీ. బహు భాషా పండితుడు ఖుతుబ్ షాహ్ (Qutab Shah) బెంగాలీ కళాశాలలో పర్షియన్ అధ్యాపకులు మాత్రమే కాకుండా 'ఫిల్బత్ కెనాల్' పర్యవేక్షకుడి (Superintendent) గా బాధ్యతలు నిర్వర్తించారు. ఆర్థిక-ధార్మిక-సామాజిక రంగాలలో మంచి పరిజ్ఞానం గల వ్యక్తిగా ఖుతుబ్ షాహ్ ఆయా ప్రాంతాల ప్రజలకు మార్గదర్శకులు అయ్యారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆరంభం కాగానే ఖుతుబ్ షాహ్ ఆంగ్లేయ వ్యతిరేక పోరాటంలో చురుగ్గా పాల్గొనటం కాకుండా ప్రజలను ఆ దిశగా నడిపించేందుకు ప్రచార కార్యక్రమాలను చేపట్టారు. బరేలి ప్రాంతంలో ఆంగ్లేయులు ఎక్కడ కన్పించినా వారిని ఖతం చేయమని తన సహచరులను ఖుతుబ్ షాహ్ ప్రేరేపించారు. ఆ దిశగా ప్రజలను చైతన్యవంతుల్ని చేసి కార్యోన్ముఖులను చేయడానికి ఆయన ప్రత్యేకంగా 'బహుదారి ప్రెస్' (Bahudari Press) స్థాపించి కరపత్రాలను సృష్టించి, ప్రచురించి, పంపిణి చేశారు. ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలోని స్వదేశీ యోధులను ఆంగ్లేయాధికారులకు వ్యతిరేకంగా రెచ్చగొట్టేందుకు ఆయన కంపెనీ కాల్బలంలో సిపాయిగా కూడా చేరారు

ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న ఆయన చర్యలను, ఉద్దేశ్యాలను పసిగట్టిన కంపెనీ గూఢచారులు ఆ విషయం కాస్తా అధికారుల దృష్టికి తీసుకరావడంతో ఆయన ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఆంగ్లేయాధికారులు ఆయనను ఆరెస్టు చేసి పలు ఆరోపణల మీద విచారణ జరిపించారు. ఆ విచారణ తంతు తరువాత ఆంగ్ల న్యాయస్థానం ఖుతుబ్ షాహ్‌కు మరణ దండన విధిస్తూ తీర్పు చెప్పింది. అత్యున్నత న్యాయస్థానం ఆయనకు విధించిన మరణదండనను పక్కకు పెట్టి యావజ్జీవి కారాగార శిక్షను ఖరారు చేసింది. ఆ తీర్పు మేరకు ఖుతుబ్ షాహ్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**కాతిల్ బేగ్ :** ఆనాటి బొంబాయి రెసిడెన్సీ నివాసి. ఆయనకు ధోండి మాలిక్ బేగ్ (Dondi Malik Beg) అని మరో కూడా పేరుంది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో (Katil Beg) కాతిల్ బేగ్ చురుగ్గా పాల్గొన్నారు. ఆయనను ఆంగ్లేయ సైన్యాలు అరెస్టు చేసి రాజద్రోహ నేరారోపణ గావించారు. అనంతరం విచారణ తంతు నిర్వహించి 1858 ఏప్రిల్ తొమ్మిదిన యావజ్జీవిత ఖైదును ప్రకటించారు. ఆ శిక్ష ప్రకారంగా ఆయనను తొలుత ధానా జైలులో ఉంచి అటునుండి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**ఖిఫాయతుల్లా :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అవధ్ (Oudh) రాజ్యం పౌరులు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా ఖిఫాయతుల్లా పోరాడారు. ఆయనను అరెస్టు చేసి, ఆయన సోదరులు హిదాయతుల్లాతో పాటుగా ఖిఫాయతుల్లా మీద

రాజద్రోహ నేరారోపణ గావించి విచారణ సాగించారు. ఆ తరువాత ఖిఫాయతుల్లా-హిదాయతుల్లా ఇరువురికి 14 ఏండ్ల కారాగారవాస శిక్షను విధించారు. ఆ తీర్పు మేరకు ఆ సోదరుల ఆస్తులను జప్తుచేసి ఇరువురిని అండమాను జైలుకు తరలించారు.

**ఖుదా బక్ష్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం Kathghodia ప్రాంతం నివాసి. ఖుదా బక్ష్ (Khuda Baksh) తండ్రి పేరు రంజాన్ అలీ (Ramzan Ali). 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారన్న ఆరోపణల మీద ఆంగ్ల న్యాయస్థానం 1858 జూలై 28న ఆయనకు ద్వీపాంతరవాస జైలు శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు ఆంగ్లేయాధికారులు ఖుదా బక్ష్‌ను అండమానుకు తరలించారు. శిక్షాకాలం తరువాత అండమాను నుండి భారత ప్రధాన భూభాగానికి వచ్చేసిన ఖుదా బక్ష్ చివరి రోజులు స్వగ్రామంలో గడిపారు.

**ఖుదా బక్ష్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బిజినోర్ జిల్లా పూర్వా (Purwa) ప్రాంతం నివాసి. ఖుదా బక్ష్ (Khuda Baksh) తండ్రి పేరు బద్లూ (Badlu). ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలో ఖుదా బక్ష్ సిపాయిగా పనిచేశారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారన్న ఆరోపణల మీద మాత్రమే కాకుండా స్వదేశీ సైనికులను హింసకు పాల్పడాల్సిందిగా ప్రేరేపిస్తూ, రెచ్చగొడుతున్నట్టుగా ఆంగ్లేయాధికారులు ఆయన మీద ఆరోపణలు నమోదు చేశారు. అనంతరం ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు ఖుదా బక్ష్‌ను ఆంగ్లేయాధికారులు అండమానుకు తరలించారు. అండమానులో శిక్షాకాలం అనుభవిస్తూ ఖుదా బక్ష్ కన్నుమూసారు.

**ఖుర్బాన్ అలీ :** బీహార్ రాష్ట్రానికి చెందిన ఖుర్బాన్ అలీ (Khurban Ali) ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఖుర్బాన్ అలీని అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం న్యాయస్థానంలో విచారణ తంతు నిర్వహించి కారాగారశిక్షను విధించి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించింది.

**ఖాజి సర్ఫాజ్ అలీ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం షాజహాన్ పూర్ జిల్లా షాజహాన్‌పూర్ పట్టణం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఖాజి సర్ఫాజ్ అలీ (Khaji Sarfraz Ali) చురుగ్గా పాల్గొన్నారు. ఆ తిరుగుబాటు విఫలం అయ్యాక ఖాజి సర్ఫాజ్ అలీని ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరం మోపి విచారణ తంతు నిర్వహించారు. ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్ష విధించింది. ఆ తీర్పు మేరకు ఆంగ్లేయాధికారులు ఖాజి సర్ఫాజ్ అలీని అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**మౌల్వీ లియాఖత్ అలీ :** మౌల్వీ లియాఖత్ అలీ ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అలహాబాద్ జిల్లా చాయిల్ (Chail) తహసిల్‌లోని మహాగావ్ఁ (Mahgaon) గ్రామంలోని చేనేత కార్మికుల కుటుంబంలో 1817 అక్టోబర్ ఐదున జన్మించారు. అలహాబాదు కేంద్రంగా ఆయన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఆరంభంలో మౌల్వీ సహచరులకు ఆధిపత్యం లభించినా ఆ తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక బలగాలతో సాగిన పోరులో పరాజయం తప్పని పరిస్థితి ఎదురయ్యింది. ఆ ప్రతికూల పరిస్థితులలో 1858 జూన్ 17న మౌల్వీ లియాఖత్ అలీ ఆంగ్ల గూఢచారుల ప్రయత్నాలను వమ్ము చేస్తూ అలహాబాద్ పరగణా నుండి క్షేమంగా ఇతర ప్రాంతాలకు తప్పించుకున్నారు. మౌల్వీ లియాఖత్ అలీ 14 ఏండ్ల తరువాత 1871లో ఆంగ్లేయులకు పట్టుబడ్డారు. ఆయన మీద రాజద్రోహం, ఆంగ్లేయ సైనికులను హత్యచేసారని, ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టారని బ్రిటిష్ ప్రభుత్వం నేరారోపణలు గావించింది. అనంతరం విచారణ నిర్వహించి యావజ్జీవిత కారాగార శిక్షను విధించి, ఆయనను అండమానుకు పంపారు. అండమాను శిక్షాక్షేత్రంలో మౌల్వీ లియాఖత్ అలీ 1892 మే 17న కన్నుమూసారు.(**ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మౌల్వీ లియాఖత్ అలీ వివరాలు మరిన్ని ఉన్నాయి.**)

**మహిబుల్లాహ్ :** మధ్యప్రదేశ్ రాష్ట్రం నిమార్ (Nimar) జిల్లాలోని నిమార్ పట్టణ నివాసి. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా మధ్యప్రదేశ్ రాష్ట్రం ఖర్గోన్ (Khargone) జిల్లా మండలేశ్వర్ (Mandaleshwar) వద్ద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో మహిబుల్లాహ్ (Mahibullah) పాల్గొన్నారు. ఆ పోరాటంలో పైచేయి సాధించిన ఆంగ్ల సైన్యం ఆయనను నిర్బంధించింది. ఆంగ్ల న్యాయస్థానం ఆయన మీద చేయబడిన రాజద్రోహం నేరారోపణను విచారణ జరిపింది. అనంతరం ఆయనకు యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. ఆ శిక్షమేరకు ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. చివరకు అండమానులో మహిబుల్లాహ్ కన్నుమూసారు.

**మగ్బూల్ షాహ్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం లక్నోకు చెందిన మగ్బూల్ షాహ్ (Magbool Shah) 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి రాజద్రోహం నేరం క్రింది విచారణ జరిపారు. ఆ విచారణలో న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగారశిక్ష విధించింది. 1858 జూన్ 18న ఆయనను అండమానుకు తరలించారు. అండమాను శిక్షాక్షేత్రం చేరుకున్న మగ్బూల్ షాహ్ శిక్షాకాలం పూర్తయ్యాక స్వగ్రామం వెళ్ళకుండా అండమానులోనే స్థిరపడ్డారు.

**మంజూ షాహ్ :** మధ్యప్రదేశ్ రాష్ట్రం నిమార్ బేరర్ (Nimar Berar) జిల్లాలోని నిమార్ పట్టణం నివాసి. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా మధ్యప్రదేశ్ రాష్ట్రం ఖర్గోన్ (Khargone) జిల్లా మండలేశ్వర్ (Mandaleshwar) వద్ద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ఆయన పాల్గొన్నారు. చివరకు ఆంగ్ల సైన్యం ఆయనను నిర్బంధించింది. ఆయన మీద రాజద్రోహం నేరాన్ని ఆపాదించింది. ఆ నేరారోపణ మీద విచారణ తంతును నిర్వహించింది. అనంతరం ఆయనకు యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తూ తీర్పును ప్రకటించింది. ఆ శిక్ష ప్రకారంగా మంజూ షాహ్ (Manju Shah) ను అండమానుకు తరలించగా అండమాను శిక్షాక్షేత్రంలో ఆయన కన్నుమూసారు.

**మహమ్మద్ బక్ష్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అవధ్ రాజ్యం పౌరులు. తండ్రి పేరు భాగో (Bhago). 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా పోరాడారు. 1858 జూన్ ఏడున మహమ్మద్ బక్ష్‌ను (Mahammad Baksh) ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొడుతూ, ప్రభుత్వ కార్యకలాపాల మీద గూఢచర్యం నిర్వహిస్తూ రహస్యాలను తిరుగుబాటు నాయకులకు చేరవేస్తున్నారన్న నేరారోపణల మీద విచారణ సాగించారు. ఆ ఆరోపణలను విచారించిన ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు కఠినకారగార శిక్షను విధించింది. ఆంగ్ల న్యాయస్థానం తీర్పు మేరకు ఆయనను అండమానుకు తరలించారు. అండమాను శిక్షాక్షేత్రంలో ఐదు సంవత్సరాల జైలుశిక్షను పూర్తయ్యాక మహమ్మద్ బక్ష్ తిరిగి స్వదేశం చేరుకున్నారు.

**మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాది :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ప్రఖ్యాత ఆగ్రా పట్టణం నివాసి. ఆయన పూర్తి పేరు మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాది. ఆయన తండ్రి సయ్యద్ అహ్మద్ హుసైన్ ప్రఖ్యాత ఉర్దూ కవి. మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాది (Munshi Mohammad Ismail Hussain Muneer Shikobadi)1816 లో జన్మించారు. 1857 నాటి తిరుగుబాటులో ఆయన ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ జరిపించారు. ఆయనకు 12 సంవత్సరాల ద్వీపాంతరవాస శిక్షను విధిస్తూ ఆంగ్లేయ న్యాయస్థానం తీర్పు ప్రకటించింది. ఆ తీర్పు ప్రకారంగా మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాది ని అండమానుకు తరలించారు. అండమానులో ప్రఖ్యాత స్వాతంత్ర్య సమరయోధులు, సుప్రసిద్ధ సాహిత్యవేత్త మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది (Fazal e Haq Khairabadi) తో మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాదికి సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. 1865లో అండమాను జైలు నుండి విముక్తి లభించగా స్వదేశం

చేరుకున్న మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాది1880లో కన్నుమూసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోబాది వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మహోమ్మద్ యార్ ఖాన్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బదౌన్ (Badaun) జిల్లా బదౌన్ నివాసి. బదౌన్ పట్టణ ప్రాంతానికి ఆయన 'నాయిబ్ నిజాం' (Naib Nizam of Badaun) గా బాధ్యతలు నిర్వహించారు. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నాయకునిగా తిరుగుబాటు యోధులను ముందుండి నడిపించారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు మహోమ్మద్ యార్ ఖాన్‌ను (Mohammad Yaar Khan) నిర్బంధించి విచారణ జరిపి ఐదు సంవత్సరాల కఠిన కారాగారవాస శిక్షను విధించారు. చివరకు ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేసి అండమానుకు తరలించారు.

**మన్సబ్ అలీ :** బీహార్ రాష్ట్రం చందెల్లా (Chandella) ప్రాంతం నివాసి. బ్రిటిష్ పోలీసు విభాగంలో మన్సబ్ అలీ (Mansab Ali ) ఉద్యోగి. 1857నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం పట్ల ఆయన ఆకర్షితులయ్యారు. ఆంగ్లేయాధికారులు స్వజనుల మీద సాగిస్తున్న క్రూరచర్యలు, దాష్టీకాలను చూసి ఆగ్రహించారు. ఆంగ్లేయుల మీద పోరాటానికి ఒక ప్రత్యేక దళం ఏర్పాటు చేసుకున్న మన్సబ్ అలీ ఆంగ్లేయ వ్యతిరేక పోరాటానికి సిద్ధం కావాల్సిందిగా ప్రజలను కోరుతూ ముమ్మరం ప్రచారం చేశారు. బ్రిటిష్ పోలీసు విభాగంలోని తన సహచరులను కూడా ఆంగ్లేయ అధికారుల ఆజ్ఞలను, ఆదేశాలను ధిక్కరించాల్సిందిగా ఉద్బోధించారు. ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను, ఆయన సహచరులను మూకుమ్మడిగా నిర్బంధించింది. ప్రజలలో తిరుగుబాటు ప్రేరేపిస్తూ, హింసను రెచ్చ గొడుతున్నారంటూ ఆంగ్లేయాధికారులు ఆయన మీద నేరారోపణలు గావించారు. అనంతరం ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతు నిర్వహించి మన్సబ్ అలీ, ఆయన సహచరులకు కఠినకారాగార శిక్ష విధించింది. ఆ తీర్పు మేరకు మన్సబ్ అలీ ఆయన అనుచర బృందాన్ని అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**మౌల్వీ మజహర్ కరీం :** 1857 నాటి ఉమ్మడి బెంగాల్ ప్రాంతానికి చెందిన మౌల్వీ మజహర్ కరీం (Maulvi Mazhar Kareem) ధార్మిక పండితులు. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన కూడా భాగస్వాములయ్యారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయనను నిర్బంధించి చేతులు-కాళ్ళు కట్టేసి భయంకర చిత్రహింసలకు గురిచేశారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో పాల్గొన్నారన్న ఆరోపణ మీద ఆయనకు కారాగారశిక్ష విధిస్తూ అండమానుకు తరలించారు. బహుభాషా పండితులు మౌల్వీ

మజహర్ కరీం పాండిత్య ప్రతిభను గమనించిన అండమాను శిక్షాక్షేత్రంలోని ఆంగ్లేయాధికారి మేజర్ జాన్ (Major Jhon) ఆయన శిక్షాకాలాన్ని తగ్గించాడు. ఆ తరువాత మేజర్ జాన్ అభ్యర్ధన మేరకు మౌల్వీ మజహర్ కరీం 'మరాసదుల్ ఇత్లాబ్' (Marasadul Itlab) అను గ్రంథాన్ని అనువదించి ఇచ్చారు.

**ముషీర్ అలీ** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, లక్నో జిల్లా, కాకోరి పట్టణం నివాసి. బ్రిటిష్ ప్రభుత్వంలో ముషీర్ అలీ (Mushir Ali) బులంద్ సహర్ (Buland Shahar) ప్రాంతానికి తహసిల్దార్ (Thehasildar) గా బాధ్యతలు నిర్వహించారు. ఆ సమయంలో పెల్లుబికిన ప్రథమ స్వాతంత్ర్య సమరంలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా 1858 జూన్ తొమ్మిదిన ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేశారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ మోపారు. ఆ ఆరోపణల మీద ఆంగ్ల న్యాయస్థానంలో దోషిగా నిలబెట్టి విచారణ తంతు నిర్వహించారు. ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు కారాగార శిక్ష విధించింది. ఆ శిక్ష మేరకు ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి పంపారు. అండమాను జైలులో శిక్షాకాలం అంతా గడిపిన తరువాత ముషీర్ అహ్మద్ స్వస్థలం చేరుకున్నారు.

**మురాద్ అలీ** : ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఫరూకాబాద్ (Farukhabad) జిల్లాలోని ఫరూకాబాద్, 1857 నాటి అవధ్ (Awad) రాజ్యంలోని ఫరూకాబాద్ ప్రాంతం నివాసి. బ్రిటిష్ ప్రభుత్వంలోని పోలీసు విభాగంలో మురాద్ అలీ (Murad Ali) ఉద్యోగి. బ్రిటిష్ ప్రభుత్వం స్వదేశీ జనుల పట్ల క్రూరంగా వ్యవహరిస్తున్న తీరుతెన్నులను స్వయంగా చూసిన మురాద్ అలీ ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరుబాట పట్టారు. ఆయన మిత్రులు పరాలి (Paralee) అనునతడు బీహార్ రాష్ట్రంలోని ఒక గ్రామం నివాసి. ఆయన ఆంగ్ల ప్రభుత్వం అనుసరిస్తున్న రైతాంగ వ్యతిరేక చర్యలకు వ్యతిరేకంగా రైతుల సంక్షేమం ప్రధాన లక్ష్యంగా రైతుల సంఘం ఏర్పాటు చేశారు.

ఆ రైతు సంఘం ఆధ్వర్యంలో ఒకసారి ఊరేగింపు జరుగుతుండగా బ్రిటిష్ పోలీసులు ప్రదర్శకుల మీద దాడి చేశారు. ఆ దాడిలో పాల్గొన్న ఒక ఆంగ్లేయాధికారి రైతుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరించాడు. ఆ ఆంగ్లేయాధికారి చర్యలకు ఆగ్రహించిన రైతు సంఘం నాయకులు పరాలి ఆంగ్లేయుడి మీద దాడి చేసి అతగాడిని అంతం చేశాడు. బ్రిటిష్ పోలీసులు తక్షణమే స్పందిస్తూ రైతు నాయకుడు పరాలిని, మురాద్ అలీని నిర్బంధించారు. మురాద్ అలీని చిత్రహింసల పాల్జేశారు. చివరకు పరాలి (Paralee) మీద హత్యానేరం నమోదు చేసి విచారణ జరిపి ఉరిశిక్ష విధించి వెంటనే ఉరిని అమలు పర్చారు. ఆ చర్య పట్ల ప్రతికూలంగా స్పందించిన మురాద్ అలీ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా

తిరుగుబాటు బాట పట్టారు. ఆంగ్లేయాధికారుల క్రూర చర్యలను వ్యతిరేకించమని బ్రిటిష్ పోలీసు విభాగంలోని తన సహచరులను రెచ్చగొట్టారు. ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలను పాటించకుండా, ఆంగ్లేయుల అమానవీయ ఆదేశాలను ఉల్లంఘించాలని, ధిక్కరించాలని సహచరులకు, ప్రజలకు ఆయన ఉద్బోధ చేశారు.

ఆ కారణంగా ఆగ్రహించిన బ్రిటిష్ ప్రభుత్వం మురాద్ అలీని నిర్బంధించింది. ఆయన మీద పలు నేరారోపణలు నమోదు చేసి సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపింది. చివరకు ఆంగ్లేయ సైనిక న్యాయస్థానం మురాద్ అలీకి యావజ్జీవకారాగార శిక్ష విధిస్తూ, ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించాల్సిందిగా తీర్పు చెప్పింది. ఆ తీర్పు ప్రకారంగా అండమానుకు తరలించబడిన మురాద్ అలీ తిరిగి స్వస్థలం ముఖం చూడలేకపోయారు.

**మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్** : ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ (Mirja Vilayat Hussain Khan) ఉత్తరప్రదేశ్ బుందేల్ ఖండ్ ప్రాంతానికి చెందిన ప్రస్తుత బండా (Banda) జిల్లా బండా సంస్థానం నివాసి. ఆయన బండా నవాబు అలీ బహుదూర్ ఆస్థానంలో ప్రధాన మంత్రి. 1857 జూన్ 15న బండా సంస్థానాన్ని కబళించేందుకు వచ్చిన ఆంగ్లేయుడు H. A. Clockwell హత్యకు గురవుతాడు. ఆగ్రహించిన ఆంగ్లేయాధికారి జనరల్ వైట్‌లాక్ (General Whitelock) తన సైన్యాలతో 1857 అక్టోబర్ 18న బండాను చుట్టుముట్టాడు. స్వదేశీ యోధులు ఆంగ్ల సైన్యాలను తిప్పికొట్టారు. ఆ పరాజయంతో రగలిపోయిన జనరల్ వైట్‌లాక్ మళ్ళీ భారీ సైన్యంతో వచ్చి బండా కోటను స్వాధీనం చేసున్నాడు. ఆ పరిణామాల క్రమంలో మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ తదితరులను ఆంగ్లేయులు నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహ నేరారోపణగావించి, విచారణ తంతు జరిపి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు. అనంతరం మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్‌ను అండమాను జైలుకు తరలించగా ఆయన అక్కడే కన్నుమూసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మెహందీ హసన్** : అప్పటి అవధ్ (Awadh) రాజ్యం లోని సుల్తాన్‌పూర్ (Sultanpur) పట్టణం ఇప్పటి ఉత్తరప్రదేశ్ రాష్ట్రం సుల్తాన్‌పూర్ జిల్లాలోని సుల్తాన్‌పూర్ పట్టణ నివాసి. బ్రిటిష్ పోలీసు విభాగంలో మెహందీ హసన్ (Mehandi Hasan) ఉద్యోగి. స్వదేశీయుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయాధికారుల తీరుతెన్నులను స్వయంగా చూసిన ఆయన ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు బాట పట్టారు. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా బ్రిటిష్ పోలీసు విభాగంలోని

తన సహచరులను ఆంగ్లేయ ప్రభుత్వ ఆదేశాలను ఉల్లంఘించమని, ఆజ్ఞలను ధిక్కరించమని ప్రచారం చేసారు. ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టి పోరుబాట నడవమని ఉద్బోధించారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు మెహందీ హసన్‌ను నిర్బంధించారు.

బ్రిటిష్ పోలీసు విభాగం రహస్యాలను తిరుగుబాటు యోధులకు చేరవేస్తున్నారన్న ప్రధాన ఆరోపణతోపాటుగా పలు ఇతర నేరారోపణలను మెహందీ హసన్ మీద నమోదు చేసారు. ఆంగ్ల న్యాయస్థానంలో ఆయనను నిందితునిగా నిలబెట్టారు. ఆ నేరారోపణల మీద ఆంగ్ల న్యాయస్థానం విచారణ జరిపి మెహందీ హసన్‌కు కఠినకారాగార శిక్షను విధిస్తూ అండమాను శిక్షాక్షేత్రం పంపాల్సిందిగా ఆంగ్లేయాధికారులను ఆదేశించింది. ఆ తీర్పు మేరకు ఆంగ్లేయాధికారులు మెహందీ హసన్‌ను అండమానుకు తరలించారు.

**మొహ్మద్ జాన్** : ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్ నివాసి. తండ్రి హిదాయత్ అలీ. రాయ్‌బరేలికి చెందిన సయ్యద్ అహ్మద్ బరేల్వి తాత్విక భావజాలంతో, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిస్తున్న పోరాటానికి మొహ్మద్ జాన్ (Mohammed Jan) ప్రభావితులయ్యారు. సయ్యద్ అహ్మద్ బరేల్వి స్ఫూర్తితో సాగుతున్న వహాబీ ఉద్యమంలో మొహ్మద్ జాన్ భాగస్వామి అయ్యారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారులు ఆయనను 1858 ఏప్రిల్ 13న నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ గావించి విచారణ జరిపిన ఆంగ్లేయాధికారులు ఆయనకు యావజ్జీవిత కారాగారశిక్ష విధించారు. ఆ తరువాత అండమానుకు పంపారు. చివరకు మొహమ్మద్ జాన్ అండమాను శిక్షాక్షేత్రంలో కన్నుమూసారు.

**మొహమ్మద్ షఫీ హుస్సేని** : ప్రస్తుత హర్యానా రాష్ట్రంలోని అంబాలా పట్టణానికి చెందిన యోధుడు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న మొహమ్మద్ షఫీ హుస్సేని (Mohammad Shafi Hussaini) ఆంగ్లేయ బలగాలకు వ్యతిరేకంగా పోరాడారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయనను నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరం మోపి, యావజ్జీవ కారాగార శిక్షను విధించి అండమానుకు తరలించారు.

**మొహిబుల్లాహ్** : ప్రస్తుత మధ్యప్రదేశ్ రాష్ట్రం ఖర్గోన్ (Khargone) జిల్లా, నిమార్ బేరర్ (Nimar Berar) ప్రాంతం నివాసి. రాష్ట్రంలోని ఖర్గోన్ జిల్లా లోని మండలేశ్వర్ (Mandaleshwar) వద్ద ఆంగ్లేయ సైన్యాలతో స్వదేశీ సైనిక యోధులు సాగించిన సమరంలో మొహిబుల్లాహ్ (Mohibba-ul-Lah) పాల్గొన్నారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ చేసి విచారణ జరిపి యావజ్జీవిత కారాగారశిక్ష విధించారు. ఆ తీర్పు మేరకు ఆయనను అండమానుకు పంపారు, చివరకు మొహిబుల్లాహ్ అండమానులో చివరిశ్వాస విడిచారు.

**నజీర్** : అస్సాం రాష్ట్ర నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పాల్గొన్నారు. ఆంగ్లేయాధికారులు నజీర్ (Nazeer) ను అరెస్టు చేశారు. ఆయన కార్యకలాపాల మీద విచారణ జరిపిన ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించింది. అనంతరం ఆయనను అండమానుకు పంపించారు.

**నవాబ్ అహమ్మద్ మీర్జా** : ఢిల్లీ కేంద్రంగా సాగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నవాబ్ అహమ్మద్ మీర్జా (Nawab Ahmed Mirja) భాగస్వామి. చక్రవర్తి బహుద్దూర్ షాహ్ జఫర్ కు అండదండలుగా నిలచిన ఆయన ఢిల్లీ దర్బారులోని ప్రముఖులు. 1857 నాటి పోరాటంలో పాల్గొన్న తిరుగుబాటు యోధులకు సాధన-సంపత్తి అందించి ప్రోత్సహించారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు అహమ్మద్ మీర్జాను నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ చేశారు. ఆంగ్ల న్యాయస్థానం ఎదుట దోషిగా నిలబెట్టి విచారణ తంతు నిర్వహించారు. అనంతరం ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించగా అండమానుకు తరలించారు.

**నవాబ్ మూసా ఖాన్** : ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామానికి ప్రధాన కార్యక్షేత్రంగా భాసిల్లిన ఢిల్లీ నగరం నివాసి. చక్రవర్తి బహుద్దూర్ షాహ్ జఫర్ ఆస్థానంలో నవాబ్ మూసా ఖాన్ (Nawab Musa Khan) ప్రముఖుడు. 1857 నాటి పోరాటంలో ఆయన తిరుగుబాటు యోధులకు సాధన-సంపత్తి అందించి, ఆహారం-ఆశ్రయం కల్పించి ప్రోత్సహించారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు మూసా ఖాన్‌ను నిర్బంధించి ఆయన మీద రాజద్రోహం నేరారోపణ గావించారు. ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ నిర్వహించి జీవితఖైదు విధించి ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**జనరల్ నవాబ్ మెహమూద్ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బిజినూర్ (Bijnor) జిల్లా నజీబాబాద్ (Najibabad) ప్రాంతపు కులీనులు. ఆయన తండ్రి నవాబు మియాన్ ఖాన్. 1740లో రొహిల్లా యోధుడు నవాబు నజీబుద్దౌలా (Nawab Najib-ud-Daula) పేరున నజీబాబాద్ నగరం ఏర్పడింది. ఆ నవాబు నజీబుద్దౌలా వంశజుడయిన జనరల్ మెహమూద్ ఖాన్ ( General Mehamud Khan) ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడారు.

1857 జూన్ ఐదున నవాబు మెహమూద్ ఖాన్ తన చిన్నపాటి సంస్థానాన్ని స్వతంత్ర సంస్థానంగా ప్రకటించారు. ఆయనకు నజీబాబాద్ ప్రజానీకం, సైన్యం తోడుగా నిలిచాయి. ఆనాటి తిరుగుబాటులో ఆంగ్లేయ సైన్యాలతో పోరాడుతున్న ఇతర ప్రాంతాల యోధులకు ఆయన అన్నివిధాల సహాయసహకారాలు అందించారు. ఆ కారణంగా

ఆగ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు నవాబు మెహమూద్ ఖాన్ సంస్థానం మీద భారీ బలగాలతో దాడి చేసి ఆయనను నిర్బంధించారు. ఆ తరువాత ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్షను విధించి, అండమాను శిక్షాక్షేత్రానికి పంపారు.

**నాసిరా** : మహారాష్ట్రలోని ఖాందేష్ (Khandesh) జిల్లా యావల్ (Yawal) తాలూకా నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆంగ్ల అధికారులు నాసిరా (Nassira) ను అరెస్టు చేయగా ఆంగ్ల న్యాయస్థానం ఉరిశిక్ష విధించింది. 1858 అక్టోబర్ 29న ఆ ఉరిశిక్షను జీవిత ఖైదుగా మార్చారు. నాసిరాను స్వస్థలానికి, స్వజనానికి సుదూరంగా ఉంచాలన్న ఉద్దేశ్యంతో అండమానుకు తరలించారు.

**నియాజ్ మొహమ్మద్ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం రాంపూర్ (Rampur) జిల్లాలోని ప్రఖ్యాత రాంపూర్ పట్టణ నివాసి. ఆంగ్ల పాలకుల కబంధహస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేసేందుకు తిరుగుబాటు శంఖారావం పూరించిన రొహిల్‌ఖండ్ అధినేత ఖాన్ బహదూర్ ఖాన్ సైన్యంలో ఆయన సైన్యాధికారి. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బదౌన్ (Badaun) జిల్లా బాధ్యతలను ఖాన్ బహదూర్ ఖాన్ ఆయనకు అప్పగించారు. 1857 మే 31న రోహిల్‌ఖండ్ రాజధాని బరేలి (Bareilly) కేంద్రంగా ఖాన్ బహదూర్ ఖాన్ స్వతంత్ర బావుటాను ఎగురవేశారు. రొహిల్‌ఖండ్ అధినేత ఖాన్ బహదూర్ ఖాన్ ఆదేశాల మేరకు తన సమరయోధుల దళాలతో కలసి షంషాబాద్ (Shumshabad) వద్ద ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలను నియాజ్ మోహమ్మద్ ఖాన్ వీరోచితంగా ఎదుర్కొన్నారు.

ఆంగ్ల సైన్యాధికారి సర్ హోప్ గ్రాంట్ (Sir Hope Grant) భారీబలగాలతో, ఆధునిక యుద్ధ సామగ్రితో స్వదేశీ యోధుల మీద భయానక దాడులు చేసిన ఫలితంగా స్వదేశీ పోరాట యోధులు కకావికులయ్యారు. ఆంగ్లేయ సైన్యాధికారి సర్ హోప్ గ్రాంట్ అరెస్టుల పర్వం ఆరంభించి వందలాది స్వదేశీ యోధులను నిర్బంధించాడు. ఆ సమయంలో ఆంగ్ల అధికారులకు చిక్కకుండా బదౌన్ నుండి నియాజ్ మొహమ్మద్ ఖాన్ తప్పించుకున్నారు. చివరకు బొంబాయి వద్ద ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు ఆయనను నిర్బంధించారు. బొంబాయి నుండి బదౌన్ (Badaun) ఆయనను తీసుక వచ్చి రాజద్రోహ నేరారోపణ మోపి బదౌన్ న్యాయస్థానంలో విచారణ తంతు జరిపించారు. చివరకు న్యాయస్థానం ఆయనకు ఉరిశిక్ష ప్రకటించగా ఆ ఉరిశిక్షను అలహాబాద్ ఉన్నత న్యాయస్థానం యావజ్జీవిత కారాగార శిక్షగా మార్చింది. ఆ మీదట ఆంగ్లేయాధికారులు నియాజ్ మొహమ్మద్ ఖాన్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. ఆ విధంగా అండమాను చేరిన నియాజ్ మొహమ్మద్ ఖాన్ అండమానులోనే చివరిశ్వాస విడిచారు.

**నుజ్జర్ మొహమ్మద్ :** ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్ ప్రాంతం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్ల సైన్యాలతో వీరోచితంగా పోరాడిన సాహసి. ఈ సంగ్రామంలో ఆంగ్ల సైన్యాలది పైచేయి కావడంతో నుజ్జర్ మొహమ్మద్ (Nuzzr Mohammad) ను నిర్బంధించిన ఆంగ్లేయాధికారులు విచారణ తంతు నిర్వహించి యావజ్జీవ కారాగారవాస శిక్షను ప్రకటించారు. ఆనాడు ఇతర స్వాతంత్ర్య సమరయోధులను పంపినట్టుగా నుజ్జర్ మొహమ్మద్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. అండమానుకు పంపబడిన సహచర స్వాతంత్ర్య సమరయోధుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయాధికారి డాక్టర్ వాకర్ మీద 1859 ఏప్రిల్ ఒకటిన జరిగిన దాడిలో ఆయన కూడా స్వయంగా పాల్గొన్నారు. ఆ ప్రతిఘటన పట్ల ఆగ్రహించిన అధికారులు డాక్టర్ వాకర్ నాయకత్వంలో సమరయోధుల మీద తీవ్ర ప్రతీకార చర్యకు పూనుకున్నారు. అధికారుల పాశవిక చర్యలకు సహచర స్వాతంత్ర్య సమరయోధులతోపాటుగా మొహమ్మద్ నుజ్జర్ కూడా బలయ్యారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మొహమ్మద్ నుజ్జర్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**నూరా :** మధ్యప్రదేశ్ రాష్ట్రం నిమార్ (Nimar) జిల్లాలోని నిమార్ పట్టణం నివాసి. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా మధ్యప్రదేశ్ రాష్ట్రం ఖర్గోన్ (Khargone) జిల్లా మండలేశ్వర్ (Mandaleshwar) వద్ద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో నూరా (Noora) చురుగ్గా పాల్గొన్నారు. చివరకు ఆంగ్ల సైన్యం ఆయనను నిర్బంధించింది. ఆయన మీద రాజద్రోహం నేరాన్ని ఆపాదించి న్యాయస్థానం ఎదుట నిలబెట్టింది. ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతు జరిపి ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్షను ప్రకటించింది. ఆ శిక్ష ప్రకారంగా నూరా ను అండమానుకు తరలించగా అండమాను శిక్షాక్షేత్రంలో నూరా చివరిశ్వాస విడిచారు.

**ఖయీాం ఖాన్ :** మధ్యప్రదేశ్ రాష్ట్రం నిమార్ (Nimar) జిల్లాలోని నిమార్ పట్టణం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా మధ్యప్రదేశ్ రాష్ట్రం ఖర్గోన్ (Khargone) జిల్లా మండలేశ్వర్ (Mandaleshwar) వద్ద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ఖయీాం ఖాన్ (Qaim Khan) చురుగ్గా పాల్గొన్నారు. ఆ పోరులో చివరకు ఆంగ్ల సైన్యానిది పైచేయి అయ్యింది. అనంరతం ఆయనను నిర్బంధించిన అంగ్లేయాధికారులు విచారణ తంతును జరిపించారు. ఆంగ్లేయ న్యాయస్థానం యావజ్జీవిత కారాగార శిక్షను ప్రకటించింది. ఆ శిక్షమేరకు ఖయీాం ఖాన్ ను అండమానుకు తరలించగా అండమాను శిక్షాక్షేత్రంలో కన్నుమూసారు.

**ఖుతుబ్ షాహ్ :** 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన ఖుతుబ్ షాహ్ (Qutub Shah) ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి చెందిన పండితులు. ఆయన తండ్రి పేరు బక్షుల్లా (Baksh Ullah). ఖుతుబ్ షాహ్ బరేలి కళాశాల (Bareilly College) లో అధ్యాపకులు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభం కాగానే ఖుతుబ్ షాహ్ ఉద్యమం మరింత ప్రజ్వరిల్లడానికి తన విద్వత్తును వినియోగించారు. ప్రజలను, స్వదేశీ సైనికులను ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాటన సాగేందుకు ప్రోత్సహిస్తూ ప్రత్యేక సాహిత్యం సృష్టించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజానీకంలో ప్రచారం చేస్తూ ప్రసంగాలు చేయసాగారు.

ఖుతుబ్ షాహ్ సాగిస్తున్న ఆంగ్లేయ ప్రభుత్వ వ్యతిరేక చర్యలను, ఆయన ప్రచార కార్యక్రమాలను పసిగట్టిన ఆంగ్లేయాధికారులు 1857 మే 31న అరెస్టు చేసారు. ఆయనను బరేలి కళాశాల అధ్యాపక ఉద్యోగం నుండి తొలిగించారు. ఆ చర్యలను ఏమాత్రం లెక్కచేయని ఖుతుబ్ షాహ్ రోహిల్ ఖండ్ వెళ్ళారు. రోహిల్ ఖండ్ ప్రాంతంలోని తిరుగుబాటు యోధులు, బరేలి అధినేత ఖాన్ బహదూర్ ఖాన్ ఆస్థానంలో ప్రభుత్వ ప్రచురణల, ప్రచార శాఖాధికారిగా నియమితులయ్యారు. భారతదేశం అంతటా ఉప్పెనలాగా సాగుతున్న స్వాతంత్ర్య సంగ్రామం మరింతగా ప్రజ్వరిల్లడానికి అవసరమగు సమాచార సామగ్రిని, ప్రకటనలు బరేలి రాజ్యాధినేత ఖాన్ బహదూర్ ఖాన్ మార్గదర్శకంలో రూపొందించి ప్రజానీకానికి, పోరాటయోధులకు విస్తృతంగా అందించ సాగారు.

ఖుతుబ్ షాహ్ కొనసాగిస్తున్న ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక చర్యల తీవ్రతను తెలుసుకున్న ఆంగ్లేయాధికారులు ఆయన మీద మండిపడసాగారు. ఈ లోగా ఆంగ్లేయులతో పోరాడుతున్న బరేలి రాజ్యాధినేత ఖాన్ బహదూర్ ఖాన్ పరాజితులు కావడంతో ఆంగ్లేయాధికారి Mr. H. Vansittar (Bareilly Division Special Commissioner) ఖుతుబ్ షాహ్‌ను నిర్బంధించాడు. ఆయన మీద రాజద్రోహ నేరారోపణగావించి Mr. H. Vansittar విచారణ తంతును నిర్వహించారు. చివరకు 1859 మార్చి 26న ఖుతుబ్ షాహ్‌కు ఉరిశిక్ష విధిస్తూ తీర్పు ప్రకటించారు. ఆ తరువాత ఉన్నత న్యాయస్థానం ఆ ఉరిశిక్షను యావజ్జీవిత కారాగార శిక్షగా మార్చింది. ఆ మీదట ఖుతుబ్ షాహ్ అస్తి పాస్తులను జప్తు చేసిన ఆంగ్లేయాధికారులు ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**రాజా మీరా :** కర్నాటక రాష్ట్రం నార్‌గుండ్ (Nargund) పరగణాలోని ధార్వార్ జిల్లా నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచి ఆంగ్లేయ సైన్యాలతో సాగిన

పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించగా రాజా మీరా (Raja Meera) ను ఆంగ్లేయులు అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**రియాజుల్ హఖ్** : బెంగాలు పరగణాకు చెందిన రియాజుల్ హఖ్ (Riaz-ul-Haq) బహుళ ప్రజాదరణ గల ప్రముఖ నాయకులు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన చాలా చురుగ్గా పాల్గొన్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలతో స్వదేశీ యోధులు సాగించిన పోరాటంలో ప్రత్యక్ష భాగస్వామ్యం వహించారు. ఆ కారణంగా కంపెనీ సైన్యం ఆయనను అరెస్టు చేసింది. ఆ తరువాత న్యాయస్థానంలో విచారణ తంతు జరిపి ఆయనకు కారాగారశిక్ష విధించి అండమాను శిక్షాక్షేత్రం పంపించారు. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసాక రియాజుల్ హఖ్ తిరిగి స్వదేశం చేరుకున్నారు.

**రొహిం** : మహారాష్ట్రలోని ఖాందేష్ (Khandesh) జిల్లా యావల్ (Yawal) తాలూకా నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆంగ్లేయాధికారులు రొహిం (Rohim) ను అరెస్టు చేసి రాజద్రోహానికి పాల్పడినట్టుగా ఆయన మీద నేరారోపణ చేశారు. ఆ నేరారోపణను విచారించిన ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు ఉరిశిక్ష విధిస్తూ తీర్పు చెప్పింది. 1858 అక్టోబర్ 29న ఉరిశిక్షను యావజ్జీవిత కారాగారవాస శిక్షగా మార్చారు. స్వస్థలానికి, స్వజనానికి రొహింను దూరంగా ఉంచాలన్న ఉద్దేశ్యంతో ఆంగ్లేయాధికారులు ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఆగ్రా నివాసి. ఆయన తండ్రి సయ్యద్ అమీర్ జమాన్. సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది (Sayyad Akbar Jaman Akbarabadi) అరబిక్, పర్షియన్ భాషల్లో పాండిత్యం సంపాదించి 'మాజిద్' (Majid) అను కలం పేరుతో కవిత్వం రాసారు. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన పాల్గొన్నారు. ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులకు చిక్కకుండా తప్పించుకున్నా కూడా చివరకు ఆయనను ఆంగ్ల సైనికులు నిర్బంధించారు. తిరుగుబాటు యోధులకు సహకరించి వారి వెంట సాగారన్న ఆరోపణల మీద సైనిక విచారణ జరిపి, నేరం నిర్ధారించిన ఆంగ్లేయాధికారులు ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. అండమానులో 20 సంవత్సరాల పాటు గడిపిన తరువాత సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది కారాగారం నుండి విముక్తి పొంది చివరకు స్వస్థలం ఆగ్రా పట్టణం చేరుకున్నారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**సయ్యద్ షబ్బీర్ :** 1857 నాటి అవధ్ రాజ్యం ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అవధ్ (Oudh) ప్రాంతం నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సమరంలో సయ్యద్ షబ్బీర్ (Sayyad Shabbir) చురుగ్గా పాల్గొన్నారు. అవధ్ రాజమాత బేగం హజరత్ మహల్ ఆంగ్లేయులతో సాగించిన వీరోచిత పోరులో ఆయన కూడా భాగస్వామి అయ్యారు. ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి విచారణ జరిపించారు. ఆ తరువాత సయ్యద్ షబ్బీర్ కు కారాగార శిక్ష విధించి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**సర్వర్ షాహ్ :** 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో సర్వర్ షాహ్ (Sarwar Shah) ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఆంగ్లేయ ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతున్న సర్వర్ షాహ్ చర్యల పట్ల ఆగ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు ఆయనను అరెస్టు చేసారు. ఆయన మీద రాజద్రోహ నేరారోపణ గావించారు. ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు నడిపించి ఆయనకు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించారు. ఆ తీర్పు ప్రకారం సర్వర్ షాహ్‌ను అండమానుకు పంపారు.

అండమాను-నికోబార్ దీవులను శిక్షాక్షేత్రంగా (Penal Settlement) మార్చాలని నిర్ణయించుకున్న ఆంగ్ల ప్రభుత్వం, ఆ ఏర్పాట్లు చూడడానికి ఆంగ్లేయాధికారి డాక్టర్ జె.పి. వాకర్ ను Superintendent గా అండమానుకు పంపింది. అండమానుకు పంపబడిన స్వాతంత్ర్య సమరయోధుల పట్ల ఆ ఆంగ్లేయుడు డాక్టర్ వాకర్ అత్యంత క్రూరంగా వ్యవరించ సాగాడు. డాక్టర్ వాకర్ కిరాతక చర్యలను సహించలేక పోయిన సమర యోధులు అతడిని అంతం చేయాలని నిర్ణయించుకుని 1858 ఏప్రిల్ ఒకటవ తేది మధ్యాహ్నం సమయాన మూకుమ్మడిగా దాడి చేసారు. ఆ దాడికి సంబంధించిన వివరాలు డాక్టర్ వాల్కర్‌కు ముందస్తుగా తెలియడంతో సమరయోధుల చేసిన ప్రయత్నం విఫలమయ్యింది. ఆ దాడి నుండి డాక్టర్ వాకర్ సురక్షితంగా బయటపడ్డాడు. ఈ దాడిలో ఇతర స్వాతంత్ర్య సమరయోధుల తోపాటుగా సర్వర్ షాహ్ చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా అధికారులు ఆయనను నిర్బంధించి పలు అమానవీయ శిక్షలకు గురిచేసారు. ఆంగ్లేయాధికారుల క్రూరత్వానికి సమరయోధులు సర్వర్ షాహ్ అండమాను శిక్షాక్షేత్రంలో కన్నుమూసారు.

**సవాత్ దావూద్ :** 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాలకు వ్యతిరేకంగా సవాత్ దావూద్ (Sawat Doud) పోరాడారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్లేయాధికారులు ఆయన మీద రాజద్రోహ నేరారోపణ నమోదు చేసారు. ఆయనను దోషిగా పేర్కొంటూ ఆంగ్ల న్యాయస్థానం ఎదుట నిలబెట్టారు. ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతు జరిపి ఆయనకు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించింది. ఆ తీర్పు మేరకు ఆంగ్లేయాధికారులు సవాత్ దావూద్ ను అండమాను జైలుకు పంపారు.

**సుబేదార్ ఖాదర్ బక్ష్ :** 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామానికి ప్రధాన కార్యక్షేత్రంగా భాసిల్లిన ఢిల్లీ నగర నివాసి. మొగల్ చక్రవర్తి బహుద్దూర్ షాహ్ జఫర్ సైన్యంలో ఖాదర్ బక్ష్ (Khadar Baksh) సుబేదారుగా బాధ్యతలు నిర్వహించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వదేశీ సైనిక యోధులు ప్రథమ స్వాతంత్ర్య సమర శంఖారావాన్ని పూరించగానే ఆయన కూడా స్వాతంత్ర్య సమరంలో భాగస్వామి అయ్యారు. సుబేదార్ ఖాదర్ బక్ష్ స్వదేశీ యోధుల పక్షాన నిలచి ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన ఆంగ్లేయ సైన్యాలతో సాగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఖాదర్ బక్ష్‌ను నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ చేశారు. ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు నిర్వహించారు. ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించగా ఖాదర్ బక్ష్ ను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**షేక్ అమీరుల్లాహ్ :** బెంగాల్ పరగణాకు చెందిన ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలోని ఐదవ అశ్విక దళంలో అమీరుల్లాహ్ (Sheikh Amir-ul-Lah) సిపాయి. ఆ సమయంలో పెల్లుబికిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో షేక్ అమీరుల్లాహ్ స్వయంగా పాల్గొన్నారు. అందుకు ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను నిర్బంధించింది. అనంతరం ఆయన మీద సైనిక న్యాయస్థానంలో విచారణ నిర్వహించగా, సైనిక న్యాయస్థానం ఆయనకు ఉరిశిక్షను ప్రకటించింది. ఆ శిక్షను కాస్తా ఉన్నత న్యాయస్థానం యావజ్జీవ కారాగారవాస శిక్షగా మార్చుతూ తీర్పు చెప్పింది. ఆ తీర్పు ప్రకారంగా షేర్ అమీరుల్లాహ్‌ను అండమానుకు తరలించారు. అండమాను చేరుకున్న షేక్ అమీరుల్లాహ్ అండమాను శిక్షాక్షేత్రంలో కారాగార శిక్షను అనుభవిస్తూ కన్నుమూసారు.

**షేక్ అలీ :** ఆనాటి మైసూరు రాజ్యం రాజధాని, ప్రస్తుత కర్నాటక రాష్ట్రం మాండ్యా జిల్లాలోని చారిత్రక శ్రీరంగపట్నం పట్టణం నివాసి. మైసూరు పులిగా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్ మైసూరు రాజ్యాన్ని శ్రీరంగపట్నాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలన సాగించారు. ఆ ప్రాంతానికి చెందిన షేక్ అలీ (Sheikh Ali) మహారాష్ట్ర రాష్ట్రంలోని సతారా (Satara) జిల్లా సతారా పట్టణంలోని ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక స్థావరానికి చెందిన 22వ స్థానిక పదాతిదళంలో హవల్దార్ (Havldar in 22nd Native Infantry Regiment Stationed at Satara) గా బాధ్యతలు నిర్వహించారు. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో షేక్ అలీ చురుగ్గా పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్లేయ సైన్యాధికారులు ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు యోధులు రూపొందించిన వివిధ పథకాల వివరాలను వెల్లడించే పత్రాలను తమకు అప్పగించవలసిందిగా తీవ్ర ఒత్తిడి తెచ్చారు. దండు రహస్యాలు

వెల్లడించమని, అధికారిక దస్త్రాల రహస్యాలను బయట పెట్టమని ఆయనను భయంకర చిత్రహింసలు గురిచేసినా షేక్ అలీ సహచరుల రహస్యాలను గాని, ప్రాముఖ్యత గల పత్రాల వివరాలను ఏమాత్రం బయట పెట్టలేదు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు షేక్ అలీ రాజద్రోహానికి పాల్పడ్డారని నిర్ణయించి, యావజ్జీవిత కారాగారవాస శిక్షను ప్రకటించి ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**షేక్ మొహమ్మద్ అఫ్జల్** : ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అమ్రోహా (Amroha) జిల్లా అమ్రోహా పట్టణం నివాసి. అప్పట్లో అమ్రోహా ప్రాంతం 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో పోరాటయోధురాలు అవధ్ రాజ్యమాత బేగం హజరత్ మహల్ రాజ్యం అవధ్ (Oudh) లో భాగంగా ఉంది. ఆనాడు ఆంగ్లేయాధికారుల అక్రమ చర్యలకు వ్యతిరేకంగా బేగం హజరత్ మహల్ సాగిస్తున్న పోరాటంలో షేక్ మొహమ్మద్ అఫ్జల్ (Sheik Mohammed Afzal) క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఆంగ్ల సైన్యాలతో సాగిన పోరాటంలో తిరుగుబాటు యోధులు ఆంగ్లేయుల ఆధిపత్యం నుండి అమ్రోహా ను విముక్తం చేసి 1857 మే 19న స్వాధీనం చేసుకున్నారు.

ఆ కారణంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు స్వాతంత్ర్య సమరయోధుల మీద ప్రతీకార చర్యకు పూనుకున్నారు. ఆంగ్లేయాధికారి, మొరదాబాద్ కమీషనర్ ఆఘమేఘాల మీద భారీ బలగాలను సమకూర్చుకుని అమ్రోహ చేరుకున్నాడు. స్వదేశీ సైనికులు, తిరుగుబాటు యోధుల మీద విరుచుకపడ్డాడు. ఆ సందర్భంగా అమ్రోహ ప్రాంతంలో జరిగిన పోరాటానికి షేక్ మొహమ్మద్ అఫ్జల్ నాయకత్వం వహించారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారులు షేక్ మొహమ్మద్ అఫ్జల్ మీద మండిపడుతూ ఆయనను నిర్బంధించారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణ మోపి ఆంగ్ల న్యాయస్థానంలో దోషిగా నిలబెట్టారు. ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతు జరిపి, ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేయమని ఆంగ్లేయాధికారులకు ఆదేశాలు జారీ చేసింది. ఆ తరువాత షేక్ మొహమ్మద్ అఫ్జల్ కు యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధిస్తూ తీర్పు చెప్పింది. ఆ తీర్పు మేరకు ఆయనను అండమానుకు తరలించారు. ఆ విధంగా అండమాను చేరుకున్న షేక్ మొహమ్మద్ అఫ్జల్ చివరకు అండమాను శిక్షాక్షేత్రంలో తనువు చాలించారు.

**షేక్ ఫర్మూద్ అలీ** : ప్రస్తుత అస్సాం రాష్ట్రానికి చెందిన షేక్ ఫర్మూద్ అలీ (Sheik Formud Ali ) 1857 నాటి భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా అస్సాంలో సాగిన ఆంగ్లేయ వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆంగ్ల ప్రభుత్వం ఆయనను నిర్బంధించింది. ఆయన మీద రాజద్రోహ నేరారోపణ గావించి విచారణ తంతును

నిర్వహించింది. అనంతరం ఆయనకు యావజ్జీవిత కారాగారవాసం శిక్ష విధిస్తూ ఆంగ్ల న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తీర్పు ప్రకారంగా ఆంగ్లేయాధికారులు ఆయనను అండమానుకు తరలించారు. ఆ విధంగా అండమానుకు తరలించబడిన షేక్ ఫర్మాద్ అలీ జీవితం అండమాను శిక్షాక్షేత్రంలో ముగిసింది.

**షేక్ మన్నూ** : ప్రస్తుత తమిళనాడు రాష్ట్ర రాజధాని చెన్నెయ్ (Chennai) అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీలోని (Madras Presidency ) మద్రాసు నగరం నివాసి. 1857లో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడమంటూ మద్రాసు ప్రజలకు పిలుపునిస్తూ మద్రాసు పట్టణంలోని నిర్మాణాల గోడల మీద పోస్టర్లు అంటిస్తూ సహచరుడు గులాం గౌస్ తో సహా షేక్ మన్నూ (Sheikh Mannu) అరెస్టయ్యారు. ఆ ఇరువురు మిత్రుల మీద రాజద్రోహ నేరారోపణ తోపాటుగా ప్రజలను ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొడుతున్నారన్న ఆరోపణలను కలగలిపి మద్రాసు సుప్రీంకోర్టులో విచారణ తంతు జరిగింది. ఆ తంతు తరువాత మద్రాసు ఉన్నత న్యాయస్థానం షేక్ మన్నూ, అతని మిత్రుడు గులాం గౌస్ ఇరువురికి యావజ్జీవిత కారాగారవాస శిక్షను ప్రకటించింది. ఈ మేరకు న్యాయస్థానం విధించిన శిక్షను అమలుపర్చేందుకు షేక్ మన్నూను, అతని మిత్రుడు గులాం గౌస్‌ను కూడా ఆంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**సిరాజుద్దీన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రం నిమార్ (Nimar) ప్రాంతం నివాసి. 1857లో ఆంగ్ల సైన్యాలకు వ్యతిరేకంగా మండలేశ్వర్ వద్ద జరిగిన పోరాటంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఆ కారణంగా ఆంగ్లసైన్యాలు ఆయనను అరెస్టు చేయగా ఆంగ్ల న్యాయస్థానం యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు సిరాజుద్దీన్‌ను (Siraj-Uddin) అండమానుకు తరలించారు. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షలను అనుభవిస్తూ సిరాజుద్దీన్ అండమాను శిక్షాక్షేత్రంలో కన్నుమూసారు.

**సుల్తాన్ పరాస్** : ప్రస్తుత కర్నాటక రాష్ట్రం అప్పటి ధార్వార్ (Dharwar) జిల్లా నార్‌గుండ్ (Nargund) నివాసి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నార్‌గుండ్ కోట రక్షకుడు భాస్కర్ రావు భావే (Bhaskar Rao Bhave) పక్షాన నిలచిన సుల్తాన్ పరాస్ (Sultan Paras) ఆంగ్లేయ సైన్యాలతో స్వదేశీ యోధులు సాగించిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఆ తరువాత 1858 జూన్ 22న లెఫ్టినెంట్ కల్నల్ మాల్‌కం ( Lt. Col. Malcolm) నేతృత్వంలో నార్‌గుండ్‌లో ఏర్పడిన న్యాయస్థానం సుల్తాన్ పరాస్ కు యావజ్జీవిత కారాగారవాస శిక్ష విధించింది. ఆ శిక్ష ప్రకారంగా ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**సయ్యద్ అహ్మద్ :** అప్పటి నిజాం సంస్థానంలో భాగమైన ఔరంగాబాద్ లోని సైనిక స్థావరంలోని ప్రథమ అశ్విక దళంలో సయ్యద్ అహ్మద్ (Syed Ahmed) సిపాయి. ఉత్తర హిందూస్థానంలో రగులుకున్న 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో స్వదేశీ సిపాయిలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా రగిల్చిన అగ్ని కీలలకు ఆయన కూడా బాగా ప్రభావితమయ్యారు. నిజాం సంస్థానంలోని స్వదేశీయుల మీద అలవికానంత పెత్తనం, ఆధిపత్యం చలాయిస్తూ అహంకారంతో ప్రవర్తిస్తున్న ఆంగ్లేయులను తరిమికొట్టాలని సయ్యద్ అహ్మద్ భావించారు. ఆ కారణంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికులకు వ్యతిరేకంగా ఆయన కూడా పోరుబాటను ఎన్నుకున్నారు. ఆ పోరాటంలో స్వదేశీ సైనిక యోధులకు ప్రజలను జత చేయదలిచారు.

ఆ లక్ష్యసాధనకు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తీవ్రమైన భాషను ఉపయోగిస్తూ ప్రసంగాలు ఆరంభించారు. ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలను ధిక్కరించమని తన సహచర సిపాయిలను, ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడమని ప్రజలను కోరుతూ, ప్రేరేపిస్తూ ప్రచార కార్యక్రమాన్ని చేపట్టి అందరిని పోరుబాట దిశగా నడవమని ఉద్బోధించసాగారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట పట్టాల్సిందిగా తన సహచరులను కూడగట్టి ప్రోత్సహించసాగారు. ఆయన చర్యల పట్ల ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు సయ్యద్ అహ్మద్ (Syed Ahmed) ను నిర్బంధించారు. ఆయన రాజద్రోహానికి పాల్పడినట్టు ఆరోపిస్తూ ఆంగ్ల న్యాయస్థానం ద్వారా విచారణ జరిపించారు. ఆ విచారణ తరువాత ఆయనకు యావజ్జీవిత ద్వీపాంతరవాస శిక్షను విధిస్తూ న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తీర్పు మేరకు ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. 1858 జనవరి ఆరున సయ్యద్ అహ్మద్ ఆయన సహచరులు మరికొందరు అండమాను లోని పోర్టు బ్లెయర్ చేరుకున్నారు.

**ఉమర్ ఖాన్ :** గుజరాత్ రాష్ట్రం బరోడా ప్రాంతం నివాసి. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఉమర్ ఖాన్ (Uamr Khan) ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయన చర్యల మీద విచారణ తంతును నిర్వహించి ఆయనకు యావజ్జీవిత కారాగారవాస శిక్ష విధించారు. ఆంగ్ల న్యాయస్థానం తీర్పు మేరకు ఉమర్ ఖాన్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

**వజీర్ :** మహారాష్ట్రలోని ఖాందేష్ (Khandesh) జిల్లా, యావల్ (Yawal) తాలూకా నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా యావల్ ప్రాంతంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో వజీర్ (Wazir) చురుగ్గా పాల్గొన్నారు. ఆ

కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేశారు. ఆయన మీద రాజద్రోహం నేరారోపణచేసారు. ఆ నేర విచారణ కోసం ఆంగ్ల న్యాయస్థానం ఎదుట ఆయనను దోషిగా నిలబెట్టారు. ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతును నిర్వహించి వజీర్‌కు ఉరిశిక్ష విధిస్తూ తీర్పు చెప్పింది. క్రింది స్థాయి న్యాయస్థానం ఇచ్చిన ఆ తీర్పును ఉన్నత న్యాయస్థానం మార్పులు చేస్తూ 1858 అక్టోబర్ 29న క్రింది స్థాయి న్యాయస్థానం విధించిన ఉరిశిక్షను కాస్తా యావజ్జీవిత కారాగారవాస శిక్షగా ప్రకటించింది. ఆ తీర్పు ప్రకారంగా స్వస్థలానికి, స్వజనానికి ఆయనను దూరంగా ఉంచాలని నిర్ణయించిన ఆంగ్లేయాధికారులు వజీర్ ను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.



ఈ భాగంలో పొందుపర్చిన సమాచారం ప్రధానంగా

Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who
Dr. Rashida Iqbal,
(Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair Andaman, 2004)

**మరియు**

పలు ఇతర గ్రంథాలు, అధికారిక దస్త్రాల నుండి
సేకరించిన విశేషాలను జతచేసి రూపొందించబడింది.

'పంతొమ్మిదవ శతాబ్దపు భారతదేశ చరిత్రలో ప్రముఖంగా కన్పించే విశిష్టమైన బ్రిటిష్ వ్యతిరేక' ఉద్యమంగా బ్రిటిష్ చరిత్రకారుడు, THE INDIAN MUSALMANS (1871) గ్రంథ రచయిత SIR WILLAIM WILSOM HUNTER (1840-1900) చే పేర్కొనబడిన 'వహాబీ ఉద్యమం' 1821 నుండి ఆరంభమయ్యింది. 'మాతృభూమిని బ్రిటిషర్ల పీడన నుండి విముక్తి చేయడానికి' ఇండియాలో సాగిన వహాబీ ఉద్యమానికి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని రాయబరేలి జిల్లా చెందిన సయ్యద్ అహమ్మద్ బరేల్వి (1786-1831) ఆద్యులు.

1821లో మక్కాకు వెళ్ళిన సయ్యద్ అహమ్మద్ అరేబియాలో శుద్ధ ఇస్లాం ప్రచారకులు అబ్దుల్ వహాబ్ (1703-1792) బోధనలతో ప్రభావితులయ్యారు. 1824 ఏప్రిల్ మాసంలో స్వదేశం చేరుకున్న సయ్యద్ అహమ్మద్ బరేల్వి (Syed Ahmed Barailvi) విస్తృతంగా పర్యటనలు సాగించారు. ఆ పర్యటనలలో ఆయనకు అసంఖ్యాక శిష్యగణం ఏర్పడగా, సామాన్య ప్రజలు ప్రధానంగా గ్రామీణ భారతం ఎదుర్కొంటున్న సమస్యలను ప్రత్యక్షంగా గమనించారు. ఆంగ్ల ప్రభుత్వం మద్దతుతో జమీందారులు, మహాజనులు (వడ్డీ వ్యాపారులు), అధికారులు సాగిస్తున్న దోపిడీ-దాష్టీకాలను ఆయన స్వయంగా చూసారు.

ఆంగ్లేయ పాలకులు నూతనంగా ప్రవేశపెట్టిన శాశ్వత భూశిస్తు విధానం (Permanent Settlement) వలన గ్రామీణ ప్రజానీకం మరింత దుస్థితికి గురయ్యింది. ప్రజానీకం ఎదుర్కొంటున్న సమస్యలకు ఆంగ్లేయ పాలన కారణమన్న నిర్ణయానికి వచ్చిన ఆయన ఆంగ్లేయుల నుండి మాతృభూమిని విముక్తి చేయాడానికి ఆంగ్లేయ పాలకుల మీద సమర శంఖం పూరించారు. సయ్యద్ అహమ్మద్ బరేల్వి ఆరంభించిన ఈ ఉద్యమం అరేబియా తత్వవేత్త అబ్దుల్ వహాబ్ పేరుతో 'వహాబీ ఉద్యమం' గాను, ఉద్యమ యోధులు 'వహాబీలు'గా పేర్గాంచారు. భారత వాయవ్య సరిహద్దు ప్రాంతంలోని సితానా (Sitana) ను స్వతంత్ర

ప్రాంతం (Free State) గా ప్రకటించుకుని అక్కడనుండి ఆంగ్లేయుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక బలగాల మీద 'వహాబీలు' పోరాటాలు నిర్వహించారు.

సయ్యద్ అహమ్మద్ బరేల్వి మార్గదర్శకంలో 1829-30 వరకు ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక బలగాల మీద సాధించిన విజయాలు భారతదేశ వ్యాపితంగా ఉన్న వహాబీ ఉద్యమకారులలో ఎంతో ఆత్మవిశ్వాసం నింపాయి. 1831లో ఆయన నిర్యాణం తరువాత దశాబ్దం పాటు నిస్తేజంగా సాగిన వహాబీ ఉద్యమ నాయకత్వం బీహార్‌కు మారింది. బీహార్ రాష్ట్రంలోని వహాబీలు బెంగాల్ నేతల నుండి స్ఫూర్తిని పొందారు. బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నాలోని సాధిఖ్‌పూర్ కేంద్రంగా మహమ్మద్ విలాయత్ అలీ (1790-1854), మహమ్మద్ ఇనాయత్ అలీ (0-1858) లు ఆంగ్లేయ వ్యతిరేక పోరాట కార్యక్రమాల కొనసాగింపుకు రంగం మీదకు వచ్చారు. ఈ సోదరద్వయం సితానా (Sitana) కేంద్రంగా వహాబీ భావజాలాన్ని మరింత విస్తృతపర్చడం మాత్రమే కాకుండా. వహాబీలను సమరశీల పోరాట యోధులుగా తీర్చిదిద్దారు. ఆంగ్లేయ సైనిక బలగాలను ఎదుర్కొనడానికి అవసరమగు అర్థబలం, అంగబలం, ఆయుధబలం సమకూర్చుతూ ప్రణాళికాబద్ధంగా కార్యక్రమాలను చేబడుతూ, దాడులను విజయవంతంగా నిర్వహిస్తూ ఆంగ్లేయ పాలకులను కలవరపర్చారు.

ఆ క్రమంలో మౌల్వీ విలాయాత్ అలీ నేతృత్వంలో సితానా కేంద్రంగా 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పూర్తి స్థాయిలో పాల్గొనటానికి ఏర్పాట్లు కూడా జరిగాయి (Penal Settlement in Andaman, RC Majumdar, Govt of India Publications, New Delhi, 1975, Page. 65). ఆ కారణంగా ఒక దశలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి వహాబీలు కూడా కారకులని Sir John Kaye లాంటి ఆంగ్లేయ సైన్యాధికారులు భావించే విధంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో వహాబీలు బహుముఖ పాత్రను పోషించారు (The Communal Triangle in India, Ashok Mehata and Achyut Patwardhan, Kitabistan, Allahabad 1942, Page. 96 ).

సమరశీల పోరాటయోధులుగా సుప్రసిద్ధులయిన 'సాధిక్‌పూర్ అలీ సోదరులు' మహమ్మద్ విలాయత్ అలీ (Mohammed Vilayath Ali) 1854లో, మహమ్మద్ ఇనాయత్ అలీ (Mohammed Enayath Ali) 1858లో కన్నుమూసినా వారు అనుసరించిన ఖిలాఫత్ విధానం (Khilafath System), వారు ఏర్పరచిన పటిష్టమయిన పునాదుల మీద నిర్మాణం అయిన 'వహాబీ ఉద్యమం' ఏమాత్రం కూడా బలహీనపడలేదు. ఆ అలీ సోదరుల నిర్మాణ కౌశల్యం, వహాబీయోధుల నిబద్ధత, దృఢసంకల్పం, త్యాగనిరతి కారణంగా పోరాట యోధులకు అర్థిక-అంగ-ఆయుధ సహకారం ఎటువంటి ఆటంకాలు లేకుండా నిరంతరం అత్యంత రహస్యంగా కొనసాగాయి. ఈ నిర్మాణ వ్యవస్థను ఛేదించడానికి ఆంగ్లేయ ప్రభుత్వ

గూఢచారి వ్యవస్థ పడరాని పాట్లు పడింది. ఆంగ్ల ప్రభుత్వానికి సవాళ్ళు విసురుతూ తమ కార్యాకలాపాలను సాగిస్తున్న వహాబీ ఉద్యమ నాయకుల ఆటకట్టించాలని నిర్ణయానికి వచ్చిన ఆంగ్లేయాధికారులు వహాబీ ఉద్యమకారులు, వారి కుటుంబీకులు, సానుభూతిపరుల మీద విరుచుకపడ్డారు. అందుకు అవసరమగు అనుమతులను కూడా ఆంగ్ల ప్రభుత్వం నుండి పొంది దాడులు, నిర్బంధాలు, అరెస్టులు, క్రూరశిక్షలను ఉధృతం చేశారు. 1863 నుండి ఆంగ్ల ప్రభుత్వం వహాబీ నాయకుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరించడం ఆరంభించింది. ఈ క్రమంలో పలు కుట్రకేసుల నమోదు, విచారణలు, విభ్రాంతికర సంఘటనలు చోటు చేసుకున్నాయి. అంబాలా విచారణ, పాట్నా విచారణ, మాల్డా విచారణ, రాజ్ మహాల్ విచారణ లాంటి ప్రధాన విచారణలు సాగాయి. ఈ విచారణలలో Crimes Against Queen ప్రధాన ఆరోపణగా ఆంగ్ల ప్రభుత్వం పేర్కొంది. ఆంగ్ల న్యాయస్థానం అత్యధికులకు ఉరిశిక్షలు, ద్వీపాంతర కారాగార శిక్షలు విధించింది. ఆంగ్ల ప్రభుత్వం చర్యలు, ఆంగ్లేయ న్యాయస్థానం తీర్పుల పట్ల ఆగ్రహించిన మహమ్మద్ అబ్దుల్లా 1871 సెప్టెంబర్ 20న కలకత్తా ఉన్నత న్యాయస్థానం ప్రధాన న్యాయమూర్తి John Paxton Norman ను న్యాయస్థాన ప్రాంగణంలో ఖతం చేశారు. అండమాను సందర్శనకు వచ్చిన Viceroy and Governor-General of India Lord Mayo ను మహ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రిది 1872 ఫిబ్రవరి 8న అండమాను దీవుల్లో అంతం చేసి సంచలనాలకు కారణమయ్యారు. ఆ విధంగా ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షల పర్యవసానంగా వహాబీ ఉద్యమానికి చెందిన ప్రధాన నాయకులు, కార్యకర్తలు పెద్ద సంఖ్యలో అండమానుకు తరలించబడ్డారు.

**అబ్దుల్ గఫ్ఫార్** : ప్రస్తుత హర్యానా (Haryana) రాష్ట్రంలోని కురుక్షేత్ర (Kurukshetra) జిల్లాలోని చారిత్రక పట్టణం ధానేశర్ లేక ధానేశ్వర్ (Thanesar/ Thaneswar) నివాసి. అబ్దుల్ గఫ్ఫార్ (Abdul Gaffar) తండ్రి పేరు షాహ్ అలీ ఖాన్. అబ్దుల్ గఫ్ఫార్ 1836లో జన్మించారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, ప్రఖ్యాత రచయిత మౌల్వీ మహమ్మద్ జాఫర్ ధానేసరి శిష్యులలో ఈయనొకరు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాలను కేంద్రంగా చేసుకుని వహాబీలు సాగిస్తున్న పోరాటాలకు అండదండలు అందిస్తున్న మౌల్వీ మహమ్మద్ జాఫర్ ధానేసరి శిష్యుడిగా అబ్దుల్ గఫ్ఫార్ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాటన సాగారు. ఆ కారణంగా 1863లో ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసారు. ఆ తరువాత ఆయన మీద పలు నేరారోపణలు నమోదు చేసి, విచారణ తంతు జరిపిన ఆంగ్ల న్యాయస్థానం తొలుత ఆయనకు ఉరిశిక్షను విధించింది. ఆ తరువాత అంబాలా ఉన్నత న్యాయస్థానం ఆ ఉరిశిక్షను యావజ్జీవిత

కారాగారవాస శిక్షగా మార్చింది. ఆ తీర్పు మేరకు 1866లో ఆయనను అండమాను శిక్షాక్షేత్రం పంపారు. అండమానులో 18 ఏండ్లు దుర్భరమైన జీవితాన్ని గడిపిన అబ్దుల్ గఫ్ఫార్ 1883 మార్చి మూడున అండమాను నుండి విముక్తమయ్యారు.

**అబ్దుల్ గఫూర్ :** బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నా నివాసి. అబ్దుల్ గఫూర్ (Abdul Gafoor) తండ్రిపేరు మంగూ (Mangoo). 1838లో గఫూర్ జన్మించారు. ప్రముఖ రచయిత మౌల్వీ మహమ్మద్ జాఫర్ థానేసరి సహాయకులు (మున్షీ) గా బాధ్యతలు నిర్వహించారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాలను కేంద్రంగా వహాబీలు సాగిస్తున్న పోరాటాలకు అండదండలు అందిస్తున్న మౌల్వీ మహమ్మద్ జాఫర్ థానేసరికి చేయూత అందిస్తున్న అబ్దుల్ గఫూర్ ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో చురుగ్గా భాగస్వాములు అయ్యారు. ఆ కారణంగా ఆంగ్ల ప్రభుత్వం అరెస్టు చేసి, యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. అనంతరం అబ్దుల్ గఫూర్‌ను అండమానుకు తరలించింది.

**అబ్దుల్ కరీం :** ప్రస్తుత హర్యానా రాష్ట్రం అంబాలా జిల్లాలోని ప్రధాన పట్టణం అంబాలా నివాసి. ఆయన తండ్రి గుల్ మొహమ్మద్. 1829లో అబ్దుల్ కరీం (Abdul Karim) జన్మించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా భారత వాయవ్య సరిహద్దు ప్రాంతాల నుండి వహాబీలు సాగిస్తున్న పోరాటాలకు అండదండలు అందిస్తున్న మౌల్వీ మహమ్మద్ జాఫర్ థానేసరికి మార్గదర్శకంలో అబ్దుల్ కరీం పని చేశారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో భాగస్వామి అయినటువంటి ముహమ్మద్ షఫీకి అబ్దుల్ కరీం ఆంతరంగిక కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. ఆ క్రమంలో ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా 1864 మే 2న ఆంగ్ల ప్రభుత్వం అబ్దుల్ కరీంను అరెస్టు చేసింది. అనంతరం ప్రస్తుత బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నాలో గల ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు నిర్వహించి ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు అబ్దుల్ కరీంను అండమానుకు తరలించారు.

**అబ్దుల్ రహీం అజిమాబాది :** బీహార్ రాష్ట్రం పాట్నా నివాసి. చరిత్ర ప్రసిద్ధి పొందిన పాట్నాకు గల పూర్వ నామం 'అజిమాబాద్'. ఆ పేరుతో తనను తాను అబ్దుల్ రహీం అజిమాబాది (Abdul Rahim Azimabadi) అని ప్రకటించుకున్నారు. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నందుకు అబ్దుల్ రహీం అజిమాబాదిని ఆంగ్లేయాధికారి సార్జెంట్ పార్‌సన్ (Sgt.Parson) వెంబడించి నిర్బంధించాడు. 1864 మే రెండున పాట్నా న్యాయస్థానం అబ్దుల్ రహీంకు యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించిన తరువాత

1867 డిసెంబర్ 25న ఆయన అండమానుకు తరలించబడ్డారు. పందొమ్మిది ఏండ్ల తరువాత 1883 మార్చి మూడున అండమాను జైలు జీవితం నుండి అబ్దుల్ రహీం కు విముక్తి లభించింది. స్వగ్రామం చేరుకున్న అబ్దుల్ రహీం అజిమాబాది 1931 అగస్టు 24న స్వగ్రామంలో కన్నుమూసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అబ్దుల్ రహీం అజీమాబాది వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మౌల్వీ అహ్మదుల్లాహ్ :** బీహార్ రాష్ట్రం రాజధాని పాట్నా (Patna) జిల్లా మానేర్ (Maner) తహసిల్ లోని సాధిక్‌పూర్ (Sadiqpur) గ్రామనివాసి. 1801లో ఆయన జన్మించారు. తండ్రి పేరు ఇలాహీ బక్ష్ (Illahi Baksh). 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం సమయంలో మూడు మాసాల పాటు నిర్బంధంలో ఉన్నారు. ఆ తరువాతి కాలంలో మౌల్వీ అహ్మదుల్లాహ్ నిబద్దత, క్రమశిక్షణ, కార్యదక్షత వలన వహాబీ ఉద్యమంలో ప్రముఖ నాయకునిగా ఎదిగారు. 1864 నవంబరు ఐదున అహ్మదుల్లాహ్‌ను, ఆయన అనుచర గణాన్ని ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. అహ్మదుల్లాహ్‌కు ఉరిశిక్ష విధించి, ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేయాల్సిందిగా 1865 ఫిబ్రవరి 27న ఆంగ్ల న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తీర్పును ఉన్నత న్యాయస్థానం యావజ్జీవిత ద్వీపాంతరవాస శిక్షగా మార్చింది. 1865 జూన్ 15న అహమ్మదుల్లాహ్‌ను అండమానుకు తరలించగా 1881 నవంబరు 21 రాత్రి 80 ఏండ్ల వయస్సులో అహ్మదుల్లాహ్ చివరిశ్వాస విడిచారు. మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి మార్గదర్శకంలో మౌలానా అహ్మదుల్లాహ్ పార్థివ శరీరాన్ని వైపర్ ల్యాండ్ ఉత్తర భాగాన గల డుండాస్ పాయింట్ (Dundas Point) వద్ద 1881 నవంబరు 22న ఖననం చేసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మౌలానా అహ్మదుల్లాహ్ వివరాలు మరిన్ని ఉన్నాయి)**

**అమీర్ ఖాన్ :** బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నా నగరంలోని ఆలంగంజ్ (Alam gunj) నివాసి. 1793లో ఆయన జన్మించారు. కలకత్తాలో తోళ్ళ వ్యాపారవేత్తగా ఖ్యాతి గడించిన ఆయన బంగారు, వెండి నాణాల మార్పిడి వ్యవహారాలను కూడా నిర్వహిస్తూ బ్యాంకర్‌గా సుప్రసిద్ధులయ్యారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగుతున్న వహాబీ యోధుల ఉద్యమానికి ఆయన తొలి నుండి తోడుగా నిలిచారు. ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుల వద్ద ఆంగ్లేయ సైన్యాలతో తలపడుతున్న వహాబీ యోధులకు అంగబలం, ఆయుధ బలం, ఆర్థిక బలం అందించడానికి వహాబీ ఉద్యమనేతలు చేపట్టిన కార్యకలాపాలకు అమీర్ ఖాన్ సహాయ సహకారాలు అందించారు. ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దులలోని సితానా (Sitana) కార్యక్షేత్రంగా

వహాబీలు నిర్వహిస్తున్న కార్యకలాపాలకు ఆర్థిక సహకారం అందించేందుకు వెండి మొహరీలను (Silver Mohurs), బంగారు మొహిరీలు (Gold Mohurs) గా మార్చి పాట్నా ద్వారా సితానాకు ఆంగ్లేయ గూఢచారులు పసికట్టలేని విధంగా పంపించసాగారు. ఆ విషయాన్ని అనుమానించిన ఆంగ్లేయాధికారులు 1869 జూలై 19న ఎటువంటి వారెంట్ లేకుండా కలకత్తాలోని ఆయన గృహం మీద ఆకస్మిక దాడి జరిపారు. కలకత్తా డిప్యూటి కమీషనర్ కెప్టన్ బిర్చ్ (Captain Birch) జరిపిన దాడులలో అమీర్ ఖాన్‌ను, ఆయన అనుచరులను అరెస్టు చేశాడు. ఆయన ఇంట్లో వహాబీ ఉద్యమకారుల కోసం నిధులు సేకరిస్తున్న 'హుండి' లభించింది. ఆమీర్ ఖాన్‌ను బీహార్ రాష్ట్రం గయా (Gaya) తీసుకెళ్ళారు. గయా కారాగారంలో 1869 ఆగస్టు 26 వరకు నిర్బంధంలో ఉంచి,ఆ తరువాత అలీపూర్ జైలుకు తరలించారు. ఆయన మీద పలు నేరారోపణలు నమోదు చేసి న్యాయస్థానంలో విచారణ తంతును నిర్వహించిన ఆంగ్లేయాధికారులు, ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్ష విధించారు. ఆ శిక్ష మేరకు 1872లో అండమాను శిక్షాక్షేత్రానికి అమీర్ ఖాన్‌ను తరలించారు. 1878లో అమీర్ ఖాన్ అండమాను నుండి విముక్తి పొంది స్వగ్రామం చేరుకున్నారు.

**అమీరుద్దీన్** : ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం లక్నో డివిజన్‌లోని రాయ్‌బరేలి (Rae Bareilly) పట్టణ నివాసి. రాయ్‌బరేలికి చెందిన సయ్యద్ అహ్మద్ బరేల్వి తాత్విక భావజాలంతో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఆయన సాగిస్తున్న పోరాట స్ఫూర్తికి అమీరుద్దీన్ ప్రభావితులయ్యారు. సయ్యద్ అహ్మద్ బరేల్వి మార్గదర్శకంలో సాగుతున్న వహాబీ ఉద్యమంలో అమీరుద్దీన్ చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్లేయ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి రాజద్రోహం నేరారోపణ నమోదు చేసింది. ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు నిర్వహించి ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. న్యాయస్థానం ఆదేశాల మేరకు అమీరుద్దీన్‌ను ఆంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రం తరలించగా, అమీరుద్దీన్ అండమానులో చివరిశ్వాస విడిచారు.

**అమీరుద్దీన్ మౌల్వీ** : బెంగాల్ రాష్ట్రం మాల్దా జిల్లా మాల్దా (Malda) నివాసి. వృత్తిరీత్యా అమీరుద్దీన్ ఉపాధ్యాయులు, ప్రవృత్తిరీత్యా ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక వహాబీ ఉద్యమకారులు. మాల్దాలో జరిగిన హింసాకాండలో మౌల్వీ అమీరుద్దీన్ ప్రమేయం ఉందని నేరారోపణ గావించిన ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసారు. 1872 ఆరంభం నాటి మాల్దా కుట్ర కేసు (Malda Conspiracy Case of 1872) లో ఆయనను నిందితుడిగా ప్రకటించారు. ఆ కుట్రకేసులో ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్ష విధించగా 1872

మార్చిలో ఆంగ్లేయాధికారులు మౌల్వీ అమీరుద్దీన్‌ను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. అండమానులో నేరస్థుల పట్ల కఠినంగా వ్యవహరించాలంటూ సవరించిన చట్టం (Amended Convict Law) అమలులో ఉన్నందున ఆయన చాలాకాలం జైలు అధికారుల క్రూరచర్యలను, భయంకర శారీరక కష్టాన్ని భరించాల్సి వచ్చింది. ఆ తరువాత వృత్తిరీత్యా ఉపాధ్యాయుడైన అమీరుద్దీన్‌లోని విద్వత్తును గ్రహించిన అధికారులు ఆయనను ఉపాధ్యాయునిగా నియమించారు. అండమానులో పది సంవత్సరాలు జైలు జీవితం అనుభవించాక 1883 జనవరి 22న లార్డ్ రిప్పన్ జారీచేసిన ఉత్తర్వుల మూలంగా అమీరుద్దీన్ అండమాను జైలు నుండి విముక్తమయ్యి. 1883 మార్చి మూడున స్వగ్రామం చేరుకున్నారు.

**హాజి దీన్ మొహమ్మద్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అవధ్ (Awadh) రాజ్యంలోని బరేలి (Bareilly) ప్రాంతం నివాసి. ఆంగ్లేయులతో పోరాడుతున్న వహాబీ యోధులతో కలసి హాజి దీన్ మొహమ్మద్ (Haji Din Mohammad) వహాబీ ఉద్యమంలో భాగస్వాములు అయ్యారు. ఆ కారణంగా అధికారులు ఆయనను అరెస్టు చేసి రాజద్రోహం నేరారోపణ క్రింద ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ జరిపి యావజ్జీవిత కారగారశిక్ష విధించి, అండమానుకు తరలించారు. అండమానులో హాజీ దీన్ మొహమ్మద్ కన్నుమూసారు.

**హస్మత్‌దాద్ ఖాన్ :** బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నా నగరంలోని ఆలంగంజ్ (Alamgunj) నివాసి. 1803లో ఆయన జన్మించారు. ఆయన తోళ్ళ వ్యాపారి. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న వహాబీ యోధులకు నిధులను సమకూర్చుతున్నారన్న నేరారోపణ మీద హస్మత్‌దాద్ ఖాన్ (Hasmatdad Khan) ను 1869లో ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ఆయనను సుదీర్ఘకాలం వివిధ జైళ్లల్లో ఉంచుతూ వహాబీ ఉద్యమకారుల రహస్యాలను రాబట్టేందుకు అధికారులు విఫల ప్రయత్నాలు చేశారు. చివరకు ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేస్తూ హస్మత్‌దాద్ ఖాన్‌ను కారాగార శిక్ష విధిస్తూ 1871 జూలై నాల్గున న్యాయస్థానం తీర్పు ప్రకటించింది. 1872లో ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. అండమానులో ఎనిమిది ఏండ్ల పాటు కారాగార శిక్షను అనుభవించిన హస్మత్‌దాద్ ఖాన్ 1879లో విముక్తి పొంది స్వగ్రామం చేరుకున్నారు.

**మియా మసూద్ ఖాన్ / మియా మసూద్ గుల్ :** అప్పటి బెంగాల్, ప్రస్తుత బంగ్లాదేశ్ (Bangladesh) లోని బోగ్రా (Bogra) జిల్లాలోని రాజాషాహి (Rajashahi) డివిజన్‌కు చెందిన పారిశ్రామిక పట్టణం బోగ్రా నివాసి. ఆంగ్లేయుల ఆధిపత్యం నుండి మాతృభూమి విముక్తి ఆశిస్తూ ఆంగ్లేయులతో పోరాడుతున్న వహాబీల ఉద్యమంలో ఆయన

భాగస్వామి. ఉద్యమకారులకు సహాయ సహకారాలు అందిస్తున్నందున ఆంగ్లేయాధికారులు ఆయనను నిర్బంధించారు. పలు నేరారోపణలు గావించి విచారణ తంతును జరిపిన ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు ద్వీపాంతరవాస శిక్షను విధించింది. ఆ శిక్ష మేరకు మసూద్ గుల్/ ఖాన్ ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

ఆ తరువాత భారత ప్రధాన భూభాగం నుండి అండమాను వచ్చిన యస్.యస్ మహారాణి (SS Maharani) ఓడ 1883 జనవరి 22తేది గల ఆంగ్ల ప్రభుత్వ ఉత్తర్వులను తెచ్చింది. వహాబీ ఉద్యమంలో పాల్గొని అరెస్టయ్యి అండమాను పంపబడిన వహాబీ ఉద్యమకారులను విడుదల చేయాలన్నది ఆ ఉత్తర్వు సారాంశం. ఆ ఉత్తర్వుల ప్రకారంగా 1883 ఏప్రిల్ 18న అండమానులోని ఇతర ఉద్యమకారులతోపాటుగా మసూద్ గుల్/ ఖాన్ కూడా విముక్తమయ్యారు. ఆ ఉత్తర్వులలో పేర్కొన్న ప్రకారంగా విడుదల చేయబడిన వారందరిని ఆంగ్లేయాధికారులు భారత ప్రధాన భూభాగానికి తరలించగా మియా మసూద్ గుల్ / మసూద్ ఖాన్ 1883 ఏప్రిల్ మాసంలో స్వగ్రామం చేరుకున్నారు.

**మొహమ్మద్ హుసైని :** ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం లక్నో డివిజన్‌లోని రాయ్‌బరేలి (Rae Bareilly) పట్టణం కార్యక్షేత్రంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో మొహమ్మద్ హుస్సేని పాల్గొన్నారు. ఆయన తన ప్రసంగాలతో జనసందోహాలను ఆంగ్లేయులకు వ్యతిరేకంగా కార్యోన్ముఖులను చేయసాగారు. ఆ ప్రసంగాలకు ప్రభావితులైన పలువురు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా మాట్లాడం, కార్యాక్రమాలలో పాల్గొనడం గమనించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయన చర్యల పట్ల ఆగ్రహించింది. మంచి వక్త అయినటువంటి మొహమ్మద్ హుస్సేనిని ఆంగ్లేయ అధికారులు నిర్బంధించి రాజద్రోహ నేరారోపణ చేశారు. ఆయన మీద న్యాయస్థానంలో విచారణ తంతు జరిపి యావజ్జీవకారాగార శిక్ష విధించారు. ఆ ప్రకారంగా అండమానుకు తరలించబడిన మొహమ్మద్ హుస్సేని అక్కడే కన్నుమూసారు.

**మొహమ్మద్ షఫీ హుసైని :** బ్రిటిష్ రాణికి వ్యతిరేకంగా రాజద్రోహానికి పాల్పడ్డారన్న నేరారోపణ మీద ఆంగ్లేయాధికారులు మొహమ్మద్ షఫీ హుసైనిని నిర్బంధించారు. విచారణ తంతు జరిపి యావజ్జీవిత కారాగార శిక్షను విధించి అండమానుకు తరలించారు.

**మొహమ్మద్ షఫీ లాహోరి :** ప్రస్తుత హర్యానా రాష్ట్రం అంబాలా జిల్లాలోని అంబాలా పట్టణంలో 1814లో జన్మించారు. ఆయన తండ్రి మొహమ్మద్ తఖి. మొహమ్మద్ షఫీ లాహోరి సంపన్న వ్యాపారస్థుడు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న వహాబీలకు ఆయన అండదండలు అందించారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా పలు కార్యకలాపాలలో

పాల్గొన్నారు. ఆ కారణంగా ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి రాజద్రోహానికి పాల్పడినట్టు ఆరోపించి ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ తంతు నిర్వహించారు. ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారగార శిక్షను విధించింది. చివరకు మొహ్మద్ షఫి లాహోరిని ఆంగ్లేయాధికారులు అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

**ఇబ్రహిం మండల్ :** ప్రస్తుత బెంగాల్ రాష్ట్రంలోని ఉత్తర దినాపూర్ (Dinapur) జిల్లా ఇస్లాంపూర్‌లో ఇబ్రహీం మండల్ (Ibrhim Mandal) జన్మించారు. స్వాభావికంగా నీతి, నిజాయితి, నిబద్ధత గల మంచి వ్యక్తిగా ఆయన ప్రఖ్యాతుడు. ధార్మికపరాయణుడుగా రాజమహల్ ప్రాంతపు ప్రజలకు సుపరిచితుడు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా వహాబీలు సాగిస్తున్న ఉద్యమంలో ఆయన భాగస్వామి అయ్యారు. వహాబీ ఉద్యమం వ్యాప్తికి మాల్దా, రాజాషాహి, బోగ్రా, రంగ్‌పూర్, దినాజ్‌పూర్ తదితర ప్రాంతాలలో ఉద్యమ శాఖలను ఆయన ఏర్పాటు చేసారు. 1870లో అధికారులు ఆయనను నిర్బంధించి 'రాజ మహల్ కుట్ర కేసు'లో నిందితుడిగా పేర్కొన్నారు. విచారణ తంతు నిర్వహించిన ఆంగ్ల న్యాయస్థానం ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేయమని ఆదేశించి, ఆయనకు యావజ్జీవిత కారాగార శిక్ష విధించింది. ఆ తీర్పు మేరకు ఇబ్రహిం మండల్‌ను 1870 అక్టోబర్‌లో అండమానుకు తరలించారు.

**మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రిది :** ప్రస్తుత పాకిస్థాన్‌లోని పంజాబ్ రాష్ట్రం పెషావర్‌లో 1842లో జన్మించారు. 1863లో ప్రస్తుత హర్యానా రాష్ట్రం అంబాలా పట్టణంలో స్థిరపడ్డారు. వహాబీ ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. గ్రామంలో జరిగిన ఘర్షణలో పాల్గొన్న కారణంగా 1868 ఏప్రియల్ 2న న్యాయస్థానం ఉరిశిక్ష ప్రకటించింది. ఆయన మంచి ప్రవర్తన వలన ఆ ఉరిశిక్షను ద్వీపాంతరవాస శిక్షగా మార్చి, 1869లో అండమాను జైలుకు పంపారు. 1872 ఫిబ్రవరి 8న అండమాన్ జైలుకు వచ్చిన బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ మేయో మీద ఆయన ఆకస్మిక దాడి చేసి అంతం చేసి సంచలనం సృష్టించారు. చివరకు పోర్టు బ్లేయర్ న్యాయస్థానం షేర్ అలీకి మరణదండన విధించగా 1872 మార్చి 11న ఉరిశిక్ష అమలయ్యింది. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' లో మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రిది వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**తబారక్ అలీ మౌల్వీ :** ప్రస్తుత బంగ్లాదేశ్ లోని పబ్నా (Pabna) జిల్లాలోని పబ్నా పట్టణం (అప్పట్లో బెంగాల్ పరగణాలోనిది) నివాసి, వహాబీ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. బీహార్ రాష్ట్రం పాట్నాలో ఆంగ్లేయాధికారులు అరెస్టు చేసి రాజద్రోహం నేరం మోపి న్యాయస్థానంలో హజరు పర్చారు. విచారణ తంతును జరిపిన ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు

యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. ఆ తీర్పు మేరకు ఆంగ్లేయాధికారులు 1872 మార్చిన ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. అండమానులో స్టేషన్ ముహర్రర్ (Station Muharraar) గా బాధ్యతలు నిర్వహించిన తబారక్ అలీ (Tabarak Ali) 1883లో అండమాను నుండి విముక్తి పొంది సొంత పట్టణానికి చేరుకున్నారు.

**ముహమ్మద్ జాఫర్ అలీ థానేసరి :** ప్రస్తుత హర్యానా (Haryana) రాష్ట్రం లోని కురుక్షేత్ర (Kurukshetra) జిల్లాలోని చారిత్రక పట్టణం థానేశర్ లేక థానేశ్వర్ (Thanesar/ Thaneswar) నివాసి. 1838లో ముహమ్మద్ జాఫర్ అలీ థానేసరి (Muhammed Jafar Ali Thanesari) జన్మించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన పాల్గొన్నారు. భారత పశ్చిమ సరిహద్దు ప్రాంత్రాల నుండి ఆంగ్లేయ పాలకుల మీద పోరాటం సాగిస్తున్న వహాబీ పోరాటయోధులకు అంగబలం-అర్థబలం-ఆయుధబలం అందించిన ఆయనను 1863 చివరిలో అలీఘర్‌లో అరెస్టుచేశారు. 1864 మే రెండు/మూడున ఆంగ్ల న్యాయస్థానం ఆయనకు కారాగారవాస శిక్ష ప్రకటించి అండమానుకు తరలింమని ఆదేశించింది. పద్దెనిమిది ఏండ్ల శిక్షాకాలం తరువాత 1883 నవంబరు తొమ్మిదిన అండమాను శిక్షాక్షేత్రం నుండి విముక్తి పొందిన జాఫర్ అలీ థానేసరి నవంబరు 13న కలకత్తా చేరుకున్నారు. ఆ తరువాత నవంబరు 21న స్వస్థలం అంబాలాకు చేరుకున్న ముహమ్మద్ జాఫర్ థానేసరి 1905లో కన్నుమూశారు. **ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు' లో ముహమ్మద్ జాఫర్ థానేసరి వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మౌల్వీ యహ్యా అలీ :** ప్రస్తుత బీహార్ రాష్ట్రం పాట్నా కేంద్రంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఉధృతంగా సాగిన వహాబీ ఉద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన యహ్యా అలీ (Yahya Ali) బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నా (Patna) జిల్లా మానేర్ (Maner) తహసిల్ లోని సాధిక్‌పూర్ (Sadiqpur) గ్రామంలో 1822లో జన్మించారు. ఆయన తండ్రి సయ్యద్ ఇలాహి బక్ష్. ఆయన సోదరులు అహ్మదుల్లా (1801-1881) వహాబీ ఉద్యమ నాయకుడు. ఆయనను అరెస్టు చేసి 'అంబాలా కుట్ర కేసు'ను బనాయించారు. ఆ కేసులో యావజ్జీవిత కారాగారశిక్షను విధిస్తూ న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తీర్పు ప్రకారంగా మౌల్వీ యహ్యా అలీని 1866 జనవరి 11న అండమానుకు తరలింగా, 1868 ఫిబ్రవరి 20న ఆయన కన్నుమూసారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మౌల్వీ యహ్యా అలీ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**



ఈ భాగంలో పొందుపర్చిన సమాచారం ప్రధానంగా

Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who

Dr. Rashida Iqbal,

(Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, Andaman, 2004)

and

An Account of Revolutionaries Detained in Cellular Jail.

Mr. Anup Das Guptha, Kolkata

(Ex-Andaman Political Prisoners Fraternity Circle, Port Blair, Andaman)

మరియు

పలు ఇతర గ్రంథాలు, అధికారిక దస్త్రాల నుండి

సేకరించిన విశేషాలను జతచేసి రూపొందించబడింది

'ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రజలలో కలుగజేసిన స్వేచ్ఛా-స్వాతంత్ర్య కాంక్షను మరింత బలోపేతం చేస్తూ భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ఉద్యమాలు సాగినప్పటికి అవి కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితమయ్యాయి. 1885లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన జరిగాక ఆంగ్లేయ పాలకుల ఊహలకు భిన్నంగా భారతీయులలో మత-కుల-ప్రాంతాలకు అతీతంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలలో జాతీయ భావనలు ఏకోన్ముఖంగా పొడచూపసాగాయి. స్వదేశం, స్వపరిపాలన, స్వదేశీపాలకులు అనే ఆలోచనలు ప్రజలలో పొటమరించ సాగాయి. ఆ ఆలోచనల పర్యవసానంగా మహారాష్ట్ర, మణిపూర్, బర్మా తదితర ప్రాంతాలలో ప్రజానీకం ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట సాగారు.

ఆ ప్రతికూల వాతావరణాన్ని మొగ్గలోనే తుంచివేయాలన్న ఆలోచనతో భారత వైస్రాయి లార్డ్ కర్జన్ తమ 'విభజించు-పాలించు' సూత్రానికి అనుగుణంగా 1905లో బెంగాల్ ప్రెసిడెన్సీని తూర్పుబెంగాలు-పశ్చిమబెంగాలు అని విభజించాడు. ఆ విభజనతో భారతీయులు ప్రధానంగా బెంగాలు ప్రజలు మండిపడ్డారు. బెంగాలు విభజన వ్యతిరేక ఉద్యమం రగులుకుంది. అ ఉద్యమంలో భాగంగా కలకత్తాలో 1905 ఆగస్టు ఏడున స్వదేశీ ఉద్యమం మొగ్గతొడిగింది. స్వదేశీ ఉద్యమ భావజాలం నుండి స్వరాజ్యం, స్వపరిపాలనల సాధనకు బెంగాలు, పంజాబు, మహారాష్ట్ర ప్రాంతాలలో విప్లవోద్యమాలు అంకురించాయి.

ప్రజా వ్యతిరేక చట్టాల ద్వారా ప్రజలను పీడనకు గురిచేస్తూ, ఉద్యమకారుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయ వలసపాలకుల నుండి మాతృభూమికి విముక్తి కలిగించడం భారత జాతీయ కాంగ్రెస్ శాంతియుత సమాలోచనల ద్వారా అసాధ్యమని భావించిన సమరయోధులు సాయుధ పోరాట బాటను ఎన్నుకున్నారు. ఆ విధంగా విప్లవోద్యమాల భావజాలం విస్తృతి పొందినందున ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమి విముక్తి ప్రధాన లక్ష్యంగా పంజాబు, మహారాష్ట్ర, బెంగాలు తదితర ప్రాంతాలలో పలు

విప్లవ సంఘాలు / సంస్థలు పురుడుపోసుకున్నాయి. ఆ క్రమంలో అనుశీలన సమితి, జుగాంతర్, అభినవ భారతి, మిత్రమేళ, అభినవ భారత సమాజ్, ఆత్మోన్నత సమితి, భారత మాతా సొసైటీ, Dawn Society, Society for the Removal of Obstacles లాంటి పలు విప్లవోద్యమ సంస్థలు / సంఘాలు పుట్టుకొచ్చాయి.

భారత జాతీయ కాంగ్రెస్ అనుసరిస్తున్న మెతక విధానాలు మౌలానా అబుల్ కలాం ఆజాద్‌కూ నచ్చలేదు. బెంగాలు విప్లవకారుడు శ్యామ సుందర చక్రవర్తి బెంగాల్‌లోని విప్లవోద్యమ సంస్థలను ఆయనకు పరిచయం చేసాడు. మౌలానా విప్లవోద్యమంలో భాగస్వామి కావాలనుకున్నారు. అయితే బెంగాల్ విప్లవకారులు మౌలానాను ఏమాత్రం నమ్మలేదు. ఈ విషయాన్ని, '.At first they did not fully trust me and tried to keep me outside their inner councils. In course of time they realised their mistake and I gained their confidence' అని తన గ్రంథం India Wins Freedomలో ఆయన పేర్కొన్నారు.

మాతృదేశ విముక్తి కోసం సాగే పోరాటంలో ప్రాణాలను సైతం అర్పించగల యువకులతో 'భగవంతుని పార్టీ' (హిజ్‌బుల్లా) అను రహస్య విప్లవ సంస్థను మౌలానా ప్రారంభించారు. ఈ సంస్థలో సభ్యత్వం స్వీకరించిన యువకుల చేత, మాతృదేశ విముక్తి పోరాటంలో సర్వం త్యాగం చేస్తామని, ఖిద్ధిపూర్ స్మశానవాటికలో ప్రమాణాలు చేయించారు. మౌలానా ఆజాద్ ఆలోచనల, ఆచరణల ప్రభావంతో విప్లవ సంఘాల పరిధి బెంగాల్-బీహార్ దాటి బొంబాయి, ఉత్తర భారతదేశంలోని పలు పట్టణాలకు వ్యాపించింది. ఈ మేరకు విప్లవోద్యమ సంస్థలలో సభ్యులయిన యువకులు బృందాలుగా ఏర్పడి ఆంగ్లేయ అధికారుల మీద, ప్రభుత్వ కార్యాలయాల మీద దాడులు చేసి ఆంగ్లేయాధికారులను కలవరపెట్టారు.

ఈ క్రమంలో ఆంగ్లేయ వలసపాలకులతో ఇంటా-బయటా పోరాటానికి సిద్ధపడిన విప్లవకారులు స్వదేశం నుండి విదేశాలకు వెళ్ళారు, విదేశాల నుండి స్వదేశానికి కూడా విచ్చేసారు. 1913లో అమెరికా సంయుక్త రాష్ట్రంలో ఏర్పడిన గదర్ పార్టీ (Ghadar Party) స్వదేశం నుండి విదేశాల నుండి విప్లవోద్యమాన్ని నడిపింది. స్వదేశంలో ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా బ్రిటిష్ భారత సైన్యంలోని స్వదేశీ సైనికులలో జాతీయ భావనలను ప్రేరేపించి ఆంగ్లేయాధికారులకు వ్యతిరేకంగా పోరుబాట సాగటానికి ప్రోత్సహించింది. విదేశాలలోని తమ కార్యకర్తలను పెద్దసంఖ్యలో ఇండియాకు రప్పించి పోరుకు సిద్ధం చేసింది. ఈ విధంగా విప్లవ సంఘాలు, గదర్ పార్టీ లాంటి సంస్థలు పలు ప్రాంతాల నుండి తమ విప్లవకర కార్యకలాపాలను పెద్దఎత్తున నిర్వహించాయి. ఆ సందర్భంగా ఆంగ్ల ప్రభుత్వం విప్లవసంస్థల

మీద, విప్లవకారుల మీద విరుచుకపడింది. నిర్బంధాలు, అరెస్టులు ముమ్మరంగా సాగాయి. విచారణలు జరిగాయి. చివరకు రాజద్రోహానికి పాల్పడుతున్నారని, ప్రజలను హింసాయుత చర్యల దిశగా ప్రోత్సహిస్తున్నారని ఆరోపిస్తూ విప్లవకారుల మీద రాజద్రోహం కేసులు నమోదయ్యాయి. ఆ కేసుల విచారణలు సాగాయి. పర్యవసానంగా ఆయా కేసులలోని విప్లవకారులకు తీవ్ర శిక్షల విధింపు ముమ్మరంగా సాగింది. ఆవిధంగా సుదీర్ఘ జీవితకాల శిక్షలకు గురైన విప్లవకారులను అండమానులోని 'సెల్యులర్ జైలు'కు తరలించారు.

అండమాను దీవుల్లోని శిక్షాక్షేత్రంలో 1896లో ఆరంభయయ్యి 1906లో పూర్తి స్థాయిలో నిర్మాణం పూర్తి చేసుకున్న సెల్యులర్ జైలు (Cellular Jail) కు తొలి రాజకీయ ఖైదీల జట్టుగా 1908 నాటి చారిత్రాత్మక అలీపూరు బాంబు కేసు / మాణిక్కోట్లా కుట్ర కేసు (Alipure Bomb Case or Manicktola Conspiracy Case) లో దోషులు (Convicts) గా ఆంగ్ల న్యాయస్థానాలచే నిర్ధారించబడిన విప్లవకారులను ఆంగ్ల ప్రభుత్వం మహారాజ ఓడ (Maharaja Vessal) ద్వారా 1909 చివర్లో తరలించింది. ఆ తర్వాత నుండి గదర్ పార్టీ సభ్యులను, ఇతర విప్లవ సంఘాల / సంస్థల విప్లవకారులను, స్వాతంత్ర్య సమరయోధులను పెద్ద సంఖ్యలో అండమాను లోని సెల్యులర్ జైలుకు పంపడం కొనసాగింది.

**అల్లావుద్దీన్** : అల్లావుద్దీన్ (Alla-ud-Din) పంజాబు రాష్ట్ర నివాసి. ఆయన తండ్రి పేరు దాసుంతి (Dasunti). 1919 నాటికి అల్లావుద్దీన్ వయస్సు 21 ఏండ్లు. ఆంగ్లేయుల పట్ల ఏహ్యాభావం కలిగిన అల్లావుద్దీన్ ఈ దేశం వదలిపెట్టి ఆంగ్లేయులు వెళ్ళాలని ఆకాంక్షించిన యువకుడు. ఆ కారణంగా ఆయన పంజాబు రాష్ట్రంలోని కాసూర్ (Kasoor) ప్రాంతంలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా పలు కార్యకలాపాలలో పాల్గొన్నారు. ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం పలు దాడులకు పాల్పడ్డారన్న నేరారోపణల మీద ఆయనను అరెస్టు చేసింది. ఆ తరువాత సైనిక న్యాయస్థానంలో భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 కింద ఆయన దాడులకు పాల్పడ్డారని పలు ఇతర నేరాలను కూడా ఆయనకు ఆపాదిస్తూ 'కాసూర్ సప్లిమెంటరీ రాయట్ కేస్ – 77' (Kasoor Supplementary Riot Case -77) నమోదు చేశారు. ఆ 'కాసూర్ సప్లిమెంటరీ రాయట్ కేస్ – 77' ను విచారించిన ఆంగ్ల న్యాయస్థానం అల్లావుద్దీన్‌ను తప్పుపట్టింది.

ఆ ప్రకారంగా ఆంగ్ల న్యాయస్థానం అల్లావుద్దీన్‌కు యావజ్జీవిత కారాగారశిక్ష విధిస్తూ అండమానుకు పంపాల్సిందిగా ప్రభుత్వ అధికారులను ఆదేశించింది. ఆ ఆదేశాల

ప్రకారంగా 1896లో ప్రారంభించబడి 1906లో నిర్మాణం పూర్తిచేసుకున్న అండమాను శిక్షాక్షేత్రం లోని సెల్యులర్ జైలు కు అల్లావుద్దీన్‌ను 1919 మే 28న తరలించారు. అండమానులోని సెల్యులర్ జైలులో అల్లావుద్దీన్ 'ఖైది నం. 43843' (Prisoner No. 43843) గా నమోదయ్యారు. 1921లో అండమానులోని సెల్యులర్ జైలును మూసివేసి శిక్షాక్షేత్రాన్ని రద్దు చేయాలని ఆంగ్ల ప్రభుత్వం సంకల్పించింది. ఆ సరికొత్త రాజకీయ నిర్ణయం వలన అల్లావుద్దీన్ సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తమయ్యి భారత ప్రధాన భూభాగం లోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు.

**అలీ అహ్మద్ సిద్దీఖీ :** అలీ అహ్మద్ సిద్దీఖీ (Ali Ahmed Siddiqui) ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఫైజాబాద్ (Faizabad) జిల్లా, అక్బర్‌పురా (Akbarpura) పోలీసు స్టేషన్ పరిధిలోని షహజాద్‌పూర్ (Shahajadpur) లో జన్మించారు. బ్రతుకు దెరువు కోసం చిన్న వయస్సులోనే ఇరత దేశాలకు వెళ్లిన అలీ అహ్మద్ సిద్దీఖీ 'గదర్ పార్టీ' నాయకులతో మంచి సంబంధాలు ఏర్పర్చుకున్నారు. 'గదర్ పార్టీ' నిర్ణయం మేరకు 1915లో బాంకాక్ నుండి బర్మా వచ్చిన ఆయన గదర్ పార్టీ కార్యక్రమాలను ముమ్మరం చేశారు. అ సందర్భంగా 1915 ఏప్రిల్ లో అలీ అహ్మద్ సిద్ధిఖీ, ఫియాన్ అలీ, ముజ్తబా హుసైన్‌లను ఆంగ్ల ప్రభుత్వం అరెస్టు చేసి వారి మీద చరిత్రాత్మక 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' ('Second Mandalay Conspiracy' Case) నమోదు చేయగా 1917 జూలై ఆరున అలీ అహ్మద్ సిద్ధిఖీ తదితరులకు మరణ దండన విధిస్తూ న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ మరణదండన యావజ్జీవిత కారాగార శిక్షగా మారినందున 1918 ఫిబ్రవరి 11న అలీ అహ్మద్ సిద్ధిఖీని మాండలే జైలు నుండి అండమానుకు తరలించారు. 1921లో అండమానులోని సెల్యులర్ జైలును మూసివేసి శిక్షాక్షేత్రాన్ని రద్దు చేయాలని ప్రభుత్వం సంకల్పించింది. ఆ రాజకీయ నిర్ణయం వలన అలీ అహమ్మద్ సిద్దీఖీ సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తమయ్యి భారతదేశం లోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు. **(ఈ పుస్తకం లోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అలీ అహ్మద్ సిద్ధిఖీ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**దీనా :** పంజాబ్ రాష్ట్ర నివాసి దీనా (Deena). ఆయన తండ్రి పేరు వజీరా కస్సబ్ (Wazeera Kassab), 1919 నాటికి దీనా వయస్సు 25 ఏండ్లు. మాతృభూమి విముక్తి కోసం వలసపాలకులకు వ్యతిరేకంగా పోరాడుతున్న విప్లవకారులతో, విప్లవ సంఘాలతో జతకూడిన దీనా అమృతసర్, లాహోర్ కార్యక్షేత్రాలుగా బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న విప్లవోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు.

1919లో ఆంగ్ల ప్రభుత్వం తెచ్చిన రౌలత్ చట్టం ఆసరాతో ఆంగ్లేయాధికారులు రెచ్చిపోతూ ప్రజలు, జాతీయోద్యమకారుల పట్ల అత్యంత కిరాతకంగా వ్యవహరించసాగారు. ఆ చర్యల పట్ల నిరసన వ్యక్తంచేసిన పంజాబ్‌కు చెందిన స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ, (Dr. Saifuddeen Kichulu), డాక్టర్ సత్యపాల్ (Dr. Satyapal) లను ఆంగ్ల ప్రభుత్వం ఆక్రమంగా నిర్బంధించింది. ఆ అక్రమ నిర్బంధానికి వ్యతిరేకంగా పంజాబు రాష్ట్రం, అమృతసర్‌లో ప్రజలు, విప్లవకారులు కలసి 1919 ఏప్రిల్ 10 తేదీన భారీ ప్రదర్శన నిర్వహించారు. అమృతసర్ రైల్వే స్టేషన్ తగులబెట్టారు. రైళ్లను తగులబెట్టి రైళ్ళ రాకపోకలకు అంతరాయం కల్గించారు. టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లను విధ్వంసం చేసి సమాచార చేరవేత వ్యవస్థకు విఘాతం కల్గించారు. ఈ సందర్భంగా రైల్వే శాఖకు చెందిన అధికారి మృత్యువాత పడ్డారు. ఆ తరువాత ఆ ప్రాంతం లోని అమృతసర్ అలియన్స్ బ్యాంకు, చార్టర్డ్ బ్యాంకు, నేషనల్ బ్యాంకు (AmrithsarAlliance Bank, Charted Bank, National Bank) లను ప్రజలు ధ్వంసం చేశారు. ఈ విధ్వంసం సందర్భంగా బ్యాంకు అధికారులు కూడా ప్రాణాలు పోగొట్టుకున్నారు. ప్రజల, విప్లవకారుల ఆగ్రహాన్ని ఆంగ్లేయులు అడ్డుకోలేకపోయారు.

ఆ తరువాత రవాణా వ్యవస్థ, టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్ల వ్యవస్థలు చక్కబడ్డాక ఆంగ్ల ప్రభుత్వం పోలీసులు, సైన్యంతో కలసి ఈ ఘటనలోని నిందితుల అరెస్టులను ఆరంభించింది. చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయిన ఈ సంఘటనలో పాల్గొన్న పలువురిని ప్రభుత్వం నిర్బంధించింది. అలా నిర్బంధానికి గురయిన వారిలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటం చేస్తున్న విప్లవకారులు Mr. Mohammadi, Mr. Sadiq, Mr. Meharuddin, Mr, Karamchand, Mr. Manohar Singh, Mr, Mohammadi, Mr, Sadikh, Mr, Sandhi, and Mr. Jayram Singh తదితరులు ఉన్నారు.

అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు (Amritsar National Bank Action Case) నేపధ్యంలో 'పంజాబు మార్షల్ లా కేసు-75' (Punjab Marshal Law Case-76) ను ప్రత్యేకంగా నమోదుచేసి విప్లవకారుడు దీనా ను నిందితునిగా ప్రభుత్వం పేర్కొంది. ఆయనను అరెస్టు చేసి ఆయన మీద కేసు నమోదు చేసింది. ఆ కేసుల్లో విచారణ జరిపిన న్యాయస్థానం ఆయనకు భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మరణదండన విధిస్తూ 1919 జూన్ 12న తీర్పు చెప్పింది. ఆ మరణదండన యావజ్జీవిత కారాగారవాసంగా మారింది. ఆ తీర్పు ప్రకారంగా ఆంగ్లేయాధికారులు దీనాను అండమానులోని సెల్యులర్

జైలుకు తరలించారు. ఆ సెల్యులర్ జైలులో ఆయన 'ఖైది నం.44203' (Prisoner No. 44203) గా నమోదయ్యారు. 1921లో అండమానులోని సెల్యులర్ జైలును మూసివేసి శిక్షాక్షేత్రాన్ని రద్దు చేయాలని ఆంగ్ల ప్రభుత్వం సంకల్పించింది. ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న సరికొత్త రాజకీయ నిర్ణయం వలన అండమాను లోని సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తమయ్యి భారతదేశం లోని ఇతర జైళ్ళకు విప్లవకారుడు దీనా తరలించబడ్డారు.

**మొహమ్మద్ హుసైన్ ముజ్తబా** : మొహమ్మద్ హుసైన్ ముజ్తబా (Mohammad Hussain Mujtaba) ఉత్తరప్రదేశ్ రాష్ట్రం జౌన్‌పూర్ (Jaunpur) జిల్లా జౌన్‌పూర్ పట్టణం నివాసి. మాతృభూమి నుండి ఆంగ్లేయులను తరిమివేయడానికి సాయుధ పోరాటమే మార్గమని నమ్మిన మొహమ్మద్ హుసైన్ ముజ్తబా, మూల్‌చంద్ (Mulchand), మొహమ్మద్ ముజ్తబా (Mohammad), లాంటి పేర్లతో ప్రసిద్ధులు. ఆయన తండ్రి పేరు సజ్జాద్ హుసైన్ (Sajjad Hussain). ఆంగ్లేయ ప్రభుత్వ కబంధ హస్తాల నుండి మాతృభూమి విముక్తి కోసం సాయుధ పోరాటం సాగించాలని 'గదర్ పార్టీ' విదేశాల నుండి ముమ్మరంగా ప్రయత్నాలు ఆరంభించింది. ఆ ప్రయత్నాలలో భాగంగా బ్రిటిష్ భారతసైన్యంలోని స్వదేశీయులలో జాతీయ భావాలను పురికొల్పి వారిని బ్రిటన్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు దిశగా ముందుకు నడపాలని తీర్మానించింది. ఆ నిర్ణయం మేరకు 'గదర్ పార్టీ' చేపట్టిన కార్యకలాపాలలో మొహమ్మద్ హుసైన్ ముజ్తబా పాల్గొన్నారు.ఆ కారణంగా ఆయనను, ఆయన సహచరులను అరెస్టు చేసి రాజద్రోహం, హింసకు పాల్పడటం, హింసను, తిరుగుబాటును ప్రోత్సహించటం లాంటి నేరాలకు పాల్పడుతున్నారన్న ఆరోపణల మీద 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' ('Second Mandalay Conspiracy' Case) ను ఆంగ్ల ప్రభుత్వం నమోదు చేసింది.

ఈ చారిత్రాత్మక 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' విచారణ పూర్తి చేసిన ఆంగ్ల న్యాయస్థానం 1917 జూలై ఆరున మొహమ్మద్ హుసైన్ ముజ్తబా తదితరులకు మరణశిక్ష విధిస్తూ తీర్పుచెప్పింది. ఆ తరువాత మరణదండనను కాస్తా యావజ్జీవ కారాగార శిక్షగా మార్చుతూ వైశ్రాయి ఆదేశాలు జారీచేసాడు. ఆ ఆదేశాల మేరకు 1918 ఫిబ్రవరి మాసంలో అండమాను లోని సెల్యులర్ జైలుకు ఆయనను తరలించారు. ఆ సెల్యులర్ జైలులో 'ఖైది నం. 41055' (Prisoner No. 41055) గా పరిగణించబడిన మొహమ్మద్ హుసైన్ ముజ్తబా 1921లో అండమాను నుండి విముక్తి పొంది స్వగ్రామం చేరుకున్నారు.

**జలాలుద్దీన్** : జలాలుద్దీన్ (Jalaluddin) పంజాబ్ రాష్ట్రం నివాసి. ఆయన తండ్రి పేరు సవాన్ లూహార్ (Sawan Luhar). మాతృభూమి విముక్తి కోసం వలసపాలకులకు

వ్యతిరేకంగా పోరాడుతున్న విప్లవకారులతో, విప్లవ సంఘాలతో జతకూడిన జలాలుద్దీన్ అమృతసర్, లాహోర్ కార్యక్షేత్రాలుగా సాగుతున్న విప్లవోద్యమంలో పాల్గొన్నారు. 1919లో ఆంగ్ల ప్రభుత్వం తెచ్చిన రౌలత్ చట్టం ఆసరాతో ఆంగ్లేయాధికారులు రెచ్చిపోతూ ప్రజలు, జాతీయోద్యమకారుల పట్ల అత్యంత కిరాతకంగా వ్యవహరించం మొదలు పెట్టారు. ఆ చర్యల పట్ల నిరసన వ్యక్తంచేసిన పంజాబ్‌కు చెందిన డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ, (Dr. Saifuddeen Kichulu) డాక్టర్ సత్యపాల్ (Dr. Satyapal) లను ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది.

ఆ నిర్బంధానికి వ్యతిరేకంగా పంజాబు రాష్ట్రం,అమృతసర్‌లో ప్రజలు, విప్లవకారులు కలసి 1919 ఏప్రిల్ 10 తేదిన భారీ ప్రదర్శన నిర్వహించారు. ఆ సందర్భంగా ప్రజలు అమృతసర్ రైల్వేస్టేషన్ తగులబెట్టారు. రైళ్లను తగులబెట్టి రైళ్ళ రాకపోకలకు పూర్తిగా అంతరాయం కల్పించారు. టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లను విధ్వంసం చేసి సమాచార చేరవేతకు విఘాతం కల్గించారు. ఆ చర్యలలో భాగంగా ఒక రైల్వే శాఖకు చెందిన అధికారి మృత్యువాత పడ్డారు. ఆ తరువాత ఆ ప్రాంతం లోని Alliance Bank, Charterd Bank, National Bank లను ప్రజలు చుట్టుముట్టి ధ్వంసం చేశారు. ఈ విధ్వంసం సందర్భంగా బ్యాంకు అధికారులు కూడా ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఆంగ్లేయుల చర్యల పట్ల ఆగ్రహించిన ప్రజలు, విప్లవకారులకు ఈ విధంగా తమ నిరసన వ్యక్తం చేశారు.

ఆ తరువాత రవాణా వ్యవస్థ, టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్ల వ్యవస్థ చక్కబడ్డాక ఆంగ్ల ప్రభుత్వం పోలీసులు, సైన్యంతో కలసి ఈ సంఘటనలో నిందితుల కోసం వేట ఆరంభించింది. చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయిన ఈ సంఘటనలో పాల్గొన్న పలువురిని ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది. ఆ విధంగా నిర్బంధానికి గురయిన వారిలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధపోరాటం చేస్తున్న విప్లవకారులు జలాలుద్దీన్ తోపాటుగా Mr. Mohammadi, Mr. Sadiq, Mr. Meharuddin, Mr. Deena, Mr. Karamchand, Mr. Manohar Singh, Mr. Sandhi, and Mr. Jayram Singh తదితరులు ఉన్నారు.

ఈ అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు (Amritsar National Bank Action Case) సందర్భంగా 'పంజాబు మార్షల్ లా కేసు-75' (Punjab Marshal Law Case-76) ను ఆంగ్ల ప్రభుత్వం రూపొందించి జలాలుద్దీన్ ను నిందితునిగా పేర్కొంది. ఆయనను అరెస్టు చేసి కేసు నమోదు చేసింది. ఆ కేసుల్లో విచారణ జరిపిన న్యాయస్థానం ఆయనకు భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మరణదండన విధిస్తూ 1919 జూన్

12న తీర్పు చెప్పింది. ఆ మరణదండన యావజ్జీవ కారాగారవాసంగా మారింది. ఆ తీర్పు ప్రకారంగా ఆంగ్లేయాధికారులు జలాలుద్దీన్ ను అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించారు. ఆయన సెల్యులర్ జైలులో 'ఖైది నం.43340' (Prisoner No. 43340) గా పరిగణించబడ్డారు. 1921లో అండమానులోని సెల్యులర్ జైలును మూసివేసి శిక్షాక్షేత్రాన్ని రద్దు చేయాలని ఆంగ్ల ప్రభుత్వం సంకల్పించింది. ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం మేరకు 1921లో సెల్యులర్ జైలు నుండి విముక్తమయ్యి భారతదేశం ప్రధాన భూభాగంలోని ఇతర జైళ్ళకు జలాలుద్దీన్ తరలించబడ్డారు.

**మెహరుద్దీన్ :** పంజాబ్‌కు చెందిన మెహరుద్దీన్ (Meharuddin) తండ్రి పేరు మందూహ్ (Mandooh). ఆంగ్ల ప్రభుత్వ రాక్షస కృత్యాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఉద్యమకారులతో కలసి ఆంగ్లేయ అధికారుల చర్యలను నిరసిస్తూ మెహరుద్దీన్ ఉద్యమించారు. ఆ ఉద్యమ కార్యక్రమాలలో భాగంగా అమృతసర్‌లో 1919 ఏప్రిల్ 10న ఆరంభమైన భారీ ప్రజా ప్రదర్శన అమృతసర్ రైల్వే స్టేషన్ దిశగా సాగింది. ఆ ప్రదర్శన సందర్భంగా కోపోద్రిక్తులయిన ప్రజలు పలు విధ్వంసక చర్యలకు పూనుకున్నారు. ఆ సందర్భంగా కొందరు అధికారులు కూడా మృత్యువు పాలయ్యారు. ఈ సంఘటన చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయ్యింది. ఆంగ్ల ప్రభుత్వం మెహరుద్దీన్ ను అరెస్టు చేసింది. భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మెహరుద్దీన్ కు మరణశిక్ష విధిస్తూ 1919 జూన్ 2న న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తరువాత ఆ మరణశిక్ష యావజ్జీవ కారాగార శిక్షగా మారింది. ఆ మేరకు ఆంగ్లేయాధికారులు ఆయనను అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించారు. ఆ జైలులో మెహరుద్దీన్ 'ఖైది నం.43339' (Prisoner No.43339) గా పరిగణించబడ్డారు. 1921లో సెల్యులర్ జైలును మూసివేయాలని ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం వలన విప్లవకారులు మెహరుద్దీన్ అండమాను శిక్షాక్షేత్రం లోని సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తులయ్యారు. ఆయనను భారతదేశం ప్రధాన భూభాగం లోని ఇతర జైళ్ళకు తరలించారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మెహరుద్దీన్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మొహమ్మది :** పంజాబ్ రాష్ట్రం నివాసి. ఆయన తండ్రి పేరు అజీజ్ కాశ్మీరి. 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయిన అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు

(Amritsar National Bank Action Case) కేసులో మొహమ్మది (Mohammadi) పాల్గొన్నారు. ఆంగ్ల ప్రభుత్వ రాక్షస కృత్యాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న విప్లవకారులు, జాతీయోద్యమకారులతో కలసి ఆంగ్లేయ అధికారుల చర్యలను నిరసిస్తూ మెహరుద్దీన్ కూడా ఉద్యమించారు. ఆ కార్యక్రమాలలో భాగంగా అమృతసర్‌లో 1919 ఏప్రిల్ 10న ఆరంభమైన భారీ ప్రజా ప్రదర్శన అమృతసర్ రైల్వే స్టేషన్ దిశగా సాగింది. ఆ ప్రదర్శన సందర్భంగా కోపోద్రిక్తులయిన ప్రజలు పలు విధ్వంసక చర్యలకు పూనుకున్నారు.

ఈ సందర్భంగా కొందరు అధికారులు కూడా మృత్యువు పాలయ్యారు. ఈ సంఘటన చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయ్యింది. ఆంగ్ల ప్రభుత్వం మెహరుద్దీన్ ను అరెస్టు చేసింది. భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మెహరుద్దీన్ కు మరణశిక్ష విధిస్తూ 1919 జూన్ 2న ఆంగ్ల న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తరువాత మరణ శిక్ష యావజ్జీవ కారాగార శిక్షగా మారింది. ఆంగ్లేయాధికారులు ఆయనను అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించారు. అండమాను శిక్షాక్షేత్రంలో గల సెల్యులర్ జైలులో మొహమ్మది 'ఖైది నం.46844' (Prisoner No.46844) గా పరిగణించ బడ్డారు. 1921లో సెల్యులర్ జైలును మూసివేసి అండమానులోని శిక్షాక్షేత్రాన్ని రద్దు చేయాలని ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయించింది. ఆ సరికొత్త రాజకీయ నిర్ణయం మేరకు మొహమ్మదీ సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తులయ్యి భారత ప్రధాన భూభాగంలోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మొహమ్మది వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మొహమ్మద్ అక్రం ఖాన్** : భారత వాయవ్యసరిహద్దు ప్రాంత నివాసి. ఆయన తండ్రిపేరు మొహమ్మద్ అమీన్. అమృతసర్‌లో జరిగిన ఆంగ్లేయాధికారి Isdon హత్య సంఘటనలో మొహమ్మద్ ఆక్రం ఖాన్ (Mohammed Akram Khan) ను నిందితునిగా పేర్కొంటూ ఆంగ్లేయాధికారులు ఆయన మీద హత్యకేసు నమోదు చేశారు. '1915 ఫిబ్రవరి 31 నాటి ఆంగ్లేయుడి హత్యాయత్న కార్యక్రమం ప్రముఖ విప్లవకారుడు రాష్‌బిహారి బోస్ మార్గదర్శకంలో రూపొందింది. ఈ కార్యక్రమాన్ని విజయవంతం పూర్తిచేయడానికి వివిధ ప్రాంతాలకు చెందిన పలువురు విప్లవకారులను ఆయన రప్పించారు. ఆ విధంగా విచ్చేసి, రాష్ బిహారి రూపొందించిన హత్యాయత్నం చర్యను విజయవంతం చేయడానికి అక్రం ఖాన్ తోపాటుగా పలురువు పాల్గొన్నారు. ఈ కేసులో ఆంగ్ల ప్రభుత్వం పలువురిని అరెస్టు

చేసింది. ఆ క్రమంలో మొహమ్మద్ అక్రం ఖాన్ తో పాటుగా ఇతరుల మీద ఆంగ్ల ప్రభుత్వం కేసులను నమోదు చేసి న్యాయస్థానంలో నిందితులుగా నిలిపింది. ఆ కేసులను విచారించిన ఆంగ్ల న్యాయస్థానం మొహమ్మద్ అక్రం ఖాన్ తోపాటుగా Bisen Singh, Channam Singh, Battar Singh, Giridhar Lal, Wilajati Singh, Kehar Singh, Nand Singh, Natha Singh, Ratan Singh, Sunder Singh లకు కారాగారశిక్షను విధిస్తూ అండమాను జైలుకు పంపించాల్సిందిగా తీర్పు చెప్పింది.' (Ex-Andaman Political Prisoners Fraternity Circle అధ్యక్షులు Mr Anup Dasguptha బెంగాలీలో రాసిన Cellular Jail, E. Nirbasitg Biplobidder Katha పుస్తకం Shishu Sahitya Samsad Pvt Ltd., Kolkata ద్వారా 2016 లో ప్రచురితమయ్యింది. అది ఆంగ్లంలోకి An Account of Revolutionaries Detained in Cellular Jail శీర్షికన అనువదించబడిన,అముద్రిత గ్రంథం నుండి).

ఈ కేసు పంజాబు మార్షల్ లా కేసుగా (Punjab Marshal Law Case) నమోదు చేసి విచారణ నిర్వహించిన ఆంగ్లేయాధికారుల న్యాయస్థానం అక్రం ఖాన్‌కు 10 సంవత్సరాల జైలుశిక్ష విధించింది. ఆ శిక్షను ఐదేండ్లకు తగ్గించి ఆయనను అండమాను తరలించారు. అండమాను జైలులోని సెల్యులర్ జైలులో మొహమ్మద్ అక్రం ఖాన్ జైలులో 'ఖైది నం. 40383' (Prisoner No. 40383) గా పరిగణించబడ్డారు. 1921లో అండమానులోని సెల్యులర్ జైలును, శిక్షాక్షేత్రాన్ని మూసివేయాలని నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు మొహమ్మద్ అక్రం ఖాన్ అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తులయ్యి భారతదేశం ప్రధాన భూభాగంలోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు.

**నాదిర్ అలీ షాహ్ :** పంజాబ్ రాష్ట్రానికి చెందిన ఖయీం అలీ షాహ్ కుమారుడు నాదిర్ అలీ షాహ్ (Nadir Ali Shah). పంజాబు రాష్ట్రంలోని కాసూర్ (Kasoor) ప్రాంతంలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా పలు కార్యకలాపాలలో పాల్గొన్నందున ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం పలు నేరారోపణల మీద 32 ఏండ్ల వయస్కుడయిన నాదిర్ అలీ షాహ్‌ను 1919లో అరెస్టు చేసింది. అప్పటి సైనిక న్యాయస్దానంలో భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 కింద కాసూర్ సప్లిమెంటరీ రాయిట్ కేస్-77 (Kasoor Supplementary Riot Case -77) అధికారులు నమోదు చేశారు. ఆ Kasoor Supplementary Riot Case -77 ను విచారించి నాదిర్ అలీ షాహ్ కు యావజ్జీవిత కారాగారాశిక్ష విధిస్తూ అండమానుకు పంపాల్సిందిగా న్యాయస్థానం ఆధికారులను ఆదేశించింది. ఆ ప్రకారంగా 1919 మే 28న అండమానులోని సెల్యులర్ జైలుకు ఆయనను తరలించారు. ఆ సెల్యూార్ జైలులో నాదిర్ అలీ షాహ్ 'ఖైది నం. 44200' (Prisoner No. 44200) గా పరిగణించబడ్డారు. 1921లో సెల్యులర్ జైలును

మూసివేయాలని ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు నాదిర్ అలీ షాహ్ సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తమయ్యి భారతదేశం ప్రధాన భూభాగం లోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు.

**సాదిఖ్ :** పంజాబ్ రాష్ట్రానికి చెందిన ఇబ్రహీం కాశ్మీరి (Ibrhim Kashmiri) కుమారుడు సాదిఖ్ (Sadiq). ఆంగ్లేయుల దుష్ట పాలన నుండి మాతృభూమికి విముక్తి కలిగించాలని భావించిన సాధిఖ్ చిన్నతనం నుండి జాతీయోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. ఆంగ్లేయుల తరిమివేతకు సాయుధపోరాటం దిశగా మళ్ళిన ఆయన, విప్లవోద్యమ సంస్థలతో సంబంధాలు ఏర్పర్చుకుని బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనసాగారు.

1919లో ఆంగ్ల ప్రభుత్వం తెచ్చిన రాక్షస రౌలత్ చట్టం ఆసరాతో ఆంగ్లేయ అధికారులు రెచ్చిపోతూ ప్రజల, జాతీయోద్యమకారుల పట్ల అత్యంత కిరాతకంగా వ్యవహరించడం మొదలు పెట్టారు. ఆ చర్యల పట్ల నిరసన వ్యక్తంచేసిన స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ (Dr. Saifuddeen Kichulu), డాక్టర్ సత్యపాల్ (Dr. Satyapal) లను ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది. ఆ నిర్బంధానికి వ్యతిరేకంగా పంజాబు రాష్ట్రం అమృతసర్‌లో ప్రజలు, విప్లవకారులు కలసి 1919 ఏప్రిల్ 10 న భారీ ప్రదర్శన నిర్వహించారు. ఆ సందర్భంగా ప్రజలు రైల్వేస్టేషన్ తగులబెట్టారు. రైళ్లను తగులబెట్టి రైళ్ళ రాకపోకలకు అంతరాయం కల్పించారు. టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లను విధ్వంసం చేసి సమాచార చేరవేత వ్యవస్థకు విఘాతం కల్గించారు. ఆ సందర్భంగా ఒక రైల్వే అధికారి కూడా మృత్యువాత పడ్డారు. ఆ ప్రాంతంలోని Alliance Bank, Chartered Bank, National Bank లను ప్రజానీకం చుట్టుముట్టి ధ్వంసం చేశారు. ఈ విధ్వంసం సందర్భంగా బ్యాంకు అధికారులు కూడా ప్రాణాలు పోగొట్టుకున్నారు.

ఆ తరువాత రవాణా వ్యవస్థ, సమాచార చేరవేత వ్యవస్థ చక్కబడ్డాక ఆంగ్ల పోలీసులు, సైన్యంతో కలసి నిందితుల కోసం వేట ప్రారంభించింది. చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయిన ఈ సంఘటనలో పాల్గొన్న పలువురిని ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది. ఆ విధంగా నిర్బంధానికి గురయిన వారిలో ఆంగ్ల ప్రభుత్వంతో సాయుధ పోరాటం చేస్తున్న విప్లవకారులు సాదిఖ్ తోపాటుగా Mr. Mohammadi, Mr. Meharuddin, Mr. Deena, Mr. Karamchand, Mr. Manohar Singh, Mr. Sandhi, Mr. Jalaluddin and Mr. Jayram Singh తదితరులు ఉన్నారు.

ఈ సంఘటన అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు (Amritsar National Bank Action Case) గా ప్రఖ్యాతిగాంచింది. ఈ కేసు సందర్భంగా పంజాబు మార్షల్ లా కేసు-75 (Punjab Marshal Law Case-76) ను రూపొందించి 26 ఏండ్ల సాదిఖ్ ను నిందితునిగా పేర్కొంది. ఆయనను భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మరణదండన విధిస్తూ 1919 జూన్ 12న ఆంగ్ల న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ మరణదండన కాస్తా జీవిత ఖైదుగా మారింది. (Ex-Andaman Political Prisoners Fraternity Circle అధ్యక్షులుగా పనిచేసిన Mr Anup Dasguptha రచించి, Shishu Sahitya Samsad Pvt Ltd., Kolkata ద్వారా 2016 లో Cellular Jail, E. Nirbasitg Biplobidder Katha శీర్షికన బెంగాలి భాషలో ప్రచురితమయిన ఈ పుస్తకం An Account of Revolutionaries Detained in Cellular Jail శీర్షికన ఆంగ్లంలోకి అనువాదమైన అముద్రిత గ్రంథం నుండి)

ఆ తీర్పు ప్రకారంగా ఆంగ్లేయాధికారులు ఆయనను అండమానులోని సెల్యూలర్ జైలుకు తరలించారు. ఆయన సెల్యూలర్ జైలులో 'ఖైది నం. 43845' (Prisoner No. 43845) గా పరిగణించ బడ్డారు. అండమానులోని సెల్యూలర్ జైలును మూసివేసి Penal Settlement ను రద్దు చేయాలని ఆంగ్ల ప్రభుత్వం 1921లో నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు సాదిఖ్ అండమాను లోని సెల్యూలర్ జైలు నుండి 1921లో విముక్తమయ్యి భారతదేశం లోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు.

**సంధీ :** పంజాబ్ రాష్ట్రానికి చెందిన సంధీ (Sandhi) 1919 నాటికి 26 ఏండ్ల యువకుడు. ఆయన తండ్రి పేరు హుస్సేన్ బక్ష్. (Hussen Baksh) ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమికి విముక్తి కలించాలని భావించిన సంధీ చిన్నతనం నుండి జాతీయోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. ఆంగ్లేయుల తరిమివేతకు సాయుధపోరాటం దిశగా మళ్ళిన ఆయన విప్లవోద్యమ సంస్థలతో సంబంధాలు ఏర్పర్చుకుని బ్రిటిష్ వ్యతిరేక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనసాగారు.

ఆంగ్ల ప్రభుత్వం 1919లో తెచ్చిన రౌలత్ చట్టం ఆసరాతో ఆంగ్లేయాధికారులు రెచ్చిపోతూ ప్రజలు, జాతీయోద్యమకారుల పట్ల అత్యంత కిరాతకంగా వ్యవహరించడం మొదలు పెట్టారు. ఆ చర్యల పట్ల నిరసన వ్యక్తంచేసిన స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ సైపుద్దీన్ కిచ్లూ (Dr. Saifuddeen Kichulu), డాక్టర్ సత్యపాల్ (Dr. Satyapal) లను ఆంగ్ల ప్రభుత్వం అక్రమంగా నిర్బంధించింది.

ఆ నిర్బంధానికి వ్యతిరేకంగా పంజాబు రాష్ట్రం అమృతసర్‌లో ప్రజలు, విప్లవకారులు కలసి 1919 ఏప్రిల్ 10న నిర్వహించిన భారీ ప్రదర్శన సందర్భంగా ప్రజలు రైల్వే స్టేషన్ తగులబెట్టారు. రైళ్లను తగులబెట్టి రైళ్ళ రాకపోకలకు అంతరాయం కల్పించారు. టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లను విధ్యంసం చేసి సమాచార చేరవేతకు విఘాతం కల్గించారు. ఈ సందర్భంగా రైల్వే అధికారి ఒకరు మృత్యువాత పడ్డారు. ఈ ఆందోళన సమయంలో ఆ ప్రాంతంలోని Alliance Bank, Chartered Bank, National Bank ప్రజానీకం చుట్టుముట్టి ధ్వంసం చేశారు. బ్యాంకు అధికారులు కూడా ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆగ్రహించిన ప్రజలు, విప్లవకారులకు అడ్డూఆపు లేకుండా పోయింది.

ఆ తరువాత రవాణా వ్యవస్థ, సమాచార చేరవేత వ్యవస్థ చక్కబడ్డాక ఆంగ్ల ప్రభుత్వం పోలీసులు, సైన్యంతో కలసి భారీ సంఖ్యతో రంగంలోకి దిగింది. ఈ సంఘటనలో నిందితుల కోసం వేట ప్రారంభించింది. చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్దమయిన ఈ సంఘటనలో పాల్గొన్న పలువురిని ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది. ఆ విధంగా నిర్బంధానికి గురయిన వారిలో సంధీ తోపాటుగా ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధపోరాటం చేస్తున్న విప్లవకారులు Mr. Mohammadi, Mr. Meharuddin, Mr. Deena, Mr. Karamchand, Mr. Manohar Singh, Mr. Sadikh, Mr, Jalaluddin and Mr. Jayram Singh తదితరులు ఉన్నారు.

ఈ సంఘటన అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు (Amritsar National Bank Action Case) గా ప్రఖ్యాతిగాంచింది. ఈ కేసు సందర్భంగా ఆంగ్ల ప్రభుత్వం పంజాబు మార్షల్ లా కేసు-75 (Punjab Marshal Law Case-76) ను రూపొందించి సంధీని నిందితునిగా పేర్కొంది. ఆ కేసుల్లో న్యాయస్థానం ఆయనకు భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మరణదండన విధిస్తూ 1919 జూన్ 12న న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తరువాత ఆ మరణదండన యావజ్జీవ కారాగారవాసంగా మారింది. (Ex-Andaman Political Prisoners Fraternity Circle అధ్యక్షులుగా పనిచేసిన Mr Anup Dasguptha బెంగాలీ భాషలో Cellular Jail, E. Nirbasitg Biplobidder Katha శీర్షికన రచించగా అది Shishu Sahitya Samsad Pvt Ltd., Kolkata ద్వారా 2016 లో ప్రచురితం అయ్యింది. ఆ పుస్తకం An Account of Revolutionaries Detained in Cellular Jail శీర్షికన ఆంగ్లంలోకి అనువాదమయ్యింది. ఆ అముద్రిత గ్రంథం నుండి)

ఆ విధంగా అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు చేరుకున్న విప్లవకారుడు సంధీ సెల్యూలర్ జైలులో 'ఖైది నం. 43845' (Prisoner No. 43845) గా పరిగణించబడ్డారు. 1921లో అండమానులోని సెల్యులర్ జైలును, శిక్షాక్షేత్రాన్ని (Penal Settlement) మూసివేయాలని ఆంగ్ల ప్రభుత్వం నిర్ణయించింది. ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న ఆ సరికొత్త రాజకీయ నిర్ణయం మేరకు విప్లవకారుడు సంధీ కూడా అండమాను లోని సెల్యులర్ జైలు నుండి 1921లో విముక్తమయ్యి భారతదేశంలోని ఇతర జైళ్ళకు తరలించబడ్డారు.



ఈ భాగంలో పొందుపర్చిన సమాచారం ప్రధానంగా

Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who
Dr. Rashida Iqbal,
(Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, Andaman, 2004)

మరియు

పలు ఇతర గ్రంథాలు, అధికారిక దస్త్రాల

నుండి సేకరించిన విశేషాలను జతచేసి రూపొందించబడింది.

**భా**రత స్వాతంత్ర్యోద్యమంలో కేరళ రాష్ట్రం మలబారు మోప్లాలు అపూర్వ త్యాగాలతో, అసమాన ధైర్యసాహసాలతో ఆంగ్లేయ బలగాలను ఎదుర్కొని తమ ప్రత్యేకతను చాటుకున్నారు. 1800లో భూసమస్య ప్రధానంగా ఆరంభమయ్యి, 120 సంవత్సరాలపాటు సాగిన భూ పోరాటంలో పెద్ద సంఖ్యలో మోప్లా ప్రజానీకం బలయ్యింది. చివరకు 1920-22 లలో ఆ పోరాటం జాతీయోద్యమంలో భాగమయ్యింది. ఆ కారణంగా మోప్లా యోధులు జైలుశిక్షలకు, కాల్పులకు, ఉరిశిక్షలకు ఎరయ్యారు, అండమాను జైలు పాలయ్యారు. ఆనాటి పోరాట యోధులను 1971లో స్వాతంత్ర్య సమరయోధులుగా భారత ప్రభుత్వం గుర్తించింది. ఈ పోరాటాలలో పాల్గొన్న మోప్లా యోధులు బ్రిటిష్ వ్యతిరేకతలో, దేశభక్తి విషయంలో అగ్రగణ్యులన్న చారిత్రక వాస్తవాన్ని ఎవ్వరూ కాదనలేని రీతిలో, చిరస్మరణీయ ఖ్యాతితో భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో శాశ్వత స్థానాన్ని సుస్థాపితం చేసుకున్నారు.

టిపూ సుల్తాన్ 1782 మలబారును హస్తగతం చేసుకోగానే దున్నేవాడిదే భూమి ప్రాతిపదికగా రైతు పంటభాగాన్ని చెల్లిస్తున్నంత కాలం, ఆ భూమి నుండి సాగు రైతును తొలగించడానికి రాజుకు కూడా హక్కు లేదని ప్రకటించాడు. ఆ విధానాలు భూకామందుల ఆధిపత్యాన్ని, పెత్తనాన్ని దెబ్బతీసాయి. బడుగు రైతన్నకు ఊహించని విధంగా లభించిన మహత్తర అవకాశం తెచ్చిపెట్టిన ఆ ఆనందం ఎంతో కాలం నిలవలేదు. టిపూ తీసుకున్న నిర్ణయాల ఫలితంగా, రైతు అనుకూల మార్పులు స్థిరీకరణ పొంది రైతు జనజీవితాలలో శాశ్వత మార్పులు చోటు చేసుకునేలోగా, 1799లో టిపూ సుల్తాన్ పాలన అస్తమించింది. టిపూ సుల్తాన్ మీద సాధించిన తమ విజయానికి సహాయపడిన భూస్వాములకు, రాజాలకు, సామాజిక పెత్తందారులకు తాయిలాలుగా మలబారు ప్రాంతపు భూములను ఈస్ట్ ఇండియా కంపెనీ కట్టబెట్టింది. ఆంగ్ల ప్రభుత్వ వత్తాసుతో భూకామందులు రైతుల భూములను

ఆక్రమించుకుని రైతులను కాస్తా రైతు కూలీలుగా మార్చేసారు. ఆ కారణంగా భూస్వాముల మద్దతుదారులు, ఆంగ్లేయాధికారులు, ఆంగ్ల ప్రభుత్వ పోలీసులు, ఆంగ్ల న్యాయస్థానాలు, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు మోప్లా రైతుల ఆగ్రహాన్ని చవి చూడాల్సి వచ్చింది. భూములు కోల్పోయిన రైతుల ఆగ్రహం నుండి పుట్టుకొచ్చిన తిరుగుబాట్లు గురించి చరిత్ర పరిశోధకుడు, Mapilla Muslims of Kerala గ్రంథ రచయిత Prof Ronald E. Miller ప్రస్తావిస్తూ, 1821 నుండి 1921 వరకు 51 తిరుగుబాట్లు జరిగాయని 1836 నుండి 1921 వరకు జరిగిన 29 ప్రధాన తిరుగుబాట్లు మలబారు రైతాంగ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకున్నాయని పేర్కొన్నాడు.

భూకామందులు, ఆ భూస్వాములకు వత్తాసు పలుకుతున్న ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సుదీర్ఘ కాలంగా పోరాటాలు జరిపిన మలబారు మోప్లాల వైఖరిలో 1919-21 నాటి ఖిలాఫత్-సహాయనిరాకరణ ఉద్యమాలు పెనుమార్పును తెచ్చాయి. ఖిలాఫత్ ఉద్యమం సందర్భంగా మలబారులో పర్యటించిన మహాత్మా గాంధీ, మౌలానా షౌకత్ అలీ తదితర నేతల ప్రసంగాలు మోప్లాలను కదిలించాయి. ఈ పరిణామాలతో కలవరపడిన బ్రిటిష్ పాలకులు మలబారు మోప్లాల కట్టడికి పూనుకున్నారు. ఆంగ్లేయుల కర్కశ చర్యలతో మోప్లాలు మండిపడ్డారు. తిరగబడ్డారు. ఆంగ్లేయాధికారులు మోప్లా నాయకుల నిర్బంధాలకు పూనుకోవడంతో ఆగ్రహం మరింత ప్రజ్వరిల్లి ప్రభుత్వ, పోలీసు అధికారులను తరిమికొట్టి, ఆంగ్లేయుల ప్రమేయం ఏమాత్రం లేకుండా ఆరు మాసాల పాటు తిరుంగాడి ప్రాంతం మలబారు మోప్లా యోధుల స్వతంత్ర పాలనకు అవకాశమిచ్చింది.

ఆ అవమాన భారంతో ప్రతీకారానికి పూనుకున్న ఆంగ్లేయాధికారులు 1921 ఆగస్టు 28న భారీ బలగాలతో వచ్చి దాడులు ఆరంభించారు. ఆ దాడులను తిప్పికొడ్తూ మోప్లాలు సాయుధంగా తిరగబడ్డారు. ఈ సంఘటనలో పలువుర్ని ఆంగ్లేయ బలగాలు అదుపులోకి తీసుకున్నాయి. ప్రభుత్వం ప్రత్యేక న్యాయస్థానం ఏర్పాటు చేసి విచారణ తంతు నిర్వహించింది. ఆ తరువాత మౌల్వీ అలీముస్సలియార్ లాంటి ప్రముఖులతో పాటుగా మరో 12 మందికి ఉరిశిక్ష, 33 మందికి జీవిత ఖైదును న్యాయస్థానం ఖరారు చేసింది. అందులో పలువురిని అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించారు. ఆనాటి నుండి వందలాది మోప్లాలను ఆంగ్లేయ ప్రభుత్వం అండమానులోని సెల్యులర్ జైలు పాల్జేసింది. ఆ విధంగా వివిధ కేసులలో శిక్షలు విధించి మలబారు మోప్లాలను ఆంగ్ల ప్రభుత్వం అండమానుకు తరలించసాగింది. ఈ మేరకు వందలాది మలబారు మోప్లాలను

అండమానుకు పంపినప్పటికి అధికారికంగా సమగ్ర వివరాలు లభ్యం కావడం లేదు. ప్రముఖ చరిత్రకారుడు Mr. Roland E Miller ప్రకారంగా 15 వందల మందికి మాత్రమే సరిపడ గల బళ్ళారి జైలులో 4500 మలబారు మోప్లాలను ఖైదుచేసి ఉంచారని, అక్కడి నుండి పెద్ద సంఖ్యలో మోప్లాలను అండమాను జైలుకు తరలించారని తన Moppila Muslims of Kerala, (Longman, Hyderabad, 1976, Page 149) గ్రంథంలో వెల్లడించారు.

అండమానులోని వాతావరణం మలబారు వాతావరణానికి పెద్దగా తేడా లేకుండా పోవడంతో మలబారు మోప్లాలు అండమాను వాతావరణానికి అలవాటు పడిపోయారు. అండమానులోని సెల్యులర్ జైలు నియమ నిబంధనల ప్రకారంగా కొంత శిక్షాకాలం తరువాత అర్హతలు, అభిరునిని బట్టి వారికి పాక్షిక స్వేచ్ఛను కల్పిస్తూ అధికారులు Ticket of Leave, Ticket of Agriculture జారీ చేశారు. ఆ సదుపాయాన్ని వినియోగించుకున్న కొందరు మోప్లాలు మలబారులోని తమ మహిళలను అండమానుకు రప్పించుకున్నారు. మరికొందరు స్థానికంగా వివాహాలు చేసుకుని అండమానులో స్థిరనివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. శిక్షాకాలం ముగిసాక వివాహాలు, నివాసాలు, ఉపాధి, వ్యవసాయం, వ్యాపారాలను ఏర్పాట్లు చేసుకున్న మోప్లాలు అండమానులో శాశ్వతంగా స్థిరపడి పోయారు. ఆ విధంగా స్థిరపడ్డ ప్రాంతాల కాలనీలకు Calicut, Manjeri, Malapuram, Wandoor, Tirur, Mannarkkad అంటూ మలబారులోని తమ స్వగ్రామాల పేర్లను కూడా పెట్టుకున్నారు.

**అహ్మద్ కుట్టీ, మత్తుమ్మల్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్మాక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో అహ్మద్ కుట్టీ మత్తుమ్మల్ (Ahmed Kutty, Mattummal) పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను లోని సెల్యులర్ జైలులో చాలా కాలం బంధించబడిన ఆయనకు వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతించిన ఆంగ్ల ప్రభుత్వం Agriculture Ticket జారీచేసింది. శిక్షాకాలం పూర్తయ్యాక అహ్మద్ కుట్టీ మత్తుమ్మల్ అండమానులో స్థిరపడ్డారు.

**అహ్మద్ కుట్టీ, వరియత్ వలాప్పిల్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్మాక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో అహ్మద్ కుట్టీ, వరియత్ వలాప్పిల్ (Ahmed Kutty, Variyath

Valappil ) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించింది. ఆ సెల్యులర్ జైలులో ఆయన బంధించ బడ్డారు. ఆ తరువాత అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆయనకు ఆంగ్ల ప్రభుత్వం Agriculture Ticket ఇచ్చింది. శిక్షాకాలం ముగిసిన తరువాత అహ్మద్ కుట్టీ, వరియత్ వలాప్పిల్ అండమానును స్థిరనివాసం చేసుకున్నారు.

**అలావి హజి, నెల్లిపరాంబన్ :** కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921 -22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో అలావి హజి, నెల్లిపరాంబన్ (Alavi Haji, Nelliparamban) పాల్గొన్నారు. ఆంగ్ల ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి విచారణ తంతు నిర్వహించి అండమాను లోని సెల్యులర్ జైలుకు తరలించింది. ఆ జైలులో ఆయన చాలా కాలం బందీగా ఉన్నారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలను నిర్వహించడానికి పాక్షిక స్వేచ్ఛకు అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket జారీచేసింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత అలావి హజి, నెల్లిపరాంబన్ అండమానులో స్థిరపడ్డారు.

**అలావి మచిన్‌చేరి :** కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో అలావి మచిన్‌చేరి (Alavi Machincheri ) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమాను సెల్యులర్ జైలుకు తరలించింది. ఆ తరువాత అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి ఆంగ్ల ప్రభుత్వం నుండి Agriculture Ticket పొందారు. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత అలావి మచిన్‌చేరి అండమానును స్థిరనివాసం చేసుకున్నారు.

**అలావి పూవాకుండి :** కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో మలబారు ప్రాంతంలో సాగిన 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో అలావి పూవాకుండి (Alavi Poovakundi) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ నిర్వహించి అండమాను సెల్యులర్ జైలుకు తరలించింది. కొంత కాలం తరువాత అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత అలావి మచిన్‌చేరి అండమానులో స్థిరపడ్డారు.

**అతాన్ చుంగట్టో** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22లో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో అతాన్ చుంగట్టో (Athan Chungatto) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించింది. అండమానులోని సెల్యూలర్ జైలులో చాలా కాలం బంధించబడిన ఆయనకు అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి ఆంగ్ల ప్రభుత్వం Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత అతాన్ చుంగట్టో అండమానులో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు.

**కాయరని పోకాట్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22లో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో కాయరని పోకాట్ (Kayarni Pokat) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించింది. ఆ జైలులో ఆయన చాలా కాలం బంధించబడ్డారు. ఆ తరువాత అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి ఇతర ఉద్యమకారుల తోపాటుగా ఆయనకూ ఆంగ్ల ప్రభుత్వం Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కాయరని పోకాట్ అండమానులో స్థిరపడ్డారు.

**కొయాకుట్టీ కొజేహిస్సేరి** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22లో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో **కొయాకుట్టీ కొజేహిస్సేరి** (Koyakuty Kozhisseri) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించింది. ఆ సెల్యూలర్ జైలులో ఆయన చాలా కాలం బంధించబడ్డారు. ఆ తరువాత కొంతకాలానికి అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కొయాకుట్టీ కొజేహిస్సేరి అండమానును స్థిరనివాసం చేసుకుని అక్కడే ఉండిపోయారు.

**కుంజేని కాయకథాతిపరంబిల్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో కుంజేని కాయకథాతిపరంబిల్ (Kunmjeni Kayakhatiparambil)

పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమాను శిక్షాక్షేత్రం లోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యూలర్ జైలులో ఆయన చాలా కాలం బంధించబడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కుంజేని కాయకథాతిపరంబిల్ అండమానులో ఉండిపోయారు.

**కుంజలావి కొలపరాంబన్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921 –22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగబాటు'లో కుంజలావి కొలపరాంబన్ (Kunjalavi Kolaparamban) చురుగ్గా పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమాను లోని సెల్యులర్ జైలుకు తరలించింది. అండమాను సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి పాక్షిక స్వేచ్ఛకు అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket జారీచేసింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కుంజలావి కొలపరాంబన్ అండమాను ను స్థిరనివాసం చేసుకున్నారు.

**కుంజర కథుకల్లన్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921–22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో కుంజర కథుకల్లన్ (Kunjara Kathukallan) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించింది. ఆ సెల్యూలర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న ప్రత్యేక నిర్ణయం ప్రకారంగా అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఇతర మోప్లా యోధులతోపాటుగా ఆయనకు కూడా Agriculture Ticket జారీచేసింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కుంజర కథుకల్లన్ తిరిగి కేరళకు వెళ్ళకుండా ఆయన అండమానును స్థిరనివాసం చేసుకున్నారు.

**కుంజయమ్మూన్ ముక్రి** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921–22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో జాతీయోద్యమంలో భాగంగా సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు' లో కుంజయమ్మూన్ ముక్రి (Kunjayammun

Mukri) చురుగ్గా పాల్గొన్నారు. ఆంగ్ల ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యూలర్ జైలులో ఆయన చాలా కాలం బంధించబడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఇతర ఉద్యమకారులతో పాటుగా ఆయనకు కూడా Agriculture Ticket జారీచేసింది. ఆ తరువాత ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం పూర్తిగా ముగిశాక కుంజయమ్మాన్ ముక్రి అండమానును స్థిరనివాసం చేసుకుని అక్కడే ఉండిపోయారు.

**కుంజేడు నిహియిల్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్మాక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో కుంజేడు నిహియిల్ (Kunjeedu Neehiyil) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కుంజేడు నిహియిల్ అండమానులో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు.

**కుంజి ఖాదర్ మొల్ల** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్మాక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో కుంజి ఖాదర్ మొల్ల (Kunji Khader Molla) చురుగ్గా పాల్గొన్నారు. ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసింది. ఆంగ్ల న్యాయస్థానం విచారణ తంతు నిర్వహించి కఠినకాగార శిక్షను విధిస్తూ ఆయనకు అండమాను లోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కుంజి ఖాదర్ మొల్ల అండమానులో స్థిరపడిపోయారు.

**కుట్టీ హసన్ చక్కుపురక్కల్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో జాతీయోద్యమంలో భాగంగా మలబారు ప్రాంతంలో సాగిన చారిత్మాక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో కుట్టీ హసన్ చక్కుపురక్కల్ (Kutty Hasan

Chakkupurakkal) చురుగ్గా పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు చేపట్టడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket జారీ చేసింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత కుట్టీ హసన్ చక్కుపురక్కల్ అండమానులో స్థిరపడ్డారు.

**మరక్కార్ పూయికుంమాన్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. బ్రిటిష్ ప్రభుత్వం వత్తాసుతో భూస్వాములు స్థానిక రైతుల మీద సాగిస్తున్న దుష్కృత్యాలకు, ఆధిపత్యానికి వ్యతిరేకంగా శతాబ్దం క్రితం కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో ఆరంభమైంది. 1921-22 నాటికి జాతీయోద్యమంలో భాగంగా మారిన ఆ చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో మరక్కార్ పూయికుంమాన్ (Marakkar Pooyikuman) చురుగ్గా పాల్గొన్నారు. ఆ తరువాత అలీ సోదరులు, మహాత్మాగాంధీ తదితర జాతీయోద్యమ నాయకుల జోక్యం, ప్రమేయంతో ఆ మలబారు మోప్లా రైతాంగ పోరాటం కాస్తా మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు ఆకాంక్షిస్తూ ఆరంభమయిన జాతీయోద్యమం దిశగా మలుపులు తిరిగి అందులో పూర్తిగా భాగమయ్యింది. ఆ మహత్తర పోరాటంలో పాల్గొన్నందున మరక్కార్ పూయికుంమాన్ ను ఆంగ్ల ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆయన మీద పలు నేరాలను ఆపాదించిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి, ఆయనకు కఠినకారాగార శిక్షను విధించింది. ఆ శిక్ష మేరకు ఆయనను అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. ఆ తరువాత కొంతకాలానికి అండమాను దీవులలో వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత మరక్కార్ పూయికుంమాన్ అండమానును స్థిరనివాసం చేసుకున్నారు.

**మరక్కార్ మతూమ్మల్** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో మరక్కార్ మతూమ్మల్ (Marakkar Mathummal) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు

Agriculture Ticket జారీచేసింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత మరక్కార్ మతూమ్మల్ అండమానును శాశ్వతనివాసం చేసుకున్నారు.

**మొయిదీన్ కుట్టీ, పూలకుయ్యిల్ కున్హి :** కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో మొయిదీన్ కుట్టీ, పూలకుయ్యిల్ కున్హి (Moideen Kutty, Poolakuyyil Kunhi) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి శిక్ష విధించింది. ఆయనను అండమాను శిక్షాక్షేత్రం లోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. ఆ సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత మొయిదీన్ కుట్టీ, పూలకుయ్యిల్ కున్హి అండమానులో స్థిరంగా ఉండిపోయారు.

**పొక్కార్ అనిపా :** కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో పొక్కార్ అనిపా (Pokkar Anipa) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత పొక్కార్ అనిపా అండమానులో స్థిరపడ్డారు.

**రాయిన్ మాచింగోల్ :** కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగుబాటు'లో రాయిన్ మాచింగోల్ (Rayin, Machingol) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు

Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత రాయిన్ మాచింగోల్ అండమానులో స్థిరనివాసం ఏర్పాటుచేసుకున్నారు.

**సైదాలిప్ప అంబత్తుపరంబం** : కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతం నివాసి. 1921-22 ప్రాంతంలో కేరళ రాష్ట్రం మలబారు ప్రాంతంలో సాగిన చారిత్రాత్మక 'మలబారు మోప్లా తిరుగబాటు'లో సైదాలిప్ప అంబత్తుపరంబం (Saidalippa Ambattuparambam) పాల్గొన్నారు. ఆయనను అరెస్టు చేసిన ఆంగ్ల ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించి అండమానులోని సెల్యులర్ జైలు (Cellular Jail) కు తరలించింది. అండమాను సెల్యులర్ జైలులో ఆయన చాలా కాలం బంధించ బడ్డారు. ఆ తరువాత కొంత కాలానికి అండమాను దీవులలో స్వయంగా వ్యవసాయ కార్యకలాపాలు నిర్వహించడానికి అనుమతిస్తూ ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు Agriculture Ticket ఇచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం ముగిసిన తరువాత సైదాలిప్ప అంబత్తుపరంబం అండమాను దీవులలో శాశ్విత నివాసం ఏర్పర్చుకుని అక్కడే స్థిరపడిపోయారు.



ఈ భాగంలో పొందుపర్చిన సమాచారం ప్రధానంగా

Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who

Dr. Rashida Iqbal,

(Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, Andaman, 2004)

మరియు

పలు ఇతర గ్రంథాలు, అధికారిక దస్త్రాల నుండి

సేకరించిన విశేషాలను జతచేసి రూపొందించబడింది.

మహాత్ముని అడుగుజాడలో భారత స్వాతంత్ర్య సమరం ఒకపక్కన అహింసాయుత పద్ధతులలో ముందుకు సాగుతుండగా మరోపక్కన ఆంగ్లేయుల నుండి మాతృభూమి విముక్తికి సాయుధపోరాటం మినహా మరో మార్గంలేదని నమ్మిన విప్లవకారులు, విప్లవోద్యమ సంస్థలు ఆ మార్గంలో తమ కార్యక్రమాలను ఆచరణలో పెట్టాయి. అహింసోద్యమం అసంఖ్యాకంగా ప్రజలను ఆకర్షిస్తున్న పరిణామాలను చూసి అధికారం కొల్పోతామన్న భయంతో ఆంగ్ల ప్రభుత్వం కిరాతక చట్టాలను రూపొందిస్తూ రాక్షస చర్యలకు పాల్పడింది. ఆ చర్యలు ప్రజలలో ఆగ్రహావేశాలను రెచ్చగొట్టటం వలన విప్లవోద్యమ సంస్థలు తమ చర్యలు ముమ్మరం చేశాయి. ఇంటా-బయటా కూడా అహింసోద్యమం, సాయుధపోరాట చర్యలు ఏకకాలంలో సాగుతూ ఆంగ్ల ప్రభుత్వ ఉద్వాసనకు అవసరమగు సానుకూల వాతావరణం బలోపేతం అయ్యేందుకు కారణమయ్యాయి.

1905 నాటి బెంగాల్ విభజన జాతీయోద్యమానికి గట్టి పునాదులు వేసింది. ఆ సందర్భంగా వెలుగులోకి వచ్చిన స్వదేశీ ఉద్యమం స్వదేశీ ఉత్పత్తుల వరకు పరిమితం కాకుండా స్వదేశీయుల పాలన అను దృక్పథాన్ని కూడా పటిష్టం చేసింది. ఆ తరువాత 1919 నాటి రౌలత్ చట్టం ఆంగ్లప్రభుత్వం పట్ల ఆగ్రహాన్ని రగిలించింది. ఖిలాఫత్-సహాయ నిరాకరణ ఉద్యమం ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను ఏకోన్ముఖం చేసింది. అందులో భాగంగా శాసనోల్లంఘన లాంటి ఉద్యమ కార్యక్రమాలను గాంధీజీ మార్గదర్శకంలో భారత జాతీయ కాంగ్రెస్ నిర్వహించింది. ఈ కార్యక్రమాల సందర్భంగా శాసనోల్లంఘన చర్యలలో పాల్గొన్న ఉద్యమకారుల పట్ల కూడా ఆంగ్ల ప్రభుత్వం అత్యంత క్రూరంగా వ్యవహరించింది.

ఆ క్రమంలో ఆంగ్ల వలసపాలకులను తుదముట్టించేందుకు విప్లవకర చర్యలు ఊపు అందుకున్నాయి. ఖిలాఫత్-సహాయనిరాకణ ఉద్యమం ఆరంభానికి ముందు నుండి

పంజాబు, మహారాష్ట్ర, బెంగాలు తదితర ప్రాంతాలలో పురుడు పోసుకున్న అనుశీలన సమితి, జుగాంతర్, అభినవ భారతి, మిత్రమేళ, నౌజవాన్ భారత్ సభ, అభినవ భారత సమాజ్, ఆత్మోన్నత సమితి, డాన్ సొసైటీ, సొసైటీ ఫర్ ది రిమూవల్ ఆఫ్ అబ్జికల్స్, భారతమాత సొసైటీ, గదర్ పార్టీ, 'హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్', హిందూస్థాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీ లాంటి విప్లవ సంస్థలు, సంఘాలు ఇంటా-బయటా తమ విప్లవ చర్యలను, కార్యక్రమాలను చురుగ్గా ఆచరణలో పెట్టాయి.

1925లో పండిత రాంప్రసాద్ బిస్మిల్, అష్ఫాఖుల్లాహ్ ఖాన్ లాంటి విప్లవకారులు నిర్వహించిన కాకోరి రైలు దోపిడి సంఘటన, 1927 నాటి ఆంగ్లేయ పోలీసు అధికారి శాండర్స్ (Saunders) హత్య, 1929లో సెంట్రల్ అసెంబ్లీలో సర్దార్ భగత్ సింగ్ విసిరిన బాంబు సంఘటనలు చరిత్ర సృష్టించాయి. విప్లవకారులు విజృంభించి విప్లవకర కార్యక్రమాలతో ఆంగ్లేయ పాలకులను భయకంపితులను చేసిన సమయాన్ని చరిత్రకారులు భారత స్వాతంత్ర్యోద్యమంలో 'అగ్నియుగం'గా పిలిచారు. ఆ అగ్నియుగం ఉధృతిని అరికట్టడానికి ఆంగ్ల ప్రభుత్వం విప్లవ సంస్థల మీద విరుచుక పడి, విప్లవకారులను కఠిన శిక్షలకు గురి చేసింది. ఆ శిక్షలకు వెరవని విప్లవోద్యమకారులు ఆంగ్ల ప్రభుత్వాధికారులను భయోత్పాతానికి గురిచేస్తూ 1932-38 మధ్య కాలంలో నిర్వహించిన దాడులు, కాల్పుల సంఘటనలు వివిధ కేసులుగా నమోదయ్యాయి.

ఈ మేరకు 1932 నుండి 1938 వరకు జరిగిన పలు విప్లవకర చర్యల మీద ఆంగ్ల ప్రభుత్వం నమోదు చేసిన కొన్ని ప్రధాన కేసులు ఇలా ఉన్నాయి : Barisal (Singa-Gaurnadi) Robbery case 1932; Planning Assassination of Greham; Magistrate of Mymensingh District 1932; Attempt to murder of Rajashahi, The Jail Superintendent of Police Mr. C.A.W.Luke Case 1932; Attempt to murder Alfred Watson, the Editor of The Statesman Magazines Case, 1932; Assassination of Robert Douglas, District Magistrate of Midnapur Case 1932; Barisal Action Case 1932, Attempt to Assassinate Police Superintendent Grassby Case 1932; Attempt to Assassinate Police Superintendent Grassby Case 1932; Kishoregunj Action Case 1932, Mymensingh Conspiracy Case 1932; Angariya Robery Case 1932, Netrakona Arms Conspiracy Case 1932; Charmuguria Action Case 1932; Tangaile Action Case 1932; Medda Robbery Case 1932; Brahmanberia Arms Case 1932, Dhaka Railway Station Action Case 1932 – 33 (Known as Faridpur Bomb Case); Bankura Robbery Case 1933; Dhamrai Mail Action Case 1933; Assassination of B. E. J. Burge, Magistrate of Midnapore District, 1933; Cornwallis Street (Kolkata) Conspiracy Case 1933; Kamalpur Action Case -

1933; Subalpur (Birbhum) Conspiracy Case 1933; Itkhola (Srihatta) Robbery Case 1933; Inter Provincial Insurgent Case 1933; Kuniati Action Case 1933; Hili (Dinajpur) Conspiracy Case 1933; Naldanga (Rangpur) Robbery Case 1933; Kurigram (Rangpur) Conspiracy Case 1933;Kusthia Arms Conspiracy Case 1933, Dinajpur Action Case 1933-34; Jharia Conspiracy Case 1934; Midnapur Conspiracy Case 1934; Bathua Conspiracy Case 1934; Lebong (Darjeeling) Conspiracy Case 1934; Nawadwip-Nadia Arms Conspiracy Case 1935; Manicktala Arms Conspiracy Case 1936.

ఈ కేసులలో నిందితులందరికి శిక్షలు పడేలాగా ఆంగ్ల ప్రభుత్వం కట్టుదిట్టమయిన చర్యలను తీసుకుంది. ఆంగ్లేయాధికారులను భయోత్పాతానికి గురిచేస్తూ ఆంగ్ల ప్రభుత్వాన్ని కలవర పెట్టిన విప్లవకారుల పట్ల, విప్లవ సంస్థలు, సంఘాల పట్ల అత్యంత కఠినంగా వ్యవహరించింది. ప్రధానంగా విప్లవకారులకు ఉరిశిక్షలు విధిస్తూ అది సాధ్యం కానట్టయితే సుదీర్ఘ కఠిన కారాగార శిక్షలకు గురిచేసింది. ఆంగ్ల ప్రభుత్వానికి, ఆంగ్ల పోలీసులకు, ఆంగ్ల సైన్యాలకు కూడా నేరుగా సవాళ్ళు విసిరి ప్రత్యక్షంగా పోరాటాలకు దిగిన విప్లవకారులను కడు ప్రమాదకారులుగా పరిగణిస్తూ వారిని భారత ప్రధాన భూభాగంలోని ప్రజానీకం నుండి కడు దూరంగా ఉంచాలని నిర్ణయించిన ఆంగ్ల ప్రభుత్వం సుదీర్ఘ కాలపరిమితి గల కారాగార శిక్షలు విధించి అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించడం పరిపాటి అయ్యింది.

**అబ్దుల్ ఖాదిర్ చౌదరి** : అప్పటి బెంగాల్ ప్రోవిన్స్ ఇప్పటి బంగ్లాదేశ్ లోని రాజాషాహి (Rajashahi) డివిజన్ లోని బోగ్రా (Bogra) జిల్లాకు చెందిన ఖేత్‌లాల్ (Khetlal) ప్రాంతపు కాంతాహార్ (Kantahar) గ్రామం నివాసి. ఆయన తండ్రి పేరు మౌల్వీ అబ్దుల్ లతీఫ్ చౌదరి. అబ్దుల్ ఖాదిర్ చౌదరి (Abdul Qadir Chaudhury) 1901 నవంబరు 10న జన్మించారు. మాతృభూమి నుండి ఆంగ్లేయులకు ఉద్వాసన పలకాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న'అనుశీలన సమితి' సభ్యులయ్యారు. 1933 అక్టోబర్ 28/29న తపాలా శాఖకు చెందిన నగదు సంచులతో వెడుతున్న డార్జిలింగ్ మెయిల్ రైలు మీద సాయుధులైన అనుశీలన సమితి విప్లవకారులు దాడి చేశారు. ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం పలువురు విప్లవకారులను అరెస్టు చేసి కేసును నమోదు చేసింది. ఆ కేసులో 1934 ఫిబ్రవరి 27న అబ్దుల్ ఖాదిర్ చౌదరికు యావజ్జీవిత కారాగారశిక్ష పడింది. ఆ శిక్ష కాస్తా ఏడేండ్ల కఠిన కారాగారశిక్షగా మారింది. 1935లో అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించబడిన ఆయన 1937-38లో జైలు నుండి విముక్తి పొందారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అబ్దుల్ ఖాదిర్ చౌదరి వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**మొల్లా జీవన్ :** ప్రస్తుత బంగ్లాదేశ్‌లోని ఢాకా డివిజన్ ఫరీద్‌పూర్ జిల్లాలోని ఫరీద్‌పూర్ (Faridpur) పట్టణం, అప్పటి బ్రిటిష్ ఇండియాలోని ఫరీద్‌పూర్ నివాసి. ఆయన తండ్రి మొల్లా కలగాలి. 1911 లో జన్మించిన మొల్లా జీవన్ (Molla Jeevan) ను విప్లవోద్యమ సహచరులు అబ్దుల్ జబ్బార్ (Abdul Jabbar) అని పిలుచుకున్నారు. ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవోద్యమంలో పాల్గొంటూ పలు విప్లవకర చర్యలకు పాల్పడుతున్నారన్న ఆరోపణల మీద 1936లో మొల్లా జీవన్‌ను ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ఆయన మీద పలు ఆరోపణలతోపాటుగా పేలుడు పదార్థాల చట్టం (Explosives Act) సెక్షన్ 4 మరియు 5ల క్రింద పేర్కొన్న నేరాలకు కూడా పాల్పడ్డారంటూ కేసు నమోయ్యింది.

ఈ కేసును ఫరీద్‌పూర్‌లో ఏర్పాటు చేసిన ప్రత్యేక మేజిస్ట్రేట్ కోర్టు (Special Magistrate of Faridpur) న్యాయమూర్తి పిసి మజుందార్ (PC Mazumdar) విచారించి మొల్లా జీవన్‌కు ఐదు సంవత్సరాల కఠిన కారాగారశిక్షను విధిస్తూ తీర్పు చెప్పాడు. ఆ తీర్పు మేరకు విప్లవకారుడు మొల్లా జీవన్‌ను తొలుత అలీపూర్ కేంద్ర కారాగారానికి తలించారు. అలీపూర్ జైలులో ఆయన ఖైది నం. 3659 (Prisoner No.3659) గా పరిగణించ బడ్డారు. ఆ తరువాత 1937లో ఆయనను అలీపూర్ జైలు నుండి అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు పంపించారు. ఆ జైలులో Permanent Incarceration No. 395గా ఆయన నమోదయ్యారు. చివరకు 1937-38 ప్రాంతంలో మొల్లా జీవన్ అండమానులోని సెల్యులర్ జైలు నుండి విడుదలయ్యారు.

**మొహమ్మద్ ఇబ్రహీం :** పశ్చిమ బెంగాల్ రాష్ట్ర రాజధాని కలకత్తా నగరం నివాసి. ఆయన తండ్రి అబ్దుల్ హుసైన్. మొహమ్మద్ ఇబ్రహీం (Mohammed Ebrahim) 1907లో కలకత్తాలో జన్మించారు, విప్లవోద్యమకారుడు ఇబ్రహీం 'తారాదాస్' (Tara Das) అను మరొక నామంతో కూడా చలామణి అయ్యారు. విప్లవోద్యమ కార్యక్రమాలలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు. ఆ కారణంగా ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం మొహమ్మద్ ఇబ్రహీం ను Calcutta Letter Conspiracy Case – 1935 లో దోషిగా పేర్కొంది. 1935లో ఆయనను ఆంగ్ల ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆయన మీద పలు నేరారోపణలు చేసి కలకత్తాలోని అసిస్టెంట్ ఛీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ (Assistant Chief Presidency Magistrate, Calcutta) కోర్టులో ఇబ్రహీంను హాజరుపర్చారు.

ఆయన మీద భారత శిక్షాస్మృతిలోని 387/120-B, 335/114 మరియు 186 సెక్షన్స్ క్రింద Calcutta Letter Conspiracy Case – 1935 ఆంగ్ల ప్రభుత్వం నమోదు

చేసింది. ఆ తరువాత ఆ కేసును విచారించిన న్యాయస్థానం మొహమ్మద్ ఇబ్రహీంను నేరస్థునిగా నిర్ధారించింది. అనంతరం 1935లో ఆయనకు ఐదు సంవత్సరాల తొమ్మిది మాసాల కఠిన కారాగారశిక్ష విధిస్తూ తీర్పు చెప్పింది.

ఆంగ్ల న్యాయస్థానం తీర్పు ప్రకారంగా తొలుత ఆయనను అలీపూర్ లోని ప్రెసిడెన్సీ జైలుకు (Presidency Jail, Alipore) పంపారు. అలీపూర్ ఖైదులో మొహమ్మద్ ఇబ్రహీం ఖైది నం.960 (Prisoner No.960) గా పరిగణించబడ్డారు. అనంతరం కొంత కాలానికి అలీపూర్ జైలు నుండి అండమానులోని సెల్యులర్ జైలుకు ఆయనను తరలించారు. అండమానులోని సెల్యులర్ జైలులో Permanent Incarceration No. 370 గా మొహమ్మద్ ఇబ్రహీం పరిగణించబడ్డారు. ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న సరికొత్త నిర్ణయాల మేరకు 1937-38 ప్రాంతంలో మొహమ్మద్ ఇబ్రహీం సెల్యులర్ జైలు నుండి విముక్తమయ్యారు.

**సిరాజుల్ హక్** : పశ్చిమ బెంగాల్ రాజధాని కలకత్తా నగరంలోని సీతారాం ఘోష్ వీధిలోని అప్పటి ఇంటి నం.4 నివాసి. 1905లో జన్మించిన సిరాజుల్ హఖ్ (Siraj-ul-Haz) తండ్రి పేరు మౌల్వీ అబ్దుల్ జలీల్. మాతృభూమి నుండి ఆంగ్లేయులకు ఉద్వాసన పలకాలంటే సాయుధపోరాట మార్గం ఒక్కటే బలమైన సాధనంగా భావించిన సిరాజుల్ హఖ్ విప్లవోద్యమాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆ క్రమంలో ఆయన విప్లవోద్యమ కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు.

1932లో కలకత్తా ఆయుధాల చట్టం (Calcutta Arms Act) క్రింద పలు నేరాలకు పాల్పడ్డారన్న ఆరోపణల మీద ఆంగ్ల ప్రభుత్వాధికారులు సిరాజుల్ హఖ్‌ను అరెస్టు చేశారు. ఈ మేరకు Calcutta Arms Act Case ను ఆయన మీద నమోదు చేసారు. ఆయన మీద కలకత్తాలోని ప్రధాన ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ కోర్టులో (Chief Presidency Magistrate, Calcutta) విచారణ జరిగింది. ఆ విచారణలో ఆంగ్లేయ పోలీసులు కలకత్తా ఆయుధాల చట్టంలోని సెక్షన్స్ 19-యఫ్, 20 ప్రకారంగా సిరాజుల్ హసన్ పలు నేరాలు చేశారని ఆరోపించారు. ఆ ఆరోపణల మీద విచారించిన న్యాయస్థానం ఆయనను దోషిగా పేర్కొంది. అనంతరం 1932 ఫిబ్రవరి ఒకటిన విప్లవకారుడు సిరాజుల్ హఖ్‌కు ఐదు సంవత్సరాల కఠిన కారాగార శిక్షను విధిస్తూ న్యాయస్థానం తీర్పు చెప్పింది.

ఆ తీర్పు మేరకు తొలుత సిరాజుల్ హఖ్‌ను అలీపూర్ కేంద్ర కారాగారానికి తరలించారు. అ కారాగారంలో ఖైదీ నం. 9549గా ఆయన నమోదయ్యారు. ఆ తరువాత 1932లో ఆయనను అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించారు.

అండమానులోని సెల్యూలర్ జైలులో ఆయన Permanent Incarceration No.40 గా పరిగణించ బడ్డారు. ఆ తరువాత ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న రాజకీయ నిర్ణయం మేరకు ఇతర సమరయోధులతోపాటుగా విప్లవకారులు సిరాజుల్ హఖ్ కూడా 1937లో అండమాను సెల్యులర్ జైలు నుండి విడుదలయ్యారు.

**గమీరుద్దీన్ సర్కార్** : పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని దినాజ్‌పూర్ (Dinajpur) జిల్లా. బల్లూర్‌ఘాట్ (Ballurghat) గ్రామం నివాసి అయినటువంటి గమీరుద్దీన్ సర్కార్ (Gamiruddin Sarkar) విప్లవోద్యమాల పట్ల ఆకర్షితులయ్యారు. 1934 జూలై 13న దినజ్‌పూర్ (Dinajpur) జిల్లా, బల్లూర్‌ఘాట్ (Ballurghat) పోలీసుస్టేషన్ పరిధిలోని బొల్లా (Bolla) గ్రామానికి చెందిన సంపన్నుడు ప్రాణబంధు చౌదురి (Pranabandhu Chowdhury) ఇంటి మీద విప్లవకారుల దళం దాడిని నిర్వహించింది. ఆ దాడిలో పాల్గొన్నందుకు గాను 1934 ఫిబ్రవరి 12న ప్రత్యేక ట్రిబ్యునల్ (Special Tribunal) గమీరుద్దీన్ సర్కార్ కు ఆరు సంవత్సరాల కఠిన కారాగారశిక్ష విధించింది.

ఆ తరువాత న్యాయస్థానం తీర్పు మేరకు 1936లో ఆంగ్లేయాధికారులు గమీరుద్దీన్ సర్కార్‌ను అండమాను శిక్షాక్షేత్రం లోని సెల్యులర్ జైలుకు తరలించారు. ఆ తరువాత నూతన రాజకీయ పరిణామాల నేపథ్యంలో ఆంగ్ల ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాల మూలంగా పలువురు ఇతర సమరయోధులతోపాటుగా 1937-38లో అండమాను సెల్యులర్ జైలు నుండి విప్లవకారులు గమీరుద్దీన్ సర్కార్ కూడా విముక్తి పొందారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో గమీరుద్దీన్ సర్కార్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**



ఈ భాగంలో పొందుపర్చిన సమాచారం ప్రధానంగా

Unsung Heroes of Freedom Struggle in Andamans - Who's Who

Dr. Rashida Iqbal,

(Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, Andaman, 2004)

And

Several Books and Documents, Photos received from

Veteran Historian, Author Mr M Ahmad Mujtaba (Alig)

(Aberdeen Bazar, Port Blair, Andaman Islands),

మరియు

పలు ఇతర గ్రంథాలు, అధికారిక దస్త్రాల నుండి

సేకరించిన విశేషాలను జతచేసి రూపొందించబడింది.

ద్వితీయ ప్రపంచ యుద్ధం (1939-1945) లో బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) మీదకు అక్షరాజ్యాల (Axis Powers) సైన్యాలను నడిపిస్తున్న జపాన్ తొలిదశలో విజయపతాకం ఎగురవేస్తూ 1942 మార్చి 13న రంగూన్‌ను స్వాధీనం చేసుకుంది. చివరకు 1942 మార్చి 23న అండమాను-నికోబారు దీవులను ఆక్రమించి జపాన్ సైనికులు ఆ దీవులను తమ గుప్పెటలోకి తెచ్చుకున్నారు. ఆ తరువాత ఆ దీవులను భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధులు నేతాజి సుభాష్ చంద్ర బోస్ నేతృత్వంలో ఏర్పడిన 'ఆజాద్ హింద్ ప్రభుత్వం' (Azad Hind Government) పరం చేస్తున్నట్టుగా జపాన్ ప్రధాని జనరల్ టోజో (General Tojo) 1943 అక్టోబర్ 28న జపాన్ రాజధాని టోకియోలో బహిరంగంగా ప్రకటించారు. ఆ ప్రకటనతో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా విప్లవోద్యమం నడుపుతున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence Leauge), ఆంగ్ల సైన్యాలతో బహిరంగంగా తలపడుతున్న 'భారత జాతీయ సైన్యం' (Indian National Army) శాఖలు కూడా అండమాను దీవులకు చేరుకున్నాయి.

1857 నుండి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు, ఆ తరువాతి కాలంలో ఉద్యమించిన విప్లవకారులు, ఆ సమర యోధుల వారసులతో నిండి ఉన్న అండమాను దీవుల్లోకి ప్రవేశించిన 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్', 'భారత జాతీయ సైన్యం' ప్రజల మద్దతుతో క్రమంగా బలోపేతం కాసాగాయి. అండమాను దీవుల్లోని వివిధ ప్రాంతాలలో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' శాఖలు ఏర్పడ్డాయి, 'భారత జాతీయ సైన్యం'లో యువకులు పెద్ద సంఖ్యలో చేరారు. జపాన్ ప్రధాని జనరల్ టోజో (General Tojo) ప్రకటనతో స్వంత భూమిని సంతరించుకున్న ఆజాద్ హింద్ ప్రభుత్వం అండమాను దీవుల మీద జాతీయ పతాకాన్ని ఎగురవేసి, ఆంగ్లేయుల అధిపత్యం నుండి విముక్తి పొందిన ప్రాంతంగా అండమానును ప్రకటించింది. అండమాను-నికోబారు దీవులకు

'షహీద్-స్వరాజ్' (Shaheed-Swarj) అను పేర్లను అజాద్ హింద్ ప్రభుత్వం ప్రకటించింది. 1858 జనవరి ఒకటిన బ్రిటిష్ పతాకం ఎగిరిన అండమాను-నికోబారు దీవులు 1942 మార్చి 23న నుండి ఆజాద్ హింద్ ప్రభుత్వ పరమయ్యాయి.

అండమాను దీవుల్లో ప్రవేశించిన రోజున ఆసియావాసులంతా తమ సోదరులని, ఆంగ్లేయులు మాత్రమే తమ శత్రువులని, అందువలన అండమాను వాసులకు తమ వలన ఎటువంటి ఇబ్బందులు ఉండవని జపాన్ సైన్యాధికారులు ప్రకటించారు. ఆ క్రమంలో ఆంగ్ల ప్రభుత్వం ద్వారా సెల్యులర్ జైలులో బంధించబడి ఉన్న స్వాతంత్ర్య సమరయోధుల తోపాటుగా ఇతర ఖైదీలనూ విడుదల చేశారు. ఈ పరిణామాలతో అండమాను-నికోబారు (షహీద్-స్వరాజ్) దీవులలోని స్వాతంత్ర్య సమరయోధులు, ఆ యోధుల కుటుంబీకులు, ఇతర ప్రాంతాల నుండి వచ్చి అండమానులో స్థిరపడిన ప్రజలు ఎంతగానో సంతోషించారు.

జపాన్ సైన్యాధికారుల ప్రకటనలు కలుగజేసిన ఆ సంతోషం అండమాను-నికోబారు వాసులకు ఎన్నోరోజులు నిలవలేదు. అండమాను ప్రజలకు తాము మిత్రులమంటూ ఇటు జపాను సైన్యాధికారులు సానుకూల ప్రకటనలు గుప్పిస్తుండగా అటు జపాను సైనికుల ఆగడాలు ఆరంభమయ్యాయి. అండమాను ఆక్రమించిన విజయోత్సాహంతో ఉన్న జపాన్ సైనికులను ఉల్లాసపర్చేందుకు జపాన్ సైన్యాధికారులు 1942 మార్చి 24న వారికి కొంత స్వేచ్ఛనిస్తూ ఆటవిడుపు కల్పించారు. ఆ అవకాశంతో జపాన్ సైనికులు జనవాసాల మీద పడ్డారు. అడ్డూ-ఆపూ లేదంటూ, అందిందంతా తమ స్వంతమంటూ కనపడినదంతా ఎత్తుకపోతూ, తెంపరితనంతో విచ్చలవిడిగా వ్యవహరించసాగారు. జపాన్ సైనికుల స్వైరవిహారంతో ఆరంభమైన ఆకతాయితనం పరాకాష్టకు చేరుకుని ఆడపడుచులను భౌతికంగా అవమానపర్చే స్థాయికి చేరుకుంది. ఆ చర్యలను ఏమాత్రం సహించలేక, జపాన్ సైనికులను అడ్డుకోలేక ప్రజలు అఘాయిత్యాలను, అవమానాలను దిగ మింగుకుని మిన్నకున్నారు. ప్రతిఘటన ఏమాత్రం లేకపోవటంతో మరింతగా పెచ్చరిల్లిన జపాన్ సైనికులు అబెర్‌దీన్ గ్రామంలోని ఇళ్ళల్లోకి ప్రవేశించసాగారు.

ఆ క్రమంలో ఆషిక్ అలీ ఇంటిలోకి ప్రవేశించి ఆ ఇంటి మహిళల పట్ల అసభ్యంగా ప్రవర్తించారు. అందుకు ఆగ్రహించిన జుల్ఫిఖార్ అలీ / సన్నీ (Zulfiquer Ali / Sunny) అను యువకుడు తుపాకితో జపాన్ సైనిక మూకల దిశగా కాల్పులు జరిపాడు. ఆ చర్యతో అప్పటికి పారిపోయిన జపాన్ సైనికులు ప్రతీకారచర్యకు పూనుకున్నారు. అబెర్‌దీన్ గ్రామాన్ని దిగ్బంధనం చేసి గ్రామంలోని గృహాలను తగులబెట్టడం ఆరంభించారు. పోలీసు బలగాల

ప్రధానాధికారి నారాయణ రావు జోక్యంతో అప్పటికి తమ విధ్వంసక చర్యలను విరమించుకున్న సైనికులు జుల్ఫిఖార్‌ను తమ ఎదుట హాజరు పెట్టమని డిమాండ్‌ చేశారు. ఆ డిమాండుకు అనుగుణంగా 25 మార్చి 1942న జుల్ఫిఖార్‌ అలీని హాజరుపర్చారు. బహిరంగ ప్రదేశంలో జుల్ఫిఖార్‌ అలీని ఒక స్తంభానికి కట్టివేసి గ్రామస్తులందరి సమక్షంలో అతడ్ని దారుణాతి దారుణంగా హింసించి, చిత్రహింసలకు గురిచేసి క్రూరంగా కాల్చి చంపారు.

ఆ సంఘటనతో పతాకస్థాయికి చేరిన జపాన్‌ సైనికుల పైశాచిక కాండ, ఉన్నత సైన్యాధికారుల కిరాతక చర్యలు, భయానక నిర్ణయాలు అండమాను లోని స్వాతంత్ర్య సమరయోధులను, సమరయోధుల కుటుంబీకులను, ప్రజలను పెద్ద సంఖ్యలో బలి తీసుకున్నాయి. అండమాను దీవులలో ఉన్న ప్రజలను, ఇండియన్‌ ఇండిపెండెన్స్‌ లీగ్‌, భారత జాతీయ సైన్యంలోని సభ్యులను అనుమానపు దృక్కులతో చూస్తూ, బ్రిటిష్‌ ప్రభుత్వం ఏజెంట్లుగా, గూఢచారులుగా ముద్రలు వేసి సామూహిక హత్యాకాండకు జపాన్‌ సైన్యం పాల్పడింది. ఆ కారణంగా 1945 ఆగస్టు 15న బ్రిటిష్‌ సైన్యాలు జపానీయుల నుండి అండమానును తిరిగి స్వాధీనం చేసుకున్నప్పుడు అండమాను వాసులు హర్షాతిరేకాలు వ్యక్తంచేస్తూ ఆంగ్ల సైనికులకు ఎదురు వెళ్ళి స్వాగతం పలికారు.

**మున్షీ జుల్ఫిఖార్‌ అలీ :** అండమాను-నికోబారు దీవులలోని అబెర్‌దీన్‌ (Aberdeen) గ్రామం నివాసి. ఆయన తండ్రి పేరు మున్షీ అక్బర్‌ అలీ (Munshi Akbar Ali). స్వేచ్ఛా-స్వతంత్ర భావాలు కలిగిన ఇరువది ఏండ్ల యువకుడు మున్షీ జుల్ఫిఖార్‌ అలీ (Munshi Zulfiquer Ali) ని సన్నీ (Sunny) అని కూడా పిలుస్తారు. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో భాగంగా జపాన్‌ సైన్యాలు ఆంగ్ల సైన్యాలను పరాజితులను చేస్తూ ముందుకు సాగి 1942 మార్చి 22న పోర్టు బ్లేయర్‌ను ఆక్రమించుకుని అండమాను-నికోబారును హస్తగతం చేసుకున్నాయి. ఆంగ్లేయుల మీద సాధించిన విజయాలతో విజయోత్సాహంతో ఉన్న జపాన్‌ సైనికులకు అబెర్‌దీన్‌ గ్రామంలోని మహిళల పట్ల సైనికులు అసభ్యంగా ప్రవర్తించారు. అందుకు ఆగ్రహించిన యువకుడు జుల్ఫిఖార్‌ సైనిక దుండగుల మీద కాల్పులు జరిపాడు. ఆగ్రహించిన జపాన్‌ సైనికులు ప్రజలలో భయోత్పాతం సృష్టించేందుకు జుల్ఫిఖార్‌ అలీని బంధించి భయానక చిత్రహింసలకు గురిచేసి, గ్రామస్తుల సమక్షంలో 1942 మార్చి 26న బహిరంగంగా కాల్చి చంపారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో మున్షీ జుల్ఫిఖార్‌ అలీ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**అబ్దుల్ జలీల్** : అండమాను-నికోబారు దీవుల్లోని అండమాను ప్రాంతపు పోర్టు బ్లయర్ (Port Blair), అబెర్‌దీన్ బజార్ (Aberdeen Bazar) నివాసి అబ్దుల్ జలీల్ (Abdul Jalil) 1910 ఫిబ్రవరి 15న జన్మించారు. తండ్రి పేరు మొహమ్మద్ నజీర్ (Mohammad Nazeer). అబ్దుల్ జలీల్ ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయులు. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్న నేరారోపణలకు గురిచేసి, 1944 జనవరి 30న అబ్దుల్ జలీల్‌ను జపాన్ సైనికులు కాల్చి చంపారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో అబ్దుల్ జలీల్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**అబ్దుల్ అహమ్మద్** : అండమాను దీవుల్లోని పోర్టు బ్లెయర్ ప్రాంతంలోని జంగ్లీఘాట్ (Junglighat) నివాసి అయినటువంటి అబ్దుల్ అహమ్మద్ (Abdul Ahammad) 1923 మే ఒకటిన జన్మించారు. ఆయన తండ్రి పేరు రోషన్ (Roshan). ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో పోరాడుతున్న భారత జాతీయ సైన్యంలో ఆయన సభ్యులయ్యారు. అబ్దుల్ అహమ్మద్ పోర్టు బ్లెయర్ కేంద్రంగా భారత జాతీయసైన్యం కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆయన చర్యల పట్ల అనుమానపు దృక్కులు సారించిన జపాన్ సైనిక బృందం 1943 సెప్టెంబర్ లో ఆయనను అరెస్టు చేసింది. అండమాను లోని సెల్యులర్ జైలులో ఆయనను నిర్బంధించి పలు కిరాతకచర్యలకు గురిచేసిన జపాన్ సైనికబృందం కొద్దిరోజుల తరువాత ఆయనను విడుదల చేసింది. ఆ తరువాత 1976లో అబ్దుల్ అహమ్మద్ అండమానులో కన్నుమూసారు.

**అబ్దుల్ గఫూర్ యం** : అండమాను దీవుల్లోని పోర్టు బ్లేయర్ నివాసి అయినటువంటి యం. అబ్దుల్ గఫూర్ (M Abdul Gafoor) 1910 మార్చి ఒకటిన జన్మించారు. అబ్దుల్ గఫూర్ చర్యల పట్ల అనుమానపు దృక్కులు సారించిన జపాన్ సైనిక బృందం పలు మార్లు ఆయనను అరెస్టు చేసి విడిచిపెట్టింది. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో యం. అబ్దుల్ గఫూర్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**అబ్దుల్ జబ్బార్** : అండమాను దీవుల్లోని అండమాను ప్రాంతపు పోర్టు బ్లేయర్ (Port Blair), అబెర్‌దీన్ బజార్ (Aberdeen Bazar) నివాసి అబ్దుల్ జబ్బార్ (Abdul Jabbar) 1923 జనవరి 14న జన్మించారు. ఆయన తండ్రి పేరు అబ్దుల్ సుభాన్ (Abdul Subhan). ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో పోరాడుతున్న భారత జాతీయ సైన్యం (Indian National Army) లో ఆయన సభ్యులు అయ్యారు. ఆజాద్ హింద్ ప్రభుత్వం (Azad Hind Government) ఏర్పాటు

విషయంలో ఆయన ఎంతగానో సహకరించారు. ఆయన మీద అనుమానపు దృక్కులు సారించిన జపాన్ సైనిక బృందం 1944 ఆగస్టులో ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో నిర్బంధించింది. పలుమార్లు చిత్రహింసల పాల్జేసి, మూడు నెలల తరువాత ఆయనను విడుదల చేసింది. అబ్దుల్ జబ్బార్ 1993 నవంబరు 17న కన్నుమూసారు.

**యం. అబ్దుల్ ఖాలిఖ్ :** అండమాను దీవుల్లోని అండమాను ప్రాంతపు పోర్టు బ్లెయర్ (Port Blair), అబెర్‌దీన్ బజార్ (Aberdeen Bazar) నివాసి యం. అబ్దుల్ ఖాలిఖ్ (M. Abdul Khaliq). ఆయన 1921 ఆగస్టు 26న జన్మించారు. ఆయన తండ్రి పేరు యం. అబ్దుల్ రవూఫ్ (M. Abdul Rauf). అబ్దుల్ ఖాలిఖ్ ప్రభుత్వ వాతావరణ శాఖ (Meteorological Department) ఉద్యోగి. ఆంగ్లేయుల పాలకుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) లో ఆయన సభ్యులయ్యారు. పోర్టు బ్లెయర్ కేంద్రంగా ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యక్రమాలలో ఆయన చురుగ్గా పాల్గొన్నారు. అబ్దుల్ ఖాలిఖ్ చర్యల పట్ల అనుమానపు దృక్కులు సారించిన జపాన్ సైనిక బృందం 1943 జనవరి 22న ఆయనను అరెస్టు చేసింది. ఆ తరువాత సెల్యులర్ జైలులో బంధించి చిత్రహింసల పాల్జేసింది. చివరకు 1943 మార్చి 30న జపాన్ సైనిక బృందంలోని ఫైరింగ్ స్క్వాడ్ అబ్దుల్ ఖాలిఖ్‌ను డుగ్నాబాద్ సముద్ర తీరానికి (Dugnabad Shore) తీసుకెళ్ళి అక్కడ అమానుషంగా కాల్చి చంపింది. అనంతరం యం.అబ్దుల్ ఖాలిఖ్ పార్థివ శరీరాన్ని అండమానులో ఖననం చేశారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో యం. అబ్దుల్ ఖాలిఖ్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**అబ్దుల్ ఖాదిర్ :** అండమాను దీవుల్లోని అండమాను ప్రాంతపు పోర్టు బ్లెయర్ (Port Blair), అబెర్‌దీన్ బజార్ (Aberdeen Bazar) నివాసి అబ్దుల్ ఖాదిర్ (Abdul Qader) 1919 మే 11న జన్మించారు. ఆయన తండ్రి పేరు అబ్దుల్ మజీద్ (Abdul Majeed). ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో పోరాడుతున్న భారత జాతీయ సైన్యం (Indian National Army) లో 1942 జూన్ మాసంలో ఆయన సభ్యులు అయ్యారు. జపాన్ సైనిక బృందం ఆయన మీద అనుమానపు దృక్కులు సారించి 1942 ఆగస్టులో అరెస్టు చేసి సెల్యులర్ జైలులో నిర్బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికులు ఆయనను బలవంత పెట్టారు. అందుకు అంగీకరించని ఆయనను జపాన్ సైనికులు

చిత్రహింసల పాల్జేశారు. ఆ తరువాత రెండు సంవత్సరాలకు 1944లో అబ్దుల్ ఖాదిర్ ను సెల్యులర్ జైలు నుండి విడుదల చేశారు.

**అలీ హుసైన్ వొలిమావ్ కుట్టీ** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (chukchucha) గ్రామం టూహెట్ రీఅంగ్టిమా (Tuhet Reangtima) నివాసి. అలీ హుసైన్ వొలిమావ్ కుట్టీ (Ali Hussain Volimov Kutti) ని ఆంగ్లేయ ప్రభుత్వం గూఢచారిగా జపాన్ సైన్యాధికారులు అనుమానించారు. ఆయనను అరెస్టు చేసి మరి కొందరితోపాటు ఆయనను నికోబార్ దీవులకు తరలించారు. ఆ దీవులలో జపాన్ సైనికులు సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా అలీ హుసైన్ వొలిమావ్ కుట్టీ నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డారు.

**అబ్దుల్ సుభాన్** : అండమాను లోని పోర్టుబ్లెయర్ (Port Blair) లో 1894 ఆగస్టు 13న అబ్దుల్ సుభాన్ (Abdul Subhan) జన్మించారు. ఆయన తండ్రి పేరు మహమ్మద్ నాజిర్ (Mahammad Nazir). అబ్దుల్ సుభాన్ ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయులు. ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' పట్ల ఆకర్షితులయ్యారు. 1942 ఏప్రిల్ మాసంలో లీగ్ సభ్యత్వం చేపట్టి పోర్టు బ్లెయర్ కేంద్రంగా లీగ్ కార్యక్రమాలలో పాల్గొన్నారు. భారత జాతీయసైన్యం అధినేత నేతాజి సుభాష్ చంద్ర బోస్ 1943 డిసెంబరు 31న అండమాను వచ్చినప్పుడు రోజ్‌లాండ్ వద్ద ఆయనకు స్వాగతం పలికిన ఆహ్వానసంఘం సభ్యులుగా అబ్దుల్ సుభాన్ గురుతర బాధ్యతలను నిర్వర్తించారు. అబ్దుల్ సుభాన్ చర్యల పట్ల అనుమానంతో జపాన్ సైనిక బృందం 1942 జనవరి మాసంలో అరెస్టు చేసి సెల్యులర్ జైలులో నిర్బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా, జపాన్ కు వ్యతిరేకంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వాల్సిందిగా జపాన్ సైన్యాధికారులు బలవంతం పెట్టారు. అందుకు అంగీకరించని ఆయనను వారం పాటు చిత్రహింసల పాల్జేశారు. ఆ తరువాత అబ్దుల్ సుభాన్ ను సెల్యులర్ జైలు నుండి విడుదల చేశారు.

**అఫ్తాబ్ అలీ** : అండమాను దీవుల్లోని అండమాను ప్రాంతపు పోర్టు బ్లయర్ (Port Blair) నివాసి. 1915 డిసెంబర్ 15న అఫ్తాబ్ అలీ (Aftab Ali) జన్మించారు. ఆయన తండ్రి పేరు అక్బర్ అలీ (Akbar Ali). ఆంగ్లేయ వలసపాలన నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో పోరాడుతున్న భారత జాతీయ సైన్యం (Indian National Army) లో 1942 జూన్ మాసంలో అఫ్తాబ్ అలీ సభ్యులయ్యారు. అఫ్తాబ్ అలీ చర్యల మీద

అనుమానంతో జపాన్ సైనిక బృందం 1944 ఆగస్టు మాసంలో ఆయనను, ఆయన సహచరులను అరెస్టు చేసి సెల్యూలర్ జైలులో నిర్బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు ఆయనను బలవంతం పెట్టారు. అందుకు అంగీకరించని ఆయనను వారం పాటు సెల్యులర్ జైలు (Cellular Jail) లో చిత్రహింసల పాల్జేశారు. మూడు మాసాల తరువాత సెల్యులర్ జైలు నుండి ఆయనను విడుదల చేశారు. 1993 సెప్టెంబరు 17 అఫ్తాబ్ అలీ అండమానులో కన్నుమూసారు.

**అవాల్దీన్** : అండమాను దీవుల్లోని పోర్టు బ్లెయర్ (Port Blair), అబెర్‌దీన్ (Aberdeen) నివాసి. అవాల్దీన్ (Awaldeen) 1914 డిసెంబర్ 15న జన్మించారు. ఆంగ్లేయుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence Leauge) లో సభ్యులయ్యారు. లీగ్ సభ్యుడిగా కార్యక్రమాలను ముమ్మరం చేశారు. ఆయన చర్యల పట్ల అనుమానంతో జపాన్ సైనిక బృందం 1944 జూలై మాసంలో అవాల్దీన్ ను అరెస్టు చేసి సెల్యూలర్ జైలులో నిర్బంధించి కొన్ని రోజుల తరువాత విడుదల చేసింది.

**ఇబ్రహీం వొలిమావ్ కుట్టీ** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (Chukchucha) గ్రామం, టూహెట్ హోంగ్‌సిటిఓ (Tuhet Hongsitio) ప్రాంతం నివాసి. జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా ఇబ్రహీం వొలిమావ్ కుట్టీ (Ebrahim Volimov Kutti) నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డారు.

**ఈసావూ ఈసా** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన స్మాల్ లపాటి (Smal Lapati) గ్రామం టూహెట్ అపుంగ్ (Tuhet Apung) ప్రాంతం నివాసి. ఆయనను అంగ్లేయుల గూఢచారిగా అనుమానించిన జపాన్ సైనికులు నిర్బంధించి చిత్రహింసలకు గురిచేశారు. చివరకు జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా ఈసావూ ఈసా (Esau Isa) నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డారు.

**ఫైజల్ హుసైన్** : బ్రిటిష్ భారత సైన్యంలోని సైనిక పోలీసు (Indian Military Police) విభాగంలో లాన్స్ నాయక్ (Lance Naik No. 3774) గా బాధ్యతలు నిర్వహించిన ఫైజల్ హుసైన్ (Faizal Hussain) ప్రస్తుత పాకిస్థాన్ దేశంలోని రావల్పిండి (Rawalpindi)

నివాసి. ఆంగ్ల ప్రభుత్వంపాలనా కాలంలో అండమానుకు బదలీ మీద వచ్చిన ఆయన ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న విప్లవోద్యమ సంస్థ 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence Leauge) లో సభ్యులు అయ్యారు.

ఆయన చర్యలను జపాన్ సైనిక బృందం అనుమానించింది. ఆ అనుమానం మేరకు జపాన్ సైనిక బృందం 1943లో ఫైజల్ హుసైన్‌ను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. జపాన్ సైనికులు ఆయనను అమానుష చిత్రహింసలకు గురిచేసారు. ఆంగ్ల ప్రభుత్వ గూఢచారిగా వ్యవహరిస్తున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి ఫైజల్ హుసైన్ ఆంగీకరించ లేదు. అందుకు ఆగ్రహించిన జపాన్ సైనికులు ఆయనకు విషపూరిత ఇంజెక్షన్ (Poisonous Injection) ఇచ్చి ఆ తరువాత జైలు నుండి 1943 నవంబరు 19న విడుదల చేసారు. ఆ విషపూరిత ఇంజెక్షన్ కారణంగా ఇల్లు చేరుకున్న కొద్దిరోజులకు ఫైజల్ హుసైన్ స్వగృహంలో మృత్యు వాతపడ్డారు.

**ఫజల్ హుసైన్ :** ప్రస్తుత పాకిస్థాన్ దేశంలోని లాహోర్‌లో ఫజల్ హుసైన్ (Fazal Hussain) 1922 అక్టోబర్ 14న జన్మించారు. 1940 ప్రాంతంలో ఆయన అండమాను దీవులకు తరలి వచ్చారు. అండమానులోని సెల్యులర్ జైలు వార్డన్‌గా ఉద్యోగం చేశారు. కళలు, సాంస్కృతిక కార్యకలాపాల పట్ల ఆసక్తి గల ఆయన రాంసింగ్ (Ram Singh) అను వ్యక్తి నిర్వహిస్తున్న కళా-సాంస్కృతిక సంస్థలో భాగస్వాములయ్యారు. ఈ కళా-సాంస్కృతిక సంస్థ ఆ తరువాత 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) సాంస్కృతిక విభాగంలో విలీనమయ్యింది. ఫజల్ హుసైన్ కార్యకలాపాల పట్ల ఆనుమానంతో జపాన్ సైనిక బృందం ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో నిర్బంధించింది. 1944 జనవరి 30న ఫజల్ హుసైన్‌ను కాల్చిచంపి ఆయన భౌతికకాయాన్ని అండమాను లోని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో సమాధి చేసింది.

**ఫజల్ బేగ్ :** ఆంగ్లేయ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్నందున యునైటెడ్ ప్రొవిన్స్ (United Province) నివాసి ఫజల్ బేగ్ (Fazal Beg) ను ఆంగ్ల ప్రభుత్వం అండమాను శిక్షాక్షేత్రానికి తరలించింది. అండమానులో ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) లో ఆయన సభ్యులయ్యారు. పోర్టు బ్లెయర్ కేంద్రంగా లీగ్ నిర్వహిస్తూ వచ్చిన వివిధ కార్యక్రమాలలో ఫజల్ బేగ్ చురుగ్గా పాల్గొన్నారు.

జపాన్ సైనిక బృందం ఆయనను సెల్యులర్ జైలులో బంధించి చిత్రహింసల పాల్జేసింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా జపానుకు వ్యతిరేకంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు ఆయనను బలవంతం పెట్టారు. అందుకు ఏమాత్రం ఆయన అంగీకరించ లేదు. ఆయనను భయానకంగా చిత్రహింసలు పెట్టి చివరకు 1944 జనవరి 30న జపాన్ సైనిక బృందంలోని ఫైరింగ్ స్క్వాడ్ ఫజల్ బేగ్‌ను కాల్చి చంపింది. ఆయన పార్థివ శరీరాన్ని అండమానులోని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో ముందుగా సిద్ధం చేసి ఉంచిన సామూహిక సమాధిలో జపాన్ సైనికులు ఖననం చేశారు.

**ఫర్జంద్ అలీ :** అండమానులోని పోర్టుబ్లయర్ (Port Blair), ప్రాంతపు సౌత్ పాయింట్ (South End) నివాసి ఫర్జంద్ అలీ (Farzand Ali) 1911 మే ఐదున జన్మించారు. ఆయన తండ్రి పేరు ఇద్దో (Iddo). ప్రభుత్వ Settlement Department లో ఫర్జంద్ అలీ గుమాస్తాగా బాధ్యతలు నిర్వహించారు. ఆ సమయంలో ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంగా అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) పట్ల ఆయన ఆకర్షితులయ్యారు. ఆ క్రమంలో ఫర్జంద్ అలీ లీగ్ సభ్యత్వం చేపట్టారు.

ఫర్జంద్ అలీ కార్యకలాపాలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1943 అక్టోబర్–నవంబరు ప్రాంతంలో ఆయనను అరెస్టు చేసింది. ఆ తరువాత సెల్యులర్ జైలులో బంధించి ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం మీద సంతకాలు చేయమని జపాన్ సైనికులు ఆయనను బలవంతం పెట్టారు. అందుకు ఏమాత్రం అంగీకరించనందున జపాన్ సైనికులు ఆయనను చిత్రహింసల పాల్జేశారు. చివరకు 1944 జనవరి 30న జపాన్ సైనిక బృందంలోని ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial force) ఫర్జంద్ అలీని కాల్చి చంపింది. ఆయన పార్థివ శరీరాన్ని అండమాను లోని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) వద్ద ముందుగా సిద్ధం చేసి ఉంచిన సామూహిక సమాధిలో ఖననం చేశారు.

**గులాబ్ ఖాన్ :** అండమానులోని దక్షిణ ప్రాంతానికి (South Andaman) చెందిన బాంబూఫ్లాట్ (Bambooflat) నివాసి గులాబ్ ఖాన్ (Gulab Khan). ఆయన ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయులు. ఆంగ్లేయ వలస పాలన నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్

లీగ్' (Indian Independence League) లో సభ్యులయ్యారు ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనికులు 1943 నవంబరు ఒకటిన ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించారు. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు గులాబ్ ఖాన్‌ను బలవంతం పెట్టారు. ఆయన అందుకు అంగీకరించనందున జపాన్ సైనికులు చిత్రహింసల పాల్జేశారు. చివరకు 1944 జనవరి 21న జపాన్ సైనిక బృందం ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial force) గులాబ్ ఖాన్‌ను సెల్యులర్ జైలులో కాల్చి చంపింది.

**గులాం సర్వర్ :** బ్రిటిష్ భారతసైన్యంలో సైనికుడు. బ్రిటిష్ భారత సైన్యం నుండి ఉద్యోగ విరమణ తరువాత గులాం సర్వర్ (Gulam Sarvar) అండమానులోని ఫెర్రాగంజ్ (Frragunj) గ్రామంలో స్థిరపడ్డారు. అండమానులో ఉపాధ్యాయుడిగా ఉద్యోగం చేస్తున్న ఆయన ఆంగ్లేయుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) లో సభ్యులు అయ్యారు. అండమాను లోని పోర్టుబ్లెయర్ కేంద్రంగా గులాం సర్వర్ 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు.

గులాం సర్వర్ చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో నిర్బంధించింది. ఆంగ్ల ప్రభుత్వంతో ఆయనకు గల సంబంధాలను వెల్లడించమంటూ జపాన్ సైనికులు గులాం సర్వర్‌ను చిత్రహింసల పాల్జేశారు. అవాస్తవ ఆరోపణలను అంగీకరిస్తూ ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి గులాం సర్వర్ అంగీకరించలేదు. 1944 జననవరి 30న జపాన్ సైనిక బృందం ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial force) గులాబ్ సర్వర్‌ను కాల్చి చంపింది. గులాం సర్వర్ పార్థివ శరీరాన్ని అండమానులోని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో సమాధి చేశారు.

**హసన్ :** అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (Chukchucha) గ్రామం టూహెట్ హొంగసిటిఓ (Tuhet Hongsitio) నివాసి హసన్ (Hasan). అండమానులో సాగించిన మారణ కాండలా జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో కూడా సామూహిక హత్యాకాండను సాగించారు. అటువంటి ఒక సామూహిక హత్యాకాండలో హసన్ నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డారు.

**హసన్ మూసా :** అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (Chukchucha) గ్రామం టూహెట్ రంగ్‌టిమా (Tuhet

R-ang-tima) నివాసి. జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా హసన్ మూసా (Hasan Moosa) నిర్దాక్షిణ్యంగా కాల్చి వేయబడ్డారు.

**హసన్ మొహమ్మద్** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (Chukchucha) గ్రామం టూహెట్ హొంగసిటిఓ (Tuhet Hongsitio) నివాసి. ఆయనను బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారిగా భావించి జపాన్ సైనిక అధికారులు నికోబార్ ప్రాంతంలోని ప్రజల మీద సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా హసన్ మొహమ్మద్ (Hasan Moosa) నిర్దాక్షిణ్యంగా కాల్చి వేయబడ్డారు.

**మొహమ్మద్ అలీ** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన మూసా (Moosa) గ్రామం టూహెట్ యూయా (Tuhet Uiyah) నివాసి. ఆయనను బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారిగా జపాన్ సైనికాధికారులు అనుమానించారు. ఆ కారణంగా ఆయన, ఆయనతోపాటుగా పలువుర్ని నిర్బంధించారు. ఆ తరువాత నికోబారు ప్రాంతంలోని ప్రజల మీద సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా మొహమ్మద్ అలీ (Mohammad Ali) నిర్దాక్షిణ్యంగా కాల్చి వేయబడ్డారు.

**లాల్ ఖాన్** : అండమానులోని పోర్టు బ్లెయర్‌లో లాల్ ఖాన్ (Lal Khan) జన్మించారు. ఆంగ్లేయ పాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా పనిచేస్తున్న భారత జాతీయసైన్యం (Indian National Army) లో లాల్ ఖాన్ సభ్యులయ్యారు. భారత జాతీయసైన్యం, అండమాను శాఖ చేపట్టిన పలు కార్యకలాపాలలో ఆయన భాగస్వాములయ్యారు. ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనికబృందం లాల్ ఖాన్‌ను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. బ్రిటిష్ ప్రభుత్వం పక్షాన గూఢచర్యం నెరపుతున్నారన్న అనుమానంతో ఆయనను చిత్రహింసల పాల్జేసింది. అనంతరం సెల్యులర్ జైలు నుండి లాల్ ఖాన్‌ను విడుదల చేసింది.

**మహామూద్** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (chukchucha) గ్రామం టూహెట్ హోంగ్‌సిటిఓ (Tuhet Hongsitio) నివాసి. బ్రిటిష్ ప్రభుత్వం పక్షాన గూఢచర్యం నెరపుతున్నారన్న అనుమానాలతో జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా మహామూద్ (Mahamood) నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డారు.

**మహామూద్ అలీ** : అండమానులోని పోర్టు బ్లయర్‌లోని అబెర్‌దీన్ (Aber-deen) ప్రాంతంలో మహామూద్ అలీ (Mahamood Ali) 1924 నవంబరు తొమ్మిదిన

జన్మించారు. ఆయన తండ్రి పేరు జాఫర్ అలీ. ఆంగ్లేయ పాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఏర్పడిన భారత జాతీయ సైన్యం (Indian National Army) పట్ల మహామూద్ అలీ ఆకర్షితులయ్యారు. 1942 జూన్ మాసంలో భారత జాతీయ సైన్యంలో ఆయన చేరారు. అండమాను కేంద్రంగా భారత జాతీయ సైన్యం చేపట్టిన కార్యకలాపాలలో ఆయన భాగస్వాములయ్యారు. మహామూద్ అలీ చర్యలను జపాన్ సైనిక బృందం అనుమానిందింది. ఆ అనుమానం మీద 1944 అగస్టులో అరెస్టు చేసిన జపాన్ సైనిక బృందం సెల్యులర్ జైలులో ఆయనను బంధించి, తప్పుడు కేసులను బనాయించింది. ఆంగ్ల ప్రభుత్వ అనుకూల గూఢచారిగా వ్యవహరిస్తున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం మీద సంతకాలు చేయాల్సిందిగా జపాన్ సైనికాధికారులు ఒత్తిడి చేశారు. ఆ విధంగా ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి మహామూద్ అలీ అంగీకరించ లేదు. ఆ కారణంగా జపాన్ సైనిక బృందం ఆయనను చిత్రహింసల పాల్జేసింది. ఆ విధంగా మూడు మాసాల పాటు సెల్యులర్ జైలులో జపాన్ సైనికులు నరకం చూపించారు. ఆ తరువాత జపాన్ సైన్యాధికారులు మహామూద్ అలీని విడుదల చేశారు.

**మీర్ అలం** : 1900లో మీర్ అలం (Mir Alam) అండమానులో జన్మించారు. ఆయన తండ్రి పేరు రహమతుల్లా. ప్రభుత్వ వైద్య విభాగంలో మీర్ అలం మున్షీ (Munshi) గా బాధ్యతలు నిర్వహించారు. ఆంగ్లేయ పాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) లో మీర్ అలం సభ్యులయ్యారు. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొంటూ అండమానులో 'లీగ్' విస్తరణకు ఎంతో కృషి చేశారు. అండమానులోని బాంబూ ఫ్లాట్ (Bamboo flat) గ్రామంలో ఏర్పడిన గ్రామ 'సేవా సమితి' (Sewa Samithi) కార్యదర్శిగా మీర్ అలం ఎన్నికయ్యారు.

అటు 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్', ఇటు 'గ్రామ సేవా సమితి' కార్యక్రమాలను మీర్ ఆలం క్రియాశీలకంగా నిర్వహించారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా మాట్లాడుతూ స్వేచ్ఛా-స్వాతంత్ర్య భావనల దిశగా ప్రజలను కార్యోన్ముఖులను చేయసాగారు. ఆయన చర్యలు, ఆయన ప్రసంగాల పట్ల అభ్యంతరాలు తెలుపుతూ బాంబూ ఫ్లాట్ (Baboo flat) మరియు వింబర్లే గంజ్ (Wimberly gunj) ప్రాంతపు ఇండియన్ మిలటరీ పోలీసు విభాగం (Indian Military Police Department) పలు హెచ్చరికలు చేసింది.

ఆ హెచ్చరికలను ఖాతరు చేయకుండా ముందుకు సాగుతున్న మీర్ ఆలం చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1944 జనవరి మొదటి వారంలో ఆయనను అరెస్టు చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం పక్షాన గూఢచర్యానికి పాల్పతున్నారని జపాన్ సైన్యాధికారులు అనుమానించారు. ఆ మేరకు ఆయన నుండి ఒప్పుదల వాంగ్మూలం డిమాండ్ చేసారు. ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి మీర్ అలం ససేమిరా అన్నారు. ఆగ్రహించిన జపాన్ సైనిక బృందం సెల్యులర్ జైలులో ఆయనను బంధించి చిత్రహింసల పాల్జేసింది. చివరకు 1944 జనవరి 30న జపాన్ సైనిక బృందంలోని ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial force) మీర్ ఆలం ను కాల్చి చంపి అండమాను లోని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో సమాధి చేసింది.

**మొహమ్మద్ బక్ష్** : అండమానులో 1925 డిసెంబర్ 15న మొహమ్మద్ బక్ష్ (Mohammad Baksh) జన్మించారు. ఆయన తండ్రి పేరు అల్లాహ్ బక్ష్ (Allah Baksh). ఆంగ్లేయ పాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఏర్పడిన భారత జాతీయసైన్యం (Indian National Army) శాఖలో 1944లో మొహమ్మద్ బక్ష్ సభ్యులు అయ్యారు. భారత జాతీయసైన్యం చేపట్టిన పలు కార్యకలాపాలలో ఆయన భాగస్వాములయ్యారు. ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1944 ఆగస్టున అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఆంగ్ల ప్రభుత్వ గూఢచారిగా వ్యవహరిస్తున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి మహామూద్ అలీ ఆంగీకరించనందున ఆయనను చిత్రహింసల పాల్జేసింది. జపాన్ సైన్యాధికారులు 1944 నవంబరులో మొహమ్మద్ బక్ష్‌ను సెల్యులర్ జైలు నుండి విడుదల చేశారు.

**మొహమ్మద్ ఖాన్** : అండమాను లోని పోర్టుబ్లెయర్ ప్రాంతపు హడ్డో (Haddo) నివాసి. విద్యాశాఖలో మొహమ్మద్ ఖాన్ గుమాస్తా (Munshi) గా నియుక్తులయ్యారు. ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) శాఖలో ఆయన సభ్యత్వం స్వీకరించారు. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ప్రముఖ నాయకులు మీర్ అలం కుమార్తెను ఆయన వివాహం చేసుకున్నారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొంటున్న మొహమ్మద్ ఖాన్ కార్యకలాపాలను అనుమానించిన జపాన్ సైనిక బృందం అరెస్టు చేసి, సెల్యులర్ జైలులోని ఆరవ విభాగంలో ఆయనను బంధించింది. ఆ తరువాత ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికులు ఆయనను

బలవంతం చేపారు. అందుకు ఆయన అంగీకరించనందున జపాన్ సైనికులు ఆయన పట్ల చాలా అమానుషంగా వ్యహోరించి, చిత్రహింసల పాల్జేశారు. చివరకు 1944 జనవరి 30న హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) తీసుకుని వెళ్ళగా, అక్కడ జపాన్ సైనిక ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial Force) మొహమ్మద్ ఖాన్‌ను కాల్చి చంపింది. ఆయన భౌతికకాయాన్ని హోంఫ్రాయ్‌గంజ్ లో సమాధి చేశారు.

**మొహమ్మద్ మేమివీత్తల్** : ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) శాఖలో మొహమ్మద్ మేమివీత్తల్ (Mohammad Memeveetial) సభ్యులు అయ్యారు. ఆయన లీగ్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1943 నవంబరులో అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఆ తరువాత ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికులు ఆయనను బలవంతం పెట్టారు. ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి అంగీకరించనందున ఆయన పట్ల దుర్మార్గంగా ప్రవర్తించారు. పది రోజుల పాటు భయానక చిత్రహింసలకు గురిచేసిన తరువాత మొహమ్మద్ మేమివీత్తల్ ను సెల్యులర్ జైలు నుండి విడుదల చేశారు.

**నవాబు అలీ ఖాన్ సాహెబ్** : అండమానులోని పోర్టు బ్లెయర్ ప్రాంతానికి చెందిన అబెర్‌దీన్ బజారు (Aberdeen Bazar) నివాసి నవాబు అలీ ఖాన్ సాహెబ్ (Nawab Ali Khan Saheb). 1884 జూలై ఒకటిన ఆయన జన్మించారు. ఆంగ్లేయులకు అనుకూలంగా తమ చర్యల మీద గూఢచర్యానికి పాల్పడుతున్నారన్న నేరారోపణ మీద ఆయనను జపాన్ సైన్యాధికారులు నిర్బంధించారు. ఆ యోధుని మీద జపాన్ సైన్యాధికారులు ప్రయోగించిన భయానక హింసాకాండ, క్రూరచర్యల మూలంగా నవాబు అలీ ఖాన్ సాహెబ్ సెల్యులర్ జైలులో 1945 జూలై మాసంలో చివరి శ్వాస విడిచారు. **(ఈ పుస్తకంలోని ఏడవ విభాగంలోని 'పోరాట యోధుల జీవిత రేఖాచిత్రాలు'లో నవాబు అలీ ఖాన్ సాహెబ్ వివరాలు మరిన్ని ఉన్నాయి.)**

**నూర్ అహమ్మద్** : అండమానులోని పోర్టు బ్లెయర్ ప్రాంతంలోని ఫోనిక్స్ బే (Phonix Bay) నివాసి. ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) పట్ల ఆకర్షితులయిన నూర్ అహమ్మద్ (Noor Ahammad) 1942లో లీగ్ స్థానిక శాఖలో సభ్యత్వం పుచ్చుకున్నారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యకలాపాలలో చురుగ్గా

పాల్గొంటున్న ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు ఆయనను బలవంతం పెట్టారు. అందుకు అంగీకరించని ఆయనను జపాన్ సైనికులు చిత్రహింసల పాల్జేశారు. ఆయన పట్ల అత్యంత అమానుషంగా వ్యవహరించారు. అయినప్పటికి జపాన్ సైనికాధికారులు ఆశిస్తున్నట్టుగా ఆయన ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వలేదు. చివరకు 1944 జనవరి 30న హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) వద్దకు తీసుకుని వెళ్ళి అక్కడ జపాన్ సైనిక బృందం ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial force) ద్వారా నూర్ అహమ్మద్ ను కాల్చి చంపి హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో సమాధి చేసారు.

**నూర్ హుసైన్ మాలిక్** : అండమాను లోని ఉత్తర ప్రాంతం (North Andaman) నివాసి. అండమాను-నికోబారు దీవులు జపాన్ సైనిక బృందం స్వాధీనంలో ఉన్నప్పుడు ఆండమాను లోని పోలీసు బృందంలో నూర్ హుసైన్ మాలిక్ (Noor Hussain Malik) ఉద్యోగిగా నియుక్తులయ్యారు. ఆయన స్థానిక ప్రముఖులు, 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) లో సభ్యులుగా సుప్రసిద్ధులయిన నవాబు అలీ ఖాన్ సాహెబ్ (Nawab Ali Khan Saheb) కుమార్తెను వివాహం చేసుకున్నారు. ఆ తరువాత ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో అండమాను కేంద్రంగా ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) శాఖలో ఆయన సభ్యులయ్యారు.

ఆ విధంగా 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటున్న నూర్ హుసైన్ మాలిక్ చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1944 జనవరి మొదటి వారంలో ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఆ తరువాత ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు ఆయనను బలవంతం పెట్టారు. అందుకు ఆయన అంగీకరించనందున జపాన్ సైనికులు ఆయనను చిత్రహింసల పాల్జేశారు. చివరకు 1944 జనవరి 30న జపాన్ సైనిక బృందం ఫైరింగ్ స్క్వాడ్ నూర్ హుసైన్ మాలిక్‌ను కాల్చిచంపి అండమాను దీవుల్లోని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో సమాధి చేసింది.

**నూర్ మాహి** : అండమానులోని పోర్టు బ్లెయర్ ప్రాంతంలోని ఫోనిక్స్ బే (Phonix Bay) నివాసి. ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం

చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) శాఖలో నూర్ మాహి (Noor Mahi) సభ్యులయ్యారు. ఆ తరువాత ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొంటున్న నూర్ మాహి బ్రిటిష్ వ్యతిరేకతను ప్రజలలో పెంపు చేయడానికి ఆయన నిరంతరం శ్రమించారు. ఆయన కార్యకలాపాలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1943 అక్టోబర్-నవంబర్ మాసంలో అరెస్టు చేసి సెల్యులర్ జైలులో ఆయనను బంధించింది.

ఆ తరువాత ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికులు ఆయనను బలవంతం పెట్టారు. అందుకు అంగీకరించనందున ఆయనను జపాన్ సైనికులు చిత్రహింసల పాల్జేశారు. ఆయన పట్ల చాలా అమానవీయంగా వ్యవహరించారు. 1944 జనవరి 30న హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) వద్దకు తీసుకుని వెళ్ళగా, అక్కడ జపాన్ సైనిక బృందం ఫైరింగ్ స్క్వాడ్ (Firing Squad of Japan Imperial Force) నూర్ మాహిని కాల్చి చంపింది. ఆయన భౌతికకాయాన్ని హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) లో సమాధి చేశారు.

**నాసర్ ముల్లా** : అండమాను నివాసి. ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) స్థానిక శాఖలో నాసర్ ముల్లా (Nasar Mullah) సభ్యులయ్యారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొంటున్న ఆయన బ్రిటిష్ వ్యతిరేకతను ప్రజలలో పెంపు చేయడానికి శ్రమించారు. నాసర్ ముల్లా చర్యలను, కార్యకలాపాలను జపాన్ సైనిక బృందం అనుమానించింది.

ఆ అనుమానం మేరకు జపాన్ సైనిక బృందం 1943 నవంబరులో ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా జపాన్‌కు వ్యతిరేకంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు అంగీకరిస్తూ ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికాధికారులు నాసర్ ముల్లా ను బలవంతం పెట్టారు. ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి ఆయన అంగీకరించ లేదు. ఆగ్రహించిన జపాన్ సైనిక బృందం ఆయనను చిత్రహింసల పాల్జేసింది. చివరకు ఆయనను దోషిగా నిర్ధారించిన జపాన్ సైన్యాధికారులు 15 ఏండ్ల కఠినకారాగార శిక్షను విధించారు. అండమాను దీవులు తిరిగి బ్రిటిష్ ప్రభుత్వ పాలన క్రిందకు వచ్చాక 1945 సెప్టంబరులో నాసర్ ముల్లాకు స్వేచ్ఛ లభించి సెల్యులర్ జైలు నుండి విడుదలయ్యారు.

**రహిలా** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) దీవుల ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (Chukchucha) గ్రామం టూహెట్ హోంగ్‌సిటిఓ (Tuhet Hongsitio) ప్రాంతం నివాసి. స్థానికంగా ఏర్పడిన 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) కార్యక్రమాల పట్ల ఆయన ఆసక్తి చూపారు. ఆ లీగ్ శాఖ కార్యక్రమాలలో ఆయన చురుగ్గా పాల్గొనసాగారు. అండమాను-నికోబారు ప్రాంతపు ప్రజలు, 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' స్థానిక శాఖ కార్యకర్తల చర్యల పట్ల అనుమానపు దృక్కులతో చూసిన జపాన్ సైనికాధికారులు అందరిని ఆంగ్లేయ ప్రభుత్వ గూఢచారులుగా భావించింది. ఆ తరువాత ఎటువంటి నిజ నిర్ధారణ కూడా లేకుండా నికోబార్ ప్రాంతంలోని సామాన్య ప్రజల మీద సాగించిన అమానుష సామూహిక హత్యాకాండలో భాగంగా **రహిలా** (Rahila) నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డారు.

**రహ్మతుల్లాహ్** : అండమాను లోని పోర్టు బ్లెయర్ (Port Blair) ప్రాంతానికి చెందిన జుంగ్లీఘాట్ (Junglighat) నివాసి. ఆంగ్లేయ పాలకుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో పోరాడుతున్న 'భారత జాతీయసైన్యం' (Indian National Army ) స్థానిక శాఖలో రహ్మతుల్లాహ్ (Rahmathullah) సభ్యులయ్యారు. 'భారత జాతీయ సైన్యం' కార్యకలాపాలలో ఆయన చాలా చురుగ్గా పాల్గొన్నారు. ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనికబృందం 1944 ఏప్రిల్‌లో అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికాధికారులు రహ్మతుల్లాహ్‌ను బలవంతం పెట్టారు. అందుకు ఆయన అంగీకరించనందున ఆగ్రహించిన జపాన్ సైనికులు చిత్రహింసలకు గురిచేశారు. చివరకు 1944 జూలైలో రహ్మతుల్లాహ్ సెల్యులర్ జైలు నుండి విడుదలయ్యారు.

**రమేయులా** : అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar)) ప్రాంతానికి చెందిన అరోంగ్ (Arong) గ్రామం టూహెట్ యూటి (Tuhet Uiti) నివాసి. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా అండమానులోని జపాన్ సైనికుల రహస్యాలను ఆంగ్లేయ అధికారులకు రమేయులా (Rameula) చేరవేస్తున్నారని జపాన్ సైన్యాధికారులు అనుమానించారు. అందుకు అగ్రహించిన జపాన్ సైన్యాధికారులు ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించారు. ఆంగ్లేయులకు అనుకూలంగా జపాన్‌కు వ్యతిరేకంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టుగా ఒప్పదల వాంగ్మూలం ఇవ్వమని ఆయనను బలవంతం పెట్టారు. ఆందుకు ఆయన ససేమిరా అంగీకరించలేదు. ఆగ్రహించిన జపాన్ సైనికాధికారులు

నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా తౌమానన్ అరోంగ్ (Tomanan Arong) వద్ద రమేయులా ను నిర్దాక్షిణ్యంగా కాల్చిచంపారు.

**సుబేదార్ మేజర్ సుభా ఖాన్ :** జపాన్ సైనిక దళాల క్రూరత్వానికి బలయిపోయిన 'ఏడుగురు దుగ్నాబాద్ అమరయోధుల'లో (Seven Martyrs of Dugnabad) సుబేదార్ మేజర్ సుభా ఖాన్ (Subedar Major Subha Khan) ఒకరు. 1896 జూలై ఒకటిన ఆయన జన్మించారు. ఆంగ్ల ప్రభుత్వం లోని ఇండియన్ మిలటరీ పోలీసు విభాగంలో బాధ్యతలు నిర్వహించారు. ఆయనలోని శక్తి సామర్ధ్యాలను గమనించిన బ్రిటిష్ ప్రభుత్వం సబ్ మేజర్‌గా ఆయనకు పదోన్నతి కల్పిస్తూ అండమాను లోని పోర్టు బ్లెయర్‌కు బదలీ చేసింది. అండమానులో సుభా ఖాన్‌కు మరో పదోన్నతి వరించింది. ఇండియన్ మిలటరీ పోలీసు విభాగం కమాండెంట్ (Commandant) గా ఆయనను ఆంగ్ల ప్రభుత్వం నియమించింది. ఆ నూతన పదవిలో సుభా ఖాన్ 1942లో చార్జీ తీసుకున్నారు. ఆ తరువాతి పరిణామాల నేపథ్యంలో ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) స్థానిక శాఖ పట్ల సుభాఖాన్ ఆకర్షితులయ్యారు. ఆయన 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' సభ్యులయ్యారు. ఆ క్రమంలో జపాన్ సైన్యాధికారుల ద్వారా భారత జాతీయ సైన్యానికి చెందిన సైనిక యోధులకు ప్రత్యేక శిక్షణ కార్యక్రమాన్ని కూడా సుభా ఖాన్ ఏర్పాటు చేశారు.

కమాండెంట్ సుభా ఖాన్ చర్యలను జపాన్ సైనిక బృందం అనుమానించి 1943 జనవరి 22న అరెస్టు చేసింది. ఆయనను సెల్యులర్ జైలులో బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికులు బలవంతం పెట్టారు. అందుకు అంగీకరించనందున ఆయనను చిత్రహింసల పాల్జేశారు. చివరకు 1943 మార్చి 30న జపాన్ సైనిక బృందం ఫైరింగ్ స్క్వాడ్ సుభా ఖాన్‌ను దుగ్నాబాద్ తీరానికి (Dugnabad Shore) తీసుకుని వెళ్ళి అక్కడ అమానుషంగా కాల్చి చంపింది. జపాన్ సైన్యాధికారుల దాష్టీకానికి బలయినటువంటి సుభా ఖాన్ తోపాటుగా మిగిలిన ఆరుగురి అమరత్వం స్మరణకు వచ్చేలా దుగ్నాబాద్ వద్ద Seven Martyrs of Dugnabad Memorial నిర్మించుకున్న అండమాను ప్రజలు ఈనాటికి కూడా ఆ అమర వీరుల పట్ల గౌరవప్రపత్తులను వ్యక్తంచేస్తూ స్మరించుకుంటున్నారు.

**సాధిఖ్ అలీ :** అండమాను లోని పోర్టు బ్లెయర్ (Port Blair) ప్రాంతానికి చెందిన హడ్డో (Haddo) నివాసి సాధిఖ్ అలీ (Sadaq Ali) 1919 జనవరి 10న జన్మించారు.

ఆయన తండ్రి పేరు ఇడ్డో (Iddo). ఆంగ్లేయుల కంబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో పోరాడుతున్న 'భారత జాతీయ సైన్యం' (Indian National Army) స్థానిక శాఖలో సాధిఖ్ అలీ 1942 జూన్‌లో సభ్యులయ్యారు. 'భారత జాతీయ సైన్యం' కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఆయన చర్యలను అనుమానించిన జపాన్ సైనిక బృందం ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. జపాన్ కార్యకలాపాల మీద గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికాధికారులు సాధిఖ్ అలీని బలవంతం పెట్టారు. అందుకు ఆయన అంగీకరించలేదు. ఆ కారణంగా ఆయనను చిత్రహింసల పాల్జేశారు. చివరకు, మూడు మాసాల చిత్రహింసల తరువాత 1944లో సాధిఖ్ అలీ విడుదలయ్యారు.

**సర్దార్ ఖాన్ :** అండమాను నివాసి సర్దార్ ఖాన్ (Sardar Khan) 1914లో జన్మించారు. ఆయన తండ్రి పేరు మొహమ్మద్ ఖాన్ చౌదరి (Mohammed Khan Coudary). ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) స్థానిక శాఖలో సర్దార్ ఖాన్ సభ్యులయ్యారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఆయన కార్యకలాపాలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1943 నవంబరులో ఆయనను అరెస్టు చేసి సెల్యులర్ జైలులో బంధించింది. ఒక మాసం నిర్బంధం తరువాత ఆయనను విడుదల చేశారు.

ఆ తరువాత ఆయనను జపాన్ సైనిక బృందం మరోమారు జూన్ 1944న నిర్బంధించింది. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు సర్దార్ ఖాన్‌ను బలవంతం పెట్టసాగారు. ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వఆయన ఆయన ఏమాత్రం అంగీకరించలేదు. ఆగ్రహించిన జపాన్ సైన్యాధికారులు ఆయనను చిత్రహింసలకు గురిచేశారు. ఆ విధంగా మూడు మాసాల పాటు సాగిన చిత్రహింసల తరువాత 1944 సెప్టంబరు మాసంలో సర్దార్ ఖాన్ విడుదల అయ్యారు.

**ఉస్మాన్ :** అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar) ప్రాంతానికి చెందిన సవాయ్ (Sawai) గ్రామం టూహెట్ కావల్ (Tuhet Kaval) నివాసి. జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా ఉస్మాన్ (Usman) నిర్దాక్షిణ్యంగా కాల్చి వేయబడ్డారు.

**ఉమర్ :** అండమాను-నికోబారు దీవులలోని నికోబారు (Nicobar)) ప్రాంతానికి చెందిన చుక్‌చూచా (chukchucha) గ్రామం టూహెట్ హోంగ్‌సిటిఓ (Tuhet Hongsitio) నివాసి. జపాన్ సైనికాధికారులు నికోబార్ ప్రాంతంలో సాగించిన సామూహిక హత్యాకాండలో భాగంగా ఉమర్ (Umar) రాక్షసంగా కాల్చివేయబడ్డారు.

**ఉస్మాన్ అలీ :** అండమాను లోని పోర్టు బ్లెయర్ (Port Blair) ప్రాంతం నివాసి ఉస్మాన్ అలీ (Usman Ali) 1913 ఏప్రిల్ 20న జన్మించారు. ఆయన తండ్రి పేరు అబ్దుల్ (Abdul). 1942 జూన్‌లో ఉస్మాన్ అలీ 'భారత జాతీయ సైన్యం'లో సభ్యులయ్యారు. 'భారత జాతీయ సైన్యం' సబ్యులుగా ఆయన తన కార్యకలపాలను చురుగ్గా సాగించారు. ఆయన కార్యకలాపాలను అనుమానించిన జపాన్ సైనిక బృందం 1944 ఆగస్టులో అరెస్టు చేసి సెల్యులర్ జైలులో ఖైదు చేసింది.

ఆ తరువాత ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా, జపాన్‌కు వ్యతిరేకంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైనికాధికారులు ఉస్మాన్ అలీ మీద తీవ్ర ఒత్తిడి తెచ్చారు. అందుకు ఆయన అంగీకరించనందున ఆయనను జపాన్ సైనికులు చిత్రహింసల పాల్జేశారు. ఆ విధంగా మూడు మాసాల పాటు చిత్రహింసల పరంపర సాగిన తరువాత 1944 నవంబరులో ఉస్మాన్ అలీ సెల్యులర్ జైలు నుండి విడుదలయ్యారు.



# జీవిత రేఖా చిత్రాలు

పలు గ్రంథాలు, పత్రికలు, దస్త్రాలు, పోరాటయోధుల కుటుంబీకుల
నుండి సేకరించిన సమాచారం మేరకు రూపొందించిన
స్వాతంత్ర్య సమరయోధుల
జీవిత రేఖా చిత్రాలు మరిన్ని వివరాలతో

# జీవిత రేఖా చిత్రాలు



# మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్

ఒకప్పటి హైదరాబాద్ సంస్థానం, ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని, ప్రస్తుత తెలంగాణ రాష్ట్ర రాజధాని, సుప్రసిద్ధ హైదరాబాద్ నగర నివాసి. మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ (Maulvi Syed Alla-ud-Din) 1824లో హైదరాబాద్‌లో జన్మించారు. ఆయన తండ్రి మౌల్వీ సయ్యద్ హాఫీజ్ ఇలాహి (Maulvi Syed Hafiz Ellahi). ఆంగ్లేయ పాలకులకు వ్యతిరేకంగా 1857లో ఆరంభమైన పోరాటంలో మిత్రుడు పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌తో కలిసి 1857 జూలై 17న బ్రిటిష్ రెసిడెన్సీ (British Residency) మీద దాడి చేశారు. ఆ చారిత్రాత్మక దాడి పూర్వాపరాలు ఇలా ఉన్నాయి.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఉత్తర భారతదేశంలోని ధార్మిక నాయకులు ఏవిధంగానైతే, ప్రజలను, స్వదేశీ సైనికులను బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా విజృంభించమని ప్రోత్సహించారో, అదే విధంగా దక్షిణ భారతదేశంలోని మౌల్వీలు ప్రజలను ఉత్తేజితులను చేశారు. అత్యంత ధైర్యసాహసాలతో, ప్రాణాలను తృణప్రాయంగా భావించి బహిరంగంగా తిరుగుబాటు కార్యకలాపాలను ప్రోత్సహించటం మాత్రమేకాదు తిరుగుబాటు దళాలను ముందుండి స్వయంగా నడిపించారు. ఈ మేరకు దక్షిణ భారత దేశంలో బలమైన సంస్థానమగు నైజాంలో ప్రజలను తిరుగుబాటుకు సిద్ధం చేయడానికి ధార్మికవేత్తలు ప్రయత్నించారు.

ఆనాడు నైజాం నవాబు లాంటి బలమైన సంస్థానాధీశులు ఆంగ్లేయులకు అండగా ఉన్నప్పటికి తిరుగుబాటు జ్వాలల సెగను ఆంగ్ల అధికారులు చవిచూడాల్సి వచ్చిందంటే, తిరుగుబాటు యోధులు ఎంతటి దృఢ నిశ్చయంతో వలస పాలకులకు వ్యతిరేకంగా పోరు బాటన ముందుకు సాగారో తెలుస్తుంది. ప్రజలను, తిరుగుబాటు యోధులను ప్రోత్సహించటమే కాకుండా పోరాటంలో అగ్రభాగాన నిలచిన ధార్మిక నేతలలో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ ఒకరు.

1857 నాటి పరిణామాల కంటె ముందుగానే నైజాం ప్రాంతంలో మాత్రమే కాదు నైజాం రాజధాని హైదరాబాదులో కూడా బ్రిటిష్ పాలకుల పెత్తనానికి, ఆధిపత్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు భావనలు పొడచూపాయి. బ్రిటిషర్లతో నిజాం నవాబు ఒప్పందానికి వచ్చాక, ఆయన ఆంగ్లేయులకు 'జో హుకుం' అనటం సహించలేని ప్రజలు, రాజవంశీకులు ఏదోకారణంగా నిరసనలు వ్యక్తంచేస్తూ, తిరగబడుతూనే వచ్చారు. ఆంగ్లేయాధికారుల అహంకారం, అతిశయించిన పెత్తనాన్ని సహించని ఆత్మగౌరవం గల స్వదేశీ సైనికులు ఆరంభం నుండి అసంతృప్తిని వెల్లడిస్తూనే వచ్చారు. ఈ అసంతృప్తిని అణిచివేయడానికి ఎంతగా ప్రయత్నించినా అది పాలక వర్గాలకు సాధ్యం కాలేదు.

చివరకు నిజాం సికిందర్‌ఝా దర్బారులోని నూరుల్ ఉమ్రా ఆనాటి అసంతృప్తి సిపాయిలకు నాయకత్వం వహించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పద్ధతులు, పెత్తనం నచ్చని పలువురు నూరుల్ ఉమ్రా సైన్యంలో చేరారు. ఈ పరిస్థితులను గమనించిన ఆంగ్లేయ అధికారులు కఠినంగా వ్యవహరించటమే కాకుండా, నిజాంను కూడ ప్రభావితుడ్ని చేసి, నిజాం దర్బారులోని ప్రముఖ వ్యక్తి నూరుల్ ఉమ్రా పదవిని ఊడగొట్టించారు.

1812 ప్రాంతంలో హైదరాబాదు నగరంలోని బ్రిటిష్ రెసిడెన్సీకి చెందిన సిపాయిలు తిరుగుబాటు చేశారు. ఆంగ్ల సైనికాధికారి మేజర్ ఎడ్వర్డ్ గోర్టన్‌ను శతఘ్నికి బంధించి, తమ తిరుగుబాటును మన్నిస్తాననీ, సిపాయిలకు వేతనాలు యధావిధిగా చెల్లిస్తానని హామీ ఇవ్వకపోతే శతఘ్నిని పేల్చివేస్తామని ఆతడ్ని బెదిరించారు. ఈ సందర్భంగా నిజామాబాద్, నాందేడ్, పర్భనీ, బేరూర్, సిరివంద, మహదేవపూరు ప్రాంతాలలో కూడా తిరుగుబాట్లు రచ్చకెక్కాయి. ఆ తరువాత, సిపాయిలకు హామీలిచ్చి ప్రాణం కాపాడుకున్న మేజర్ గోర్టన్ తిరుగుబాటు నాయకులందర్నీ ఉరికంబాలెక్కించాడు.

1838లో నైజాం సందర్శించిన వహాబీ నేతలు మౌల్వీ విలాయత్ అలీ, సలీం అలీల ప్రభావం వలన బ్రిటిష్ వ్యతిరేక వహాబీ ఉద్యమానికి బలమైన బీజాలు పడ్డాయి. నిజాం వంశజుడు ముబారిజుద్దౌలా (గోహర్ అలీ ఖాన్) బ్రిటిషు వారికి వ్యతిరేకంగా రాజీలేని

పోరాటం ప్రారంభించారు. 1839లో ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని ప్రశ్నించినందుకు 1840లో ఆయనను గోల్కొండ కోటలో బంధించారు. ఆ కోటలోని జైలులో 14 సంవత్సరాలు పాటు గడిపిన ముబారిజుద్దౌలా 1854లో కన్నుమూసారు.

ఆంగ్లేయుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని కొందరు, ఆంగ్లేయుల నైతిక స్థైర్యాన్ని దెబ్బతీసేందుకు, ప్రాణభయంతో వారంతా ఇండియా వదలి పారిపోయేలా చేయడానికి భయం గొలిపే పలు అంశాలను ప్రచారంలో పెట్టారు. ఆంగ్లేయ అధికారులతో స్నేహం నటిస్తూ, '..నైజాం సంస్థానంలోని మంత్రులు, ఉన్నతాధికారులు తేనెపూసిన కత్తుల్లా వ్యవహరించేవారు. పైకి ఎంతో స్నేహపూరితంగా ఉంటూనే ... మీరు ఇక్కడ నుండి వెళ్ళి పోండి ... ఇక్కడ పరిస్థితులు అంత బాగా లేవు. మీ ప్రాణాలకు ముప్పు ఏర్పడవచ్చు ...' అని చెబుతూ అధికారులను అదరగొట్టేవారని బ్రిటిషు సైనికాధికారి మేజర్ హెచ్.సి. బ్రిగ్స్ వివరించాడు (1857 తెలుగునాట తిరుగుబాటు, డాక్టర్ మహంకాళిరావు, నవయుగభారతి ప్రచురణలు, భాగ్యనగర్, 2001, పేజీ 17).

ప్రస్తుత సికింద్రాబాదు, ఆనాటి బొల్లారం వద్ద ఉన్న బ్రిటిషర్ల సైనిక స్థావరం 1855లో అతలాకుతలం అయ్యింది. ఆ సంవత్సరం మోహర్రం పండుగ ఆదివారం నాడు వచ్చింది. ఆరోజున ఎటువంటి ఊరేగింపులు జరుపరాదని బ్రిగేడియర్ మెకంజీ ఆదేశాలు జారీచేశాడు. ఆ ప్రాంతంలో మొహర్రం పండుగ మత, కులాల ప్రసక్తి లేకుండా ప్రజలంతా కలసి జరుపుకుంటారు. ఈ పండుగ రోజున మేళతాళాలతో ఊరేగింపు ఉండటం సహజం. ఈ వాతావరణానికి అవకాశం కల్పించకుండా, అధికారులు ఉత్తర్వులు జారీ చేయటంతో ప్రజలలో అగ్రహం కట్టలు తెంచుకుంది. బ్రిటిష్ కంటింజెంటు సైన్యంలోని హవల్దార్ గులాం ఖాదిర్ ఆవేశంలో బ్రిగేడియర్ మెకంజీని కత్తితో పొడిచాడు. ఈ సందర్భంగా ఆ ఆంగ్లేయాధికారి వ్యక్తిగత సిబ్బంది అధికారి పక్షాన కాకుండా ప్రజల పక్షాన నిలిచారు. ఈ సంఘటనలో మతాలకు అతీతంగా వ్యక్తమైన ఐక్యతను గమనించిన ఆంగ్ల అధికారులు సుమారు 10 రోజుల పాటు తమ గృహాలు దాటి బయటకు రావటానికి భయపడ్డారు.

1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం అయ్యాక ఉత్తరాది నుండి నానా సాహెబ్ ప్రతినిథి రంగారావు పాగే దక్షణాదికి వచ్చారు. ఆయన హైదరాబాదు వచ్చి సఫ్దరుజుద్దౌలా అను యోధుడ్ని కలిశాడు. నానా సాహెబ్ ఉత్తరానికి ప్రతిస్పందిస్తూ ఆయన కొందరికి లేఖలు రాసి తన అనుచరుడు షేక్ మదార్‌కు అందించాడు. శత్రుబలగాల మీదకు విసిరే 25 వేల విస్ఫోటకాలను ఆయన సేకరించి అందించాడు. ఆ క్రమంలో రంగారావుకు హైదరాబాదు పరిసర గ్రామానికి చెందిన బందా అలీ పటేల్ మద్దతు పలికాడు. ఈ విషయాన్ని పసిగట్టిన బ్రిటిషర్లు రంగారావును పట్టుకున్నారు. ఆయన అరెస్టు కావటంతో

సఫ్దరుజుద్దౌలా, తదితరులూ పట్టుబడ్డారు. సఫ్దరుజుద్దౌలా, గ్వాలియర్ మహారాజు భార్య, తిరుగుబాటు నాయకురాలు బైజాబాయితో తరచుగా విప్లవం గురించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారని విచారణలో రుజువైంది. న్యాయస్థానంలో విచారణ జరిగినప్పుడు సఫ్దరుజుద్దౌలా చాలా నిర్భయంగా వ్యవహరించారు. మాతృభూమిని పరాయిపాలకుల బానిసత్వం నుండి విముక్తం చేయడం కోసం స్వచ్ఛందంగా ఈ పోరాటంలో పాల్గొన్నానని ఆయన ప్రకటించాడు. ప్రభుత్వం యావజ్జీవ కారాగార శిక్ష విధించి, ఆయన ఆస్తులను జప్తు చేసింది. ఈ విధంగానే రోహిల్లా యోధులు కలాన్ ఖాన్, గులాబ్ ఖాన్ లు బ్రిటిషర్ల మీద దాడులు జరిపేందుకు రొహిల్లా సైన్యాన్ని తయారు చేసుకున్నారని, విచారణలో బహిర్గతమైంది.

ఈ చారిత్రక నేపథ్యంలో 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం కాగానే హైదరాబాదులోని నిజాం నవాబు కూడా పోరులో భాగస్వామి అవుతాడని స్వేచ్ఛా పిపాసువులైన ప్రజలు ఆశించారు. నిజాం నవాబు తమ గూటి నుండి తప్పుకున్నట్టయితే తమ పట్టంతా జారిపోగలదని భావించి, భయపడిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు నిజాం తమకు దూరం కాకుండా తగు జాగ్రత్తలు తీసుకున్నారు ( ' If the Nizam goes all goes ' - Highlights of the Freedom Movement in Andhra Pradesh, Sarojini Regani, 1972, Page 7 ) ప్రజలు ఆశించినట్టుగా నిజాం ప్రథమ స్వాతంత్ర్య సమరంలో పాల్గొనలేదు. ఆంగ్లేయులకు నైజాం ప్రాంతం ఇటు తమ చేతుల్లో నుంచి గానీ, అటు నిజాం చేతుల్లో నుండి గానీ జారిపోవటం ఏమాత్రం ఇష్టంలేదు. నైజాం చేజారినట్టయితే తమ మనుగడకు కడు ప్రమాదమని పసిగట్టిన ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారులు కూడా ఎటువంటి ధిక్కారాన్ని సహించలేకున్నారు. ఆ కారణంగా తిరుగుబాటును అతి క్రూరంగా అణిచి వేసేందుకు ఆంగ్లేయ పాలకవర్గం సన్నద్ధమైంది.

ఆ వాతావరణంలో రంగప్రవేశం చేసిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ హైదరాబాదు కేంద్రంగా జరిగిన తిరుగుబాటు కార్యకలాపాలకు కేంద్ర బిందువయ్యారు. మౌల్వీ మార్గదర్శకత్వంలో తిరుగుబాటు కార్యకలాపాలు ముమ్మరమయ్యాయి. నిజాం నవాబును తిరగబడమని కోరుతూ నగరంలో పోస్టర్లు వెలిశాయి. ఒక పోస్టరులో, ‘ The aid of the Almighty and his Prophet is present with Afzal-ud Dowla Bahadur who should not fear and be apprehensive. If fearful he should wear bangles and sit at home...If after reading this paper on hearing of it a representation is not made to the king (Nizam) or his Diwan, the oath of the swine is on him and if in case of a Hindu the oath of a cow ’. (ibid page 7-8) అని పేర్కొని ఉంది.

1857 జూన్ 10వ తేదిన మౌల్వీ ఇబ్రహీం నాయకత్వంలో తిరుగుబాటు చేయాలనుకున్నారు. ఆ లక్ష్యం మేరకు మౌల్వీ అక్బర్ తగిన ప్రచారం కూడా నిర్వహించారు. ఆ ప్రచారంతో సైనిక స్థావరాలలోని స్వదేశీ సైనికులు ఆంగ్ల అధికారులను లెక్కచేయక ఇష్టారాజ్యంగా వ్యవహరించటం ప్రారంభించారు. ప్రజలు, సిపాయిలు తిరుగుబాటు గురించి బహిరంగంగా ముచ్చటించుకోసాగారు. పలు ప్రాంతాలలోని వివిధ విభాగాలకు చెందిన సైనికులు తిరుగుబాటు దళాలతో కలసి పోతున్నారని నైజాం సంస్థానంలో వార్తలు గుప్పుమనసాగాయి. ఆ వార్తలతో ప్రజలు ఉత్తేజితులు కాసాగారు. మౌల్వీ అల్లావుద్దీన్ లాంటి ఆలోచనాపరులు తిరుగుబాటుకు అవసరమైన ఆర్థిక, అంగ, ఆయుధ బలాలను సమకూర్చసాగారు. జూన్ 13వ తేదిన చార్మినార్ దగ్గరలో గల మక్కా మసీదులో నమాజు తరువాత ప్రసంగం సాగుతుండగా, ఇరువురు వ్యక్తులు లేచి స్వాతంత్ర్యసంగ్రామం గురించి ప్రసంగించమని కోరారు. అ క్షణంలో బ్రిటిష్ సైనికులు వచ్చి వారిని పట్టుకునేలోగా అక్కడి నుండి వారంతా కనుమరుగయ్యారు.

ఈ విధంగా నైజాం రాజధాని ప్రాంతం తిరుగుబాటు వార్తలతో, ఆశ్చర్యం కలిగించే వివిధ సంఘటలతో అతలాకుతలం అవుతుండగా, అటు ఔరంగాబాదులో ప్రథమ అశ్వికదళం, బుల్దానాలోని మరొక దళం తిరుగుబాటు దళాలతో చేరాయని వార్తలందాయి. ఈ రెండు దళాలు హైదరాబాదుకు చెందినవి కావటం వలన తిరుగుబాటు వార్త సహజంగా హైదరాబాదులో తీవ్ర ఉద్రిక్త పరిస్థితికి కారణమైంది. ఔరంగాబాదు తిరుగుబాటుకు నాయకులైన జమేదార్ అమీర్ ఖాన్, దఫేదార్ మీర్ ఫిదాఅలీలలో ఫిదా అలీ పట్టుబడ్డారు. మీర్ ఫిదాఅలీ ఉరిశిక్షకు గురికాగా, అమీర్ ఖాన్ తప్పించుకున్నారు.

బుల్దానా తిరుగుబాటుకు నాయకత్వం వహించిన జమేదారు చిద్దా ఖాన్ తన 10 మంది అనుచరులతో జూన్ 24 నాటికి హైదరాబాదు చేరుకున్నారు. నైజాం ప్రభుత్వం నుండి రక్షణ లభిస్తుందన్న భావనతో విచ్చేసి, సాలార్ జంగ్‌ను కలసిన చిద్దాఖాన్, ఆయన అనుచరులను సాలార్ జంగ్ తన గదిలోనే బంధించి ఖైదు చేయించాడు. ఆ తరువాత విచారణ నిమిత్తం బ్రిటిష్ రెసిడెన్సీకి అప్పగించాడు. ఈ వార్తతో ప్రజల హృదయాలు భగ్గుమన్నాయి. ఫిరంగీయులను చంపమంటూ నగరంలోని పలు చోట్ల పోస్టర్లు దర్శనమిచ్చాయి. ఆ పోస్టర్ల మీద ' Faithful to murder the feringhee ' , (History of The Deccan, J D E Gribble, Vol.2, Mittal Publications, New Delhi, 1990 , Page 237) అంటూ తిరుగుబాటు యోధులు ప్రజలకు పిలుపునిచ్చారు.

1857 జూలై 17వ తేదిన హైదరాబాదులోని మక్కా మసీదులో ముస్లింలు, ఇతర ప్రజానీకం పెద్ద సంఖ్యలో సమావేశమయ్యారు. ఈ సమావేశంలో మౌల్వీ అల్లావుద్దీన్ పాల్గొన్నారు. చిద్దాఖాన్, ఆయన అనుచరులను విడుదల చేయించాలని సమావేశంలో తీర్మానించారు. ప్రతినిధివర్గంగా నలుగురు మౌల్వీలను పంపి బ్రిటిష్ రెసిడెంట్‌ను కలసి ఎలాగైనా చిద్దాఖాన్‌ను విడుదల చేయించాలని అనుకున్నారు. ఒకవేళ చర్చలు ఫలప్రదం కానట్టయితే, బలప్రయోగానికి పూనుకోవాలని కూడా నిశ్చయించారు. ఈ విషయం వేగుల ద్వారా తెలుసుకున్న సాలార్ జంగ్ మక్కా మసీదులో సమావేశమైన వారిని చెదరగొట్టేందుకు అరబ్ గార్డులను పంపాడు. ఈ విషయాన్ని బ్రిటిష్ రెసిడెన్సీకి కబురు చేసి, ఈ పరిణామాల వలన భయపడాల్సిన అవసరం లేదనీ, రక్షణకు అవసరమైన అన్ని చర్యలు తీసుకున్నట్టూ ఆంగ్లేయాధికారులకు ఆయన విన్నవించుకున్నాడు.

మక్కా మసీదు వద్ద సమావేశాన్ని చెదరగొట్టేందుకు సాలార్ జంగ్ ఎప్పుడయితే పూనుకున్నాడో, ఆ చర్యతో ప్రజలు మరింతగా రగిలిపోయారు. మౌల్వీ అల్లావుద్దీన్ ఆగ్రహం వ్యక్తంచేశారు. ఆయన మస్తిష్కంలో రూపుదిద్దుకుంటున్న పోరాట వ్యూహం త్వరితగతిన ఒక కొలిక్కి వచ్చింది. ఇక చర్చల వలన సాధించేది ఏమీ లేదని స్పష్టమైన తరువాత సాయుధ పోరాటమే చివరి మార్గమని ఆయన నిర్ణయానికొచ్చారు. ఈ రకంగా పాలకవర్గాలను ఎదుర్కోవాల్సి వస్తుందని ముందుగా ఊహించిన మౌల్వీ అందుకు తగిన ఏర్పాట్లు ఎప్పుడో చేసుకుని సిద్ధంగా ఉన్నారు. ఆయన ఆదేశాల మేరకు అగ్నిగుండంలో నైనా దూకేందుకు, స్వాతంత్ర్య సంగ్రామంలో సమిధలయ్యేందుకు సిద్ధంగా ఉన్న మూడు వందల మంది సాహసులను ఆయన సమకూర్చుకుని ఉన్నారు. ఆ సాహసుల నుండి ప్రమాణ పత్రాలు కూడా ఆయన తీసుకున్నారు. ఏ క్షణాన ఆదేశించినా వెంటనే రంగంలోకి దిగడానికి ఆ సాహసుల దళం మౌల్వీ అల్లావుద్దీన్ సైగ కోసం ఎప్పుడెప్పుడా అంటూ ఎదురు చూస్తోంది.

చివరకు ఆ క్షణం రానే వచ్చింది. బ్రిటిష్ రెసిడెన్సీ, సాలార్‌జంగ్ ప్రతిస్పందనల మీద సహచరుడు పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌తో మౌల్వీ అల్లావుద్దీన్ సంప్రదించారు. 1857 జూలై 17న మధ్యాహ్నం నాలుగు గంటల సమయానికల్లా మూడు వందల మంది పోరాట యోధులు రణనినాదం చేస్తూ, ఆంగ్ల-నిజాం సైన్యాల మీద పోరుకు సిద్ధమయ్యారు. విజయమో వీరస్వర్గమో సాధించేందుకు బయలుదేరిన ఆ యోధులు ప్రస్తుత కోఠి బస్టాండ్ ఎదురుగా గల సుల్తాన్ బజారు నుండి బ్రిటిష్ రెసిడెన్సీ వైపుకు దూసుకు వెళ్ళారు. ప్రస్తుతం హైదరాబాదు నగరంలోని కోఠి సెంటరులో గల మహిళా కళాశాల ఆనాడు 'బ్రిటిష్ రెసిడెంట్' గా పిలువబడిన ఆంగ్లేయాధికారి నివాసం, కార్యాలయం. ఈ విషయం గమనించిన సాలార్

జంగ్ బ్రిటిష్ అధికారిని ముందుగా అప్రమత్తం చేస్తూ, తమ బలగాలు వచ్చేంత వరకు ఆత్మరక్షణకు పూనుకోవాల్సిందిగా సమాచారం పంపారు.

అన్నిటికి సిద్ధమని బయలుదేరిన తిరుగుబాటు దళాలు, బ్రిటిష్ రెసిడెన్సీకి పడమర వైపు నుండి దాడికి సమాయత్తమయ్యాయి. ఆ ప్రాంతంలో ఉన్న అబ్బాన్ సాహెబ్, జయగోపాల్ దాస్ అను ఇరువురు షావుకార్ల భవనాలను తమ స్థావరాలుగా చేసుకున్నారు. ఆ ప్రాంతం నుండి పుత్లీ బౌలీ, దిల్‌షుక్ తోటల వైపు ఉన్న ద్వారాల మీద నియంత్రణ సాధించేందుకు వీలుగా వ్యూహాత్మకంగా నాయకులు చర్యలు తీసుకున్నారు. ఆ సమయంలో రెసిడెన్సీ రక్షణ బాధ్యత మేజర్ హెచ్.సి బ్రిగ్స్ స్వీకరించాడు. రాత్రిపూట కావటం వలన తిరుగుబాటు దళాలను కదలనివ్వకుండా, ఆ బలగాల చుట్టూతా తన బలగాలను వ్యూహాత్మకంగా మోహరించేందుకు సమయం తీసుకున్నాడు. శత్రువు మీద ఎంతో కసితో ఉన్న తిరుగుబాటు బలగాలు దూకుడుగా ముందుకు ఉరికేసరికి పోరు ప్రారంభమైంది.

ఆంగ్ల సేనలు తెల్లవారుజాము వరకు కాల్పులు జరిపాయి. ఆంగ్లేయ బలగాలు విసురుతున్న ఫిరంగి గోళాల నిప్పుల సెగలకు పొగలకు తట్టుకుని నిలబడగలిగేందుకు తగిన ఆచ్ఛాదన కరువుకావటంతో తిరుగుబాటు బలగాలు వెనక్కు తగ్గాల్సి వచ్చింది. తిరుగుబాటు దళాలను దిగ్బంధనం చేసేందుకు నిజాం నవాబు ఏర్పాటు చేసిన అరబ్బు దళాలు, తిరుగుబాటు యోధులకు అనుకూలంగా వ్యవహరించాయి. ఆ దళాల సహకారం తోనే, తిరుగుబాటు దళాలు అబ్బాన్ సాహెబ్, జయగోపాల్ దాస్‌ల గృహాలను వదలి, పోరులో మరణించిన వారిని వదలి, గాయపడిన సహచరులను మాత్రం వెంట తీసుకుని వెనుకకు వెళ్ళిపోయాయి. ఈ పోరాటంలో మొత్తం మీద నలుగురు మృతిచెందగా, పలువురు గాయపడ్డారు. ఆంగ్ల సేనలు, నైజాం ప్రభువు సహకారంతో తిరుగుబాటు దళాల దాడిని తిప్పికొట్టగలిగాయి. తిరుగుబాటు దళాలకు సహకరించిన అబ్బాన్ సాహెబ్, జయగోపాల్ దాస్‌ల భవనాలను ఆంగ్లసేనలు ధ్వంసంచేసి, ఆ ప్రముఖుల కుటుంబ సభ్యులను ఊచకోత కోసాయి. ఆ ప్రముఖుల ఆస్తిపాస్తులను జప్తు చేశాయి.

దక్షిణాదిలో అతిపెద్ద సంఘటనగా చరిత్రలో నిలచిపోయిన 'రెసిడెన్సీ మీద జరిగిన దాడి'లో నైజాం ప్రభువుల చలువ ఫలితంగా ఆంగ్లేయులకు విజయం దక్కింది. కానీ ఆంగ్లేయుల పెత్తనం నుండి విముక్తి ఆకాంక్షిస్తూ రగులుకున్న విప్లవ జ్వాలలను పూర్తిగా ఆర్పివేయటం ఆంగ్లేయులకు సాధ్యం కాలేదు. 'If the Nizam goes all goes' అని భయపడిన ఆంగ్లేయులకు ఆనాడు నైజాం ప్రభువు అండగా నిలువకున్నట్టయితే ప్రథమ స్వాతంత్ర్య

సమరయోధులకు విజయం తప్పక సొంతం అయ్యిఉండేది. ఈ విధంగా ఉత్తర భారత దేశంలోనే కాదు దక్షిణాది బిడ్డలు మౌల్వీ అల్లావుద్దీన్ లాంటి యోధులు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు లక్ష్యంగా ఆంగ్లేయ పాలకుల పెత్తనం నుండి మాతృభూమి విముక్తి కోసం స్వదేశీయుల స్వేచ్ఛ కోసం చివరికంటా పోరాడారు.

1858 జూన్ 18న నగరంలోని తిరుగుబాటు దళాల మీద, ప్రజల మీద ఆంగ్ల సైన్యాలు విరుచుకు పడ్డాయి. భారీ ఎత్తున అరెస్టులు ఆరంభమయ్యాయి. ఆ సమయంలో మౌల్వీ అల్లావుద్దీన్ ఆంగ్ల సైనికుల కన్నుగప్పి నగరం నుండి తప్పించుకున్నారు. అలా తప్పించుకున్న మౌల్వీ ఒకటిన్నర సంవత్సరం పాటు ఆంగ్లసైనికుల కంటపడకుండా రహస్య జీవితం గడిపారు. ఆయనకు పీర్ మహమ్మద్ అను వ్యక్తి ఆశ్రయం కల్పించి కాపాడారు. ఆ రహస్య జీవితంలో మౌల్వీ అల్లావుద్దీన్ ఫరూఖ్ నగర్, బెంగుళూరు తదితర ప్రాంతాలలో తల దాచుకున్నారు. ఈ సందర్భంగా మళ్ళీ తిరుగుబాటుకు తగిన మార్గాల అన్వేషణ సాగిస్తూ మౌల్వీ గడిపారు. తిరుగుబాటు నాయకులు సయ్యద్ భిక్కూ, సయ్యద్ లాల్, మహమ్మద్ అలీ తదితర నేతలను మౌల్వీ కలుసుకుని సంప్రదింపులు జరిపారు.

ఈ విధంగా ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని సవాల్ చేసి, తిరుగుబాటుకు నాయకత్వం వహించిన మౌల్వీ అల్లావుద్దీన్‌ను ఎలాగైనా పట్టుకోవాలని కసితో ఉన్న ఆంగ్లేయాధికారులు మౌల్వీని పట్టిచ్చిన వారికి నాలుగు వేల రూపాయల నజరానాను నిజాం ప్రభుత్వం ద్వారా ప్రకటింప చేశారు ('A reward of 4 thousand for his arrest was anounced by Nizam's Government -Who's Who Of Freedom Struggle in Andhara Pradesh, Vol. , Ed. by Sarojini Regani, AP Govt. Publications, 1978, Page 457). చివరకు మౌల్వీ అల్లావుద్దీన్‌ను ఆంగ్లేయులు పట్టుకోగలిగారు.

మౌల్వీ అల్లావుద్దీన్ మీద కేసును నమోదు చేసిన ఆంగ్ల-నిజాం అధికారులు Hyderabad City Court సమక్షాన ఆయనను దోషిగా నిలబెట్టారు. అనంతరం హైదరాబాదు సిటీ కోర్టు విచారణ తంతు నిర్వహించి, 1859 ఆగస్టు 25న ఆయనకు యావజ్జీవిత కారాగారశిక్షను విధిస్తూ తీర్పు చెప్పింది. ఆ తీర్పు ప్రకారంగా 1860 జనవరి 22న మౌల్వీ అల్లావుద్దీన్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ అండమాను శిక్షాక్షేత్రంలో 'ఖైది నం. 3807' గా పరిగణించబడ్డారు. ఆ విధంగా పాతికేళ్ళకు పైగా నిర్బంధ జీవితం గడిపిన మౌల్వీ అల్లావుద్దీన్ 1884లో కన్నుమూశారు (Who's Who Of Freedom Struggle in Andhara Pradesh, Vol. One, Ed. by Sarojini Regani, AP Govt. Publications, 1978, Page 457).

ఆంగ్లేయుల మిత్రుడు నైజాం సంస్థానాధీశుని రాజధానిలో ఆంగ్లేయ సైన్యాల మీద దాడికి సిద్ధపడిన సాహసి మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ 1884లో కన్నుమూశారని ప్రముఖ చరిత్రకారిణి డాక్టర్ సరోజిని రెగాని ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1978లో ప్రచురించిన Who's Who Of Freedom Struggle in Andhara Pradesh, Vol. One, Page 457 లో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ గురించి రాస్తూ '..., Suffered Imprisonment there till his death in 1884' అని డాక్టర్ రెగాని విస్పష్టంగా పేర్కొన్నారు.

కానీ, మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ 1884 మరణించ లేదని, ఆయన 1889 వరకు సజీవంగా ఉన్నారని పలు దస్త్రాలు, ఆ తరువాత జరిగిన పలు పరిశోధనల ద్వారా వెల్లడవుతుంది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 150 ఏండ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా హైదరాబాదు నగరంలోని All India Majlis-e-Tamer-e-Millat & Tipu Sultan Research Center సంయుక్తంగా 2007 ఆగస్టు 17 నుండి 19 వరకు, 'Relevance of 1857 to the Present Day Today ' అను అంశం మీద జాతీయ స్థాయి సెమినార్ నిర్వహించారు. ఆ సెమినార్‌లో 'Moulvi Allauddin, An Eminent Freedom Fighter of Hyderabad ' శీర్షికతో Dr. Syed Dawood Ashraf ఒక పరిశోధనాపత్రాన్ని సమర్పించారు. ఆ సెమినార్‌లో సమర్పించబడిన పరిశోధనా పత్రాలు, ఇతర పత్రాలతో కలిపి ఆంగ్లం-ఉర్దూ భాషల్లో నిర్వాహకులు ఒక Souvenir ప్రచురించారు. Dr. Ashraf రూపొందించిన ఆ పరిశోధనాపత్రం ఆ Souvenir లో (Page 54-58) చోటుచేసుకుంది.

Dr. Ashraf సమర్పించిన పరిశోధనాపత్రం మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ 1884 లో కన్నుమూయలేదని 1889 ఆయన వరకు సజీవంగా ఉన్నారని వెల్లడించింది. ఆ వినూత్న విషయం వెల్లడిని బలపర్చేందుకు అవసరమగు దస్త్రాలను కూడా పరిశోధనాపత్రంలో పేర్కొంటూ తగిన అధికారిక రుజువులను కూడా డాక్టర్ అష్రాఫ్ ఎరుకలోకి తెచ్చారు. Andhra Pradesh State Archives and Research Institute వారి officially preserved file: ' File No. (445) of 1298 F relating to Court (miscellaneous) Subject:- Application of Alauddin for his release from Port Blair ', అను శీర్షికన ఉర్దూలో ఉన్న అధికారిక దస్త్రం ప్రకారం మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ 1889 వరకు సజీవులన్న విషయం రూఢి అవుతుందని Dr. Ashraf ప్రకటించారు. Dr. Ashraf బహిర్గతపర్చిన దస్త్రాల ప్రకారం, అండమానులో 30 ఏండ్ల పాటు గడిపిన మౌల్వీ అల్లావుద్దీన్ ఆంగ్లేయాధికారులు జారీచేసిన 'టిక్కెట్ ఆఫ్ లీవ్' వలన పాక్షిక స్వేచ్ఛను పొంది వివిధ వ్యాపారాలు చేశారు.

అవసరార్థులకు ఉర్దూ, పర్షియన్ భాషలను ఆయన బోధించారు. అధికారులకు మేధోపరమైన సహకారం అందించారు.

ఆ క్రమంలో 30 ఏండ్లు అండమానులో గడిపిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ తనను అండమాను శిక్షాక్షేత్రం నుండి తనను విముక్తం చేయమంటూ అటు బ్రిటిష్ భారత ప్రభుత్వం, ఇటు హైదరాబాదు ప్రభుత్వాలకు రాసుకున్న పలు వినతిపత్రాలను ఉటంకిస్తూ 1889 ఫిబ్రవరి ఒకటిన Government of Hyderabad కు మౌల్వీ చివరి విజ్ఞప్తి పంపుకున్నారు. ఆ విజ్ఞప్తి పత్రంతోపాటుగా వృద్ధ్యాప్యం, అనారోగ్యం, తనను ఇబ్బంది పెడుతున్న పలు వ్యాధుల గురించి పేర్కొంటూ, ఆయన నడవడిక, ఆయన సహాయ-సహకారాలను ప్రస్తావిస్తూ డాక్టర్లు, ఆంగ్లేయాధికారులు ఇచ్చిన 44 Testimonials కూడా 1889 ఫిబ్రవరి ఒకటి నాటి మహజరుకు మౌల్వీ జతచేశారు. ఈ మహజరులో తొలుత తాను Government of India కు వినతిపత్రం అందించగా తన విడుదలకు సానుకూలంగా స్పందిస్తూ Government of India Government of Hyderabad సమ్మతిని కోరిందని పేర్కొన్నారు. Government of India ఆ సూచన మేరకు మౌల్వీ నేరుగా Government of Hyderabad కు విజ్ఞప్తి పత్రం పంపించారు. ఆ విషయం తమ పరిధిలోనిది కాదంటూ Government of India కు విజ్ఞప్తి చేసుకోవాల్సిందిగా Government of Hyderabad మౌల్వీకి సలహా ఇచ్చింది. ఈ మేరకు రెండు ప్రభుత్వాలు ఆయన విడుదల ఆంశం తమది కాదంటే తమది కాదంటూ అల్లావుద్దీన్‌కు స్వేచ్ఛ ప్రసాదించ లేదు.

చివరకు 1889 ఫిబ్రవరి ఒకటిన గత చరిత్రను పూర్తిగా వివరిస్తూ పలు అధికారిక దస్త్రాలను కూడా జతచేస్తూ మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ తన ఆఖరి వినతిపత్రాన్ని Government of Hyderabad పంపుకున్నారు. ఆ వినతి పత్రం తరువాత మౌల్వీ ఏమైయ్యారన్నది తెలియరాలేదు. ఆ కారణంగా మౌల్వీ 1884లో కన్నుమూసారనటం సరికాదని 1889 ఫిబ్రవరి ఒకటి వరకు అండమాను శిక్షాక్షేత్రంలో ఆయన సజీవులుగా ఉన్నారని Dr. Syed Dawood Ashraf అలనాటి పలు దస్త్రాల సహాయంతో రూఢిచేశారు. ఆ తరువాత మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ పరిస్థితి ఏమిటన్నది తెలియలేదు. ◆



# నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఆంగ్లేయ సైన్యాధికారులకు ముచ్చెమటలు పట్టించిన ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అవధ్ రాజ్యం రాజమాత బేగం హజరత్ మహల్ ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలతో సాగించిన పోరాటంలో నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ (Nawab Ali Mohammad Khan) ఆమెకు కుడిభుజంగా నిలిచారు. ఆయన నవాబ్ మమ్మూఖాన్ (Nawab Mammu Khan) అని అలీ మొహమ్మద్ ఖాన్ బహదుర్ (Ali Mohammad Khan Bahdur) అని కూడా సుప్రసిద్ధులు. చరిత్రకారులచే, సమకాలీనులచే ఆయన 'మమ్మూఖాన్' (Mammu Khan) అని పిలువబడ్డారు.

1856 ఫిబ్రవరి 13న అవధ్ నవాబు వాజిద్ అలీషాను ఆంగ్లేయులు నిర్బంధించి, మార్చి 13న కలకత్తా పంపి రాజధాని లక్నోను అక్రమంగా ఆక్రమించుకున్నారు.ఆ కారణంగా ఆరంభమైన అవధ్ పోరాటానికి మమ్మూఖాన్ తగిన వ్యూహాన్ని రూపొందించి బేగం హజరత్ మహల్‌కు అండదండలు అందించారు. 1857 మే 31న లక్నో ఛావనీలో బేగం హజరత్ మహల్ నాయకత్వాన స్వదేశీ యోధులు, ప్రజలు సమావేశమై స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుని జూన్ మాసం నాటికి అవధ్ రాజ్యంలో ఆంగ్లేయుల అధికారం ఆనవాళ్ళను కనుమరుగు

చేసిన చారిత్రక ఘట్టంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. 1857 జూలై 7న బేగం హజరత్ మహల్ తన బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను అవధ్ నవాబుగా ప్రకటించి, లక్షా ఎనభైవేల సైనికులను సమకూర్చి, లక్షలాది రూపాయలను వ్యయం చేసి లక్నో కోటను పునర్నిర్మించే బృహత్తర కార్యక్రమంలో నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ ఆమెకు తోడుగా నిలిచారు. అవధ్ రాజ్యపాలన కోసం ఏర్పాటు చేసిన ఉన్నతస్థాయి కమిటీలో ఆయన న్యాయవిభాగం అధినేతగా బాధ్యతలు నిర్వహించారు. బేగం హజరత్ మహల్‌కు అత్యంత విశ్వాసపాత్రుడిగా, ఆమె బిడ్డడు మీర్జా బిర్జిస్ ఖాదిర్ బహదూర్ (Mirza Birjis Khadir Bahadur,1845-1892) భద్రతకు తన సర్వం పణంగా పెట్టి నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ రక్షకుడిగా నిలిచారు. అవధ్ పోరాటాన్ని బలోపేతం చేసేందుకు సాగిన ప్రయత్నాలలో భాగంగా పోరాట యోధుడు మౌల్వీ అహమ్మదుల్లా షాహ్ ఫైజాబాది ని అవధ్ రప్పించి ఆయనను పోరాటంలో భాగం చేయడానికి బేగం హజరత్ మహల్ సాగించిన ప్రయత్నాలు విజయవంతం చేయడంలో ఆయన వ్యూహాత్మకంగా వ్యవహరించారు. ఆ తరువాతి కాలంలో అవధ్ పోరాటం, అవధ్ రాజ్యపాలన తీరుతెన్నుల విషయంలో స్వతంత్ర అవధ్ రాజ్యం ప్రధాన న్యాయమూర్తిగా వ్యవహరిస్తున్న ఆయనకు, మౌల్వీ అహమ్మదుల్లా షాహ్ మధ్యన అభిప్రాయభేదాలు తలెత్తాయి. ఈ బలహీనతలు ఎలా ఉన్నా, ప్రత్యర్థులు ఎలాంటి ఆరోపణలు చేసినా నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ మాత్రం పోరుబాట వీడలేదు, బేగం హజరత్ మహల్‌ను విడనాడ లేదు. బ్రిటిష్ బలగాలతో ఢీ అంటే ఢీ అంటూ బేగం హజరత్ మహల్ సాగించిన నాలుగు పోరాటాలలో ఆయన కడవరకు ఆమె వెన్నంటి నిలిచారు. పది మాసాల పాటు ప్రత్యక్ష పాలన చేసి ప్రజలను, ఇతర స్వదేశీ పాలకులను ఉత్తేజితుల్ని చేసిన బేగం పాలనలో ఆయన ప్రధాన వ్యూహకర్తగా తనదైన భాగస్వామ్యం వహించారు.

1859 మార్చిలో ఆంగ్ల సైన్యాధికారులు అవధ్ రాజధాని లక్నోను భారీ బలగాలతో, యుద్ధ సామగ్రితో అన్నివైపుల నుండి చుట్టుముట్టారు. భయంకర యుద్ధం సాగింది. పరాజయం తప్పని పరిస్థితులలో సహచరుల ఒత్తిడి మేరకు బేగం హజరత్ మహల్‌తో కలసి నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ నేపాల్ అడవుల్లోకి తప్పుకున్నారు. అనంతర పరిణామాల ఫలితంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు ఆయనను అరెస్టు చేసారు. అయన మీద రాజద్రోహం నేరం మోపి విచారణ జరిపి యావజ్జీవి కారాగారశిక్షను విధించారు. ఆ శిక్షమేరకు, 1859 చివర్లో ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించగా, నవాబ్ అలీ మొహమ్మద్ ఖాన్ అండమానులో కన్నుమూసారు. ◆

# ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి

ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం లోని దీవాహ్ (Deewah) గ్రామంలో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి (Mufthi Inayat Ahmed Kakori) 1813లో జన్మించారు. చిన్నతనంలో తల్లితండ్రుల వద్ద ప్రాథమిక విద్యను పూర్తి చేశాక 13 ఏండ్ల వయస్సులో విద్యాభ్యాసం నిమిత్తం ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ప్రముఖ విద్యాకేంద్రం రాంపూర్ వెళ్ళారు. ఇస్లామిక్ తత్త్వశాస్త్రంలోని వివిధ విభాగాలను అధ్యయనం చేశాక 'హదీస్'లలో ప్రత్యేక పరిజ్ఞానం సముపార్జన నిమిత్తం ఢిల్లీ వెళ్ళారు. అక్కడ ఉన్నత విద్యాభ్యాసం పూర్తయ్యాక అయన అలీఘర్‌లో న్యాయమూర్తిగా నియుక్తులయ్యారు. ఆంగ్ల ప్రభుత్వానికి విశ్వాసపాత్రుడయిన అధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్న ఇనాయత్ అహ్మద్ కాకొరి ప్రధాన న్యాయమూర్తిగా అక్బరాబాద్ ఉన్నత న్యాయస్థానానికి బదిలీ అయ్యారు.

అక్బరాబాద్‌లో ప్రధాన న్యాయమూర్తిగా బాధ్యతలు చేపట్టేందుకు వెడుతున్న సమయంలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజానీకంలో పెల్లుబుకుతున్న వ్యతిరేకత, ఆగ్రహాన్ని ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి స్వయంగా గమనించారు. ఆంగ్లేయుల వివక్షాపూరిత చర్యలను గమనించి ఉన్న ఆయన ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు బాటలో సాగుతున్న ప్రజానీకంతో ఏకమయ్యారు. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య

సంగ్రామంలో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి భాగస్వామి అయ్యారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలం అయ్యాక ప్రజలు, సమరయోధులు, స్వదేశీ సైనికులు, స్వదేశీ సైన్యాధికారులు, అనుమానితుల మీద ఆంగ్లేయాధికారులు పాశవికంగా విరుచుకపడ్డారు. కన్పించిన వారిని కన్పించినట్టుగా, అందినవారిని అందినట్టుగా కాల్చివేస్తూ, ఉరిశిక్షలు విధిస్తూ భయానక వాతావరణాన్ని సృష్టించారు. ఆ రాక్షసకాండలో భాగంగా ముఫ్తి ఇనాయత్ అహ్మద్ ను ఆంగ్లేయాధికారులు ఢిల్లీలో నిర్బంధించారు. ఆయన మీద పలు నేరారోపణలను నమోదు చేశారు, ప్రభుత్వ వ్యతిరేక చర్యలు, హింసాకాండకు పాల్పడ్డారంటూ ఆరోపణలతో విచారణ నిర్వహించారు. చివరకు ఆంగ్ల న్యాయస్థానం కారాగారవాస శిక్షను విధిస్తూ తీర్పు చెప్పగా ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు.

అండమానుకు తరలించబడిన తరువాత మొదటి నాలుగు సంవత్సరాలు ఆంగ్లేయాధికారుల పాశవిక హింసాకాండకు, క్రౌర్యానికి, అవమానాలకు ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి గురయ్యారు. ఆంగ్ల అధికారులు ఆయనను ఎంతటి చిత్రహింసలకు గురి చేసినా, మరెంతగా ఇక్కట్ల పాల్జేసినా ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి మాత్రం స్థిరచిత్తంతో అన్నిటిని సహిస్తూ, అన్నిటిని భరిస్తూ ఎవ్వరినీ కూడా పల్లెత్తు మాట కూడా అనకుండా మంచి ప్రవర్తనతో అండమాను శిక్షాక్షేత్రంలో మంచి ఖైదీగా గడిపారు.

మంచి విద్వత్తు, మంచి న్యాయశాస్త్ర పరిజ్ఞానం కలిగిన ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి అండమాను శిక్షాక్షేత్రంలో కూడా వివిధాంశాల మీద తన రచనా వ్యాసంగాన్ని సాగించారు. ఆయన పలు గ్రంథాలను రచించారు. ఆయన ఎన్ని గ్రంథాలు రచించిన, మరెన్ని రచనలు చేసినా ఆ గ్రంథాలలో ఎక్కడా కూడా అండమాను శిక్షాక్షేత్రంలో ఆంగ్లేయాధికారులు ఖైదీల పట్ల వ్యవహరిస్తున్న అమానవీయ తీరుతెన్నులు గాని, తన పట్ల వ్యక్తమయిన కాఠిన్యాన్ని గాని ప్రస్తావించ లేదు. ఆ గ్రంథాలలో విషయ ప్రాధాన్యత తప్ప అన్య విషయాల మీద ఆయన దృష్టి సారించకపోవడం విశేషం.

ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి ఖగోళశాస్త్రం, జ్యోతిష్య శాస్త్రం, వేదాంతం మీద కూడా ప్రధానంగా దృష్టి నిల్పారు. ఈ శాస్త్ర రంగాలలో ముఫ్తి ఇనాయత్ ప్రతిభను, మేధోవ్యక్తిత్వ వికాసాన్ని క్రమంగా గుర్తించిన ఆంగ్లేయాధికారులు ఆయన సేవలను గణనీయంగా వినియోగించుకున్నారు. అధికారులు ఆయనను తమ కార్యాలయంలో మున్షీగా నియమించుకుని ఆయన మేధోపరమైన సేవల ప్రయోజనం పొందారు.

ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి సహకారంతో ఆంగ్లేయాధికారులు పలు అనువాదాలను చేయించుకున్నారు. ఆయన సహాయంతో ఖగోళశాస్త్రం, జ్యోతిష్య శాస్త్రం, వేదాంతం సంబంధిత గ్రంథాలను అధ్యయనం సాగించారు, అనువదించుకున్నారు. ఆయన తన విధివిధానాలలో భాగంగా Taqeem-ul-Baldan అను గ్రంథాన్ని ఆంగ్లేయాధికారుల వినతి మేరకు పూర్తిగా అనువదించి పెట్టారు. ఈ గ్రంథాన్ని అనువదించడం కష్టతరం మాత్రమే కాకుండా చాలా క్లిష్టతరమని భావించిన ఆంగ్ల అధికారులకు అత్యవసరమగు గ్రంథానువాదాన్ని ముఫ్తి ఇనాయత్ అత్యంత సునాయాసంగా చేసిపెట్టడంతో ఆంగ్లేయ ఉన్నతాధికారులు ఎంతగానో సంతోషించారు.

అండమాను జైలు జీవితంలో స్వాతంత్ర్య సంగ్రామ యోధులు, పండిత ప్రముఖులు మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది (Moulana Faz-lay-Haq Khairabadi) సాన్నిహిత్యం లో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకోరి గడిపారు. ఆ సమయంలో అండమాను జైలు అధికారి ఒకరు ఖగోళశాస్త్రం మీద పర్షియన్ / అరబిక్ భాషలో రాసిన గ్రంధంలోని భాషను, విషయ పరమైన తప్పొప్పులను సరిదిద్ది పెట్టడానికి మౌల్వీ ఇనాయత్ అహ్మద్ కాకోరి (Maulavi Inyat Ahmad Kakori) సహాయం కోరారు. అత్యంత క్లిష్టతరమయినదని ఆంగ్లేయాధికారులు భావించిన ఆ అరబ్బీ / పర్షియన్ భాషా గ్రంథంలోని తప్పొప్పులను, భాషా పరమైన-వస్తు పరమయిన దోషాలు ఏమాత్రం లేకుండా, మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది సహకారంతో మౌల్వీ ఇనాయత్ అహ్మద్ కాకోరి చక్కని అనువాదాన్ని చేసి పెట్టారు.

ఆ శుద్ధ ప్రతిని ఆయన ఆంగ్లేయాధికారికి అందజేశారు. అతికొద్ది సమయంలోనే మౌల్వీ ఇనాయత్ అద్భుతంగా సరిదిద్ది శుద్ధ ప్రతిని తీసుకరావడంతో ఆంగ్ల అధికారి ఆశ్చర్యానికి లోనయ్యాడు. ఆ సమయంలో ఈ సరిదిద్దుడు కార్యక్రమంలో తనకంటె మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది పాత్ర అత్యధికమని, ఇందులో తన పాత్ర అతి స్వల్పమని మౌల్వీ ఇనాయతుల్లా ఆంగ్లేయాధికారికి వివరించారు. ఆ మాటలు వినగానే ఆ అధికారికి మౌలానా ఫజల్-ఏ-హాఖ్ మీద ఎనలేని గౌరవం పెరిగింది. ఆ క్రమంలో మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాదిని ఆ అధికారి తన కార్యాలయంలో మున్షీగా నియమించుకుని ఆదరించారు.

ఆ తరువాత మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం పూర్వోపరాలను వెల్లడిస్తూ, ప్రథమ స్వాతంత్ర్య సమరం విఫలం కావడానికి కారణాలను విశ్లేషిస్తూ, అండమానుకు తరలించబడిన స్వాతంత్ర్య సమరయోధుల ఇక్కట్లను, అక్కడి దుర్భర పరిస్థితులను, ఆంగ్లేయాధికారుల క్రౌర్యాన్ని పేర్కొంటూ, ఆయన తాత్విక-ధార్మిక

భావజాలాన్ని కూడా వెల్లడిస్తూ 'అల్ సవురతుల్ హిందియా' (Al-Surath-Ul-Hindia) శీర్షికన సుప్రసిద్ధ గ్రంథాన్ని అరబ్బీ భాషలో రాసారు. ఆ గ్రంథాన్ని అతి రహస్యంగా అండమాను శిక్షాక్షేత్రం నుండి మౌలానా హఖ్ కుటుంబానికి చేరవేయడంలో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకోరి బృహత్తర పాత్ర నిర్వహించారు. మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది పెన్సిల్, బొగ్గుతో చిత్తు కాగితాల మీద రాసి పెట్టుకున్న 'అల్ సవురతుల్ హిందియా' గ్రంథం చిత్తు ప్రతిని ముఫ్తి ఇనాయత్ అండమాను శిక్షాక్షేత్రం నుండి అంగ్లేయాధికారుల కంట పడకుండా రహస్యంగా స్వదేశానికి తెచ్చి మౌలానా ఖైరాబాది కుమారుడు మౌలానా అబ్దుల్ హఖ్ ఖైరాబాది (Maulana Abdul Haq Khairabadi) కి అప్పగించారు. ఆ విధంగా స్వదేశం చేరిన మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది గ్రంథం 'అల్ సవురతుల్ హిందియా' ఆంగ్లేయుల పాలన సమాప్తం అయ్యాక పలు భాషల్లో అనువదించబడి ముద్రితమయ్యింది.

అండమాను జైలులో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి నుండి మేధోపరమైన సహాయాన్ని పొందిన ఆంగ్లేయాధికారులు ఆయన పట్ల సానుకూలత చూపారు. ఆయన కూడా ఆంగ్లేయ ఉన్నతాధికారి కార్యాలయంలో మున్షీగా సమర్ధవంతంగా బాధ్యతలు నిర్వహిస్తూ మంచి పేరు తెచ్చుకున్నారు. ఆయన నుండి పలు విధాలుగా సేవలను పొందిన ఆంగ్లేయాధికారులు అండమాను జైలు నుండి ఆయన విడుదలకు సహకరించారు. అండమాను నుండి ఆయనకు త్వరితగతిన విముక్తి కలిగించి స్వదేశం పంపడానికి అండమాను లోని ఆంగ్లేయాధికారులు బ్రిటిష్ ప్రభుత్వానికి సిఫార్సు చేశారు. ఆంగ్ల అధికారుల ప్రయత్నాలు, పంపిన సిఫార్సుల ఫలితంగా ముఫ్తి ఇనాయత్ ఆంగ్ల న్యాయస్థానం విధించిన శిక్షాకాలం పూర్తి కాకముందే అండమాను శిక్షాక్షేత్రం నుండి విముక్తమయ్యారు.

ఈ మేరకు అండమాను శిక్షాక్షేత్రం నుండి స్వస్థలం చేరుకున్న ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకోరి విద్యాబోధన మీద ఉన్న ఆసక్తితో ఇస్లామిక్ వేదాంత సారాన్ని నేర్పేందుకు కాన్పూరులో 'మదరసా' స్థాపించారు. మూడు సంవత్సరాల పాటు మదరసా నిర్వహణ, బోధన తదితర బాధ్యతలను నిర్వహించిన ఆయన 1866లో మక్కా యాత్రకు సంకల్పించుకున్నారు. ఆ హజ్ యాత్ర ప్రయాణంలో భాగంగా సముద్రయానం చేసి జెద్దాహ్ చేరుకున్నారు. ఆయన, ఆయన మిత్రబృందం జెద్దాహ్ సముద్ర తీర ప్రాంతంలో ఉండగా సముద్రంలో ఆకస్మికంగా తుఫాను చెలరేగింది. ఆ భయానక తుఫానుకు ఆయన ప్రయాణిస్తున్న ప్రయాణ నౌక తలకిందులు అయ్యింది. ఆ ప్రమాదంలో ముఫ్తి ఇనాయత్ అహ్మద్ కాకొరి తన సహచరులతో సహా 1866లో జెద్దాహ్‌లో కన్నుమూసారు. ◆



# మౌలానా ఫజల్ ఏ హఖ్ ఖైరాబాది

ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామ సమయాన ఆంగ్లేయ వలస పాలకుల మీద తిరగబడమని ప్రజలకు పిలుపునిస్తూ జారీ అయిన చారిత్రాత్మక 'ఫత్వా-ఏ-జిహద్' (Fatwa-e-Jihad) సృష్టికర్త మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది (Moulana Faz-lay-Haq Khairabadi). 1796 ఏప్రిల్ ఏడున ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, సితాపూర్ (Sitapur District) జిల్లా, ఖైరాబాద్ (Khairabad) లో ఆయన జన్మించారు. ఖైరాబాద్‌లో జన్మించినప్పటికి ఎక్కువ కాలం ఆయన ఢిల్లీలో గడిపారు. అయినప్పటికి ఆయన తన స్వగ్రామం Khairabad పేరుతో Khairabadi గా విఖ్యాతులయ్యారు. ఆయన తండ్రి మౌలానా ఫజల్ ఏ ఇమాం ఖైరాబాది (Moulana Faz-lay-Imam Khairabadi). మౌలానా ఇమాం ప్రముఖ ధార్మిక పండితులు. ఆనాడు మొగల్ రాజదర్బార్ గౌరవాన్ని అందుకుంటూ మొగల్ రాజులకు ధార్మికంగా సలహాలిస్తూ 'సర్దారుల్ సర్దార్' (Sadar-ul-Sardar) గౌ మౌలానా ఫజలే ఇమాం ఆదరించబడ్డారు, ప్రజలచేత గౌరవించబడ్డారు.

మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది జన్మించిన సమయంలో ఢిల్లీలో మొగల్ రాజు అక్బర్ షా-2 పాలన సాగుతుంది. ఢిల్లీ నగరం ఆనాడు ప్రముఖ కవి పండితులు, సాహిత్యవేత్తలు, బహుభాషా కోవిదులతో అలరారుతుంది. ఆ సాహిత్య వాతావరణంలో

తొలుత తండ్రి వద్ద ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాది అక్షరాభ్యాసం చేశారు. తండ్రి మహాపండితుడు కావడం వలన ఆయన కూడా చిన్ననాటి నుండి ప్రతిభా సంపన్నుడయ్యారు. ఆ తరువాత ప్రముఖ పండితులు షా అబ్దుల్‌ ఖాదిర్‌ సాహెబ్‌ దెహల్వీ, షా అబ్దుల్‌ అజీజ్‌ల వద్ద ఆయన శిష్యరికం గావించారు. చిన్ననాటి నుండి చురుకైన విద్యార్థి మాత్రమే కాకుండా మంచి జ్ఞాపకశక్తి గల విద్యార్థిగా మౌలానా ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాది పరిగణించ బడ్డారు. ఆ కారణంగా పదమూడు ఏండ్ల వయస్సు నాటికి ధార్మిక-సామాజిక శాస్త్రాలలో మంచి విద్వత్తు సంపాదించిన ఆయన ఆనాటి పండిత లోకాన్ని ఆశ్చర్యపర్చారు.

పలు శాస్త్రాలలో ప్రతిభాపాటవాలను సంపాదించుకున్న మౌలానా ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాది పద్ధెనిమిది ఏండ్ల వయస్సులో ఢిల్లీ రెసిడెన్సీ లోని న్యాయ విచారణ కార్యాలయంలో ప్రధానాధికారిగా (Chief of Cutchery in Delhi Residency) నియమితులయ్యారు. ఆయన అద్భుత ప్రతిభను గుర్తించిన ఆంగ్లేయాధికారులు ఢిల్లీ కమీషనర్‌ కార్యాలయానికి పదోన్నతి మీద బదిలీ చేశారు. ఆ అధికారిక ఉన్నతోద్యోగాలలో గౌరవమర్యాదలు పుష్కలంగా లభిస్తున్నా ఆయన మనసు మాత్రం ఆ ఉన్నతోద్యోగాల మీద నిలువలేదు. ఆ ఉద్యోగాలలో పనిచేస్తున్న ప్రతిభా సంపన్నులు, మంచి విద్వత్తు గల భారతీయుల పట్ల ఆంగ్లేయాధికారులు చూపుతున్న వివక్ష మౌలానా ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాదికి నచ్చక ఉద్యోగానికి రాజీనామా సమర్పించారు.

ప్రముఖ శాస్త్రాల అధ్యయనం, బోధన పట్ల ఆసక్తి గల మౌలానా ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాది 1821లో ధార్మిక-సామాజిక శాస్త్రాల ఆధ్యయనం, అధ్యాపనం చేపట్టారు. ఆయా రంగాలలో ఆయన చూపెడుతున్న ప్రతిభాపాటవాల గురించి తెలుసుకున్న ఝజ్జర్‌ (Jhajjar) సంస్థానం నవాబు స్వయంగా తన కొలువులోకి ఆయనను ఆహ్వానించారు. ఆక్కడ కొంతకాలం గడిపిన తరువాత అల్వార్‌ (Alwar), సహరాన్‌పూర్‌ (Saharanpur), టోంక్‌ (Tonk) సంస్థానాలలో ఆయన పలు ఉన్నత పదవులను నిర్వహించారు. ఆ తరువాత రాంపూర్‌ (Rampur) నవాబు కొలువులో కొంతకాలం గడిపారు. చివరకు 1847లో లక్నో (Lucknow) సంస్థానం చేరుకున్నారు. 1856లో లక్నో రాజధానిగా గల అవధ్‌ రాజ్యాన్ని ఆంగ్లేయులు ఆక్రమించాక మౌలానా ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాది లక్నో రాజ్యం వదలిపెట్టి ఢిల్లీ చేరుకున్నారు.

1857లో ఢిల్లీ చేరుకున్న మౌలానా ఫజల్‌-ఏ-హఖ్‌ ఖైరాబాది అక్కడ కన్పించిన ప్రతికూల పరిస్థితులను, విషమయ రాజకీయ వాతావరణాన్ని చూసి విచలితులయ్యారు. ఆవేదనకు గురయ్యారు. ఆయన సత్వరమే మొగల్‌ చక్రవర్తి బహదూర్‌ షా జఫర్‌ను కలుసుకున్నారు. ఢిల్లీలో నెలకొని ఉన్న అవాంఛనీయ పరిస్థితుల మీద ఆయనతో వివరంగా

చర్చించారు. ఆంగ్లేయులతో పోరాటానికి సిద్ధం కావాల్సిందిగా చక్రవర్తి బహదుర్ షా జఫర్‌ను, మొగల్ రాజకుమారులను మౌలానా ఫజల్-ఏ-హఖ్ ప్రోత్సహించారు.

ఆంగ్ల ప్రభుత్వ కార్యాలయాలలో మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది ఉన్నత అధికారిగా పనిచేస్తూ ఆంగ్లేయాధికారులతో కలసి బాధ్యతలు నిర్వహించి ఉన్నందున ఆంగ్ల పాలకుల వ్యవహార సరళి, ఆలోచనలు లక్ష్యాలు-ఉద్దేశ్యాలు, ప్రభుత్వ రహస్యాలు, విధానాలు ఆయనకు బాగా అవగతం. ఆంగ్లేయులు క్రమంగా భారతీయుల అన్ని జీవన రంగాలలో చొచ్చుక పోతూ భారతీయుల మిశ్రమ సంస్కృతి, ఆచార సాంప్రదాయలను విచ్ఛిన్నం చేస్తున్న తీరుతెన్నులను ఆయన గ్రహించారు. ఆంగ్లేయుల దురాశాపూరిత చర్యలు సామాన్య ప్రజల బ్రతుకులను అతలాకుతలం చేయడం స్వయంగా చూసారు. ఆ కారణంగా ఆంగ్ల ప్రభుత్వం తదుపరి చర్యల గురించి అవగాహన, అంచనాలు కలిగి ఉన్న ఆయనకు రానున్న సంక్లిష్ట పరిస్థితులు ఆందోళనకు గురిచేశాయి. ఆ ఆందోళన మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాదిని ఆంగ్లేయ శాసకులకు వ్యతిరేకంగా పోరుబాటన సాగమని నిర్దేశించింది.

భారతీయుల సామాజిక-ఆర్థిక-రాజకీయ-ధార్మిక రంగాలు ఆంగ్లేయుల ఎత్తుగడలు, స్వార్థం, కుటిలత్వం వలన విషపూరితం అవుతుండగా, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావం 1857 మే 10న మీరట్ నుండి మారుమ్రోగింది. ఆ శంఖారావం ప్రకంపనలు దశదిశలా వ్యాపిస్తూ, సంస్థానాలలో ప్రతిధ్వనిస్తూ ఢిల్లీ చేరుకున్నాయి. ఆంగ్లేయుల కబంధ హస్తాల నుండి విముక్తం మాతృభూమిని చేయడానికి ఆంగ్లేయ సైన్యాలతో తలపడేందుకు మీరట్ నుండి ఢిల్లీ వచ్చిన స్వదేశీ యోధులకు మౌలానా అండగా నిలిచారు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఢిల్లీ కేంద్రంగా తిరుగుబాటు యోధులు ఆరంభించిన పోరాటానికి నాయకత్వం వహించిన తిరుగుబాటు యోధుల సర్వసైన్యాధ్యక్షులు ముహమ్మద్ బక్త్‌ఖాన్ 14 వేల మంది స్వదేశీ యోధులతో 1857 జూన్ 26న ఢిల్లీ చేరుకున్నారు. ఆయన మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది లాంటి ప్రముఖులను కలుసుకుని, ప్రముఖులతో మంతనాలు జరిపారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వదేశీ సైనికులు మాత్రమే కాకుండా ప్రజలు కూడా పోరుబాట సాగాల్సిన అవసరాన్ని మౌలానా గుర్తించారు.

ఆ సందర్భంగా భక్త్‌ఖాన్ వినతి మేరకు ఆంగ్లేయుల మీద తిరగబడమని మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది ప్రజలకు బహిరంగంగా పిలుపు ఇచ్చారు. ఈ సందర్భంగా మౌఖిక పిలుపు మాత్రమే కాకుండా ఆ పిలుపుకు అక్షర రూపం కల్పిస్తూ భారత స్వాతంత్ర్య సంగ్రామ సాహిత్య చరిత్రలో సుప్రసిద్ధమయిన 'ఫత్వా-ఏ-జిహద్' (Fatwa-e-Jihad) ను

ఆయన ప్రత్యేకంగా రూపొందించారు. మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది విరచిత ఆ 'ఫత్వా-ఏ-జిహద్' మీద తొలుత తాను స్వయంగా సంతకం చేశారు. ఆ తరువాత ఢిల్లీ నగరంలో ప్రముఖ వ్యక్తులయిన ముఫ్తి సదరుద్దీన్ ఖాన్ (Mufthi Sadar-ud-Din Khan), మౌల్వీ అబ్దుల్ ఖదిర్ (Maulvi Abdul Qadir), ఖాజి ఫైజ్ అహ్మద్ బదయూని (Qazi Faiz Ahmed Badayuni), డాక్టర్ వజీర్ ఖాన్ అక్బారాబాది (Dr. Wazir Khan Akbar Abadi), మౌల్వీ సయ్యద్ ముబారక్ షాహ్ రాంపూరి (Maulvi Saiyed Mubarak Shah Rampuri) లతో ఆయన సంతకాలు చేయించారు. ఆ తరువాత 'ఫత్వా-ఏ-జిహద్' ప్రజలకు విడుదల చేశారు. ఆనాటి నుండి మౌలానా ఖైరాబాది రూపకల్పన చేసిన 'ఫత్వా-ఏ-జిహద్' భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రత్యేకతను సంతరించుకుంది.

ఆ చారిత్రాత్మక 'ఫత్వా-ఏ-జిహద్' పిలుపుకు ప్రజానీకం పెద్ద ఎత్తున స్పందించింది. భారతదేశం వ్యాప్తంగా ప్రాచుర్యం పొందిన 'ఫత్వా-ఏ-జిహద్' ప్రకంపనాలను సృష్టించింది. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట సాగటం ప్రతి భారతీయుని విధిగా పేర్కొన్న ఆ ఫత్వా సంచలనాలకు కారణమయ్యింది. ఆ ఫత్వా ప్రజలను ప్రేరేపించి సాహసోపేతంగా పోరాటాల దిశగా నడిపించింది. ప్రజలు అత్యంత ధైర్యసాహసాలు చూపుతూ, స్వదేశీ సైనిక యోధులతో కలసి ఆంగ్ల సైన్యాల మీద పెద్ద ఎత్తున విరుచుకపడ్డారు. ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలోని స్వదేశీ ఉన్నతాధికారులు, సైనికులు పెద్ద ఎత్తున తిరుగుబాటు ప్రకటించి కంపెనీ సైన్యాల నుండి దూరమయ్యి మాతృభూమి విముక్తి కోసం పోరాటం సాగిస్తున్న స్వాతంత్ర్య సమరయోధుల దళాలలో స్వచ్ఛందంగా వచ్చి చేరారు.

ఆనాడు ఢిల్లీ కేంద్రంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో భాగంగా ఏర్పడిన స్వదేశీయుల స్వరాజ్యానికి మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది ప్రత్యేక రాజ్యాంగం రూపకల్పనలో స్వాతంత్ర్య సమర యోధుల సర్వసైన్యాధ్యక్షులు మహ్మద్ బక్త్‌ఖాన్‌కు సహకరించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఆరంభమయిన సమరాన్ని పర్యవేక్షిస్తున్న ఆనాటి యుద్ధ సమితి (War Council) లో సభ్యులుగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఇటు అక్షరంతో అటు ఆయుధంతో కూడా మౌలానా పేర్కొనదగిన పాత్ర నిర్వహించారు.

స్వదేశీ సైనికులు, సంస్థానాధీశులు, ప్రజలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో అవిశ్రాంతంగా పాల్గొంటూ అన్ని త్యాగాలకు సిద్ధపడినా, ఆవరించి ఉన్న ప్రతికూల పరిస్థితులను పూర్తిగా అధిగమించలేక పోయారు. చివరకు 1857 సెప్టెంబర్ 20న స్వాతంత్ర్య సమరయోధుల ప్రధాన పోరాటకేంద్రంగా నిలచిన ఢిల్లీ పూర్తిగా ఈస్ట్

ఇండియా కంపెనీ బలగాల వశమయ్యింది. ఆనాటి సంక్లిష్ట పరిస్థితులలో మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది ఢిల్లీ నుండి తప్పుకున్నారు. ఆయన ఢిల్లీ నుండి నేరుగా లక్నో వెళ్ళి అక్కడ ఆంగ్ల సైన్యాలతో పోరాడుతున్న బేగం హజరత్ మహల్ కు సహకరించారు. బేగం హజరత్ మహల్ సంస్థానంలో ఉంటూ ఇతర తిరుగుబాటు యోధులతో కలసి ఆంగ్లేయుల మీద పోరుబాటన సాగారు. లక్నోలో కూడా బేగం హజరత్ మహల్ సాగించిన పోరాటం విఫలమయ్యి తిరుగుబాటు యోధులు అజ్ఞాతంలోకి నిష్క్రమించాక మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది లక్నో విడిచి స్వగ్రామం ఖైరాబాద్‌కు వెళ్ళిపోయారు.

ఆరంభం నుండి మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది చర్యలు, ఆయన కార్యక్రమాలతో మండిపడుతున్న ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు ఆయన నిర్బంధం కోసం ప్రయత్నాలను ముమ్మరం చేసారు. ఆయనను వెంటాడి, వెంటాడి చివరకు స్వగ్రామం ఖైదాభాద్‌లో 1858 డిసెంబర్ మూడున నిర్బంధించారు. ఆ వెనువెంట ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు ఆయనను ఢిల్లీకి తరలించారు. మౌలానా మీద రాజద్రోహం, ప్రజలను హింసకు ప్రేరేపించారన్న పలు నేరారోపణలు చేశారు. ప్రధానంగా 'ఫత్వా-ఏ-జిహద్' (Fatwa-e-Jihad) జారీ చేసి ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సైనికులను, ప్రజానీకాన్ని రెచ్చగొట్టి ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రలు, హింసాయుత చర్యలకు పాల్పడి ఆంగ్లేయ రాజ్యాన్ని కూలదోసేందుకు కుయుక్తులు పన్నారని, రాజద్రోహానికి పాల్పడ్డారని న్యాయస్థానంలో ఆంగ్ల ప్రభుత్వం చార్జిషీటు దాఖలు చేసింది. ఆంగ్ల ప్రభుత్వం మోపిన ఆరోపణల మేరకు మౌలానా ఖైరాబాది మీద ఆంగ్ల న్యాయస్థానంలో విచారణ ఆరంభం అయ్యింది.

ఆ విచారణలో మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది తన వాదనను తాను స్వయంగా విన్పించారు. ఆ విచారణ సమయంలో మౌలానా ప్రదర్శించిన అద్భుతమైన న్యాయశాస్త్ర పరిజ్ఞానం, వాగ్ధాటి, అభిప్రాయ వ్యక్తీకరణలో శాస్త్రీయత-స్పష్టత, ఆయన ప్రవర్తన లోని చక్కని హుందాతనం చూసిన, మేధోసంపదను గమనించిన ఆంగ్లేయ న్యాయమూర్తుల బృందం ఎంతగానో అబ్బుర పడింది. మౌలానా తన విశిష్ట వ్యక్తిత్వంతో అద్భుత ప్రతిభా పాటవాలతో ఆంగ్లేయ న్యాయమూర్తులను కూడా బాగా ఆకట్టుకున్నారు.

ఆ కారణంగా ఆంగ్ల న్యాయమూర్తుల బృందంలో ఆయన పట్ల సానుకూలత ఏర్పడింది. ప్రభుత్వ ఆరోపణలు ఏవీ కూడా మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది బలమైన వాదన ఎదుట నిలబడలేక పోయాయి. ప్రభుత్వ న్యాయవాది వాదనలన్నీ మౌలానా వాదనల ఎదుట ఒక్కక్కొటిగా వీగిపోసాగాయి. ఆ కారణంగా న్యాయమూర్తుల బృందం ఆయనను

ఈ కుట్రకేసు నుండి విముక్తుడ్ని చేయాలని భావించసాగింది. ఆ విచారణలో మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది ఎటువంటి దండనకు గురికాకుండా నిర్దోషిగా బయట పడటం తధ్యమని ఇటు ప్రజలు, అటు అధికారులు కూడా భావించసాగారు.

మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది విచారణ చివరి రోజున ఎవ్వరూ ఊహించని విధంగా ఆంగ్ల న్యాయమూర్తుల ప్రశ్నకు సమాధానంగా ప్రకటించిన వ్యక్తిగత వాంగ్మూలం అప్పటి వరకు ఆయన పట్ల న్యాయమూర్తులలో ఏర్పడిన సానుకూల వాతావరణాన్ని పూర్తిగా మార్చేసింది. మౌలానా మాట్లాడుతూ 'ఫత్వా-ఏ-జిహద్' (Fatwa-e-Jihad) ను తాను స్వయంగా రూపొందించినట్టు, అలా తాను రూపొందించిన ఫత్వా మీద ఢిల్లీ నగర ప్రముఖులు తన సలహా, ఒత్తిడి మేరకు మాత్రమే సంతకాలు చేసారంటూ న్యాయస్థానంలో తన వాంగ్మూలాన్ని బహిరంగంగా ప్రకటించారు.

ఆ ప్రకటన ప్రజలలో ప్రకంపనాలు సృష్టించింది. ప్రజానీకం ఎక్కడ మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాదికి శిక్ష పడుతుందోనని ఖంగారు పడగా ఆయన పట్ల సానుభూతితో ఉన్న ఆంగ్ల న్యాయమూర్తులు ఈ విపరీత పరిణామంతో ఒక్కసారిగా విస్తుపోయారు. ఆ విధంగా అన్నివర్గాల ప్రజల నుండి వ్యక్తమౌతున్న ఆవేదన-ఆశ్చర్యానికి మౌలానా ఫజల్ -ఏ- హఖ్ సమాధానమిస్తూ, 'I confirm that the statement of the informer who has given the message about Fatwa was written by me and has been signed by learned persons on my suggestion. In the beginning the witnesses gave true statement, but later they told a lie on being impressed by me. I have to go the Almighy God and hence I can not give a false statement.' అని అన్నారు. ఆ వివరణతో మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది మీద ఆంగ్ల ప్రభుత్వం మోపిన నేరాన్ని ఆయన స్వయంగా అంగీకరించినట్టు అయ్యింది.

మౌలానా ఫజల్-ఏ-హఖ్ ప్రకటించిన ఆ నేరాంగీకార వాంగ్మూలంతో 1859 మార్చి నాలుగున ఆయనను న్యాయస్థానం నేరస్తుడిగా ప్రకటించింది. ఆ తరువాత మౌలానాకు యావజ్జీవిత కారాగార శిక్షను విధిస్తూ తీర్పు ఇచ్చింది. ఆయనను అండమాను శిక్షాక్షేత్రం పంపాల్సిందిగా అధికారులను న్యాయస్థానం ఆదేశించింది. ఆ తీర్పు ప్రకారంగా మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాదిని ఆంగ్లేయాధికారులు ఢిల్లీ నుండి ఆరు వందల మైళ్ళ దూరాన ఉన్న అండమానుకు 'ఫైర్ క్వీన్' (Fire Queen) పేరుగల ఆవిరి యుద్ధ నౌక (Steam Frigate) ద్వారా తరలించగా 1859 అక్టోబర్ ఎనిమిదిన ఆయన అండమాను చేరుకున్నారు.

అండమాను శిక్షాక్షేత్రంలో తొలుత ఆయనను ఆంగ్లేయాధికారులు శారీరక–మానసిక చిత్రహింసలకు గురిచేశారు. భారతదేశం యావత్తు గర్వించదగిన పండితుడు, కవి, సాహితీవేత్త న్యాయశాస్త్ర కోవిదుడు మౌలానా ఫజల్–ఏ–హఖ్ ఖైరాబాది ప్రతిభాపాటవాలు తెలియని ఆంగ్లేయాధికారులు ఆయన పట్ల చాలా క్రూరంగా, అమానవీయంగా ప్రవర్తించారు. ప్రఖ్యాత మొగల్ చక్రవర్తి ఆస్థానంలో, భారతదేశంలోని ప్రఖ్యాతి చెందిన ఇతర పలు సంస్థానాధీశుల కొలువులో అత్యంత గౌరవప్రతిష్ఠలను అందుకున్న పండితుడికి అత్యంత కఠినమైన పనులను ఆంగ్లేయాధికారులు అప్పగించారు. ఆయన పట్ల అత్యంత అమర్యాదకరంగా ప్రవర్తించారు, పాశవికంగా వ్యవహరించారు.

ఆ భయానక ప్రతికూల వాతావరణంలో కూడా మౌలానా ఫజల్–ఏ–హఖ్ ఖైరాబాది సాహితీ సృజనను కొనసాగించారు. బొగ్గు ముక్కలను, పెన్సిళ్ళను రాత పరికరాలు చేసుకుని కాగితపు ముక్కల మీద సాహిత్య పంక్తులను కుమ్మరిస్తూ సాహిత్య సృష్టించారు. ఆ సమయంలో అండమాను శిక్షాక్షేత్రం అధికారి ఒకరు ఖగోళశాస్త్రం మీద పర్షియన్ / అరబిక్ భాషలో రాసిన గ్రంథంలోని భాషను సరిదిద్ది పెట్టడానికి తన కార్యాలయంలో మున్షీగా పనిచేస్తున్న మౌల్వీ ఇనాయత్ అహ్మద్ కాకోరి (Maulavi Inyat Ahmad Kakori) కి బాధ్యతలు అప్పగించాడు. అత్యంత క్లిష్టతరమయిన అరబ్బీ / పర్షియన్ భాషా గ్రంథాన్ని అతికొద్ది సమయంలోనే అద్భుతంగా సరిదిద్ది మౌల్వీ ఇనాయత్ అహ్మద్ కాకోరి తీసుకరావడంతో ఆంగ్లేయుడు అశ్చర్యపోయాడు. సవరించబడిన తన గ్రంథం లోని పర్షియన్ / అరబ్బీ భాష సవరణ, వాక్యం దిద్దుబాటు తీరును పరిశీలించిన ఆంగ్ల అధికారి మౌల్వీ ఇనాయత్‌ను ప్రశంసల వర్షంలో ముంచెత్తాడు. ఆ ఆంగ్లేయుడి ప్రశంసలకు సమాధానంగా మౌల్వీ ఇనాయత్ అహ్మద్ కాకోరి మాట్లాడుతూ ఆ ప్రశంసలకు తాను ఏమాత్రం అర్హుడను కానని అసలు వాస్తవాన్ని వెల్లడించారు. ఆంగ్ల అధికారి ప్రశంసలకు మరొక మహాపండితుడు మాత్రమే అర్హులని మౌల్వీ ఇనాయతుల్లా ఆ ఆంగ్లేయాధికారికి తెలిపారు. ఆ మాటలు విని ఆశ్చర్యచకితుడయిన ఆంగ్లేయాధికారి హుటాహుటిన తనను ఆ పండితుడి వద్దకు తీసుకుని వెళ్ళమని మౌల్వీ ఇనాయత్ కాకోరిని తొందర పెట్టాడు.

ఆంగ్లేయాధికారి, మౌల్వీ ఇనాయత్ అహ్మద్ కాకోరి ఇరువురు కలసి మౌలానా ఫజల్–ఏ–హఖ్ ఖైరాబాది నివాసం ఉంటున్న ప్రాంతానికి వెళ్ళారు. ఆ సమయంలో మౌలానా తన నివాసంలో లేరు. మౌలానాను కలసిన తరువాత గాని తాను అక్కడి నుండి కదలి వెళ్ళేది లేదని తీర్మానించుకున్న ఆంగ్లేయాధికారి మౌలానా కోసం నిరీక్షిస్తూ ఉండిపోయాడు.

ఆ కాసేపటికి ముతక చొక్కా తొడుక్కొని, లుంగీ కట్టుకుని చెమటలో తడిసి ముద్దవుతూ గంపను చేత పట్టుకుని అతి సామాన్య పనివాడి ఆహార్యంలో మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది తన నివాస ప్రాంతానికి వచ్చారు. అతి సామాన్య కూలీ వస్త్రధారణలో అత్యంత సామాన్యుడిగా కన్పిస్తున్న మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాదిని చూసి ఆంగ్లేయుడు విస్తుపోయాడు. మౌలానా పట్ల జరిగిన అవమానానికి క్షమాపణలు అడిగాడు. ఆఘమేఘాల మీద ఆ ఆంగ్లేయాధికారి తన కార్యాలయం వెళ్ళి మౌలానా ఖైరాబాదిని తన వ్యక్తిగత ఉద్యోగుల వర్గంలో ఒకరుగా నియమిస్తూ ఉత్తర్వులు జారీచేశాడు. ఆ విధంగా అండమాను జైలు అధికారి చర్యల వలన అండమానులో మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది పరిస్థితులు కాస్త మెరుగుపడ్డాయి. మౌలానాకు పలు భాషలలో పాండిత్యం ఉండటం మాత్రమే కాకుండా ఆయనకు గల న్యాయశాస్త్ర పరిజ్ఞానం, ఆయన అసాధారణ సాహితీ ప్రతిభను గుర్తించిన ఆంగ్లేయాధికారులు మౌలానా గౌరవిస్తూ ఆయన మేధోపరమయిన సేవలను బాగా వినియోగించుకున్నారు. (ఈ విశేషాంశాన్ని ప్రముఖ రచయిత శ్రీ అమిత్ రాయ్ జైన్ ప్రచురించిన Cellular Jail of Andaman and Nicobar Islands, (Shree Publishers & Distributors, New Delhi, 2017, Page 76-77) గ్రంథంలో సవివరంగా పేర్కొన్నారు)

ఆ సందర్భంగా మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది తనదైన ప్రత్యేక సాహిత్య సృజనకు పూనుకున్నారు. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం పూర్వాపరాలను వెల్లడిస్తూ, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలం కావడానికి కారణాలను వివరిస్తూ, ఆ కారణాలను హేతుబద్ధంగా విశ్లేషిస్తూ గ్రంథ రచనకు పూనుకున్నారు. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర ప్రస్తావనలను మాత్రమే కాకుండా ఆయన తాత్విక-ధార్మిక భావజాలాన్ని కూడా వివరిస్తూ 'అల్ సవురతుల్ హిందియా' (Al-Surath-Ul-Hindia) అను సుప్రసిద్ధ గ్రంథాన్ని అరబ్బీ భాషలో రూపొందించారు. ఈ గ్రంథంలో స్వాతంత్ర్య సమరయోధుల పట్ల అధికారులు వ్యవహరించిన తీరుతెన్నులు, అండమానులో సమరయోధులు పడిన కడగండ్లను మౌలానా ఈ గ్రంథంలో దృశ్యమానంగా పేర్కొన్నారు.

మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది అరబ్బీ భాషలో రాసిన ఆ గ్రంథం చిత్తుప్రతిని అండమాను శిక్షాక్షేత్రం నుండి తన శిక్షాకాలం కంటె ముందుగా విడుదలయిన తన మిత్రులు ముఫ్తి మొహమ్మద్ ఇనాయత్ కాకొరి ద్వారా రహస్యంగా బయటకు పంపారు. ఆ విధంగా అండమాను నుండి ఆంగ్లేయుల కంటబడకుండా ముఫ్తి ఇనాయత్ బయటకు తెచ్చిన 'అల్ సవురతుల్ హిందియా' (Al-Surath-Ul-Hindia) గ్రంథాన్ని మౌలానా ఫజల్- ఏ- హక్

ఖైరాబాది కుమారుడు మౌలానా అబ్దుల్-హాఖ్ ఖైరాబాది (Maulana Abdul Haq Khairabadi) కి అందజేశారు. మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది విరచిత 'అల్ సవురతుల్ హిందియా' (Al-Surath-Ul-Hindia) గ్రంథం ఆ విధంగా అండమాను శిక్షాక్షేత్రం నుండి క్షేమంగా బయటపడి భారతదేశం చేరుకుంది.

అండమానులోని ప్రభుత్వ నిర్వహణాపరమైన వ్యవహారాలలో ఆయన ప్రతిభా కౌశల్యాలను వినియోగించుకున్న ఆంగ్లేయాధికారులు మౌలానాకు స్వయంగా పలు మినహాయింపులు కల్పించారు. ఈ మేరకు మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది విడుదల కోరుతూ ఆంగ్లేయాధికారులు బ్రిటిష్ ప్రభుత్వానికి కూడా ప్రత్యేకంగా విజ్ఞప్తి కూడా చేశారు. ఈ విజ్ఞప్తుల వ్యవహారమంతా అండమానులో జరుగుతుండగా మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది కుమారుడు మౌలానా షంషుల్ హక్ (Maulvi Shams-ul-Haq Dehlvi) తన తండ్రిని విడుదల చేయమంటూ స్వదేశం నుండి బ్రిటిష్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ ఒక మహజరును తయారు చేసి లండన్‌లోని ఆంగ్ల ప్రభుత్వానికి పంపారు. ఆ విజ్ఞప్తికి సానుకూలంగా స్పందించిన ఆంగ్ల ప్రభుత్వం మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాదిని క్షమించినట్టు ప్రకటించింది. ఆ ప్రకటన వెలువడటంతో ఎంతో సంతసించిన మౌలానా షంషుల్ హక్ దెహెల్వీ తన తండ్రి మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది ని అండమాను శిక్షాక్షేత్రం నుండి తీసుక రావడానికి స్వగ్రామం నుండి అండమానుకు బయలుదేరారు.

1861 ఆగస్టు 19న మౌలానా షంషుల్ హక్ దెహెల్వీ అండమాను చేరుకున్నారు. కానీ, ఆయన అండమాను చేరిన ముందు రోజు రాత్రి మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది అండమానులోని తన నివాసంలో చివరిశ్వాస విడిచారు. అండమాను చేరుకున్న మౌలానా షంషుల్ హక్‌కు ఆయన వస్తున్న దారిలో ఒక వ్యక్తి అంతిమ యాత్ర ఎదురయ్యింది. ఆ అంతిమయాత్ర తన తండ్రిదని తెలుసుకున్న మౌలానా షంషుల్ హక్ దెహెల్వీ తీవ్ర ఆవేదనతో అక్కడిక్కడ కూలబడిపోయారు. తండ్రిని స్వస్థలానికి, తమ స్వగృహానికి తీసుకెళ్ళడానికి ప్రయాసపడి అండమానుకు వచ్చిన మౌలానా షంషుల్ హక్ తన తండ్రి మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది కన్నుమూసారని తెలుసుకుని తీవ్ర నిరాశకు గురయ్యారు.

1861 ఆగస్టు 19న అండమాను లోని పోర్టు బ్లెయర్ (Port Blair) లోని సౌత్ పాయింట్ (South Point) వద్ద జరిగిన తన తండ్రి మౌలానా ఫజల్-ఏ-హాఖ్ ఖైరాబాది అంత్యక్రియలలో మౌలానా షంషుల్ హక్ ఊహించని విధంగా స్వయంగా పాల్గొన్నారు. అనంతరం తీవ్ర వ్యాకులతతో ఆయన స్వదేశానికి తిరుగు ప్రయాణం కట్టారు. (The

Silent Past of Andamans Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Andaman, 2005, Pages. 12-15).

మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది అండమానులో రచించి తన సహచరులు ముఫ్తి మొహమ్మద్ ఇనాయత్ కాకొరి ద్వారా రహస్యంగా స్వదేశానికి పంపిన 'అల్ సవురతుల్ హిందియా' (Al-Surath-Ul-Hindia) గ్రంథం అండమాను లోని దుర్భర పరిస్థితులను, ఆంగ్ల అధికారులు స్వాతంత్ర్య సమరయోధుల పట్ల వ్యవహరించిన తీరుతెన్నులను ఏకరువు పెడుతూ పలు విస్మయకర విషయాలు వెల్లడించింది. ఆ కారణంగా ఆంగ్లేయుల పాలనా కాలంలో ఆ పుస్తక ముద్రణకు ఎవ్వరూ కనీసం ప్రయత్నం కూడా చేయలేదు, అందుకు మరెవ్వరూ సాహసించలేదు. అసలు అటువంటి పుస్తకం ఒకటుందన్న సమాచారం కూడా ఎవ్వరూ ఎక్కడా ప్రస్తావించలేదు. ఆ గ్రంథం గురించి మరెక్కడా బహిర్గతం కానివ్వలేదు.

స్వదేశం చేరిన ఆ చిత్తు గ్రంథాన్ని మౌలానా ఫజల్ ఏ హక్ ఖైరాబాది కుమారుడు మౌలానా అబ్దుల్ హఖ్ ఖైరాబాది ఒక వరుసలో పెట్టి తాను స్వయంగా నాలుగు ప్రతులను తయారు చేశారు. ఆ తరువాత ఆ గ్రంథం నాలుగు ప్రతులను అలీఘర్, రాంపూర్, హబీబ్‌గంజ్, మక్కాకు ఆయన పంపారు. ఆ విధంగా మక్కాకు పంపబడిన గ్రంథాన్ని మౌలానా అబుల్ కలాం ఆజాద్ 'ముఖ్దమాత్ ఖైరతుల్ హిందియా' (Mukhadamth-Khairath-ul-Hindia) అని నామకరణం చేశారు. ఈ గ్రంథాన్ని ప్రస్తుత పాకిస్తాన్‌లోని కరాచి చెందిన డాక్టర్ సయ్యద్ మొయినుల్ హఖ్ (Dr Sayyad Moinul Haq) The Story of the War of Independence శీర్షికన ఆంగ్ల భాషలోకి తర్జుమా చేయగా ఆ గ్రంథాన్ని Pakistan Historical Society, Karachi ప్రచురించింది. (Bagihi Hindusthan, Dr Nuzhat Fatima, Sahithya Sangam, Allahabad, 2016, Pages. 17-18)

1947లో భారతదేశానికి ఆంగ్లేయ పాలన నుండి విముక్తి లభించాక అలీఘర్ చేరుకున్న ప్రతిని మౌల్వీ అబ్దుల్ సాహిద్ ఖాన్ షేర్వాని ఉర్దూలోకి అనువదించారు. అలా మౌల్వీ అబ్దుల్ సాహిద్ ఖాన్ షేర్వాని ద్వారా ఉర్దూలోకి అనువదించబడిన గ్రంథాన్ని ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అలహాబాద్ విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ నుజహత్ ఫాతిమా (Dr Nuzhat Fatima) 'బాగీ హిందూస్తాన్' (Baghi Hindusthan) శీర్షికన హిందీలో అనువదించి 2016లో వెలువరించారు. ◆



# మౌల్వీ లియాఖత్ అలీ

స్వదేశీ సైనిక యోధులు ఆంగ్లేయ వలస పాలకుల మీద తిరుగుబాటును 1857లో ప్రారంభించినప్పటికీ, అన్నివర్గాల ప్రజలు వారితో కలసి ఏకోన్ముఖంగా యుద్ధం ప్రకటించటంతో, ఈ పోరాటం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా ప్రసిద్ధిగాంచింది. శ్రీ మంగళ్ పాండే పూరించిన సమర శంఖారావంతో ఊపందుకున్న తిరుగుబాటు భారతదేశం అంతటా వ్యాపించి స్వజన పాలన ఆశించిన రాజవంశాల ప్రతినిధులు, నవాబులు, సైనిక ప్రముఖులు, జమీందారులు వలస పాలకుల తిరగబడ్డారు. అభిమానధనులైన ప్రజానాయకులు, ప్రజలు రంగప్రవేశం చేసారు. ఆ క్రమంలో కలాలకు శెలవు చెప్పి కత్తులు చేతపట్టి, పోరు సాగించిన వారిలో మౌల్వీ లియాఖత్ అలీ (Maulvi Liaqat Ali) ఒకరు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అలహాబాద్ జిల్లా చాయిల్ (Chail) తహసిల్‌లోని మహాగావ్ఁ (Mahgaon) గ్రామంలోని చేనేత కార్మికుల కుటుంబంలో మౌల్వీ లియాఖత్ అలీ 1817 అక్టోబర్ ఐదున జన్మించారు. ఆయన తండ్రి సయ్యద్ మెహర్ అలీ (Syyad Mehar Ali). మౌల్వీ లియాఖత్ అలీ చిన్నతనం లోనే ధార్మిక పరిజ్ఞానాన్ని సంపాదించుకుని, ఉన్నత విద్యావంతుడిగా విఖ్యాతిగాంచారు. మంచి అధ్యయనం తోపాటుగా విద్యాబోధన పట్ల

అమితాసక్తి చూపిన మౌల్వీ లియాఖత్ అలీ ఉపాధ్యాయుడిగా అలహాబాద్‌లో స్థిరపడ్డారు. అలహాబాద్ పరగణాలోని మోహల్లా చౌక్‌లోని సంపన్నురాలు రసూల్ బక్ష్ ఇంట, ఆమె కుమారునికి కొంతకాలం విద్యాబోధన చేశారు. మౌల్వీ లియాఖత్ అలీ ధార్మిక-సామాజిక విషయాలలో ప్రజలకు మార్గోపదేశం చేస్తూ అలహాబాద్ ప్రజల మన్ననలందుకున్నారు.

ఆంగ్లేయులు క్రమక్రమంగా భారతీయుల మీద ఆధిపత్యం సంపాదిస్తూ ప్రజల అన్ని జీవన రంగాలలో అనవసర జోక్యం చేసుకుంటూ భారతీయ సంస్కృతీ-సభ్యతలను, ఆచార-సంప్రదాయాలను మంట కలుపుతున్నారని భావించిన మౌల్వీ లియాఖత్ అలీ ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలిచారు. ప్రజాబాహుళ్యానికి సుబోధకం అయ్యేరీతిలో ఆయన వెల్లడించే అభిప్రాయాల పట్ల అమిత గౌరవం గల ప్రజానీకం ఆయన ఆభిప్రాయాలు, ఆలోచనలకు అనుగుణంగా ఆంగ్లేయ వ్యతిరేకతను ప్రదర్శించసాగారు. ఆయన ప్రవచనాలు, ప్రయత్నాలు ఇటు ప్రజల మీద అటు స్వదేశీ సైనికుల మీద, ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల యువకుల మీద బాగా ప్రభావం చూపాయి.

ఈస్ట్ ఇండియా కంపెనీ లోని స్వదేశీ సైనికుల మీద మౌల్వీ లియాఖత్ అలీ మంచి పట్టు సంపాదించారు. పరాయి పాలకులకు వ్యతిరేకంగా భారతీయ సైనికులను కూడగట్టేందుకు బ్రిటిష్ సైన్యంలోని భారతీయసైనికుల మనస్సుల్లో ప్రభుత్వ వ్యతిరేకతను నూరి పోసారు. ఆయన బోధనల వలన ఆంగ్లేయాధికారుల ఆధిపత్యం, అక్రమ తీరుతెన్నుల వలన ఆంగ్ల ప్రభుత్వం పట్ల సామాన్య ప్రజలలో వ్యతిరేకత మరింతగా గూడుకట్టింది. ఆ సమయంలో మీరట్ లోని ఈస్ట్ ఇండియా కంపెనీ ఆరవ సైనిక దళం (VI Regiment) లోని భారతీయ సైనికుల పట్ల ఆంగ్లేయ సైన్యాధికారులు ప్రదర్శిస్తున్న వివక్ష, స్వదేశీ సైనికులలో ఆంగ్లేయాధికారులకు వ్యతిరేకంగా రగిలిన ఆగ్రహం, ద్వేషం మౌల్వీ లియాఖత్ అలీ పట్ల ప్రజలలో, స్వదేశీ సైనికులలలో గౌరవభావం పెంపుదలకు బాగా ఉపకరించింది.

ఈ మేరకు మౌల్వీ లియాఖత్ అలీ నిరంతర ప్రయత్నాల వలన ఎదురవుతున్న వ్యతిరేక వాతావరణాన్ని పసికట్టిన ఈస్ట్ కంపెనీ అధికారులు ఆయనను అలహాబాద్ నుండి బహిష్కరించారు. పర్యవసానంగా మౌల్వీ లియాఖత్ అలీ స్వగ్రామం మహాగావ్ (Mahgaon) చేరుకున్నారు. ఆ గ్రామంలోని ప్రజలకు ధార్మిక మార్గదర్శనం చేస్తూ, ఉపాధ్యాయునిగా సరికొత్త జీవితం ప్రారంభించారు. అత్యంత ధైర్యసాహసాలకు విఖ్యాతుడయిన మౌల్వీ లియాఖత్ అలీకి గ్రామంలోని సంపన్న కులీన వర్గాలతోపాటుగా సామాన్య ప్రజలు కూడా అనుకూలమయ్యారు. ఆ సానుకూల వాతావరణంలో మహాగావ్ ను కేంద్రంగా చేసుకుని

బ్రిటిష్ వ్యతిరేక ప్రచారాన్ని మౌల్వీ లియాఖత్ అలీ మరింత ఉధృతం చేశారు. పరదేశీయులను స్వదేశం నుండి తరిమికొట్టి స్వదేశీ పాలనకు పునఃప్రతిష్ట చేయాలనీ, న్యాయమైన హక్కుల సాధన కోసం, ప్రతి ఒక్కరూ ధర్మపోరాటం సాగించాలనీ మౌల్వీ ఉద్బోధించారు.

ఆ సమయంలో ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామంలో భాగంగా మొగల్ చక్రవర్తి బహుదూర్ షా జఫర్ నాయకత్వంలో ఢిల్లీ కేంద్రంగా మాత్రమే కాకుండా భారతదేశంలోని ప్రముఖ పట్టణాలలో, గ్రామాలలో రగులుకున్న తిరుగుబాట్లు మౌల్వీ లియాఖత్ అలీని మరింతగా ఉత్తేజితుడ్ని చేసాయి. ఆ వాతావరణంలో అలహాబాద్ డివిజన్‌లోని పలు ప్రాంతాలలో మౌల్వీ లియాఖత్ అలీ పర్యటనలు జరిపి బ్రిటిష్ వ్యతిరేకతను రగిలించారు. మాతృభూమి నుండి పరాయి ప్రభువుల పాలనకు చరమ గీతం పాడాలనీ, స్వదేశీ పాలనకు జీవం పోయాలనీ ఆయన సాగించిన ఉత్తేజపూరిత ప్రసంగాలకు సామాన్య ప్రజలే కాకుండా ఆయా ప్రాంతాల నాయకులు, ప్రముఖులు కూడా ప్రభావితులు అయ్యారు. బ్రిటిష్ వ్యతిరేకతను పుణికి పుచ్చుకున్న ప్రజలతోపాటుగా, స్వదేశీ సైనికులు, ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలోని భారతీయ సైనికులను కూడా ఆయన ప్రవచనాలు మానసికంగా ఒకటి చేశాయి. ప్రముఖుల, ప్రజల సహకారంతో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల మీద మౌల్వీ లియాఖత్ అలీ పూర్తి స్థాయిలో సమరశంఖారావం పూరించారు. ప్రజల అభిమతం మేరకు సమర్ధవంతమైన నాయకత్వం అందించేందుకు మౌల్వీ లియాఖత్ అలీ తిరుగుబాటు రంగం మీద స్వయంగా ప్రత్యక్షమయ్యారు. ('there came to lead a man..who possesed considerable orgnising powers.' -The Indian Mutiny Of 1857, Colonel G.B Malleson, London 1906, Page.150) భారతీయ సైనికులు, గ్రామీణ ప్రాంతాల ప్రజలు, శిష్యవర్గమైన పలువురు ప్రముఖులు, గ్రామీణ పాలకులు మౌల్వీ వెంట నడిచారు.

ఈ సందర్భంగా స్వదేశీ యోధులలో, ప్రజలలో దేశం పట్ల ప్రేమాభిమానాలను ప్రోదిచేయడానికి, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఆరంభమయిన పోరాటాన్ని బలోపేతం చేయడానికి తగిన ప్రేరణ కల్పించేలా మౌల్వీ లియాఖత్ అలీ ఒక 'ప్రబోధగీతం' రాసారు. ఆ గీతం ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామయోధులకు యుద్ధగీతం అయ్యింది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రధాన పాత్ర నిర్వహించిన కాన్పూరు యోధుడు నానాసాహెబ్ పక్షాన నిలచి, ఆయన నేతృత్వంలో సాగిన పలు పోరాటాలకు వ్యూహరచన గావించిన అజీముల్లా ఖాన్ స్వయంగా ఆరంభించి, వెలువరించిన 'పయామే ఆజాది' పత్రికలో మౌల్వీ లియాఖత్ అలీ విరచిత గీతం ప్రచురితం అయ్యింది.

మౌల్వీ లియాఖత్ అలీ తన ప్రబోధగీతం ద్వారా ఆనాటి స్వాతంత్ర్య సమర యోధులకు మార్గదర్శకం చేశారు, ఉత్తేజానిచ్చారు. ప్రజలలో దేశభక్తి భావనలను ప్రోదిచేసేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు ఆ గీతం ఎంతో ఉపయుక్తమయ్యింది. '...భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం...' అంటూ మొగల్ చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ ఇచ్చిన పిలుపుకు స్పందిస్తూ మాతృదేశం ఘనతను కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి మాతృభూమి విముక్తి కోసం పోరుబాట నడవమని పురికొల్పుతూ కల్పిస్తూ మౌల్వీ విరచిత ఆ ప్రబోధ గీతం ఉర్దూ భాషలో ఇలా సాగింది.

**' హమ్ హై ఇస్‌కే మాలిక్**
**హిందూస్థాన్ హమారా !**
**పాక్ వతన్ హై ఖౌమ్‌కా జన్నత్‌సేభి ప్యారా**
**యే హై హమారీ మిల్కియత్,**
**హిందూస్థాన్ హమారా !**
**ఇస్‌కీ సలామియత్‌సే రోషన్ హై జగ్‌సారా**
**కితనా ఖదీమ్, కితనా నయీమ్**
**సబ్ దునియాసేఁ న్యారాకరతీ హై**
**జర్‌ఖేజ్ జిసే**
**గంగా జమునాకే ధారా !**
**ఊపర్ బర్ఫీలీ పర్వత్ పహరెదార్ హమారా !**
**నీచే సాహల్‌పర్ బజ్‌తా, సాగర్ నక్కారా**
**ఆయా ఫిరంగీ దూర్‌సే ఐసా మంతర్ మారా !**
**లూటా దొనో హాతోం సే**
**ప్యారా వతన్ హమారా !**
**అజ్ షహీదోఁనే తుమ్‌కో**
**అహెలే వతన్ లల్‌కారా !**
**తోడో గులామీకే జంజీరే, బరసావో అంగారా !**
**హిందూ, ముసల్మాన్ సిఖ్ హమారా**
**భాయీ భాయీ ప్యారా**

**యే హై ఆజాదికా ఝుండా,**
**ఇసే సలామ్ హమారా ! '.**

(భారత పత్రికల్లో ముస్లింల పాత్ర, వ్యాసకర్త : ముక్తార్, 'గీటురాయి' వారపత్రిక, హైదరాబాద్, 25-04-2003 నాటి సంచిక, పేజీ.23)

1857 జూన్ 6న మౌల్వీ లియాఖత్ అలీ నాయకత్వంలో స్వదేశీ సైనిక యోధుల దళాలు అలహాబాద్ పట్టణంలోకి ప్రవేశించాయి. ఆంగ్లేయాధికారులు, కంపెనీ సైనికుల మీద యుద్ధం ప్రకటించాయి. బ్రిటిష్ అధికారులను హతమార్చాయి. అలహాబాద్ పట్టణం లోని బ్రిటిషర్ల తొత్తులు ప్రాణాలను అరచేత పట్టుకుని పలాయనం చిత్తగించారు. అలహాబాద్ పట్టణం మౌల్వీ నేతృత్వంలోని తిరుగుబాటు దళాల పశమయ్యింది. మౌల్వీ లియాఖత్ అలీని 'అలహాబాద్ నవాబ్' (Nawab of Allahabad) గా ప్రజలు ప్రకటించుకున్నారు. ఆ వెనువెంట తనను తాను మొగల్ చక్రవర్తి బహదుర్ షాహ్ జఫర్ ప్రతినిధిగా ప్రకటించుకున్న మౌల్వీ లియాఖత్ అలీ అలహాబాద్ పట్టణంలోని అన్నివర్గాల ప్రజల, స్వదేశీ సైనికుల, సైనికాధికారుల ఆశీస్సులతో పాలనాధికారాన్ని చేపట్టారు.

అలహాబాద్ పట్టణంలోని ఖుస్రూబాగ్ (Khusru Bagh) కేంద్రంగా చేసుకుని 1857 జూన్ ఏడవ తేదీ నుండి పాలనా వ్యవహారాలను మౌల్వీ లియాఖత్ అలీ చక్కబెట్టడం ఆరంభించారు. లక్నో కేంద్రంగా ప్రారంభమైన తిరుగుబాటు ఫలితంగా ఏర్పడిన అస్తవ్యస్థ పరిస్థితులను సరిదిద్దేందుకు, ఆంగ్లేయుల అరాచకాన్ని అణిచివేసి శాంతి భద్రతలను పునః స్థాపించేందుకు పాలకునిగా మౌల్వీ లియాఖత్ అలీ నడుం కట్టి, పరిస్థితులను ఒక కొలిక్కి తెచ్చారు. పౌర పాలనను పునరుద్ధరించేందుకు ప్రజల నుండి సూచనలు, సలహాలు స్వీకరిస్తూ ప్రజాస్వామ్య బద్ధంగా వ్యవహరించారు. ప్రజలకు సమర్ధవంతమైన పాలన అందించేందుకు పలు ప్రాంతాలకు అధికారులను నియమించారు. తిరుగుబాటు యోధులు సైఫుల్లా, సుఖ్‌రాయ్, ఖాశిం అలీ ఖాన్, నియామత్ అష్రాఫ్‌లను ఆయా ప్రాంతాల అవసరాలను బట్టి పాలనాధికారులుగా ప్రకటించారు. భాకా ప్రాంతపు జమీందారు ఫజులుల్లా ఖాన్‌ను సైన్యాధిపతిగా నియమించారు. ఏరోజు కా రోజు నాటి పరిపాలనా వ్యవహారాలను, పాలనా పరమైన నిర్ణయాలను ఢిల్లీ చక్రవర్తికి నివేదించసాగారు.

మౌల్వీ లియాఖత్ అలీ పరిపాలనా దక్షతను గమనించి అలహాబాద్ డివిజన్‌లోని 24 గ్రామాల ప్రజలు ఆయనను పాలకునిగా అంగీకరించారు. కంపెనీ పాలకుల పాలనతో విసుగు చెందిన అనేక గ్రామాల ప్రజలు, ప్రముఖులు ఆయనకు సంపూర్ణ మద్దతు తెలిపారు.




ఆ పరగణాలోని 40 గ్రామాల ప్రజల మన్నన పొంది పాలకునిగా మౌల్వీ లియాఖత్ అలీ ఆన్ని వర్గాల గౌరవాభిమానాలను అందుకున్నారు. ప్రజాబలం సంపాదించుకున్న మౌల్వీ తన పరగణాలో బ్రిటిష్ పాలకుల ఛాయలు కూడా లేకుండా చేసారు.

ఆంగ్లేయుల అధీనంలోనున్న అలహాబాద్ కోటను స్వాధీనం చేసుకునేందుకు మౌల్వీ లియాఖత్ అలీ నేతృత్వంలో దాడి జరిగింది. ఆంగ్లేయాధికారి జనరల్ నీల్ (General Neil) రక్షణలో ఉన్న అలహాబాదు కోట తిరుగుబాటు వీరులకు దక్కలేదు. కానీ మౌల్వీ బలగాలను ధాటికి తట్టుకుని నిలబడలేక పోయిన కంపెనీ సైన్యాధికారి జనరల్ నీల్ కోటను వదలి పారిపోయాడు. కొంత బ్రిటిష్ సైన్యం, మరికొందరు ఆంగ్లేయాధికారులు మాత్రం కోటలో ఉండిపోయారు. మౌల్వీ మాత్రం ఆ కోటను స్వాధీనం చేసుకుంటేగాని తిరుగుబాటు సఫలీకృతం కాదని భావించారు. ఖుల్దాబాద్ వద్ద సమావేశమైన తిరుగుబాటు వీరులు మౌల్వీ నాయకత్వంలో కోటను పట్టుకోవాలని నిర్ణయించారు. స్వదేశీ సైనిక యోధుల వద్ద రెండు ఫిరంగులు మాత్రమే ఉన్నాయి. అయినా శత్రువును ధైర్యంగా ఎదుర్కొనేందుకు మౌల్వీ సైన్యాన్ని సన్నద్ధం చేస్తున్నంతలో బెనారస్ నుండి ఆంగ్లేయ సైనికాధికారి జనరల్ నీల్ (General Neill) జూన్ 11న అదనపు బలగాలతో అలహాబాద్ కోటకు చేరుకున్నాడు.

మౌల్వీ ఆలోచనలను పసిగట్టిన జనరల్ నీల్ 'కోట చేజారితే...అధికారం చేజారినట్టే' నని భావించి, కోట రక్షణకు తక్షణమే కట్టుదిట్టమైన చర్యలు తీసుకున్నాడు. మౌల్వీ బలగాలు అలహాబాద్ కోట మీద పూర్తి స్థాయిలో దాడి జరపక ముందే తిరుగుబాటు బలగాల మీద

జనరల్ నీల్ 1858 జూన్ 12న దాడి చేసాడు. కంపెనీ సైన్యాలు మౌల్వీ లియాఖత్ అలీ కార్యక్షేత్రంగా నిలచిన ఖుస్రూబాగ్‌ను అన్ని వైపుల నుండి చుట్టుముట్టాయి. మౌల్వీ స్వయంగా రణభూమికి కదలి వచ్చారు. ఆంగ్లేయ సైన్యాలు స్వదేశీ పోరాట యోధుల మధ్య భీకర పోరు సాగింది. ఆ పోరులో క్రమంగా కంపెనీ బలగాలది పైచేయి కాసాగింది. ఆ అవాంఛనీయ పరిస్థితులలో మౌల్వీ లియాఖత్ అలీని యుద్ధభూమి నుండి తప్పుకోవాల్సిందిగా ఆయన సహచరులు ఒత్తిడి తెచ్చారు.

ఆ ప్రతికూల పరిస్థితులలో 1858 జూన్ 17న మౌల్వీ లియాఖత్ అలీ ఆంగ్ల గూఢచారుల కళ్లు గప్పి అలహాబాద్ పరగణా నుండి క్షేమంగా తప్పించుకున్నారు. ఆంగ్ల సైన్యానికి సవాల్ చేసిన ఆయనను అలా విడిచి పెట్టటం ఇష్టంలేక మౌల్వీ లియాఖత్ అలీని పట్టిస్తే ఐదు వేల రూపాయల నజరానా ముట్ట చెబుతామని గవర్నర్ జనరల్ ప్రకటించాడు. ఈ మేరకు గ్రామాధికారులకు ఆజ్ఞలు జారీ అయ్యాయి. మౌల్వీ లియాఖత్ అలీ ఆంగ్లేయాధికారుల, కంపెనీ గూఢచారుల కళ్ళుగప్పి తప్పించుకుంటూ తాను అడుగు పెట్టిన ప్రతిచోటా తిరుగుబాటు భావాలను మరింత బలోపేతం చేస్తూ, ఆంగ్లేయ వ్యతిరేకతను ప్రజలలో రెచ్చగొడుతూ ముందుకు సాగారు. ఈ యాత్రలో మౌల్వీ లియాఖత్ అలీ లక్నో, సూరత్, అహమ్మద్ నగర్, దక్కన్‌లోని పలు ప్రాంతాలు సందర్శించారు. ఈ సందర్శనలలో ఆయన మరియం బీబీని వివాహం చేసుకున్నారు.

చివరకు మౌల్వీ లియాఖత్ అలీ కాన్పూర్ చేరుకున్నారు. కాన్పూరు కేంద్రంగా వలసపాలకుల మీద తిరుగుబాటు జెండా ఎగురవేసిన నానాసాహెబ్ సైన్యాలతో చేతులు కలిపారు. అక్కడ కూడా ప్రతికూల పరిస్థితులు ఎదురు కావటంతో, కొంత విశ్రాంతి తీసుకుని, బలగాలను సమకూర్చుకుని తిరిగి ప్రతిఘటనకు పూనుకోవాలని భావించిన మౌల్వీ గుజరాత్ రాష్ట్రంలోని సాచిన్ (Sachin) పరగణాకు చెందిన నవాబ్ సహకారం ఆశించాడు. ఆశ్రయం కల్పిస్తానన్న సాచిన్ నవాబు నమ్మక ద్రోహానికి పాల్పడ్డాడు, ఆ విషయం పసిగట్టిన మౌల్వీ లియాఖత్ అలీ అక్కడి నుండి తప్పుకున్నారు.

చివరకు ఆయన ముంబాయి చేరుకున్నారు. ముంబాయి నుండి హజ్‌యాత్రికుడిగా ఆయన మక్కాకు తప్పించుకోవాలని ప్రయత్నాలు ఆరంభించారు. మౌల్వీ ఆ ప్రయత్నాలలో ఉండగా మహారాష్ట్ర లోని బైకుల్లా రైల్వే స్టేషన్ (Byculla Railway Station) వద్ద ఆంగ్ల సైన్యాలు ఆయనను అరెస్టు చేసాయి. 1858లో అలహాబాద్ నుండి ఆంగ్ల సైన్యాల కన్నుగప్పి తప్పించుకున్న మౌల్వీ మిత్రదోహం వలన 14 ఏండ్ల తరువాత 1871లో పట్టుబడ్డారు.

ఆయన మీద రాజద్రోహం, ఆంగ్లేయ సైనికులను హత్య చేయడం, ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టారని ఆంగ్ల ప్రభుత్వం నేరారోపణలు గావించింది.

ఆ నేరారోపణల మీద బొంబాయి న్యాయస్థానంలో మౌల్వీ లియాఖత్ అలీ మీద విచారణ తంతు జరిగింది. ఈ విచారణ సందర్భంగా ఎంతో నిర్భయంగా మాతృభూమి పట్ల తనకున్న ప్రేమ, అభిమానాలను, వలస పాలకుల పట్ల ఉన్న విద్వేషాన్ని ఆయన విస్పష్టంగా ప్రకటించారు. తన మీద రాజద్రోహం నేరాన్ని ఆపాదించినందుకు తానేమీ చింతించటం లేదన్నారు. అలహాబాద్ పరగణాలోని ఆంగ్లేయాధికారుల దోపిడీ, అరాచకాల నుండి ప్రజలను కాపాడేందుకు తాను ఆయుధం చేపట్టానని, ప్రజలను సమీకరించి తిరగబడ్డానని మౌల్వీ నిర్భయంగా పేర్కొన్నారు. ఆంగ్లేయుల పాలన అంతం కావాలన్నది తన లక్ష్యమని, మొగల్ పాదుషా బహుద్దూర్ షా జఫర్‌ను మాత్రమే తాను చక్రవర్తిగా పరిగణిస్తానని మౌల్వీ లియాఖత్ అలీ విస్పష్టంగా ప్రకటించారు. ఆంగ్లేయుల వలస పాలనను అంతం చేయాలన్న లక్ష్యంతోనే తాను పోరుబాటన నడిచానని పునరుద్ఘాటించారు. అరాచక ఆంగ్లేయుల పాలన మీద స్వదేశీయులు సాగించిన తిరుగుబాటుకు తాను నాయకత్వం వహించినందుకు ఎంతగానో గర్వపడుతున్నానని ఆంగ్ల న్యాయస్థానంలో న్యాయమూర్తి సమక్షాన మౌల్వీ లియాఖత్ అలీ సాహసోపేతంగా తన అభిప్రాయాలను, ఆలోచనలను విస్పష్టంగా ప్రకటించారు.

భారతీయులు మానవతావాదులని, నైతిక విలువలకు అధిక ప్రాధాన్యతనిస్తారని ఆయన వివరిస్తూ, మహిళల పట్ల అత్యంత గౌరవం గలవారైనందున ఆంగ్ల మహిళలకు ఎటువంటి హాని జరగకుండా చూసామన్నారు. స్వదేశీయుల పాలనను పునఃస్థాపించేందుకు తిరగబడిన ప్రజల నాయకునిగా తన ప్రాణాలను ఆంగ్ల న్యాయస్థానాలు హరించినా తనకు ఎటువంటి బాధలేదన్నారు. మాతృభూమి విముక్తి కోసం ఆరంభమైన పోరాటంలో భాగంగా ప్రాణాలు విడవటాన్ని మహత్తర అవకాశంగా భావిస్తానన్నాని మౌల్వీ వెల్లడించారు.

ఆ విచారణ తరువాత ఆంగ్ల న్యాయస్థానం మౌల్వీ లియాఖత్ అలీని నేరస్థుడిగా నిర్ధారిస్తూ యావజ్జీవిత కారాగార శిక్షను విధించింది. ఆయనను ద్వీపాంతరవాసం పంపాలని ఆదేశించింది. న్యాయస్థానం ఆదేశాల మేరకు మౌల్వీ లియాఖత్ అలీని అండమాన్ దీవులకు పంపారు. మౌల్వీ లియాఖత్ అలీ 1892 మే 17న అండమాను శిక్షాక్షేత్రంలోని జైలులో కన్నుమూయగా అండమానులోని South Point వద్ద సమాధిచేశారు. ◆



# మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్

'మునీర్ షికోహ్‌బాది' (Muneer Shikohbadi) అను కలం పేరుతో కవిత్వం రాసిన మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ప్రఖ్యాత ఆగ్రా పట్టణంలో 1816లో జన్మించారు. ఆయన తండ్రి సయ్యద్ అహ్మద్ హుసైన్ ప్రఖ్యాత ఉర్దూ కవి. తండ్రి వద్ద మహమ్మద్ ఇస్మాయిల్ విద్యాభ్యాసం చేశారు. ఇస్లామిక్ ధార్మిక, వేదాంత శాస్త్రాలతోపాటుగా అరబిక్, పర్షియన్ భాషలో కూడా మంచి పాండిత్యాన్ని సంపాదించిన మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ తండ్రి బాటలో మంచి కవిగా రాణించారు.

ప్రతిభాసంపన్నుడయిన మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోహ్‌బాదిని బండా సంస్థానం నవాబు అలీ బహుదూర్ స్వయంగా తన ఆస్థానానికి ఆహ్వానించి మంత్రి పదవిని అప్పగించారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అవధ్ రాజ్యాధినేత నవాబు వాజిద్ అలీషాను ఆంగ్లేయులు అక్రమంగా పదవీచ్యుతుని చేసిన సంఘటనతో మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ ఆగ్రహించారు. 1857 నాటి తిరుగుబాటులో బుందేల్‌ఖండ్ కార్యక్షేత్రంగా సాగిన పోరాటంలో ఆయన ప్రధాన పాత్ర నిర్వహించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో స్వదేశీ యోధులను ముందుకు నడిపించిన ఆయన పలుమార్లు ఆంగ్లేయాధికారులను పరాజితుల్ని చేశారు.

చిట్టచివరకు 1858 అక్టోబర్ 18న ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలది పైచేయి కాగా బుందేల్ ఖండ్ తిరుగుబాటు విఫలమయ్యింది. ఆంగ్లేయాధికారులు ఆయన అరెస్టుకు ప్రయత్నాలు చేస్తుండగా ఆయన తప్పించుకుని ఫరూఖాబాద్ (Farukhabad) చేరుకున్నారు. ఆయనను వెంటాడిన ఆంగ్లేయాధికారులు అక్కడ ఆయనను నిర్బంధించి పలు నేరారోపణల మీద విచారణకు తరలించారు. నవాబ్ జాన్ అను అంతఃపుర గాయకుడి హత్య సంఘటనను ఆయన నెత్తిన రుద్దారు. నవాబ్ జాన్‌ను హత్య చేసింది మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ స్నేహితుడు ముస్తఫా బేగ్ కాగా ఆ నేర భారాన్ని ఆయన మోయాల్సి వచ్చింది.

ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటులో పాల్గొనటం ద్వారా మాత్రమే కాకుండా, గాయకుడి హత్యకేసులో కూడా నిందితుడిగా పరిగణించబడిన ఆయన ఆంగ్ల న్యాయస్థానంలో విచారణను ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆంగ్ల న్యాయస్థానం విచారణ జరిపి ఆయనకు 12 సంవత్సరాల ద్వీపాంతరవాస శిక్షను విధిస్తూ తీర్పు ప్రకటించింది. ఆ తీర్పు ప్రకారంగా ఆంగ్లేయాధికారులు మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోహాబాదిని అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

అండమానులో ప్రఖ్యాత స్వాతంత్ర్య సమరయోధులు, ప్రసిద్ధ సాహిత్యవేత్త మౌలానా ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది (Fazal e Haq Khairabadi) తో మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోహాబాదికి సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. ఫజల్-ఏ-హఖ్ ఖైరాబాది సాన్నిహిత్యంలో మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ అద్భుత సాహిత్యాన్ని సృష్టించారు. ఆయన విద్వత్తును, పాండిత్యాన్ని గుర్తించిన ఆంగ్లేయాధికారులు ఆయనను అండమానులోని కమీషనర్ కార్యాలయంలో మున్షీ (Munshi) గా నియమించారు. మహమ్మద్ ఇస్మాయిల్ అండమాను జైలులో బందీగా ఉన్నారని తెలుసుకున్న నవాబు అలీ బహద్దూర్ జంగ్ ఆయనను విడుదల చేయమంటూ బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రత్యేకంగా విజ్ఞప్తి చేశారు.

ఆ పరిణామాల క్రమంలో 1865లో అండమాను నుండి మున్షీ మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోహాబాది విడులయ్యారు. భారత ప్రధాన భూభాగానికి తిరిగి వచ్చిన ఆయన లక్నో చేరుకున్నారు. స్వదేశంలోని లక్నోకు చెందిన ఆగా అలీ హసన్ ఖాన్, రాంపూర్‌కు చెందిన నవాబు కలాబ్ అలీ ఖాన్ తదితరులు ఆయన గౌరవమర్యాదలకు తగ్గట్టుగా ఆశ్రయం, అవకాశాలు కల్పించారు. ఆ నవాబుల అపూర్వ ఆదరణలో ఆయన విశిష్ట సాహిత్యాన్ని సృష్టించారు. చివరకు కలరా వ్యాధి బారిన పడిన మహమ్మద్ ఇస్మాయిల్ హుసైన్ మునీర్ షికోహాబాది 1880లో కన్నుమూసారు. ◆

# మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ (Mirja Vilayat Hussain Khan) ఉత్తరప్రదేశ్ బుందేల్ ఖండ్ ప్రాంతానికి చెందిన ప్రస్తుత బండా (Banda) జిల్లా, 1857 నాటి బండా సంస్థానం నివాసి. బండా సంస్థానానికి ఆనాటి అధినేత నవాబు అలీ బహుదూర్. ఆ ప్రజారంజక పాలకుని ప్రధానమంత్రి గా మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ బాధ్యతలు నిర్వహించారు.

స్వదేశీ సంస్థానాలను ఒక్కొక్కటిగా స్వాహా చేయడానికి ఈస్ట్ ఇండియా కంపెనీ పథకాలు రూపొందించింది. గవర్నర్ జనరల్ లార్డ్ డల్హౌసి (Governor General Lord Dalhousie) ఆ పథకాలకు రూపురేఖలు దిద్దుతున్నాడు. ఈ మేరకు చట్టాలు చట్టుబండలు అంటూ రాజ్య సంక్రమణ సిద్ధాంతం అమలుకు సిద్ధపడుతున్నాడు. ఆ సిద్ధాంతం ప్రకారంగా భారతదేశంలోని సంస్థానాలన్నిటిని కంపెనీ ప్రభుత్వంలో కలిపేసుకునేందుకు ఎత్తులేస్తున్నాడు. ఆ రాజ్యసంక్రమణ సిద్ధాంతం నేపథ్యంలో సంస్థానాధీశులను అదరింపు-బెదరింపులకు గురి చేస్తున్నాడు. ఆ ఆంగ్లేయుడు తన ఎత్తులతో సతారా, నాగపూర్, ఝాన్సీ రాజ్యాలను కబళించడానికి విజయవంతంగా పన్నాగాలు సాగిస్తున్నాడు. ఆ అక్రమ చర్యల పట్ల ఇటు

ప్రజలు,అటు సంస్థానాధీశులు కలవరపడుతున్నారు. ఆ విషమ పరిస్థితులను మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ బాగా అవగాహన చేసుకున్నారు. బండా సంస్థానానికి రానున్న ప్రమాదాన్ని ఆయన ముందుగా పసిగట్టారు. మంచి పరిపాలకుడిగా ఖ్యాతిగాంచిన బండా నవాబుకు లభిస్తున్న ప్రజాదరణ, స్వదేశీ సైనిక యోధుల నుండి వ్యక్తమవుతున్న మద్దతును గమనించిన మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ ఆంగ్లేయుల ఎత్తులను చిత్తు చేయడానికి సిద్ధమయ్యారు. ఈ పరిస్థితులు ఇలా ఉండగా భారతదేశం అంతటా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ మేఘాలు వేగంగా కమ్ముకుంటున్నాయి. ఆ ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక వాతావరణంలో ఈస్ట్ ఇండియా కంపెనీకి దాసోహం అనటం కాకుండా బండా నవాబు పక్షంగా అంగ్లేయులకు ఎదురొడ్డి పోరాడేందుకు మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ నిర్ణయించుకున్నారు.

ఆంగ్లేయులు తమ సంస్థానం, స్వజనం మీద చలాయిస్తున్న పెత్తనాన్ని పిన్న వయస్సు నుండి నిరసిస్తూ వచ్చిన బండా నవాబు అలీ బహదూర్ కు మంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ ఆలోచనలు తోడు కావడంతో 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామం అందించిన స్ఫూర్తితో పోరుబాటన సాగడానికి నవాబు సిద్ధపడ్డారు. ఆయనకు ప్రధాన మంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ మేధోసంపద బాగా తోడయ్యింది. ఆ ఇరువురు ప్రముఖులు, స్వదేశీ యోధులు కలసి ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల ఎత్తులను చిత్తుచేసి బండా సంస్థానం స్వతంత్రతను పరిరక్షించుకోవాలని నిర్ణయానికి వచ్చారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ అప్పటికే ఝాన్సీ, సతారా సంస్థానాల మీద కన్నేసింది. ఆ సంస్థానాలను స్వాధీనం చేసుకొడానికి మార్గాలను సుగమం చేసుకుంటుంది. బండా సంస్థానాన్ని స్వాధీనం చేసుకోడానికి నిర్ణయించుకుంది. ఆ చర్యలలో భాగంగా అంగ్లేయాధికారి హెచ్.ఏ. కాక్‌వెల్ (H.A Cockwell) 1857 జూన్ 12న బండా కోటకు వచ్చాడు. బండా సంస్థానాధీశులు నవాబు అలీ బహదూర్, ప్రధాన మంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ తదితరులతో సమావేశమయ్యాడు. ఈస్ట్ ఇండియా కంపెనీ నిర్ణయాలను ఏకపక్షంగా ప్రకటిస్తూ కంపెనీ మాట శిరసావహించకున్నట్టయితే తీవ్ర పరిణామాలు తప్పవంటూ అదిరింపులకు, బెదిరింపులకు పాల్పడ్డాడు. ఆ సందర్భంగా అధికారి హెచ్.ఏ. కాక్‌వెల్ సంస్థానాధీశులు, స్వదేశీయోధుల మధ్యన వేడిగా, వాడిగా వాగ్వివాదాలు చోటు చేసుకున్నాయి.

ఆ సమయంలో ఆంగ్లేయాధికారి హెచ్.ఏ. కాక్‌వెల్ బెదిరింపులు మితిమీరడంతో స్వదేశీయోధులు ఆగ్రహం పట్టలేకపోయారు. ఆ ఆగ్రహావేశపూరిత చర్యల వలన ఆంగ్లేయుడు హెచ్.ఏ. కాక్‌వెల్ బండా సంస్థానంలో హత్యకు గురయ్యాడు. ఆ సంఘటన తరువాత

బండా నవాబు అలీ బహుదూర్, ప్రధాన మంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ మార్గదర్శకంలో స్వదేశీ యోధులు బండా సంస్థానం స్వతంత్రతను ప్రకటించారు. బండా సంస్థానం ఇక మీద ఈస్ట్ ఇండియా కంపెనీ కనుసన్నలలో నడిచే సంస్థానం కాదని, బండా సంస్థానం ఇక నుండి స్వతంత్ర రాజ్యమని వెల్లడించారు.

స్వతంత్రత ప్రకటించుకున్న బండా సంస్థానం నుండి ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులను వెళ్ళగొట్టి జూన్ 14, 1857 నుండి బండా నవాబు అలీ బహుదూర్ స్వయం పాలన చేపట్టారు. నవాబు అలీ బహుదూర్ చర్యలను సమర్థిస్తూ 'సంస్థానం మనది ... ఆదేశాలు నవాబువి' అంటూ ప్రజలు సంతోషం వ్యక్తంచేశారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అలీ బహుదూర్ ధ్వజమెత్తడం మాత్రమే కాకుండా, ఇతర సంస్థానాధీశులను కూడా ఆ దిశగా సాగేందుకు ఉత్సాహపర్చారు, ప్రోత్సహించారు. బండా సంస్థానం ఇరుగు పొరుగు సంస్థానాధీశులు కూడా స్వతంత్రులు కావాలన్న ఆలోచనతో అలీ బహుదూర్ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వదేశీ పాలకులకు చేయూత ఇచ్చారు.

ఆ సందర్భంగా ఆంగ్లేయులతో పోరాటానికి సిద్ధపడిన ఝాన్సీరాణి లక్ష్మిబాయి తనకు ఆయుధ-అంగబలాన్ని అందించాల్సిదిగా కోరుతూ గ్వాలియర్ సంస్థానాధీశులు సింధియాకు లేఖ రాసారు. ఆమె వినతిని గ్వాలియర్ సంస్థానాధీశులు సింధియా తిరస్కరిస్తూ ఈస్ట్ ఇండియా కంపెనీ పక్షాన చేరాడు. ఆ తరువాత ఆమె బండా నవాబ్ అలీ బహుదూర్ సహాయం అర్థిస్తూ లేఖ పంపారు. అలీ బహుదూర్‌ను తన సోదరునిగా భావిస్తూ, ఆ లేఖ తోపాటుగా ఝాన్సీరాణి లక్ష్మిబాయి 'రాఖీ' కూడా పంపారు. ఝాన్సీరాణి వినతికి తక్షణమే స్పందిస్తూ వెయ్యి మంది సుశిక్షితులైన కాల్బలం, మూడు వందల గన్నర్లను అలీ బహుదూర్ పంపారు. ఆ విధంగానే వెయ్యి మంది సైనికులను మరో పోరాట యోధుడు తాంతియా తోపేకు కూడా బండా నవాబు అలీ బహుదూర్ పంపారు. ఒక ఏడాది పాటు సాగిన బండా సంస్థానం స్వతంత్ర పాలనలో, ఝాన్సీరాణి, తాంతియాలకు సహాయం అందించడం మాత్రమే కాకుండా వారితో కలసి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటానికి సంబంధించిన వ్యూహరచనలో బండా నవాబు, ఆయన ప్రధాన మంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ చాలా చురుగ్గా పాల్గొన్నారు.

ఈ మేరకు సాగుతున్న అలీ బహుదూర్ ప్రయత్నాల వివరాలు తెలుసుకుని ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు తగు ప్రతిచర్యలకు ఉపక్రమించారు. ఆ విషయం పసిగట్టిన బండా నవాబు అలీ బహుదూర్, ప్రధాన మంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ జాగ్రత్త

పడ్డారు. ఆ పరిణామాల నేపథ్యంలో స్వదేశీ యోధులతో కూడిన ఒక యుద్ధ సమితి ఏర్పాటయ్యింది. ఆ యుద్ధ సమితిలో సభ్యునిగా మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ ప్రముఖ పాత్ర నిర్వహించారు. బండా సంస్థానంలోని స్వదేశీ పోరాట యోధులతోపాటుగా సమీపాన గల ఇతర సంస్థానాల పోరాట వీరులతో ప్రధానమంత్రి హుస్సేన్ ఖాన్ సంప్రదింపులు జరిపి విస్తృత సమాలోచనల కోసం బండా కోటలో సమీకృతమయ్యారు.

బండా సంస్థానాధీశులు, ప్రధాన మంత్రి ఆంగ్లేయుల దాడులను ముందుగా ఊహించారు. ఆ దాడులను ఎదుర్కోనడానికి సన్నద్ధులయ్యారు. ప్రజలు, స్వదేశీ యోధులు ఎటువంటి పరిణామాలు ఎదురైనా ఎదుర్కోడానికి తయారయ్యారు. ఆ విధంగా ఇనుమడించిన ఉత్సాహంతో సమీకృతమైన స్వదేశీ సైనిక యోధుల మీద జనరల్ విట్‌లాక్ (General Whit Lock) అక్టోబర్ 18న భారీ బలగాలతో దాడి చేశాడు. ఆంగ్లేయ బలగాల దాడిని బండా కోటలోని స్వదేశీ యోధులు, ప్రజలు విజయవంతంగా తిప్పిగొట్టారు.

ఆ పరాజభయంతో రగిలిపోయిన ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు బండా సంస్థానాన్ని పూర్తిగా కైవసం చేసుకునేందుకు పథకం వేశారు. భారీ ఎత్తున కంపెనీ బలగాలను సమకూర్చి జనరల్ విట్‌లాక్‌ను బండా కోట మీద దాడికి పురమాయించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలు బండా కోట మీద 1858 ఏప్రిల్ మాసంలో దాడిచేసాయి. ఆ ఆంగ్ల సైన్యాలను గోయిరా ప్రాంతంలోని ముగ్హీలీ గ్రామం వద్ద బండా సైన్యాలు అత్యంత సాహసోపేతంగా ఎదుర్కొన్నప్పటికి పరాజయం తప్పలేదు. కంపెనీ సైన్యం భురగ్రాహ్ కోటను స్వాధీనం చేసుకుని విధ్వంసానికి పాల్పడటం మాత్రమే కాకుండా, ఎనిమిది వందల మంది బండ స్వదేశీయోధులను ఊచకోతకు గురిచేసింది. చివరకు 1858 ఏప్రిల్ 20న జనరల్ విట్‌లాక్ నాయకత్వంలోని ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యం స్వదేశీ యోధులను పరాజితులను చేసి బండా కోటను స్వాధీనం చేసుకుంది.

బండా నవాబు అలీ బహుదూర్ ను నిర్బంధించిన ఆంగ్లేయులు ఆయనను ఇండోర్‌కు పంపారు. ప్రధానమంత్రి మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ మాత్రం ఆంగ్లేయ సైన్యాలకు చిక్కకుండా ఫరూఖాబాద్ వెళ్ళిపోయారు. ఆంగ్ల సైన్యాలు ఆయనను వెంటాడి చివరకు అరెస్టు చేశాయి. కంపెనీ ప్రభుత్వం మీద తిరుగుబాటు, హింసను ప్రేరేపించారన్న నేరారోపణల మీద విచారణ నిర్వహించిన ఆంగ్లేయాధికారులు 1860 అక్టోబర్‌లో 14 ఏండ్ల కారాగారశిక్ష విధించి ఆయనను అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. ఆ విధంగా అండమాను చేరిన మీర్జా విలాయత్ హుస్సేన్ ఖాన్ అండమానులో చివరిశ్వాస విడిచారు. ◆

# నుజ్జర్ మొహమ్మద్

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న నుజ్జర్ మొహమ్మద్ (Nuzzar Mohammad) ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్ ప్రాంతం నివాసి. 1857 నాటి సంగ్రామంలో ఆంగ్ల సైన్యాలది పైచేయి కావడంతో ఆయనను నిర్బంధించిన కంపెనీ అధికారులు విచారణ తంతు నిర్వహించి యావజ్జీవిత కారాగారవాస శిక్షను విధించారు. అనంతరం నుజ్జర్ మొహమ్మద్‌ను అండమాను శిక్షాక్షేత్రానికి (Penal Settlement) తరలించారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ అండమానులో శిక్షాక్షేత్రం నిర్మాణానికి, ఆంగ్ల ప్రభుత్వం విధించిన ద్వీపాంతరవాస శిక్షల అమలు కోసం అండమాను లోని చాతం (Chatham) ద్వీపానికి తరలించిన స్వాతంత్ర్య సమరయోధులచే అక్కడి అధికారులు కాయకష్టం చేయించ సాగారు. దట్టమైన అడవులు, కొండలు, గుట్టలు, భయానక క్రిమికీటకాదులతో నిండిన అండమాను-నికోబారు దీవుల సమూహాన్ని జనజీవనానికి యోగ్యంగా తయారు చేయడానికి అండమానుకు తరలించబడిన సమరయోధుల చేత భయంకర చాకిరి చేయించారు. ఆ కాయకష్టం భరించలేని వారి పట్ల ఆంగ్లేయాధికారులు అతి రాక్షసంగా వ్యవహరించటం పరిపాటయ్యింది. ఈ భయానక వెతలను భరించలేక కొందరు ఆరంభంలోనే ఆత్మహత్యలకు పాల్పడ్డారు, మరికొందరు అండమాను నుండి విముక్తి లక్ష్యంగా సముద్రంలో దూకడం,

భయానకమైన అండమాను అడవుల్లోకి పారిపోవడం లాంటి అత్యంత ప్రమాదకర చర్యలకు పూనుకుని ప్రాణాలు పోగొట్టుకున్న దుస్సంఘటనలు చాలా ఉన్నాయి.

అండమానులోని శిక్షాక్షేత్రం నిర్మాణ కార్యభారాన్ని పకడ్బందీగా నిర్వహించేందుకు డాక్టర్ జె. పి. వాకర్ అను అధికారిని సూపరింటెండెంటు హోదాలో ఈస్ట్ ఇండియా కంపెనీ అక్కడకు పంపింది. అండమాను వ్యవహారాల పర్యవేక్షణ, నిర్వహణకు అధికార బాధ్యతలు చేపట్టిన డాక్టర్ వాకర్ ప్రథమ భారత స్వాతంత్ర్య సమరయోధుల తొలి జట్టుతో కలసి అండమాను చేరుకున్నాడు. ఆ ఆంగ్ల ఆధికారి మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొన్న యోధుల పట్ల అత్యంత క్రూరంగా ప్రవర్తించాడు. అతడి అమానవీయ చర్యలను పోరాట యోధుడు నుజ్జర్ మొహమ్మద్ సహించలేకపోయారు. ఆ ఆంగ్లేయుడి చర్యల మీద ఆగ్రహంతో రగిలిపోతున్న మరికొందరు స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ వాకర్‌కు తగిన విధంగా బుద్ధి చెప్పడానికి నిశ్చయించుకుని అదను కోసం ఎదురు చూడసాగారు.

1859 ఏప్రిల్ ఒకటిన స్వాతంత్ర్య సమరయోధులకు ఆ అవకాశం లభించింది. ఆ రోజున అండమానులోని సమరయోధులు ప్రధానంగా పంజాబ్ నుండి కొత్తగా అండమాను వచ్చిన యోధులలో సహనం నశించి జె. పి.వాకర్ మీద అంతంచేయడానికి త్వరితగతిన సిద్ధమయ్యారు. స్వాతంత్ర్య సమరయోధుల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయుడు డాక్టర్ వాకర్ మీద 1859 ఏప్రిల్ ఒకటిన మూకుమ్మడిగా సమరయోధులు దాడి చేశారు. డాక్టర్ వాకర్‌ను అంతం చేయాలని అనుకున్న స్వాతంత్ర్య సమరయోధుల ప్రయత్నం గురించి ముందస్తు సమాచారం ఆ ఆధికారి అందుకోవడం వలన అది విజయవంతం కాలేదు. ఆ ఆంగ్లేయుడు చావు తప్పి కన్ను లొట్టపోయినట్టు ప్రాణాలను అరచేత పట్టుకుని పారిపోయి దాక్కొని బ్రతికిపోయాడు.

ఆ విఫల ప్రయత్నంలో పంజాబీ యోధులతో పాటుగా మొహమ్మద్ నుజ్జర్ కూడా చురుగ్గా పాల్గొన్నారు. స్వదేశీ యోధుల ప్రయత్నం విఫలం కావడంతో ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు డాక్టర్ వాకర్ నాయకత్వంలో స్వాతంత్ర్య సమరయోధుల మీద విరుచుకు పడ్డారు. ఆ మూకుమ్మడి దాడిలో పాల్గొన్నారని అనుమానించబడిన ప్రతి ఒక్కరి మీద ప్రతీకార చర్యలకు పూనుకున్నారు. ఆ తరువాత డాక్టర్ వాకర్ మార్గదర్శకత్వంలో అత్యంత రాక్షసంగా వ్యవహరించిన ఆంగ్లేయాధికారుల పాశవిక చర్యలకు సహచర స్వాతంత్ర్య సమరయోధుల తోపాటుగా నుజ్జర్ మొహమ్మద్ కూడా బలయ్యారు. ◆

# హుసైన్ షాహ్ ఫకీర్-యతీం షాహ్ ఫకీర్

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పశ్చిమగోదావరి జిల్లాలోని యానాం (Yanam) ప్రాంతానికి చెందిన హుసైన్ షాహ్ ఫకీర్, యతీం షా ఫకీర్ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో తమదైన పాత్ర నిర్వహించిన అన్నదమ్ములు. 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరగణాలోని పలు ప్రాంతాలలో ఆంగ్లేయపాలకుల పట్ల తీవ్ర వ్యతిరేకత వ్యక్తమయ్యింది. ఇతర ప్రాంతాల నుండి విచ్చేస్తున్న 'తిరుగుబాటు సిపాయిల' మూలంగా స్థానిక సైనికులలో, ప్రజలలో తిరుగుబాటు భావాలు ప్రజ్వరిల్లసాగాయి. ఆ పరిస్థితిని గమనించిన ఆంగ్లేయాధికారులు బయట నుండి వస్తున్న సిపాయిలను, వ్యక్తులను నిర్బంధించడం మాత్రమే కాకుండా స్థానికంగా కూడా తిరుగుబాటు ఛాయలు ఏమాత్రం కన్పించరాదన్న లక్ష్యంతో కఠినంగా వ్యవహరిస్తు పలుచర్యలు చేపట్టారు.

ఈ నేపథ్యంలో ఆంగ్లేయ సైన్యం నుండి బయటకు వచ్చిన తిరుగుబాటు సైనిక యోధుల రాకపోకలను పూర్తిగా నియంత్రించేందుకు మద్రాసు ప్రభుత్వం Act of 1857 అనుగుణంగా Circular No. 798 Dated 10th July 1857 ను రూపొందించి కఠినంగా అమలు పర్చసాగింది. ఆ చట్టాలకు, సర్క్యులర్‌లకు ఏమాత్రం వెరవని తిరుగుబాటు యోధులు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తిరుగుబాటును మరింతగా విస్తరింపజేస్తూ ముందుకు సాగారు.

స్వదేశీ సైనికులు మాత్రమే కాకుండా ప్రజలు కూడా వివిధ మార్గాలలో తిరుగుబాటుకు సన్నద్ధం కావడం మాత్రమే కాకుండా తిరుగుబాటు జ్వాలల వ్యాప్తికి కూడా కంకణం కట్టుకున్నారు. ఆ లక్ష్యం నేరవేర్చుకోడానికి వివిధ వేషధారణలలో, పలు ఇతర మార్గాలలో భారతదేశం అంతటా పర్యటిస్తూ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను ప్రేరేపిస్తూ, స్వదేశీ సైనిక యోధులను తిరుగుబాటుకు ప్రోత్సహిస్తూ సంచారం ఆరంభించారు.

ఆంగ్ల ప్రభుత్వం ఎన్ని చర్యలు చేపట్టినా ఉత్తర భారతంలో ఆరంభమయిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వాతావరణం దక్షిణాదికి కూడా తాకింది. ఆ క్రమంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కోస్తా ఆంధ్ర ప్రాంతంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రకంపనాలు కన్పించాయి. గతంలో ఆంగ్లేయులతో సాయుధ పోరాటం చేసిన ఫకీర్లు-సన్యాసులు కూడా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ జ్వాలల విస్తరణకు పకీర్లుగా, సన్యాసులుగా ప్రచార కార్యక్రమాలను ముమ్మరం చేశారు. ఆంగ్లేయులు ఆ ప్రచార ప్రకంపనాలను, స్వదేశీయోధుల చర్యలను, కార్యాచరణను నియంత్రించేందుకు ఎన్ని ప్రయత్నాలు చేసినా తిరుగుబాటు యోధుల విజృంభణను అరికట్టలేకపోయారు.

ఆ క్రమంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, కృష్ణా జిల్లా, మచిలీపట్నం అప్పటి మసూలిపట్నం (Masulipatnam) లో ఒక సంచలనాత్మక సంఘటన జరిగింది. 1857 జూలై మాసంలో మచిలీపట్నంలోని ఈస్ట్ ఇండియా కంపెనీ సిపాయీలు, అధికారుల కార్యక్షేత్రంగా పరిగణించబడిన, ఆంగ్ల ప్రభుత్వ పోలీసులు, సిపాయీలు కవాతు నిర్వహించు కవాతు మైదానం (Parade Ground) ఎదురుగా తిరుగుబాటుకు, ధిక్కారానికి ప్రతీకగా, తిరుగుబాటు యోధుల పతాకం అయినటువంటి ఆకుపచ్చ రంగు పతాకం (Green Flag) రహస్యంగా ఎగిరింది. స్వదేశీయోధుల తిరుగుబాటుకు చిహ్నంగా భావిస్తున్న ఆకుపచ్చరంగు పతాకాన్ని ఎగురవేయడం మాత్రమే కాదు, **ఆంగ్లేయులను నరికి వేయండి** (Slaughter the English) అంటూ హిందూస్థానీలో నినాదం రాసిన ప్లకార్డు (Placard) కూడా ఆ పతాకం కర్రకు కట్టి ఉంది. ఈ దృశ్యం ఆంగ్లేయాధికారులలో కలవరానికి, భయానికి కారణమైంది. ఆఘమేఘాల మీద చర్యలకు పూనుకున్న అధికారులు ఈ చర్యలకు పాల్పడిన వ్యక్తులను పట్టుకుని తమకు అప్పగించిన్నట్టయితే 500 రూపాయాల బహుమానం ఇస్తామని ప్రకటించారు. (The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Volumes I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, Page. 147)

ఆంగ్లేయాధికారులు ఆ సంఘటనకు కారకులయిన వారిని నిర్బంధించడానికి ప్రజల మీద విచుకపడ్డారు. అ నిర్బంధకాండలో భాగంగా పలువుర్ని అదుపులోకి తీసుకున్నారు. ఆ గాలింపు వలన యతీం షాహ్ ఫకీర్ (Ythem Shah Fakir) అలియాస్ కల్లూ, హుసైన్ షా ఫకీర్ (Hussain Shah Fakir) లను అనుమానితులుగా తేల్చారు. ఈ యోధుల గుట్టుమట్టులను తెలసుకోడానికి ఆంగ్ల ప్రభుత్వం అవిశ్రాంతంగా శ్రమించింది. చివరకు యతీం షాహ్ ఫకీర్ అలియాస్ కల్లూ, హుసైన్ షా ఫకీర్ మచిలీపట్నం ప్రాంతానికి చెందినవారని వెల్లడయ్యింది. ఈ ఫకీరు యోధులు స్థానికంగా ప్రజలలో మమేకమై సంచరిస్తున్నారని, తిరుగుబాటును విస్తరింపజేయడానికి ప్రచార కార్యక్రమాలను ముమ్మరంగా నిర్వహిస్తున్నారని అధికారులకు తెలిసింది. (The Silent Past of Andamans - Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005, Page 52-54)

ఈ సందర్భంగా మచిలిపట్నంలో మాత్రమే కాకుండా 1857 నవంబరు 7న కృష్ణా జిల్లా జగ్గయ్యపేటలోని ప్రభుత్వ కచేరి మీద దాడి జరిగింది. ఆయుధాలు చేపట్టిన నాలుగు వందల మంది రోహిల్లాలు కచేరి ఆవరణలోకి దూసుకొచ్చారు. ఆ సమయంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికుల ప్రతిఘటన అంతగా లేకపోవడంతో కోశాగారంలోని నగదును, ఆయుధాగారంలోని ఆయుధాలను తిరుగుబాటు యోధులు స్వంతం చేసుకున్నారు. ఈ సాహసకృత్యంలో హిందూ-ముస్లిం యోధులు కలసికట్టుగా పాల్గొన్నారు. (South India in 1857 War of Independence, Dr V.D. Divekar, SAKSHI, 2019, Page. 122)

ఈ ఆకస్మిక దాడికి ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాధికారులు నివ్వెరపోయారు. ఆ తరువాత 1857 ఆగస్టు 21న ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుడు రహీం బేగ్‌ను ఆంగ్లేయ అధికారులు అరెస్టు చేశారు. మొహరం పండుగ సందర్భంగా రహీం బేగ్ తిరుగుబాటుకు ప్రయత్నాలు ఆరంభించారు. ఆ రహస్యం కాస్తా బయటపడటంతో బేగ్‌ను, ఆయన సహచరులు ఖాజీ మున్‌దార్ అలీ, హుసైన్ బేగ్, షబీబ్ బేగ్, మీరా హుస్సేన్, సిలార్ ఖాన్, మీర్ లుబ్బా ఖాన్, మీర్ వజీర్ అలీ, గాలిబ్ బేగ్, ముస్తాబ్ సాహెబ్, ఖాద్ ముహమ్మద్ అలీ ఖాన్ అలియాస్ దాదా సాహెబ్ తదితరులను అరెస్టు చేశారు. (South India in 1857 War of Independence, Dr V.D. Divekar, SAKSHI, 2019, Page. 117)

ఈ తిరుగుబాటును ప్రస్తావిస్తూ ఆగస్టు 22న రాజమండ్రిలోని ఆంగ్ల అధికారి మద్రాసులోని ప్రధానకార్యదర్శికి రాసిన లేఖలో **భారీ కుట్రను మొగ్గలోనే తుంచగలిగాం** అని చెప్పుకున్నాడు. **ఈ తిరుగుబాటు కేవలం రాజమండ్రి వరకు పరిమితం కాలేదని,**

**మచిలీపట్నం, గుంటూరు జిల్లాలను కూడా కలుపుకుని ప్రజలను రెచ్చగొట్టి ఒకేసారి తెల్లవారి మీద తిరగబడేందుకు పెద్ద వ్యూహం పన్నారని, ముసల్మాన్లు ఇందులో ప్రధాన పాత్ర వహించారని** వివరించాడు (The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Volumes I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, Page. 60, 156-157).

ఈ మేరకు పలు ప్రాంతాలలో ప్రజ్వరిల్లిన ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక సంఘటనల సమాచారంతో రెచ్చిపోయిన ఆంగ్ల ప్రభుత్వ గూఢచారి దళం, కంపెనీ సైనిక దళాలు యతీం షాహ్ ఫకీర్, హుసైన్ షా ఫకీర్‌ల అరెస్టుకు తమ ప్రయత్నాలను ముమ్మరం చేసాయి. ఈ యోధుల ఆచూకి తెలిపినవారికి గాని, పట్టుకున్నవారికిగాని 500 బహుమానం ఇస్తామని ఆంగ్ల ప్రభుత్వం ప్రకటించింది. చిట్టచివరకు తిరుగుబాటును ప్రోత్సహిస్తూ ప్రజలలో ప్రచార కార్యక్రలను నిర్వహిస్తున్న హుసైన్ షాహ్ ఫకీర్, యతీం షాహ్ ఫకీర్‌లను ఆంగ్లేయాధికారులు, సైనికులు నిర్బంధించగలిగారు (The Silent past of Andamans- Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005, Page 53-54).

ఆ తరువాత యతీం షాహ్ ఫకీర్, హుసైన్ షా ఫకీర్‌ల మీద ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను, సిపాయిలను తిరుగుబాటుకు, హింసకు ప్రేరేపిస్తూ రాజద్రోహానికి (Endeavouring to excite mutiny and sedition) పాల్పడారన్న ఆరోపణలను ఆంగ్లేయాధికారులు నమోదు చేశారు. ఆ నేరాల విచారణ కొరకు ఆంగ్ల ప్రభుత్వానికి మద్దతు ఇస్తున్న నిజాం సంస్థానం రాజధానీ నగరం, ప్రస్తుత తెలంగాణ రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌కు ఆ ఇరువురు యోధులను తరలించారు. ఆంగ్లేయాధికారుల న్యాయస్థానం విచారణ జరిపి 1857 సెప్టెంబర్ తొమ్మిదిన తిరుగుబాటు యోధులు హుసైన్ షాహ్ ఫకీర్, యతీం షాహ్ ఫకీర్‌లకు యావజ్జీవ కారాగార శిక్షను విధించింది. (South India in 1857 War of Independence, Dr V.D. Divekar, SAKSHI, 2019, Page. 126)

ఆ శిక్ష ప్రకారంగా ఇరువురిని భారీ భద్రతతో కలకత్తా పంపాల్సిందిగా న్యాయస్థానం సూచించగా మద్రాసు ప్రభుత్వం మాత్రం ఆ యోధులను తొలుత మద్రాసుకు పంపి అటు నుండి అండమానుకు పంపాలంటూ ఆజ్ఞలు జారిచేసింది. ఆ ఆజ్ఞల మేరకు హుసైన్ షాహ్ ఫకీర్, యతీం షాహ్ ఫకీర్‌లను తొలుత మద్రాసుకు పంపి అటునుండి అండమానుకు తరలించారు. ఈ ఇరువురితో మరో 12 మందిని కూడా అండమానుకు పంపారు. (South India in 1857 War of Independence, Dr V.D. Divekar, SAKSHI, 2019, Page. 126). ఆ 12 మంది యోధులు ఎవరన్నది స్పష్టంగా తెలియడంలేదు. ◆

# అబ్దుల్ రహీం అజిమాబాది

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు అబ్దుల్ రహీం అజిమాబాది (Abdul Rahim Azimabadi) బీహార్ రాష్ట్రం పాట్నా పట్టణం నివాసి. బీహార్ రాష్ట్ర రాజధాని పాట్నాకు గల పూర్వనామం 'అజిమాబాద్'. ఆ అజిమాబాద్‌లో అబ్దుల్ రహీం అజిమాబాది 1841 లో జన్మించారు. ఆయన మంచి పండితులు. బహుభాషా కోవిదులు. పుట్టిన ఊరి మీదున్న ప్రేమతో తన పేరును అబ్దుల్ రహీం అజిమాబాది (Abdul Rahim Azimabadi) గా ప్రకటించుకున్నారు. ఆ పేరుతో ఆయన సుప్రసిద్ధులయ్యారు.

చిన్న వయస్సు నుండి ఆంగ్లేయుల ఆధిపత్యం, ఆంగ్లేయాధికారుల అమానవీయ ధోరణులను పట్ల అబ్దుల్ రహీం అజిమాబాదిలో వ్యతిరేకత చోటు చేసుకుంది. ఆ కారణంగా సుమారు 16 ఏండ్ల వయస్సులో 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలతో తలపడుతున్న స్వదేశీ యోధులకు ఆయన సహకరించారు.

ఆ కారణంగా ఆగ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారి సార్జెంట్ పార్‌సన్ (Sargent Parson) అబ్దుల్ రహీం అజిమాబాదిని నిర్బంధించాడు. ఆయన మీద పలు నేరారోపణలు గావించి కేసును నమోదు చేసి అంబాలా జిల్లా న్యాయస్థానానికి సమర్పించారు.

ఆయనకు ఆపాదించిన నేరాలను రుజువు చేయడానికి తగిన సాక్ష్యాలు లేకున్నా కూడా ఆంగ్ల న్యాయస్థానం సుదీర్ఘ కాలం పాటు విచారణ తంతును నిర్వహించింది. చివరకు 1864 మే రెండున అబ్దుల్ రహీం అజిమాబాదికి పధ్నాలుగు సంవత్సరాల కఠిన కారాగారవాస శిక్షను విధిస్తూ తీర్పు చెప్పింది. ఆ మీదట ఆయనను ద్వీపాంతరవాసం పంపాలని, ఆయన ఆస్తిపాస్తులన్నిటినీ ప్రభుత్వం జప్తు చేసుకోవాల్సిందిగా అధికారులను ఆదేశిస్తూ న్యాయస్థానం ఆదేశాలు జారీచేసింది.

ఆంగ్ల న్యాయస్థానం తీర్పు ప్రకారంగా ఆంగ్లేయాధికారులు 1867 డిసెంబర్ 25న అబ్దుల్ రహీం అజిమాబాదిని అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు. అండమాను చేరుకున్న అబ్దుల్ రహీంలోని విద్వత్తును గ్రహించిన ఆంగ్ల అధికారులు ఆయనను ఓడరేవుకు సంబంధించిన ప్రధాన కార్యాలయంలో ఆరు రూపాయల జీతం మీద గుమాస్తా (Munshi) గా ఉద్యోగం కల్పించారు. ఆ తరువాత ఆయనకు పదోన్నతి కల్పిస్తూ అండమానులోని ఆసుపత్రికి సంబంధించిన ప్రధాన కార్యాలయంలో ప్రధాన గుమాస్తా (Head Clerk) గా బదిలీ చేశారు. ఆ విధంగా పదోన్నతి పొందిన అబ్దుల్ రహీం అజిమాబాది అండమాను లోని ఆసుపత్రిలో తొమ్మిది సంవత్సరాల పాటు సేవలందించారు.

ఆ సమయంలో ఆంగ్ల ప్రభుత్వం అండమాను శిక్షాక్షేత్రంలోని వారికి వర్తింపజేసేందుకు ప్రత్యేకంగా రూపొందించిన శిక్షాక్షేత్రం చట్టంలో తీసుకొచ్చిన మార్పులను ఉపయోగించుకుని అబ్దుల్ రహీం అజిమాబాది ఆంగ్లేయాధికారుల నుండి 'టిక్కెట్ ఆఫ్ లీవ్' (Ticket of Leave) పొందారు. ఈ Ticket of Leave పొందిన వ్యక్తులు పాక్షిక స్వేచ్ఛతో స్వంతంగా అండమాను శిక్షాక్షేత్రంలో వ్యాపారాలు, వ్యవసాయం, ఆదాయాన్ని సమకూర్చే ఇతర ఉద్యోగాలు, పనులను చేసుకోవచ్చును. ఈ కార్యక్రమాలన్నీ ఆంగ్ల అధికారుల పర్యవేక్షణలో మాంత్రమే జరగాలి.

ఆ టిక్కెట్ ఆఫ్ లీవ్ కల్పించిన అవకాశంతో అబ్దుల్ రహీం అజిమాబాది అండమానులో వస్త్ర వ్యాపారం ప్రారంభించారు. ఆ వ్యాపారం లాభదాయకంగా ఉండటంతో ఆయన తన కుమారుడు మౌల్వీ అబ్దుల్ ఫతాహ్ (Moulvi Abdul Fattah) ను అండమాను శిక్షాక్షేత్రానికి రప్పించునేందుకు ఆంగ్లేయాధికారుల అనుమతి సంపాదించారు. ఆ అనుమతి మేరకు 1880 అబ్దుల్ రహీం అజిమాబాది కుమారుడు మౌల్వీ అబ్దుల్ ఫతాహ్ అండమాను లోని పోర్టు బ్లెయర్ చేరుకున్నారు. మౌల్వీ అబ్దుల్ ఫతాహ్ తన తండ్రి అబ్దుల్ రహీం అజిమాబాది నిర్వహిస్తున్న వ్యాపార కార్యకలాపాలలో సహకరిస్తూ సంవత్సరం పాటు అండమాను శిక్షాక్షేత్రంలో గడిపారు.

ఆ సమయంలో తన తండ్రి అబ్దుల్ రహీం అజిమాబాదిని క్షమించి అండమాను శిక్షాక్షేత్రం నుండి ఆయనకు విముక్తి ప్రసాదించి విడుదల చేయవలసిందిగా కోరుతూ మౌల్వీ అబ్దుల్ ఫతాహ్ ఆంగ్ల ప్రభుత్వాన్ని ఒక వినతి పత్రం పంపుకున్నారు. ఇది ఇలా ఉండగా అటు భారతదేశం ప్రధాన భూభాగం నుండి అబ్దుల్ రహీం అజిమాబాది భార్య కూడా తన భర్తను క్షమించి స్వదేశానికి పంపాల్సిందిగా విజ్ఞప్తి చేస్తూ 1881 ఏప్రిల్ మాసంలో ఆంగ్ల ప్రభుత్వానికి ఒక వినతి పత్రం పంపారు.

అబ్దుల్ రహీం అజిమాబాది కేసును విచారించిన అంబాల సెషన్స్ కోర్టు 1864లో ప్రకటించిన తీర్పులో తన భర్త 14 సంవత్సరాల పాటు కారాగారవాస శిక్ష అనుభవిస్తునప్పుడు ఆయన మంచి నడవడిక చూపినట్టయితే ఆ తరువాతి కాలంలో ఆయనను విడుదల చేయవచ్చని పేర్కొన్న విషయాన్ని అబ్దుల్ రహీం భార్య ఆ వినతిపత్రంలో ఉన్నతాధికారుల దృష్టికి తెచ్చారు. అంబాలా న్యాయస్థానం తన భర్తకు అటువంటి రాయితీ కల్పించి ఉన్నందున ఆయనను విడుదల చేయాల్సిందిగా ఆంగ్ల ప్రభుత్వాన్ని ఆమె కోరారు. అబ్దుల్ రహీం అజిమాబాది మీద తీవ్రమైన ఆరోపణలు ఏమీ లేనందున ఆయనకు అండమాను శిక్షాక్షేత్రం నిర్బంధం నుండి విముక్తి కల్గించాల్సిందిగా ఆ విజ్ఞప్తిలో ఆమె పేర్కొన్నారు. ఆంగ్ల ప్రభుత్వానికి ఆమె వినతిపత్రం సమర్పించేనాటికి అబ్దుల్ రహీం అజిమాబాది 14 సంవత్సరాల శిక్షా కాలాన్ని అండమాను శిక్షాక్షేత్రంలో గడిపి ఉన్నందున విడుదలకు ఆయన అన్నివిధాల అర్హులన్న విషయాన్ని ఆమె తన వినతిపత్రం ద్వారా ఆంగ్లేయాధికారుల దృష్టికి తెచ్చారు.

ఈ మేరకు పలు సానుకూల, న్యాయపరమయిన అంశాలను తన వినతిపత్రం ద్వారా ఆంగ్ల ప్రభుత్వం దృష్టికి తెస్తూ అబ్దుల్ రహీం అజిమాబాది విడుదలకు అన్ని విధాల అర్హుడని పేర్కొంటూ, ఆయనను విడుదల చేయాల్సిందిగా ఆమె పలుమార్లు డిమాండ్ చేశారు. అబ్దుల్ రహీం అజిమాబాది సత్ప్రవర్తన, ఉద్యోగ నిర్వహణలో ఆయన చూపిన శక్తి సామర్థ్యాలు, అందించిన సహాయ-సహకారాలు, ప్రస్తుత వార్ధక్యం, అనారోగ్యం, అనుభవించిన శిక్షాకాలం తదితర అంశాలను పరిగణన లోకి తీసుకుని ఆయనను అండమాను శిక్షాక్షేత్రం నుండి స్వస్థలం పంపాల్సిందిగా ఆయన భార్య నిరంతరం విజ్ఞప్తులు పంపుతూ వచ్చారు.

ఆ మహజర్ల పరంపర కారణంగా అబ్దుల్ రహీంను అండమాను శిక్షాక్షేత్రం నుండి విడుదల చేయాల్సిందిగా అండమానులోని ఆధికారులను ఆదేశిస్తూ అండమానులోని అధికారులకు ఆంగ్ల ప్రభుత్వం ఉత్తర్వులను పంపింది. అబ్దుల్ రహీం అజామాబాది విడుదల ఉత్తర్వులు స్వదేశం నుండి అండమానుకు 1883 జనవరి 22న చేరుకున్న యస్. యస్.

మహారాణి (S.S. Maharani) ఓడ ద్వారా అండమాను శిక్షాక్షేత్రంలోని ఆంగ్లేయాధికారులకు అందాయి. ఆ ఉత్తర్వుల మేరకు అబ్దుల్ రహీం విడుదలకు అంగీకరించిన అధికారులు అందుకు తగిన ఏర్పాట్లు పూర్తి చేసారు. ఆ కారణంగా 1883 మార్చి మూడున అండమాను శిక్షాక్షేత్రం నుండి అబ్దుల్ రహీం అజామాబాదికి విముక్తి లభించింది. స్వస్థలం వీడి సుదీర్ఘకాలం అండమాను శిక్షాక్షేత్రంలో గడిపిన అబ్దుల్ రహీం అజామాబాది చివరకు అండమాను శిక్షాక్షేత్రం నుండి భారత ప్రధాన భూభాగం చేరుకున్నారు.

అండమాను శిక్షాక్షేత్రంలో 19 ఏండ్ల పాటు ఆంగ్లేయాధికారుల పర్యవేక్షణలో గడిపి అండమాను నుండి విముక్తి పొంది అబ్దుల్ రహీం అజామాబాది స్వగ్రామం చేరుకున్నా కూడా ఆయన ఆంగ్లేయాధికారుల పర్యవేక్షణ, నిఘాలో ఉండక తప్పలేదు. అజిమాబాద్ ఆంగ్లేయాధికారులు ఆయనను పలు విధి-నిషేధాలకు గురిచేశారు. ఆంగ్లేయాధికారుల కనుసన్నల నుండి తప్పించుకుని స్వేచ్ఛగా సంచరించే అవకాశం కూడా ఆయనకు కలుగనివ్వకుండా అధికారులు కట్టుదిట్టమయిన చర్యలు తీసుకున్నారు. అబ్దుల్ రహీం అజామాబాది అంబాలా ఆంగ్లేయాధికారులకు ఎరుక లేకుండా ఎక్కడికీ వెళ్ళరాదని, ఎక్కడికయినా వెళ్ళాల్సి వస్తే తప్పని సరిగా అధికారుల అనుమతి తీసుకుని వెళ్ళాలని ఆంగ్లేయాధికారులు నిర్దేశిస్తూ ఆయన మీద కఠిన ఆంక్షలను విధించారు.

ఆ కారణంగా అండమాను శిక్షాక్షేత్రం నుండి స్వగ్రామం చేరుకున్నా కూడా అబ్దుల్ రహీం అజామాబాదికి ఆంగ్లేయాధికారుల ఆంక్షల, నిషేధాల చక్రబంధం కల్పించిన ఇక్కట్లు తప్పలేదు. అధికారుల ఆంక్షలు, విధినిషేధాలను తట్టుకుంటూ కూడా అబ్దుల్ రహీం అజామాబాది తన సాహితీ వ్యాసంగాన్ని నిర్విఘ్నంగా కొనసాగించారు.

చివరి క్షణం వరకు 1857 నాటి సంగ్రామ జ్ఞాపకాలను, అండమాను శిక్షాక్షేత్రంలోని దుర్భర పరిస్థితులను, అక్కడికి తరలించబడిన 1857 నాటి స్వాతంత్ర్య సమరయోధుల సాహసాల సమాచారాన్ని సన్నిహితులతో పంచుకుంటూ అబ్దుల్ రహీం అజామాబాది గడిపారు. చివరకు తన 90వ ఏట 1931 అగస్టు 24న అబ్దుల్ రహీం అజిమాబాది స్వగ్రామంలో కన్నుమూసారు. (The Silent Past of Andamans Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005, Page 18-19)◆

# మౌల్వీ అహ్మదుల్లాహ్

ప్రస్తుత బీహార్ రాష్ట్రం పాట్నా (Patna) జిల్లా, మానేర్ (Maner) తహసిల్ లోని సాధిక్‌పూర్ (Sadiqpur) గ్రామనివాసి అయినటువంటి మౌల్వీ అహ్మదుల్లాహ్ (Maulvi Ahmad-ul-Lah) 1801లో జన్మించారు. ఆయన తండ్రి పేరు ఇలాహీ బక్ష్ (Illahi Baksh). మౌలానా అహ్మదుల్లాహ్ విద్యావంతుడు, మంచి పలుకుబడి కలిగిన వ్యక్తి. ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వంలో ఆయన డిప్యూటి కలక్టర్‌గా ఉద్యోగం చేశారు.

మౌల్వీ ఆహ్మదుల్లాహ్ ఆంగ్ల ప్రభుత్వ ఉన్నతాధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నా కూడా పరాయి పాలకుల ఆధిపత్యం, అమానవీయ వ్యవహార శైలి పట్ల మాత్రం తిరస్కృతి వ్యక్తమయ్యేది. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆయనలో రగులుతున్న భావోద్రేకాలను, ఆయన కార్యకలాపాలను, కార్యాచరణను గమనించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు, 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం సమయంలో మౌల్వీని నిర్బంధించారు. మూడు మాసాల పాటు నిర్బంధంలో ఉంచి ఆ తరువాత ఆయనను విడుదల చేసారు.

ఆంగ్లేయుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా మాతృభూమి స్వేచ్ఛ కోసం పోరాడుతున్న వహాబీ ఉద్యమకారులకు మౌల్వీ అహ్మదుల్లాహ్ సానుకూలంగా వ్యవహరిస్తూ సహాయ

సహకారాలు అందించారు. మౌల్వీ అహ్మదుల్లాహ్ నియమ బద్ధతలతో కూడిన ప్రవర్తన వలన వహాబీ ఉద్యమంలో, పాట్నా కేంద్రంగా ప్రముఖ నాయకునిగా ఎదిగారు. అహ్మదుల్లాహ్ మాత్రమే కాకుండా ఆయన కుటుంబం, బంధువర్గం కూడా ఆయన వెంట వహాబీల పోరాటంలో ముందు వరసలో నిలిచారు, ఆయనతో కలిసి నడిచారు. ఆంగ్లేయ వ్యతిరేక కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నారు. ఒక దశలో వహాబీ ఉద్యమానికి చుక్కానిగా మారిన ప్రముఖ ఉద్యమకారులు మౌల్వీ యహ్యాఅలీ (1822-1868) అహ్మదుల్లాహ్‌కు స్వయాన తమ్ముడు. వహాబీల పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన అబ్దుల్ రహీం సాధిక్‌పూరి ఆయన సమీప బంధువు.

బీహార్ రాష్ట్రం పాట్నా కేంద్రంగా సాగుతున్న వహాబీ ఉద్యమ కార్యకలపాలకు మౌల్వీ అహ్మదుల్లాహ్ ప్రధాన నిర్వాహకుడిగా బాధ్యతలు చేపట్టి సమర్ధవంతంగా నిర్వహించారు. ఆయన కార్యకలాపాల పట్ల కన్నెర్ర చేసిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను 'అత్యంత ప్రమాదకర' వ్యక్తిగా ప్రకటించింది. ఆఘమేఘాల మీద ఆంగ్లేయాధికారులు స్పందిస్తూ 1864 నవంబరు 5న అహ్మదుల్లాహ్‌ను, ఆయన అనుచరులను నిర్బంధించారు.

మౌల్వీ అహ్మదుల్లాహ్, ఆయన అనుచరుల మీద రాజద్రోహం నేరం మోపి పాట్నా కేంద్రంగా 'పాట్నా కుట్రకేసు / పాట్నా విచారణ' (Patna Conspiracy Case or Patna Trail) పేరుతో బ్రిటిష్ ప్రభుత్వం విచారణ తంతు నిర్వహించింది. చరిత్ర ప్రఖ్యాతి చెందిన 'పాట్నా కుట్రకేసు / పాట్నా విచారణ' తరువాత ఆంగ్లేయ న్యాయస్థానం మౌల్వీ అహ్మదుల్లాహ్‌కు ఉరిశిక్ష విధిస్తూ ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేయాల్సిందిగా అధికారులను ఆదేశిస్తూ 1865 ఫిబ్రవరి 27న తీర్పు చెప్పింది. ఆ తీర్పు మీద పునర్విచారణ జరిపిన ఉన్నత న్యాయస్థానం ఉరిశిక్షను రద్దుచేస్తూ యావజ్జీవిత కారాగారవాస శిక్షను ఖరారు చేసింది. ఆ తీర్పు మేరకు మౌల్వీ అహమ్మదుల్లాహ్‌ను అండమానుకు తరలించారు.

మౌల్వీ అహమ్మదుల్లాహ్ 1865 జూన్ 15న అండమాను శిక్షాక్షేత్రం చేరుకున్నారు. అండమానులోని సముద్రయానశాఖలో ప్రధాన గుమాస్తాగా (Chief Clerk in Marine Departmenet) పనిచేస్తున్న మున్షీ గులాం నబీ / మొహమ్మద్, ప్రముఖ పండితులు మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి, ప్రముఖ వహాబీ ఉద్యమకారులు స్వయాన ఆయన సోదరుడు మౌల్వీ యహ్యాఅలీని ఆయన 1866 జనవరి 11న కలుసుకున్నారు. అండమాను దీవులలోని వైపర్ ఐల్యాండ్ (Viper Island) లోని న్యాయస్థానాలలో అవసరార్థులకు వినతి పత్రాలను తయారుచేసి పెడ్తూ 1871 వరకు ఆయన వైపర్ ఐల్యాండ్‌లో గడిపారు.

1881 ప్రాంతంలో వృద్ధాప్యం, అనారోగ్యం కారణంగా మౌల్వీ అహమ్మదుల్లా శారీరకంగా బలహీన పడ్డారు. ఆ సమయంలో కలకత్తాలో స్థిరపడిన కుమారుడు మౌల్వీ మొహమ్మద్ లాయక్ (Moulvi Muhammed Laiq) ను అండమానుకు రప్పించుకోవాలని ఆయన ఆశించారు. అనాడు తమ కుటుంబీకులను అండమానుకు పిలిపించుకుని వారితో కలసి ఉండడానికి ప్రభుత్వం అనుమతించడం చాలా సామాన్య విషయం. ఆంగ్ల ప్రభుత్వం ద్వారా అండమానుకు పంపబడిన పలువురి కుటుంబీకులు, కుటుంబాలు స్వగ్రామాల నుండి అండమానుకు వచ్చి ఉంటున్నాయి. అయితే అహమ్మదుల్లా ప్రముఖ వహాబీ నాయకుడు కనుక ఆయనను అత్యంత 'ప్రమాదకర వ్యక్తి'గా ఆంగ్ల ప్రభుత్వం పరిగణించి, ఆ మేరకు ప్రకటించి ఉన్నందున ఆంగ్లేయాధికారులు ఇతరులకు ఇస్తున్న సామాన్య సౌలభ్యం కూడా మౌల్వీ అహ్మదుల్లాహ్‌కు కలగజేయడానికి ససేమిరా అన్నారు.

భారత ప్రధాన భూభాగం నుండి ఆయన కుటుంబీకులు అండమానుకు వచ్చే అవకాశం లేనందున అహ్మదుల్లాహ్‌ను ఆదుకునేందుకు అండమానులోని సహచర వహాబీ ఉద్యమకారులు రంగంలోకి దిగారు. మౌల్వీ అహ్మదుల్లాహ్ కు అండగా నిలవడానికి 1864లో యావజ్జీవిత కారాగార శిక్ష విధించబడి పాట్నా నుండి అండమానుకు తరలించబడిన అబ్దుల్ కరీం సాధిక్‌పూరి ముందుకు వచ్చారు. పెద్ద వయస్కులయిన అహ్మదుల్లాహ్ అనారోగ్యం, వృద్ధాప్యం ఆయనకు తెచ్చిపెట్టిన విషాదకర పరిస్థితులను ఏకరువు పెడుతూ ఆంగ్ల ప్రభుత్వానికి ఆయన వినతి పత్రం అందించారు. మౌల్వీ అహ్మదుల్లాహ్ తనకు సమీప బంధువు అయినందున తాను ఉంటున్న అబెర్‌దీన్ (Aberdeen) కు అహ్మదుల్లాహ్‌ను పంపినట్టయితే ఆయన బాగోగులను తాను చూసుకోగలనని, అందువల్ల మౌల్వీని అబెర్‌దీన్ కు పంపాల్సిందిగా ఆ విజ్ఞప్తి పత్రంలో ఆయన విజ్ఞప్తి చేశారు. ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్యవహరించిన, ఉద్యమించిన వహాబీ యోధుల్లాంటి ప్రమాదకర వ్యక్తుల పట్ల అత్యంత కఠినంగా వ్యవహరించాలని గట్టిగా నిర్ణయించుకున్న ఆంగ్ల ప్రభుత్వం అబ్దుల్ కరీం సాధిక్‌పూరి విజ్ఞప్తికి ఏమాత్రం స్పందించలేదు.

మౌల్వీ అహ్మదుల్లాహ్ ఆరోగ్యం మరింతగా క్షీణించింది. ఆయన పరిస్థితులు విషమం అవుతున్నందున కనీసం తనను అబెర్‌దీన్ (Aberdeen) నుండి మౌల్వీ ఉంటున్న వైపర్ ఐల్యాండ్ పంపమని కోరుతూ అబ్దుల్ కరీం సాధిక్‌పూరి ఆంగ్ల అధికారులకు మరో విజ్ఞప్తి పంపారు. ఆ విజ్ఞపికి స్పందించిన ఆంగ్ల ప్రభుత్వం అబ్దుల్ కరీంను ఆయన ఉంటున్న అబెర్‌దీన్ నుండి మౌల్వీ అహ్మదుల్లాహ్ ఉంటున్న వైపర్ ఐల్యాండ్ కు వెళ్ళడానికి అనుమతి

ఇచ్చింది. ఈ మేరకు 1881 నవంబరు 21న ఉత్తర్వులు జారీచేసింది. ఆ ఉత్తర్వులను అందుకున్న అబ్దుల్ కరీం మౌల్వీ అహ్మదుల్లాహ్‌కు సేవ చేయడానికి ఆబెర్‌దీన్ నుండి ఆ రాత్రికి రాత్రి ఆఘమేఘాల మీద రోజ్ ఐల్యాండ్‌కు ప్రయాణం కట్టారు. 1881 నవంబరు 21న మౌల్వీ అహ్మదుల్లాహ్ ఉంటున్న వైపర్ ఐల్యాండ్ అబ్దుల్ కరీం చేరుకున్నారు.

ఈ మేరకు సాగిన విజ్ఞప్తుల పరంపరలను పూర్తి చేసుకుని, అధికారుల అనుమతి పొంది అబ్దుల్ కరీం రోజ్‌లాండ్ చేరుకునేసరికి మౌల్వీ అహమ్మదుల్లాహ్ ఆరోగ్యం బాగా క్షీణించింది. మౌలానా అప్పటికి 15 రోజుల నుండి వైపర్ ఐల్యాండ్‌లోని ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారు. ఆ చికిత్స ఎటువంటి సత్ఫలితాలు ఇవ్వలేదు. చివరకు మౌల్వీ అహ్మదుల్లాహ్ కోమాలోకి వెళ్ళి పోయారు. అబ్దుల్ కరీం సాధిఖ్‌పూరి ఆయన వద్దకు చేరుకునే సరికి 80 సంవత్సరాల వయస్కులు వహాబి ఉద్యమ యోధులు మౌలానా అహ్మదుల్లాహ్ 1881 నవంబరు 21 రాత్రి సమయంలో ఆసుపత్రిలో చివరి శ్వాసవిడిచారు.

మౌల్వీ అహ్మదుల్లాహ్ కన్నుమూసిన సంగతి మరుసటి రోజు ఉదయం ఆబెర్‌దీన్‌లో ఉంటున్న మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి తదితర ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులకు, వహాబీ ఉద్యమకారులకు తెలిసింది. ఆ దుర్వార్త అందుకున్న మౌలానా థానేసరి తదితరులు తక్షణమే వైపర్ ఐల్యాండ్ చేరుకున్నారు. మౌల్వీ అహ్మదుల్లాహ్ భౌతికకాయాన్ని సందర్శించి నివాళులు అర్పించారు. అనంతరం మౌల్వీ అహ్మదుల్లాహ్ సోదరుడు, ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, మౌల్వీ యహ్యా అలీ సమాధి పక్కన మౌల్వీ అహ్మదుల్లాహ్‌ను ఖననం చేయాలని మౌలానా థానేసరి తదితరులు భావించారు.

మౌల్వీ అహ్మదుల్లాహ్ పార్థివశరీరాన్ని రోజ్‌లాండ్ నుండి ఆబెర్దీన్ తరలించి అక్కడ అహ్మదుల్లాహ్ సోదరులు మౌల్వీ యహ్యాఅలీ (1822-1868) సమాధి పక్కన ఖననం చేయడానికి అనుమతి ఇవ్వాల్సిందిగా మౌల్వీ థానేసరి ఆంగ్లేయాధికారులకు విజ్ఞప్తి చేసారు. మౌల్వీ అహ్మదుల్లాహ్ పార్థివశరీరాన్ని వైపర్ ల్యాండ్ నుండి అబెర్దీన్‌కు తరలించేందుకు అంగ్ల అధికారులు ససేమిరా వీలు కాదన్నారు. ఆ కారణంగా, ఇక చేసేది ఏమీలేక మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి మార్గదర్శకంలో ప్రముఖ వహాబీ వీరుడు, మౌల్వీ అహ్మదుల్లాహ్ పార్థివ శరీరాన్ని వైపర్ ఐల్యాండ్ ఉత్తర భాగాన గల దుండాస్ పాయింట్ (Dundas Point) కు తరలించి 1881 నవంబరు 22న ఖననం చేసారు. (The Silent Past of Andamans Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005, Page 22-23 )◆



# మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రీది

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామంలో వ్యక్తిగత పోరాటాలు, ఉమ్మడి ఉద్యమాలు జమిలిగా సాగాయి. ప్రజలు ఏకోన్ముఖంగా సాగి నిర్వహించిన ఉద్యమాలలో సంఘటితశక్తి, బలమైన స్వేచ్ఛాకాంక్ష వ్యక్తం కాగా, వ్యక్తిగత పోరాటాలలో మాతృదేశం పట్ల ప్రగాఢమైన ప్రేమ, పరాయిపాలకుల పట్ల తిరుగులేని ద్వేషం, అత్యున్నత స్థాయి త్యాగం, ధైర్యసాహసాలు బహిర్గతమయ్యాయి. ఈ మేరకు వ్యక్తిగతంగా పోరుబాటన నడిచిన అమర వీరులలో మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రీది (Mahammad Sher Ali Khan Afridi) ఒకరు.

ప్రస్తుత పాకిస్థాన్ లోని పెషావర్ (Peshawar) జిల్లా జంగ్రుద్ (Jamrud) పట్టణానికి సమీపాన గల తెరాహ్ (Terah) గ్రామంలో మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రీది 1842లో జన్మించారు. ఆయన తండ్రి పేరు వలి (Wali). అఫ్రీది తొలుత పెషావర్‌లోని ఆంగ్ల ప్రభుత్వ పోలీసు విభాగానికి చెందిన అశ్వికదళంలో ఉద్యోగం చేశారు. 1963లో ఆంగ్ల ప్రభుత్వ ఉద్యోగిగా ఆంగ్లేయాధికారి General Reynel Taylor నాయకత్వంలో పెషావర్ నగరం సమీపాన గల అంబేలా (Ambela) లో జరిగిన పోరాటంలో ఆయన పాల్గొన్నారు. (Gumnam Mujahid e Azad : Sher Ali Khan Afridi, Dr Mohammed Shahid Siddiqui Ailg., All India Urdu Talim Ghar, Lucknow, 2021)

షేర్ అలీ ఖాన్ అఫ్రీది ఉద్యోగం రీత్యా పలు ప్రాంతాలు తిరిగి 1863లో అంబేలా పట్టణం చేరి అక్కడ స్థిరపడ్డారు. ఆ గ్రామంలో జరిగిన ఒక ఘర్షణలో ఆయన పాల్గొన్నారు. ఆ ఘర్షణలో ఒక వ్యక్తి హత్యకు గురయ్యాడు. ఆ హత్య సంఘటనలో దోషిగా 1868 ఏప్రియల్ 2న న్యాయస్థానం షేర్ అలీకి ఉరిశిక్ష ప్రకటించింది. ఆయన హత్య చేసారనడానికి సరైన సాక్ష్యాలు లేనందున ఉన్నత న్యాయస్థానం ఉరిశిక్షను రద్దుచేసి యావజ్జీవిత కారాగారశిక్ష విధించింది. ఆ తీర్పు మేరకు షేర్ అలీ ఖాన్ అఫ్రీదిని అధికారులు 1869లో అండమాను శిక్షాక్షేత్రం పంపారు. (The Andaman Islands, FAM Das, Bangalore, 1937, Page 127). అక్కడ ఆయన Prisioner No. 15557 గా పరిగణించబడ్డారు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న వహాబీ ఉద్యమం పట్ల ఆకర్షితులయిన షేర్ అలీ ఖాన్ అఫ్రీది ఆ తరువాతి కాలంలో ఆంగ్లేయ వ్యతిరేకతను వంట పట్టించుకున్నారు. ఆ కారణంగా వహాబీ ఉద్యమ కార్యకర్తగా దేశం కోసం, స్వజనుల కోసం ఏమీ చేయకుండానే జైలు గోడల మధ్య ఇరుక్కు పోయానని ఆయన వ్యాకులత చెందారు. అండమాను శిక్షాక్షేత్రంలో స్వజనం పట్ల కూర్రంగా వ్యవహరిస్తూ, అలవిగాని ఆధిపత్యం చూపుతున్న ఆంగ్లేయ ఉన్నతాధికారులలో ఏ ఒక్కరినైనా పరిమార్చాలని 1869లో నిశ్చయించుకున్నారు. ఆ లక్ష్యాన్ని సాధించేందుకు పథకం రూపొందించుకుని, తదనుగుణంగా తన ఎత్తుగడలను, తన ప్రవర్తనను ఆయన మార్చుకున్నారు. అండమానులో సౌమ్యంగా ప్రవర్తిస్తూ, ఆంగ్ల అధికారులకు సన్నిహితులయ్యారు. ఆ కారణంగా షేర్ అలీ ఖాన్ అఫ్రీదికి పాక్షిక స్వేచ్ఛతో Ticket- of-Leave క్రింద ప్రత్యేక అనుమతి లభించింది.

ఆ అవకాశంతో అండమానులోని హర్రియట్ పర్వతం (Mount Harriet) క్రింది భాగంలో గల హోప్ టౌన్ (Hope Town) లో నివాసం ఉంటున్న షేర్ అలీ ఖాన్ అఫ్రీది తన పథకంలో భాగంగా, జైలులోని ఖైదీలకు క్షవరం చేసేందుకు అంగీకరించారు. క్షవర కార్యక్రమం కోసం అవసరమైన సామాగ్రి కూడా ఆయనకు లభించింది. ఆ సామాగ్రిలో ఒక పదునైన కత్తి కూడా ఉంది. ఆ కత్తిని శతృసంహారానికి ఉపయోగించుకోవాలని ఆయన సంకల్పించుకున్నారు. సమయం గడవ సాగింది. సమయం గడిచిన కొద్ది మహమ్మద్ షేర్ అలీ మనస్సులోని శతృసంహార లక్ష్యం మరింతగా దృఢపడసాగింది.

చివరకు 1872 ఫిబ్రవరి 8వ తేదీన బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ మేయో (Viceroy of India Lord Mayo) అండమాన్ లోని హోప్ టౌన్ (Hope Town) కు వచ్చాడు. ఆ అవకాశాన్ని షేర్ అలీ వృధా పోనివ్వదలచుకోలేదు. క్షురకర్మల సామాగ్రిలో ఉన్న పదునైన కత్తిని

తయారుగా ఉంచుకున్నాడు. 'షేర్' (పులి) లాగా 'వేట' సమయం కోసం ఆయన ఎదురు చూడసాగారు. ఆంగ్లేయాధికారి లార్డ్ మేయో అండమాను శిక్షాక్షేత్రంలో శానిటోరియం నిర్మించేందుకు తగిన ప్రాంతాన్ని పరిశీలించేందుకు అండమాను వచ్చాడు. ఆ సందర్భంగా లార్డ్ మేయో హర్రియట్ పర్వతం చూడాలనుకున్నాడు.

ఆకలిగొన్న పులిలా అవకాశం కోసం షేర్ అలీ ఖాన్ అఫ్రీది ఎదురు చూడసాగారు. లార్డ్ మేయో హర్రియట్ పర్వత ప్రాంతం రావడంతో, హర్రియట్ పర్వతం మీదనే అతడ్ని అంతం చేయలనుకున్నారు. షేర్ అలీ ఖాన్ ఎంతగా ఎదురుచూసినా హర్రియట్ పర్వతం మీద ఆ అవకాశం దక్కలేదు. చివరకు లార్డ్ మేయో మౌంట్ హర్రియట్‌ను సందర్శించి పర్వతం దిగి తిరుగు ప్రయాణం కట్టాడు. చిన్నగా చీకటి అలుముకుంటుంది. పట్టువదలని విక్రమార్కుడిలా ఏ చిన్నపాటి అవకాశం చిక్కినా తన లక్ష్యాన్ని సాధించి తీరాలని నిర్ణయించుకున్న షేర్ అలీ ఖాన్ అఫ్రీది అవకాశం కోసం ఎదురు చూడసాగారు.

. మౌంట్ హర్రియట్‌ను సందర్శించిన లార్డ్ మేయో తిరుగు ప్రయాణం కట్టాడు. ఆ విషయం తెలుకున్న షేర్ అలీ మౌంట్ హర్రియట్ పర్వతం నుండి వేగంగా దిగువకు చేరుకున్నారు. మౌంట్ హర్రియట్ పర్వతం దిగువున సముద్ర తీరాన హోప్ టౌన్ జెట్టి (Hope Town Jetty) వద్ద లార్డ్ మేయో ఆయన అతిథుల కోసం ప్రత్యేకంగా ప్రయాణ పడవ ఏర్పాటు చేసి ఉన్నారు. లార్డ్ మేయో ఆ పడవ ఎక్కడానికి హోప్ టౌన్ జెట్టి వద్దకు తప్పక వస్తాడని నిర్ధారించుకున్న షేర్ అలీ రహస్యంగా జెట్టి సమీపానికి చేరుకున్నాడు. జెట్టికి సమీపాన గుబురుగా ఉన్న మొక్కల చాటున చీకటిలో కలసిపోయాడు. అక్కడ నుండి ఎవ్వరి కంటా పడకుండా ఆంగ్లేయుడి రాక కోసం ఎదురు చూడసాగారు. భద్రతా సిబ్బంది, ఇతరులతో కలసి ఆ చీకట్లో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన లాంతర్ల వెలుగులో సిబ్బంది దారి చూపుతుండగా లార్డ్ మేయో జెట్టి సమీపానికి వచ్చాడు.

ఆ జెట్టికి సమీపాన చీకటిలో మాటున వేసి, సరయిన అదను కోసం ఎదురు చూస్తున్న ఉన్న షేర్ అలీ ఖాన్ అఫ్రీది అకస్మాత్తుగా మెరుపు వేగంతో ముందుకు దూకి తన వద్ద ఉన్న కత్తితో లార్డ్ మేయో మీద దాడి చేశారు. లార్డ్ మేయో వెనుక వైపు నుండి లంఘించి ఆ ఆంగ్లేయుడి వీపు భాగాన్ని తీవ్రంగా గాయపర్చారు. ఆ ఆకస్మిక దాడి వలన ఏర్పడిన బలమైన గాయంతో లార్డ్ మేయో నీళ్ళలో పడిపోయాడు. ఆరంభంలో ఆయన కొంత కోలుకున్నట్టు కన్పించినా అలవిగాని రక్తస్రావంతో బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ మేయో (Viceroy of India Lord Mayo) కొంత సేపటికి జెట్టి వద్దనే మరణించాడు.



MOHAMMAD SHER ALI AFRIDI WHO KILLED
LORD MAYO, VICEROY OF INDIA ON 8TH FEB. 1872 AT ANDAMAN

ఆ విధంగా ఆంగ్లేయ అత్యున్నతాధికారిని అంతం చేయాలన్న తన నిర్ణయాన్ని లక్ష్యాన్ని షేర్ అలీ నెరవేర్చుకున్నారు. ఆ సంఘటన తరువాత షేర్ అలీ ఖాన్ అఫ్రీది హత్యాసంఘటన ప్రాంతం నుండి తప్పించుకునే ప్రయత్నం ఏమాత్రం చేయకుండా స్థిరంగా నిలబడ్డారు. ఆయనను అంతం చేయడానికి ముందుకు ఉరికిన భద్రతా సిబ్బందిని ఆంగ్లేయాధికారి ఒకరు అడ్డుకున్నాడు. ఆఘమేఘాల మీద షేర్ అలీ ఖాన్‌ను చుట్టిముట్టిన భద్రతా సిబ్బంది, ఆంగ్లేయాధికారులు ఆయనను అదుపులోకి తీసుకున్నారు. (ఈ విషయాలను F.A.M. Dass 1937లో ప్రచురించిన The Andaman Islands గ్రంథంలో The Tragic End of Lord Mayo శీర్షికతో ప్రత్యేకంగా రూపొందించిన 19వ అధ్యాయంలో, 1872 ఫిబ్రవరి 8 నాటి సంఘటన గురించీ, ఆ సంఘటనలో షేర్ అలీ ఖాన్ అఫ్రీది నిర్వహించిన సాహసోపేత పాత్రను సవివరంగా పేర్కొన్నారు)

ఈ ఘటన సందర్భంగా ఆంగ్ల ప్రభుత్వ విదేశీ కార్యదర్శి Captain Atichson మహమ్మద్ షేర్ అలీని ప్రశ్నిస్తూ నువ్వెందుకు వైశ్రాయిని హత్యచేశావ్? అన్నాడు. అందుకు సమాధానంగా 'భగవంతుడు ఆజ్ఞాపించాడు' (*Khuda ne Hukum Diya*) అని షేర్ అలీ ఖాన్ సమాధానం ఇచ్చారు.'సరే ఈ హత్యలో నీకు సహకరించిన వ్యక్తులెవ్వరూ?' అనే మరో ప్రశ్నకు, 'మనుషుల్లో నాకెవ్వరూ సహచరులు లేరు. భగవంతుడు మాత్రమే నా సహచరుడు' (*Mera Sharik Koi Admi Nahin, mera Sharik Khuda Hai*) అని షేర్ అలీ ఖాన్ అఫ్రీది తడబాటు ఏమీ లేకుండా సమాధానం ఇచ్చారు. (The Andaman Islands, F.A.M. Dass, Bangalore, 1937, Page.127). ఆ సంఘటన మరుసటి రోజున విచారణ నిమిత్తం షేర్ అలీ ఖాన్ అఫ్రీది వద్దకు వచ్చి ఆంగ్లేయ ఉన్నతాధికారులు ఈ హత్యాకాండ గురించి మళ్ళీ ప్రశ్నిస్తూ 'ఈ హత్యను నువ్వు చేశావా? నువ్వు ఏమి చెప్పదలిచావ్?' అంటూ గుచ్చి గుచ్చి పలుమార్లు అడిగారు. ఆ ప్రశ్నలకు ఏమాత్రం జంకకుండా నిబ్బరంగా సమాధానం ఇస్తూ 'అవును నేనే చేశాను' (*Han, Mainne Kiya*) అని చాలా విస్పష్టంగా, నిస్సంకోచంగా, స్థిరంగా షేర్ అలీ ఖాన్ అఫ్రీది జవాబు ఇచ్చారు. (The Andaman Islands, F.A.M. Dass, Bangalore, 1937, Page. 127).

ఆ సమయంలో అండమానులో ఉన్నటువంటి మౌలానా ముహమ్మద్ జాఫర్ అలీ థానేసరి (1838-1905) ఈ సంఘటన గురించి తన గ్రంథంలో మరిన్ని వివరాలు ఇచ్చారు. షేర్ అలీ ఖాన్ అఫ్రీది 1872 ఫిబ్రవరి 8న బ్రిటిష్ వైశ్రాయ్ లార్ మేయో (Viceroy of India Lord Mayo) తోపాటుగా అండమాను జైలు Superintendent Gen-

eral Stewart ను కూడా అంతం చేయాలని నిర్ణయించుకున్నారని మౌలానా థానేసరి ఆనాటి సంఘటన వివరించారు. (అండమాను శిక్షాక్షేత్రంలో 1866 నుండి 1883 వరకు గడిపిన ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు మౌలానా ముహమ్మద్ జాఫర్ అలీ థానేసరి 1890లో The History of Port Blair (Tavreekh Port Blair) శీర్షికన ప్రచురించిన ఉర్దూ గ్రంథంలో On the Assasination of Lord Mayo అను శీర్షికతో ప్రత్యేక అధ్యాయం (నాల్గవ) ఏర్పాటు చేసి అలనాటి సంఘటన పూర్వాపరాలను, షేర్ అలీ ఖాన్ అఫ్రీది లక్ష్యాలను, కార్యాచరణను కూడా 60వ పుట నుండి 79వ పుట వరకు సవివరంగా పేర్కొన్నారు).

ఆంగ్లేయాధికారులు షేర్ అలీ ఖాన్ మీద హత్యానేరం మోపి పోర్టు బ్లెయర్ లోని Chief Commssioner of Port Blair న్యాయస్థానంలో హాజరుపర్చారు. ఈ సందర్భంగా జరిగిన విచారణలో లార్డ్ మాయోను అంతం చేసింది తానేనని ఆయన అంగీకరించారు. ఆ విచారణ రోజున షేర్ అలీ ఖాన్ పలికిన పలుకులు భావితరాల విప్లవకారులకు ఎంతో ఉత్తేజాన్ని ఇచ్చాయి. '...నా మాతృభూమి విముక్తి కోసం ఏనాడయితే నేను పోరాట దీక్ష చేపట్టానో, ఆనాడే నా ప్రాణం మీద తీపిని వదలుకున్నాను...మన శత్రువులలో ఒకరిని నేను అంతం చేసాను...నేను నా కర్తవ్యాన్ని నిర్వహించాను...నా పవిత్ర కార్యంలో భగవంతుని వద్ద మీరంతా నాకు సాక్ష్యం...' అని ప్రకటించారు. (Hindustan Musalmano Ka Jang-e-Azadi Mein Hissa, (Hindi) Syed Ibrahim Fikri, New Delhi 1999, Page. 30)

చివరకు పోర్టు బ్లెయర్ Chief Commssioner న్యాయస్థానం షేర్ అలీ ఖాన్ అఫ్రీదికి మరణశిక్ష విధించింది. ఆ శిక్షను బెంగాల్ ఉన్నత న్యాయస్థానం ఖరారు చేసింది. 1872 మార్చి 11న ఉరిశిక్ష అమలు జరిగిన రోజున షేర్ అలీ మాట్లాడుతూ, 'నేను చేసిన పని పట్ల నేను కించిత్తు కూడా బాధపడటంలేదు...ఎంతో గర్విస్తూ, మరణాన్ని స్వీకరిస్తున్నాను' అని ప్రకటిస్తూ. ఖురాన్ గ్రంథంలోని ఆయత్‌లను మననం చేసుకుంటూ ఉరిని స్వీకరించారు. (Hindustan Musalmano Ka Jang-e-Azadi Mein Hissa, Page 30)

మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రీది త్యాగనిరతిని ప్రముఖ చరిత్రకారులు శాంతిమోయ్ రాయ్ తన గ్రంథం Freedom Movement and Indian Muslims లో వ్యాఖ్యానిస్తూ, 'షేర్ అలీ అమరత్వాన్ని ఆ తరువాతి తరం భారతీయ విప్లవకారులు ఆదర్శంగా తీసుకున్నారు', (Freedom Movement and Indian Muslims, Santimoy Ray, Peoples Publishing House, New Delhi, 1983, Page. 18) అని పేర్కొంటూ మహమ్మద్ షేర్ అలీ ఖాన్ అఫ్రీదికి ఘన నివాళులు అర్పించారు. ◆



# మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి

ప్రస్తుత హర్యానా రాష్ట్రంలోని కురుక్షేత్ర (Kurukshetra) జిల్లాలోని థానేసరి పట్టణంలో మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి (Maulana Muhammad Jaffar Thanesari) 1838లో జన్మించారు. చిన్నతనంలోనే తండ్రి జీవన్ మియా (Jeewan Miyan) ను పోగొట్టుకున్న ఆయన తల్లి సంరక్షణలో పెరిగారు. ఆంగ్లేయులు మాతృభూమిని ఆక్రమించుకుని తమ సంస్కృతి-సభ్యతలకు విఘాతం కల్గిస్తున్నారని చిన్నతనం నుండి ఆయనలో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల పట్ల తీవ్ర వ్యతిరేకత పురివిప్పింది.

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముహమ్మద్ జాఫర్ థానేసరి తన మిత్రులతో కలసి చురుగ్గా పాల్గొన్నారు. అంబాలా ప్రధాన కార్యక్షేత్రంగా ఆయన కంపెనీ బలగాలకు వ్యతిరేకంగా పోరుబాటన సాగారు. ఆనాటికి ఆయన 19 ఏండ్ల యువకుడు కావడం, తన తోటి వయస్కులతో కలసి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనడం వలన ఆయన, ఆయన మిత్ర బృందం చర్యలు ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల దృష్టికి అంతగా రాలేదు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలం అయిన తరువాత ఆంగ్ల న్యాయస్థానాలకు వచ్చు ఫిర్యాదిదారులకు, ఇతరులకు మహజర్లు రాసిపెట్టడాన్ని ముహమ్మద్ జాఫర్ థానేసరి ప్రధాన వ్యాపకం చేసుకున్నారు. ఆ కారణంగా బహుభాషా పండితుడయిన

ఆయన న్యాయశాస్త్ర విషయాలను కూడా అధ్యయనం చేసి, మంచి పట్టు సంపాదించారు. మహజర్ల రాయసగాడుగా ప్రజల గుర్తింపు పొందిన ఆయన మాతృభూమి విముక్తి పోరాటం కోసం సాగుతున్న ఉద్యమాల పట్ల, ఉద్యమ శక్తుల-వ్యక్తుల పట్ల ఆసక్తిచూపారు.

ఆ క్రమంలో భారత పశ్చిమ సరిహద్దు ప్రాంతాల నుండి ఆంగ్లేయ పాలకుల మీద పోరాటాలు సాగిస్తున్న వహాబీ ఉద్యమకారులతో మౌలానా జాఫర్ థానేసరికి మంచి సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ సంబంధాల కారణంగా ఉద్యమకారులకు అంగబలం- అర్థబలం -ఆయుధబలం అందించగల బృహత్తర బాధ్యతలను ఆయన రహస్యంగా నిర్వహించడం ఆరంభించారు. 1863 నుండి యాగిస్థాన్ (Yaghistan) కేంద్రంగా చేసుకుని వహాబీ ఉద్యమకారులు సాగిస్తున్న పోరాటాలకు చేయూత ఇస్తున్న మౌలానా థానేసరిని 'Peer-o-Khalifa' అని ఆయన అనుయాయులు. సహచరులు గౌరవంగా పిలుచుకున్నారు.

మౌలానా జాఫర్ థానేసరి చర్యల మీద కన్నేసిన ఆంగ్లేయాధికారులలో W.W. Hunter ప్రభుత్వానికి అందించిన నివేదికలో మౌలానా జాఫర్ ధానేసరి తన 12 మంది శిష్య బృందంతో అంబాలా కేంద్రంగా ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక చర్యలకు పాల్పడుతున్నారని స్పష్టంగా పేర్కొనడంతో ఆంగ్ల ప్రభుత్వం ఆగ్రహించింది. మౌలానాను నిర్బంధించడానికి ఆంగ్లేయాధికారి Captain Parson వేట ఆరంభించాడు. మౌలానాను ఎలాగయిన నిర్బంధించాలని అతడు వివిధ ప్రాంతాలను జల్లెడ పట్టసాగాడు. ఆ తనఖీలలో మౌలానా ఇంటి నుండి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఇంటా-బయటా పోరాటాలు సాగిస్తున్న యోధులకు ఆర్థికబలం-అంగబలం-ఆయుధబలం కూడా చేకూరుతుందన్న విషయాన్ని రూఢి చేస్తున్న ఉత్తరప్రత్యుత్తరాలు, వ్యక్తిగత దస్త్రాలు అధికారులకు లభించాయి. ఆ ఆధారాలతో ఆయనను అరెస్టు చేయాలని సంకల్పించిన ఆంగ్లేయాధికారులు ఆయన ఆచూకీ తెలపమంటూ మౌలానా థానేసరి సహచరులను, అనుచరులను, కుటుంబీకులను పలు ఇక్కట్లకు గురి చేసారు.

ఈ విధంగా చుట్టుముడుతున్న ప్రతికూల వాతావరణంలో ఆంగ్ల ప్రభుత్వం నుండి ప్రమాదం పసిగట్టిన మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి 1863 డిసెంబర్ 12న పోలీసుల కన్నుగప్పి ఇంటి నుండి రహస్యంగా బయటకు తప్పించుకున్నారు. ఆ చర్యతో ఉలిక్కిపడిన ఆంగ్లేయ పోలీసు అధికారి Captain Parson మౌలానా థానేసరి ఆచూకీ తెలిపిన వారికి గాని, ఆయనను పట్టిచ్చిన వారికి గాని ఆంగ్లేయ ప్రభుత్వం పదివేల రూపాయల నజరానా ఇవ్వగలదని 1863 డిసెంబర్ 13న బహిరంగంగా ప్రకటించాడు. ఈ మేరకు పోస్టర్లు అతికించారు. కరపత్రాలను ప్రజలలో విస్తృతంగా పంపిణి చేశారు. మౌలానా థానేసరిని

వెంటాడిన ఆంగ్లేయాధికారులు 1863 చివరిలో ఆయనను అలీఘర్‌లో ఆరెస్టు చేసి సంకెళ్ళు బిగించి, భారీ బందోబస్తు మధ్య ఢిల్లీ తరలించారు. అటు నుండి ఆయనను అంబాలాకు తీసుకువెళ్ళి అంబాలా జిల్లా జైలులో భారీ భద్రత మధ్య నిర్బంధించారు.

అంబాలా జైలులో ఉన్న మౌలానాను నయానా, భయానా లొంగదీసుకోడానికి ఆంగ్ల ప్రభుత్వం శతవిధాల విఫలప్రయత్నం చేసింది. మంచి హోదా కలిగిన ఉద్యోగం కల్పిస్తామని అధికారులు ఆశ చూపారు. ఆయన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు ఎటువంటి భంగం కలిగించకుండా విలాసవంతమగు జీవితం గడపటానికి అన్ని ఏర్పాట్లు చేస్తామని నచ్చజెప్ప చూసారు. అందుకు ఆయన 'సర్కారీ గవాహ్' (Government Witness) గా సహకరించాలని కోరారు. భారత పశ్చిమ సరిహద్దు ప్రాంతాలలో ఆంగ్లేయ సైనిక బలగాలతో పోరాడుతున్న వహాబీ వీరులచే 'పీర్-ఓ-ఖలీఫా' (Peer-o-Khalifa) గా సగౌరవంగా పిలువబడిన మౌలానా థానేసరి సహజంగా అధికారుల ప్రతిపాదనలన్నిటిని తిరస్కరించారు.

ఆ తరువాత అంబాలా జిల్లా న్యాయస్థానం మౌలానా జాఫర్ థానేసరి, అయన అనుచరుల చర్యల మీద విచారణ చేపట్టింది. 1864 మే రెండున మౌలానా థానేసరి, మౌలానా యహ్యా అలీ (Maulvi Yahya Ali), మౌలానా షేక్ మొహమ్మద్ షఫి (Maulana Shaik Mohammad Shafi) లకు ఉరిశిక్షలు, ఇతరులకు వివిధ శిక్షలను ప్రకటించింది. ఆ సందర్భంగా ఆంగ్లేయ న్యాయమూర్తి Major Herbert Edward మౌలానా థానేసరిని ఉద్దేశించి మాట్లాడుతూ, 'నిన్ను ఉరితీస్తారు. నీ శవాన్ని మీ వారసులకు కూడా ఇవ్వటం జరగదు. జైలులోని మరుభూమిలో ఏమాత్రం గుర్తింపు కూడా లేకుండా సమాధి చేస్తారు. నిన్ను ఉరి దీయటం నాకు అత్యంత సంతోషాన్ని కలుగచేస్తుంది' అన్నాడు. ('You will be hanged ... Even your corpse will not be given to your heirs, but will be burried with ignonimity in the jail graveyard. It willl give me great plesure to see you hanged' -Ambala Conspiracy Case of 1864 : Moulana Mohammad Jafar Thanesari, by Aijaz Ahamd, Indian Streams Research Journal, Solapur, Vol 4, Issue 4, May 2014, Page. 3)

ఆ ఆంగ్లేయుడికి సమాధానంగా, 'ఎవరు బ్రతికి ఉండాలి ఎవరు మరణించాలన్నది నీవు కాదు నిర్ణయించేది, అదంతా సర్వేశ్వరుడి అభీష్టం. నా కంటె ముందు నీ బ్రతుకును సమాప్తం చేసే శక్తి సర్వేశ్వడికి మాత్రమే ఉంది' అని అని మౌలానా జాఫర్ ఘాటుగా సమాధానం ఇచ్చేసరికి ఆ ఆంగ్లేయుడు అవాక్కయ్యాడు. ('...it is upto God not you to decide who lives and who dies, God Almighty has the power to end your life



Moulana Mohammad Jafar Thanesari
as sketched by a Artist
found in his
'Tavareekh e Ajeeb' book

before mine' – Ambala Conspiracy Case of 1864 : Moulana Mohammad Jafar Thanesari, by Aijaz Ahamd, Indian Streams Research Journal, Solapur, Vol. 4, Issue 4, May 2014, Page. 3). అనంతరం మౌలానా ఆస్తిపాస్తులను ఆంగ్ల ప్రభుత్వం జప్తు చేసింది. మౌలానాను మానసికంగా కృంగదీయడానికి 1864 సెప్టెంబర్ 16 వరకు అంబాలా జైలులోని ఉరిశిక్షలు విధించిన ఖైదీలను ఉంచేటి ప్రత్యేక గదులలో (Solitary Confinement Cell) ఆయనను ఏకాకిగా బంధించి ఉంచింది.

ఆ Solitary Confinement Cell లో మౌలానా థానేసరిని ఉంచటం మాత్రమే కాదు, ఉరిశిక్ష అమలుకు తీసుకోవాల్సిన ఏర్పాట్లను ఆయన సమక్షంలోనే చేయసాగారు. ఆయన ఏమాత్రం చింతించకుండా ఉల్లాసంగా ఉండటాన్ని గమనించిన ఆంగ్లేయాధికారి, మౌలానాను వెంటాడి అరెస్టు చేసిన Captain Parson తన సిబ్బందిలో ఒకరిని ఆయన వద్దకు పంపించాడు. మౌలానా జాఫర్ వద్దకు వచ్చిన అధికారి మౌలానాతో పిచ్చాపాటి మాట్లాడుతూ, ' నీకు ఉరిశిక్ష విధించారు. నువ్వు ఏడ్వాల్సింది పోయి ఎందుకంత సంతోషంగా ఉన్నావు' ('You have been sentenced to be hanged. You should be crying, why are you so cheerful' -Ambala Conspiracy Case of 1864 : Moulana Mohammad Jafar Thanesari, by Aijaz Ahamd, Indian Streams Research Journal, Solapur, Vol 4, Issue 4, May 2014, Page. 3) అని అడిగాడు. అందుకు మౌలానా సమాధానమిస్తూ, 'ఎందుకంటె మేము అమరులం కాబోతున్నాం.అది అత్యుత్తమమైన వరం. నీకు అది అర్థం కాని విషయం' ('Because we are hopeful of that we will attain Martyrdom, which is the greatest blessing. Nevertheless, you can not comprehend it '. -Ambala Conspiracy Case of 1864 : Moulana Mohammad Jafar Thanesari, by Aijaz Ahamd, Indian Streams Research Journal, Solapur, Vol. 4, Issue 4, May 2014, Page. 3) అనేసరికి ఆ ఆంగ్లేయాధికారి ఆశ్చర్యపోయాడట.

మౌలానా థానేసరి తమ న్యాయవాది Mr Plowden ద్వారా క్రింది కోర్టు తీర్పు మీద ఉన్నత న్యాయస్థానంలో అప్పీలు చేశారు. ఆ అప్పీలు మీద ఉన్నత న్యాయస్థానం క్రింది కోర్టు విధించిన మరణశిక్షను ద్వీపాంతరవాస శిక్షగా మార్చింది. ఆ తీర్పు తరువాత ఆయనను Solitary Confinement Cell నుండి ఇతర సామాన్య నిందితుల బ్యారెక్స్‌కు తరలించారు. ఆ తరువాత 1865 ఫిబ్రవరి 24న లాహోర్ లోని కేంద్ర కారాగారానికి పంపారు. అటు నుండి ముల్తాన్, కోట్లా, కరాచి, బొంబాయిలోని జైళ్ళకు మార్చుతూ చివరకు 1865 డిసెంబరు 8న బొంబాయి నుండి అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

మౌలానా జాఫర్ అలీ థానేసరి 1866 జనవరి 11న అండమానులోని పోర్టు బ్లెయిర్ చేరుకున్నారు. అండమాను దీవులలోని రోజ్ ఐల్యాండ్‌కు ఆయనను పంపారు. అక్కడ సముద్రయాన విభాగంలో గుమాస్తాగా ఉద్యోగం చేస్తున్న మున్షీ గులాం నబి, మరో స్వాతంత్ర్య సమరయోధులు మౌల్వీ అహ్మదుల్లాహ్‌ల సాంగత్యంలో ఉండడానికి ఆయనకు అనుమతి లభించింది. ఆంగ్ల ప్రభుత్వాధికారుల పరంగా ఆయన మీద ప్రత్యేకంగా విధి-నిషేధాలు, ఆంక్షలు ఏమీ లేకపోవడంతో 27 ఏండ్ల వయస్కుడైన మౌలానా థానేసరి ఆహారం, ఆహార్యం, సంచారం విషయంలో స్వేచ్ఛగా గడిపారు. ఆయన విద్యావంతుడు, పండితుడు మాత్రమే కాకుండా న్యాయశాస్త్ర పరిజ్ఞానం గలిగిన వ్యక్తి కావడంతో అండమాను శిక్షాక్షేత్రం లోని సముద్రయాన విభాగంలో ఆయనకు గుమాస్తాగా ఉద్యోగం కల్పించారు.

ఆ సమయంలో స్వదేశంలో ఉన్న తన భార్య, కుటుంబీకులను అండమాను రప్పించుకొడానికి అనుమతించాల్సిందిగా కోరుతూ మౌలానా జాఫర్ అలీ థానేసరి ఆంగ్ల ప్రభుత్వానికి వినతి పత్రం పంపుకున్నారు. మౌలానా వహాబీ ఉద్యమ ప్రముఖుడు కనుక ఆయనను 'ప్రమాదకర వ్యక్తి'గా పరిగణించిన ప్రభుత్వం ఆ విజ్ఞప్తిని తిరస్కరించింది. ఆ సమయంలో ఆండమాను దీవులకు ఖైదీగా తరలించబడిన ఒక కాశ్మీరీ యువతిని మౌలానా వివాహం చేసుకున్నారు. ఆ వివాహాన్ని ఆయన వహాబీ ఉద్యమ సహచరులు మౌల్వీ అహమ్మదుల్లా నిర్వహించారు. ఆ కాశ్మీరి మహిళ 1868 ఏప్రిల్ 30న ఆకస్మికంగా కన్నుమూసారు. ఆ తరువాత  స్వదేశం నుండి అండమానుకు పంపబడిన, ప్రస్తుత ఉత్తరాఖండ్ (Uttarakhand) రాష్ట్రం అల్‌మోరా (Almora) పట్టణానికి చెందిన మరొక యువతిని మౌలానా జాఫర్ అలీ థానేసరి వివాహం చేసుకున్నారు.

1870లో అండమాను లోని ఛీఫ్ కమీషనర్ కార్యాలయానికి స్టేషన్ గుమాస్తాగా హడ్డో (Haddo) నుండి రోజ్ ఐలాండ్‌కు (Ross Iland) కు మౌలానా జాఫర్ అలీ థానేసరి బదిలీ అయ్యారు. 1872 జూన్‌లో మరోమారు Head Clerk  పదోన్నతి లభించగా ఆయన రోజ్ ల్యాండ్ నుండి ఆబరెదీన్ (Aberedeen) చేరుకున్నారు. మౌలానా జాఫర్  థానేసరి రోజ్‌ల్యాండ్‌లో ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తున్నప్పుడు, ఆంగ్ల భాష అవసరాన్ని గుర్తించి ఆ భాష పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపారు. బహుభాషా పండితుడు కావడం వలన పలువురు ఆంగ్లేయాధికారులు ఆయన వద్ద పర్షియన్, ఉర్దూ భాషలు నేర్చుకోడానికి ఆసక్తి కనపర్చారు. పలు న్యాయపరమైన, ప్రభుత్వ నిర్వహణపరమైన గ్రంథాలను వివిధ భాషల్లోకి అనువాదం చేయాల్సి వచ్చినప్పుడు ఆంగ్లేయాధికారులు మౌలానా థానేసరి నుండి క్రియాశీలక సహాయం

తీసుకున్నారు. ఆ సమయంలో ఆంగ్లేయాధికారుల సమస్యలను అర్థం చేసుకోడానికి, వారికి అర్ధమయ్యేలా సమస్యను విడమర్చి చూసి తగిన సమాధానం చెప్పడానికి మౌలానాకు ఆంగ్ల భాషా పరిజ్ఞానం అవసరమయ్యింది. ఆ కారణంగా ఆయన రోజ్ ఐల్యాండ్‌లో ఆంగ్ల భాషను నేర్చుకుని ఆ భాష మీద కూడా మంచి పట్టుసాదించారు. ఆంగ్లేయాధికారి Major Prothroe 'Rule and Regulations For Port Blair' రూపొందించడానికి ప్రయత్నిస్తూ ఆ పనిలో మౌలానా థానేసరి సహకారం అభ్యర్థించాడు. ఆ ఆంగ్లేయుడి అభ్యర్ధన మేరకు 'Rule and Regulations For Port Blair' రూపకల్పనలో మౌలానా థానేసరి సహకరించడం మాత్రమే కాకుండా దానిని ఉర్దూలో అనువదించగా ఆంగ్ల ప్రభుత్వం ఆమోదం పొందిన ఈ గ్రంథం ప్రచురితమయ్యి అధికారిక గ్రంథంగా మంచి ప్రచారం కూడా పొందింది.

మౌలానా థానేసరి 1879 ఏప్రిల్ ఒకటిన ఆంగ్లేయాధికారుల విజ్ఞప్తి మేరకు అండమాను, పోర్టు బ్లయర్ తదితర ప్రాంతాల ప్రజలు, అక్కడి పరిస్థితుల మీద 'Tavareekh e Ajeeb' అను గ్రంథ రచనకు పూనుకున్నారు. ఆ గ్రంథం 1880లో తొలిసారిగా ప్రచురితం అయ్యింది. ఆ తరువాత 1892లో స్వయంగా మౌలానా థానేసరిచే సరిచేయబడి పునర్ముద్రణ పొందిన 'Tavareekh e Ajeeb' లో, అండమాను శిక్షాక్షేత్రానికి సంబంధించిన పలు ఆసక్తికర విషయాలను ఆయన చర్చించారు. భారతదేశంలోని వివిధ ఇతర ప్రాంతాల నుండి అండమాను దీవులకు వచ్చి చేరిన సాధారణ ప్రజానీకం, ఆ ప్రజల ఆచారవ్యవహారాలు వారి భాషల గురించి కూడా మౌలానా థానేసరి తన గ్రంథంలో వివరంగా పేర్కొన్నారు.

ఆ క్రమంలో అప్పటికే అండమాను చేరుకున్న తెలుగు ప్రజల పరిస్థితులు, వారి భాష తదితర అంశాల మీద కూడా మౌలానా జాఫర్ థానేసరి చర్చించారు. 'TELOOGOO LANGUAGE' అను శీర్షికన ఏర్పాటు చేసిన ప్రత్యేక అధ్యాయంలో తెలుగు భాషను ఆయన ప్రస్తావించారు. Tavareekh e Ajeeb గ్రంథంలో రెండు పుటలను (199, 200) తెలుగు భాషకు కేటాయించారు. తొలి 199వ పుటలో TELOOGOO LANGUAGE అను ఆంగ్ల శీర్షిక క్రింద 'తెలంగి జుబాన్' అంటూ ఉర్దూ అనువాదం సమకూర్చారు. ఆ తరువాత ఆ పుటను రెండు భాగాలుగా విభజించి అండమాను ప్రాంతంలోని ప్రజల సాధారణ వ్యావహారిక సంభాషణలల్లో దొర్లేటటువంటి వాక్యాలను, ప్రశ్నలను, సమాధానాలను ఆ పుటలలో పేర్కొన్నారు. మొదట 199వ పుటలో ఎడమవైపున తెలుగు వాక్యం ఇస్తూ దాని హిందీ అనువాదం కుడి వైపున ఇచ్చారు. అటు తెలుగు వాక్యం గాని ఇటు హిందీ వాక్యం గాని ఉర్దూ అక్షరాల (Urdu Script) లో మాత్రమే పొందుపర్చారు. ఈ వాక్యాలు హిందీ

تاریخ عجیب                                  ۱۹۹

Teloogoo Language

تلنگی زبان

| ہندی | تلنگی |
|---|---|
| خدا سب سے بڑا ہی | وِشنو انڈ اکنٹے پڈا |
| تمھارا نام کیا ہی | نیدی ایم پیرو |
| تمھارا ضلع کون ہی | نی ضِلّا ایدی |
| تمکو کیا بیماری ہی | نِی کویم رُو گمتا |
| تمھاری کیا نالش ہی | نِیدی ایم فریادُو |
| تمکو کنے مارا | نِیکوا یور کُوٹ نارو |
| اسِکا کیا مول ہی | دِین کی ایم خرید |
| یہ بہت مہنگا ہی | اِیدی بھُو پیریم |
| نہیں صاحب یہ سستا ہی | لے دُو بھُو چھُو کا |
| اِسطرف آؤ | اِٹلا را |
| ادھر بیٹھو اور غسل کرو | اِکڑا اکورچھو اور آشنانم چیئے |
| یہان سے چلے جاؤ | اکڑا اِنچھی ویلی پو |
| وہان سے اٹھو | اکڑا اِنچھی لے گو |
| اپنے صاحب کو میرا سلام بولو | منا دہرا کی نا سلام چھپو |
| تم نوکری کروگے | نی اُو نوکری چیستاوا |
| چار پانچ آدمیون کو بلاؤ | نال گو ایدُو منشلُو نو پیلو |

1880 లో మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి రాసిన Tavareekh e Ajeeb అను ఉర్దూ గ్రంథంలో తెలుగు భాష గురించి చేసిన ప్రస్తావన

వాక్యాలుగా పేర్కొన్నప్పటికి అవి ఉర్దూ భాషకు చాలా సమీపంగా ఉండటం విశేషం. తెలుగు వాక్యాలు చాలా వరకు సక్రమంగా ఉన్నా కూడా తెలుగు భాష రాని వ్యక్తి రాసినట్టుగా ఇట్టే తెలిసిపోయేలా ఉన్నాయి. ఈ మేరకు 199 పుటలో ఆరంభమయిన తెలుగు భాష ప్రస్తావన ఎడమ వైపున 'విష్ణు అందరి కంటె పెద్ద' అని తెలుగులో తొలి వాక్యంతో ఆరంభం అయ్యింది. ఆ వాక్యం హిందీ అనువాదాన్ని 'ఖుదా సబసే బడా హై' అంటూ అనువదిస్తూ కుడి వైపున ఇచ్చారు. ఈ మేరకు Tavareekh e Ajeeb గ్రంథంలోని రెండు పుటలలో (199, 200) మొత్తం మీద 32 తెలుగు వాక్యాలు, ఆ వాక్యాల హిందీ అనువాదాన్ని మౌలానా థానేసరి ఉర్దూలో పొందుపర్చారు.

1858 జనవరి 22న మొట్టమొదటి సారిగా అండమాను-నికోబారు దీవులలోని పోర్టు బ్లయర్‌లో బ్రిటిష్ పతాకం ఎగిరిన తరువాత అండమాను దీవుల్లోకి ఇతర ప్రాంతాల ప్రజానీకం వలస రావడం పెద్ద ఎత్తున ఆరంభమయ్యింది. ఆ పరిస్థితులలో 1880లో విరచిత గ్రంథంలో తెలుగు ప్రజల భాష గురించి మౌలానా థానేసరి ప్రస్తావించారంటే తెలుగు ప్రజలు ఆంగ్లేయులు అండమానులో అడుగుపెట్టిన 22 ఏండ్లలోనే గణనీయ సంఖ్యలో అండమాను దీవులకు చేరుకున్నట్టు తెలుస్తుంది. ప్రముఖ పండితులు మౌలానా థానేసరి తన గ్రంథంలో తెలుగు భాష గురించి ప్రస్తావించడం పరిగణ లోకి తీసుకుంటే ఈ 22 ఏండ్లలో అండమానులో తెలుగు ప్రజలు మంచి గుర్తింపు కూడా పొందినట్లుగా భావించవచ్చు. Italian of the East గా గౌరవాన్ని సంపాదించుకున్న తెలుగు భాష మాట్లాడు ప్రజలు పెద్ద సంఖ్యలో అండమాను చేరుకోవడం మాత్రమే కాకుండా తమ తెలుగు భాషను పరిరక్షించుకున్న దాఖలా మౌలానా థానేసరి ప్రస్తావనల వలన వెల్లడవుతుంది.

తెలుగు ప్రజలు, తెలుగు భాషకు సంబంధించిన విశేషాలు ఇలా ఉండగా మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి విడుదలకు ఆంగ్ల ప్రభుత్వం పంపిన ఉత్తర్వులు 1882 డిసెంబరు 30 తేదిన అండమానులోని ఆంగ్లేయాధికారులు అందుకున్నారు. ఆ ఉత్తర్వుల మేరకు మౌలానా థానేసరి అండమాను జైలు నుండి విడుదలకు మార్గం సుగమం అయ్యింది. ఆ సమయంలో ఆయతోపాటుగా శిక్ష అనుభవిస్తున్న ఆయన సహధర్మచారిణికి న్యాయస్థానం ఉత్తర్వుల మేరకు విధించబడిన శిక్షాకాలం ఇంకా పూర్తి కాలేదు. ఆ పాటికి ఆమె 14 ఏండ్లు శిక్షాకాలం పూర్తి చేశారు. ఆ కారణంగా 1883 మే ఒకటిన ఆమె విడుదలకు కూడా ఉత్తర్వులు అందాయి. ఆ సమయానికి మౌలానా భార్య ఆరుమాసాల గర్భవతి. ఆ కారణంగా ఆమెకు సముద్రయానం ఆరోగ్యరీత్యా సరికాదనటంలో అండమాను శిక్షాక్షేత్రం

నుండి మౌలానా కుటుంబం విడుదల మరికొంత ఆలశ్యమయ్యింది.

చివరకు ఆ దంపతులకు లభించిన విడుదల ఉత్తర్వులతో 1883 నవంబరు తొమ్మిదిన మౌలానా థానేసరి దంపతులు అండమాను శిక్షాక్షేత్రం నుండి భారత ప్రధాన భూభాగంలోని తమ స్వస్థలానికి బయలు దేరారు. అండమాను శిక్షాక్షేత్రంలో 18 ఏండ్ల శిక్షాకాలం గడిపిన తరువాత భార్యా, పిల్లలతో కలసి మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి స్వగ్రామానికి బయలుదేరి 1883 నవంబరు 13న కలకత్తా చేరారు. అటు తరువాత ఆయన కుటుంబం తమ స్వస్థలం అయినటువంటి అంబాలాకు 1883 నవంబరు 13న చేరుకున్నారు. (The Silent Past of Andamans-Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005. Page.18)

అండమాను శిక్షాక్షేత్రం నుండి స్వస్థలం చేరుకున్న బహుభాషా పండితులు, న్యాయశాస్త్ర పరిజ్ఞానం కలిగి ఉండటం మాత్రమే కాకుండా ఆంగ్ల భాషను కూడా అధ్యయనం చేసి మంచి పట్టు సంపాదించిన మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి విద్వత్తును, అయన గత అనుభవాన్ని గ్రహించిన ఆంగ్లేయాధికారులు ఆయన ప్రతిభాసంపన్నతను వినియోగించుకోడానికి సిద్ధపడ్డారు. ప్రధానంగా మౌలానా థానేసరి బహుభాషా పాండిత్యం, న్యాయశాస్త్ర పరిజ్ఞానం, అండమానులో ఆంగ్ల మీద ఆయన సాధించిన పట్టు, సంక్లిష్ట న్యాయ వ్యవహారాల పరిష్కారంలో ఆయన శక్తియుక్తులను బాగా ఎరిగి ఉన్న ఆంగ్లేయాధికారి Captain Temple మౌలానా థానేసరి పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపారు. ఆ అంగ్లేయుడు మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరికి బ్రిటిష్ ప్రభుత్వంలో మంచి ఉద్యోగ అవకాశం కల్పించాడు. (The Silent Past of Andamans-Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005. Page.18)

ఆ ఉద్యోగం చేసుకుంటూ చివరివరకు రచనా వ్యాసంగంలో మునిగిపోయిన మౌల్వీ ముహమ్మద్ జాఫర్ థానేసరి Tawarik-e-Ajeeb అను గ్రంథం ఉర్దూలో రాసారు. ఈ గ్రంథంలో ఆయన తన అండమాను జైలు అనుభవాలను, అక్కడి ప్రజలు, అక్కడి సమకాలీన పరిస్థితులన్నిటిని సవివరంగా పేర్కొన్నారు. ఈ మేరకు భారతదేశం స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను అభిలషిస్తూ తన జీవిత చరమాంకం గడిపి మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి 1905లో కన్నుమూశారు. ◆

# మౌల్వీ యహ్యా అలీ

ప్రస్తుత బీహార్ రాష్ట్రం రాజధాని పాట్నా కేంద్రంగా ఆంగ్లేయ వలస పాలకులకు వ్యతిరేకంగా ఉధృతంగా సాగిన వహాబీ ఉద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన మౌల్వీ యహ్యా అలీ బీహార్ రాష్ట్రంలోని  పాట్నా (Patna) జిల్లా, మానేర్ (Maner) తహసిల్ లోని సాధిక్‌పూర్ (Sadiqpur) గ్రామంలో 1822లో జన్మించారు. ఆయన తండ్రి సయ్యద్ ఇలాహి బక్ష్. ఆయన సోదరులు మౌలానా అహ్మదుల్లా (1801-1881) కూడా వహాబీ ఉద్యమంలో ప్రముఖ నాయకుడు. మౌల్వీ యహ్యా అలీ పలు భాషా పండితులు. చిన్నతనం నుండి మౌల్వీ యహ్యా అలీ బ్రిటిష్ వ్యతిరేకతను పుణికి పుచ్చుకున్నారు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా, మాతృభూమి విముక్తి లక్ష్యంగా పోరాటాలు సాగిస్తున్న వహాబీ ఉద్యమంలో మౌల్వీ యహ్యా అలీ భాగస్వాములయ్యారు. వహాబీ ఉద్యమాన్ని విస్తరింప చేయాలన్న లక్ష్యంతో, వహాబీలు సాగిస్తున్న పోరాటాలకు ప్రజానీకం మద్దతు సంపాదించేందుకు తన ప్రతిభాపాటవాలను, అద్భుత వాగ్ధాటిని ఉపయోగిస్తూ ప్రచార కార్యక్రమాలను మౌల్వీ యహ్యా అలీ విస్తృతంగా నిర్వహించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా కరపత్రాలు, లేఖలు, గ్రంథాలను కూడా ఆయన స్వయంగా రాసి వెలువరిస్తూ ఆంగ్ల పాలకులకు వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమాలను ముమ్మరంగా నిర్వహించారు. ఆంగ్లేయ

ప్రభుత్వ వ్యతిరేక సాహిత్యాన్ని విరివిగా ప్రజలలో పంపిణీచేశారు. ఒకవైపున వహాబీ ఉద్యమానికి ప్రజల మద్దతు కూడగడుతూ, మరో ప్రక్క ఆంగ్లేయ వ్యతిరేక భావజాలం ప్రజానీకంలో పెంపుదలకు ఆయన కృషి చేశారు. వహాబీ ఉద్యమ భావ ప్రచారంతో మాత్రమే ఆయన సరిపెట్టుకోకుండా ఆంగ్లేయులతో పోరాడుతున్న వహాబీ వీరులకు తొలి నుండి మార్గదర్శకం చేస్తూ అన్ని విధాల తోడ్పాటు అందించారు.

మౌల్వీ యహ్యా అలీ చర్యల మీద దృష్టి సారించిన ఆంగ్ల ప్రభుత్వం ఆయన పట్ల కన్నెర్ర చేసింది. ఆయనను కట్టడి చేయాలని జిల్లా పోలీసు సూపరింటెండెంటు కెప్టన్ పార్సన్ (Captain Parson) కు ఆదేశాలు జారీచేసింది. ఆ ఆదేశాలతో కెప్టన్ పార్సన్ ఆఘమేఘాల మీద వహాబీ యోధుల అరెస్టులకు వ్యూహం పన్నాడు. ఆంగ్ల ప్రభుత్వ చర్యలను, కెప్టన్ పార్సన్ కదలికలను ముందస్తుగా పసిగట్టిన మౌల్వీ యహ్యా అలీ తన సహచరులను హెచ్చరించడం మాత్రమే కాకుండా, 1863-64 ప్రాంతంలో కెప్టన్ పార్సన్ పోలీసు బృందాల కన్నుగప్పి, వారెవ్వరికి పట్టుబడకుండా పాట్నా నుండి అంబాలాకు తప్పుకున్నారు. ఆంగ్ల పోలీసు ఉన్నతాధికారి కెప్టన్ పార్సన్ ఎలాగయినా యాహ్యా అలీని నిర్బంధించాలని పట్టుబట్టి చివరకు అంబాలాలో ఆయనను అరెస్టు చేసాడు. ప్రభుత్వం మౌల్వీ మీద రాజద్రోహం నేరం మోపి స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో సుప్రసిద్ధమయిన 'అంబాలా కుట్ర కేసు-1864' (Ambala Conspiracy Case of 1864) ను బనాయించింది.

'అంబాలా కుట్ర కేసు-1864' ను క్రిందికోర్టు విచారించి సెషన్స్ కోర్టుకు (Session Court) పంపేంత వరకు మౌల్వీ యాహ్యా అలీని ఎవ్వరితో మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా కట్టుదిట్టమయిన ఏకాంతంలో (Solitary Confinment) ఉంచారు. 'అంబాలా కుట్ర కేసు-1864' విచారణ జరుగుతున్న సమయంలో మౌల్వీ యహ్యా అలీ ఎంతో ప్రశాంతంగా, ఏమాత్రం వ్యాకులతకు గురికాకుండా ఉండటం గమనించిన ఆంగ్లేయ ఉన్నతాధికారులు ఆయన నిబ్బరానికి ఆశ్చర్యపోయారు. చివరకు ఇది ఎలా సాధ్యమని అధికారులు ఆయనను ప్రశ్నించారు.

ఆ ప్రశ్నకు సమాధానంగా, 'I do not care whenever and wherever I am killed: finally I shall go to Almighty God, everything is in the hands of Almighty God either to give success to his creatures or to smash them' (The Silent Past of Andamans-Few Freedom Fighters of 1857, M. Ahmad Mujtaba, Port Blair, 2005, Page.20) అని ప్రసన్నవదనంతో మౌల్వీ యాహ్యా అలీ వివరించడంతో మరోమారు అబ్బుర పడటం ఆంగ్లేయాధికారుల వంతయ్యింది.

చివరకు 'అంబాలా కుట్ర కేసు–1864' (Ambala Conspiracy Case of 1864) Major Herbert Edward నేతృత్వంలోని జిల్లా సెషన్స్ కోర్టుకు చేరుకుంది. సుదీర్ఘ విచారణలో ఇరుపక్షాల వాదోపవాదనలు విన్న తరువాత 1864 మే రెండున మౌల్వీ యహ్యా అలీకి ఉరిశిక్ష విధిస్తూ న్యాయస్థానం తీర్పు ప్రకటించింది. ఆంగ్ల న్యాయస్థానం ఉరిశిక్ష ప్రకటించిన రెండవ రోజున కూడా మౌల్వీ యహ్యా అలీ రోజు మాదిరిగా తనకు అప్పగించిన రోజువారి కార్యక్రమాలను ఆయన యథాలాపంగా చేసుక పోసాగారు. ఆంగ్ల న్యాయస్థానం తనకు ఉరిశిక్ష విధిస్తూ ప్రకటించిన తీర్పు గురించి ఏమాత్రం కలవరపడని మౌల్వీ యహ్యా అలీ ఎటువంటి ఉద్రిక్తతకు లోను కాకుండా ఏమీ జరగనట్టు నిశ్చింతగా ఉండటం మాత్రమే కాకుండా రోజు మాదిరి ఎప్పటిలాగే ఉత్సాహం కనపర్చటం గమనించిన ఆంగ్లేయాధికారులు ఆశ్చర్యచకితులయ్యారు.

మౌల్వీ యహ్యా అలీని నేరస్తుడిగా ప్రకటించి ఆయనకు ఉరిశిక్ష విధించి ఆ శిక్షను అమలు జరపాల్సిందిగా న్యాయస్థానం ఇచ్చిన ఆదేశాల మేరకు అంబాలా జైలులో అధికారులు ఆయనను ఉరి తీయడానికి ఏర్పాట్లు కూడా ఆరంభించారు. మౌలానా యహ్యా అలీ పట్ల ఆగ్రహంతో ఉన్న ఆంగ్లేయాధికారులు, భయం గొలుపు ఉరిశిక్ష ఆలోచనలు చుట్టుముట్టగల Execution Cell లో ఆయనను ఏకాకిగా నిర్బంధించారు. ఉరిశిక్ష ఏర్పాటు తతంగం అంతా మౌల్వీ యహ్యా అలీ, ఆయన సహచరుల కళ్ళ ఎదుటనే జరుగుతున్నా Execution Cell నుండి అంతా గమనిస్తూ కూడా మౌలానా అలీ ఏమీ జరగనట్టు ప్రశాంత వదనంతో ఉండడాన్ని అంగ్లేయాధికారులు ఏమాత్రం జీర్ణం చేసుకోలేక పోయారు. అంబాలా సెషన్స్ కోర్టు తీర్పును కాదంటూ ఉన్నత న్యాయస్థానం తీర్పులు వచ్చేంత వరకు యహ్యా అలీ 02–05–1864 నుండి 16–09–1864 వరకు ఆ Excution Cell లో నాలుగు మాసాలు గడపవలసి వచ్చింది. అంతకాలం గడిచినా మౌలానా యహ్యా అలీ లేశమైనా ఆవేదన వ్యక్తంచేయకుండా గడపటం ఆంగ్లేయులకు ఏమాత్రం అర్థం కాలేదు.

అంబాలా సెషన్స్ కోర్టు తీర్పు మీద మౌల్వీ యహ్యా అలీ, ఆయన సహచరులు ఉన్నత న్యాయస్థానంలో (Chief Court) అప్పీలు చేశారు. ఆ అప్పీలు మీద ఉన్నత న్యాయస్థానం అంబాలా కోర్టు తీర్పు తీవ్రతను తగ్గిస్తూ మౌలానా యహ్యా అలీకి విధించిన ఉరిశిక్షను కాస్తా యావజ్జీవిత కారాగారవాస శిక్షగా మార్చింది. ఆ తీర్పు విషయాన్ని జైలు అధికారులు మౌలానాను నిర్బంధించి ఉంచిన Execution Cell కు వచ్చి 1864 సెప్టెంబర్ 16న తెలిపారు. ఆ సమయంలో కూడా మౌలానా యహ్యా అలీ చాలా స్థిరచిత్తంతో నిర్వికారంగా ఉండటం ఆంగ్లేయాధికారులకు అమితాశ్చర్యం కలిగించింది.

ఆ తరువాత ఉన్నత న్యాయస్థానం తీర్పు మేరకు మౌల్వీ యహ్యా అలీ, ఆయన సహచరులను అండమాను శిక్షాక్షేత్రానికి పంపేందుకు అధికారులు ఏర్పాట్లు ఆరంభించారు. ఆ క్రమంలో సెప్టెంబర్ 1864-65 ఫిబ్రవరి వరకు అంబాలాలో జైలులో గడిపిన మౌలానాకు బందిఖానాలోని ఏకాంత వాసం (Solitary Confinement) నుండి విముక్తి లభించింది. 1865 ఫిబ్రవరి మాసంలో అంబాలా జైలు నుండి ఆయనను తొలుత లాహోరుకు తరలించారు. అటు నుండి ముల్తాన్, పఠాన్ ఘాట్, కోట్లి, కరాచి తదితర జైళ్ళకు తరలిస్తూ చివరకు బొంబాయి రప్పించారు. అక్కడ థానా జైలులో కొంతకాలం ఉంచిన తరువాత 1865 డిసెంబరు ఎనిమిదిన బొంబాయి నుండి బయలుదేరిన యస్, యస్. జమున (SS Jamuna) అను ప్రయాణీకుల ఓడ ద్వారా మౌల్వీ యహ్యా అలీని అండమానుకు తరలించారు.

ఆ యస్,యస్ జమున ప్రయాణీకుల ఓడ సముద్ర జలాలలో 34 రోజుల పాటు ప్రయాణం చేసి 1866 జనవరి 11న అండమాను శిక్షాక్షేత్రం చేరుకుంది. మౌలానా యహ్యా అలీని ఇతర ప్రముఖులతోపాటు అండమాను లోని రోజ్‌ల్యాండ్ (Rose Island) లో నివాసం ఉంటున్న మున్షీ గులాం నబీ ఇంటికి పంపారు. మున్షీ గులాం నబీ ఇంట మౌల్వీ యహ్యా అలీ తన సోదరులు, వహాబీ ఉద్యమ నాయకులు మౌలానా అహ్మదుల్లాహ్ ని కలుసుకున్నారు. ఆ తరువాత గులాం నబీ, మౌలానా అహ్మదుల్లాహ్ తదితరులతో కలసి మౌల్వీ యహ్యా అలీ రోజ్ ల్యాండ్‌లో ఉండేందుకు ఆంగ్లేయాధికారులు అనుమతించారు.

మంచి పాండితీ ప్రకర్ష మాత్రమే కాకుండా పలు భాషాకోవిదుడు, ప్రజా సంబంధాలలో మంచి అనుభవం కలిగిన ప్రముఖ వహాబీ ఉద్యమకారుడిగా ఖ్యాతిగాంచిన మౌల్వీ యహ్యా అలీ అండమాను శిక్షాక్షేత్రంలో ఇటు ఆంగ్లేయాధికారులకు, అటు స్వదేశీ పోరాట యోధులకు అవసరమగు భాషా, సాహిత్య సేవలను అందించారు. అండమాను శిక్షాక్షేత్రంలో ఆంక్షలతో కూడిన నిర్బంధ జీవితాన్ని ఆరంభించిన మౌల్వీ యహ్యా అలీ తన 46 ఏండ్ల వయస్సులో 1868 ఫిబ్రవరి 20న అండమాను దీవులలోని రోజ్ ఐలాండ్ కన్నుమూసారు. అండమానులోని అబెర్‌దీన్ (Aberdeen) లో ప్రముఖ పండితులు, వహాబీ ఉద్యమకారులు మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేసరి మార్గదర్శకంలో స్వదేశీ యోధులంతా పాల్గొని మౌల్వీ యహ్యా అలీ అంత్యక్రియలను నిర్వహించి, ఆ యోధునికి అంతిమ వీడ్కోలు పలికారు. ◆



# అలీ అహ్మద్ సిద్దీఖీ

**మా**తృభూమికి ఆంగ్లేయ పాలకుల నుండి విముక్తి సాయుధ పోరాటం ద్వారా మాత్రమే సాధ్యమన్న నమ్మకంతో రంగం మీదకు వచ్చిన 'గదర్ ఉద్యమం'లో అలీ అహ్మద్ సిద్ధీఖీ (Ali Ahmed Siddiqui) భాగస్వామి. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఫైజాబాద్ (Faizabad) జిల్లా, అక్బర్‌పురా (Akbarpura) పోలీసు స్టేషన్ పరిధిలోని షహజాద్‌పూర్‌లో (Shahajadpur) లో ఆయన జన్మించారు. ఆయన తండ్రి పేరు ఖుర్బాన్ అలీ పఠాన్ (Qurban Ali Pathan). చిన్న వయస్సులో బ్రతుకు దెరువు కోసం అలీ అహ్మద్ సిద్ధీఖీ ఇతర దేశాలకు తరలి వెళ్ళారు.

ఆంగ్లేయుల నుండి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల సాధన కోసం సాయుధ పోరాటం లక్ష్యంగా విదేశాల నుండి ముమ్మరంగా ప్రయత్నాలు చేస్తున్న 'గదర్ పార్టీ'లో అలీ అహమ్మద్ చేరారు. ప్రథమ ప్రపంచ యుద్ధం సందర్భంగా భారతీయ విప్లవకారులకు, విప్లవ సంస్థలకు లభించిన సానుకూల అంతర్జాతీయ రాజకీయ వాతావరణాన్ని పూర్తిగా వినియోగించుకుని బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఇంటా-బయటా పూర్తి ప్రతికూలత రగిలించాలని 'గదర్ పార్టీ' నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు ప్రజలలో, బ్రిటిష్ భారత సైన్యంలోని స్వదేశీ సైనికులలో జాతీయ భావాలను పురికొల్పి బ్రిటన్‌కు వ్యతిరేకంగా, తిరుగుబాటు దిశగా ముందుకు

నడపాలని గదర్ పార్టీ తీర్మానించింది. ఆ తీర్మానం మేరకు బ్రిటిష్ భారత సైన్యాలు బ్రిటన్ పక్షాన ప్రపంచ యుద్ధంలో ఎక్కడెక్కడ పాల్గొంటున్నారో ఆయా ప్రాంతాలకు గదర్ పార్టీ తన కార్యకర్తలను పంపించింది. ఆ విధంగా గదర్ పార్టీ కార్యకర్తగా మనిలా-ఫిలిపైన్స్‌ల నుండి విచ్చేసిన అలీ అహ్మద్ సిద్ధిఖీ, ఆయన సహచరులు 1915 లో బాంకాక్ నుండి బర్మా చేరుకుని బర్మా కార్యక్షేత్రంగా తమ కార్యక్రమాలను ముమ్మరం చేశారు.

బ్రిటిష్ సైన్యంలోని భారతీయులు ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలను ఉల్లంఘించి, బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా సాగుతున్న సాయుధ పోరాటంలో పాల్గొనాల్సిందిగా ప్రజలను, ఉద్యమకారులను కోరుతూ అలీ అహమ్మద్ బర్మాలో ప్రచార కార్యక్రమాలను ముమ్మరం చేశారు. గదర్ సాహిత్యాన్ని ప్రజలలో, భారతీయ సైనికులలో పంపిణీ చేయడం, స్వదేశీ భావజాలం, ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక ఆలోచనలు గల భారతీయ సైనికులను, అధికారులను గుర్తించడం, వారితో వ్యక్తిగతంగా పరిచయాలు ఏర్పాటు చేసుకోవడం లాంటి కార్యకలాపాలను అలీ అహ్మద్ రహస్యంగా సమర్ధవంతంగా చేపట్టారు.

భారతీయ సైనికులను తిరుగుబాటుకు ప్రోత్సహిస్తున్న గదర్ యోధులను గుర్తించిన ఆంగ్ల ప్రభుత్వాధికారుల ముమ్మర ప్రయత్నాల ఫలితంగా 1915 ఏప్రిల్ మాసంలో గదర్ యోధుల రహస్యాలు బట్టబయలయ్యాయి. ఆ కారణంగా గదర్ యోధులు, వారి ద్వారా ప్రభావితులైన భారతీయ సైనికులు పెద్ద సంఖ్యలో అరెస్టుకు గురయ్యారు. బ్రిటిష్ రాణికి వ్యతిరేకంగా రాజద్రోహానికి పాల్పడ్డారన్న నేరారోపణల మీద గదర్ యోధులు అలీ అహమ్మద్ సిద్ధిఖీ, ఫియాన్ అలీ, ముజ్తబా హుసైన్ తదితరుల మీద కేసు నమోదయ్యింది. ఆ కేసు 'ద్వితీయ మాండలే కుట్ర కేసు' ('Second Mandalay Conspiracy'Case) గా పేర్గాంచింది.

ఈ చారిత్రాత్మక 'ద్వితీయ మాండలే కుట్ర కేసు'ను విచారించిన ఆంగ్ల న్యాయస్థానం 1917 జూలై ఆరున అలీ అహమ్మద్ సిద్ధిఖీ తదితరులకు మరణ దండన విధించింది. ఆ తీర్పు మీద ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేయగా, ఆ న్యాయస్థానం క్రింది కోర్టు విధించిన మరణ దండనను కాస్తా యావజ్జీవిత కారాగారవాసంగా మార్చింది. ఆ తీర్పు మేరకు గదర్ యోధులు అలీ అహమ్మద్ సిద్ధిఖీని తొలుత బర్మాలోని మాండలే జైలు (Mandalay Jail) కు పంపారు. ఆ తరువాత 1918 ఫిబ్రవరి 11న మాండలే జైలు నుండి అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించారు. అనంతరం ఆంగ్ల ప్రభుత్వ నిర్ణయం మేరకు అండమాను శిక్షాక్షేత్రం నుండి విముక్తి పొందిన అలీ అహమ్మద్ సిద్ధిఖీ 1921లో స్వస్థలం చేరుకున్నారు.◆

# మెహరుద్దీన్

పంజాబ్ రాష్ట్రం నివాసి మెహరుద్దీన్ (Meharuddin). ఆయన తండ్రి పేరు మండూహ్ (Mandooh). ఆంగ్ల ప్రభుత్వ రాక్షస కృత్యాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న భారత జాతీయోద్యమకారులతో కలసి ఆంగ్లేయ అధికారుల చర్యలను నిరసిస్తూ మెహరుద్దీన్ ఉద్యమించారు. మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ఆకాంక్షిస్తూ ఉద్యమిస్తున్న భారతీయులను అణగద్రొక్కాలన్న లక్ష్యంతో 1919లో ఆంగ్ల ప్రభుత్వం రౌలట్ చట్టం (Rowlatt Act of 1919) అను ఒక రాక్షస చట్టం తెచ్చింది. ఆ చట్టాన్ని ఆసరా చేసుకుని రెచ్చిపోయిన ఆంగ్లేయాధికారులు ప్రజల పట్ల ప్రధానంగా జాతీయోద్యమకారుల పట్ల అత్యంత కిరాతకంగా వ్యవహరించ సాగారు. సమరశీల యోధులైన పంజాబ్ రాష్ట్ర బిడ్డలను అణచి వేయడానికి కిరాతక శిక్షలను బహిరంగంగా అమలు పర్చుతూ ఆంగ్ల ప్రభుత్వం అమానవీయంగా వ్యవహరించ సాగింది.

ఆంగ్లేయాధికారుల దాష్టీకాల పట్ల ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ (Dr. Saifuddeen Kichulu), డాక్టర్ సత్యపాల్ (Dr. Satyapal) మండి పడ్డారు. ఆంగ్ల ప్రభుత్వం, ఆంగ్లేయాధికారుల చర్యలను తీవ్రంగా నిరశిస్తూ ఉద్యమించారు.

ఆగ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం నిరంకుశంగా వ్యవహరిస్తూ భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు, జాతీయోద్యమకారులు డాక్టర్ కిచ్లూ, డాక్టర్ పాల్‌లను నిర్బంధించింది. ఆ నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలు, ఉద్యమకారులు ఉద్యమించారు.

ఆంగ్ల ప్రభుత్వం పట్ల వ్యక్తం అవుతున్న ప్రజాగ్రహానికి తగిన రూపం కల్పించాలని జాతీయోద్యమ నేతలు నిర్ణయించారు. అమృతసర్-లాహోర్ ప్రధాన కార్యక్షేత్రాలుగా చేసుకుని విప్లవిస్తున్న నాయకులు డాక్టర్ కిచ్లూ, డాక్టర్ పాల్‌ల అరెస్టు పట్ల ఆగ్రహిస్తూ ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక చర్యలకు పూనుకున్నారు. ఆ చర్యలలో భాగంగా ఒక పటిష్టమయిన పథకాన్ని రూపొందించారు. ఆ పథకం అమలు చేయడానికి 1919 ఏప్రిల్ 10 తేదీని ఎంచుకున్నారు. ఆ రోజున లాహోర్, అమృతసర్ నగరాల్లో ప్రత్యేక చర్యలకు పూనుకోవాలని నిర్ణయాలు తీసుకున్నారు. ఆ నిర్ణయం మేరకు తమ కార్యాచరణకు తొలుత అమృతసర్ ను ప్రధాన కార్యక్షేత్రం చేసుకుని ఆంగ్ల ప్రభుత్వ చర్యలకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనను అమృతసర్‌లో ఆరంభించారు. ఆ నిరసన ప్రదర్శనలో పెద్ద సంఖ్యలో పాల్గొన్న ప్రజల తోపాటుగా విప్లవకారులు కూడా పాల్గొన్నారు.

1919 ఏప్రిల్ 10న అమృతసర్‌లో ఆరంభమైన ఆ భారీ ప్రజాప్రదర్శన అమృతసర్ రైల్వే స్టేషన్ దిశగా సాగింది. ఆ ప్రదర్శన సందర్భంగా కోపోద్రిక్తులయిన ప్రజలు రైల్వే పార్శిల్ కార్యాలయం చేరుకుని స్టోర్ రూంను చుట్టుముట్టగా పోలీసులు లాఠీచార్జీ చేశారు. అందుకు ఆగ్రహించిన నిరసనోద్యమకారులు ప్రతీకార చర్యలకు పాల్పడ్డారు. ఆ సంఘటనలలో మాజీ సైనికాధికారి, రైల్వే పార్శిల్ ఆఫీసు అధికారి కోబిన్‌సన్ (Kobinson) మరణించాడు. ప్రజాగ్రహాన్ని అడ్డుకోడానికి స్టేషన్ మాస్టారు, ఇతర అధికారులు విఫల ప్రయత్నం చేశారు. ఆ ప్రజా సమూహం విజృంభించి ఒక్కమ్మడిగా రైల్వేస్టేషన్ మీద విరుచుకపడి పార్శిల్ ఆఫీసుకు నిప్పు పెట్టింది.

ఆ సమయంలో బ్రిటిష్ భారత సైన్యంలోని గూర్ఖా సైనిక దళం ఒకటి సంఘటన స్థలానికి చేరుకుంది. ప్రజలను ఆపడానికి ప్రయత్నిస్తూ, విప్లవకారుల మీద కాల్పులు జరుపుతూ ఇటు ప్రజలను, అటు విప్లవకారులను నియంత్రించడానికి విఫల ప్రయత్నాలు చేసింది. ఆపాటికి రైల్వేస్టేషన్ ధ్వంసమయ్యింది. అటు తరువాత ప్రజలు, విప్లవకారులు టెలిఫోన్, టెలిగ్రాఫ్ వ్యవస్థ మీద దృష్టిసారించి ఆ పరికరాలను, రైల్వే లైన్లను కూడా ధ్వంసం చేశారు. ఈ సంఘటనలు ఇలా సాగుతుండగా పఠాన్‌కోట్, జలంధర్ వద్ద కూడా విప్లవకారులు దాడులు జరిపారు. రైల్వే స్టేషన్‌లోని స్లీపర్ రైళ్ళను తగులబెట్టారు. ఆ కారణంగా అటు-ఇటు రెండువైపుల రైళ్ల రాకపోకలు ఆగిపోయాయి.



పంజాబు ప్రజల మీద రౌలట్ చట్టం ద్వారా సాగిన అకృత్యాలు, బహిరంగ శిక్షలు.

ప్రజాసమూహానికి, విప్లవకారులకు ఆగ్రహం పెల్లుబికింది. అక్కడ రైల్వే స్టేషన్ సమీపాన గల నేషనల్ బ్యాంకు (National Bank), చార్టర్డ్ బ్యాంకు (Chartered Bank), అలియన్స్ బ్యాంకు (Alliance Bank) ల మీద ప్రజల, ఉద్యమకారుల దృష్టి పడింది. నేషనల్ బ్యాంకులోని స్టీవార్ట్ (Stewart), స్కాట్ (Scott) అను బ్యాంకు ఉద్యోగుల మీద దాడి జరిగింది. పర్యసానంగా ఆ ఇరువురు మృత్యువాత పడ్డారు. అనంతరం చార్టర్డ్ బ్యాంకు, అలియన్స్ బ్యాంకుల మీద దాడిచేసి ఆ రెండు బ్యాంకులకు తీవ్ర నష్టం కలిగించారు. ఆ సందర్భంగా చార్టర్డ్ బ్యాంకు అధికారి థామస్ (Thomas) చంపబడ్డాడు. ఈ విధంగా అమృతసర్‌లో వ్యక్తమయిన ప్రజాగ్రహం సాయంసమయానికి గాని చల్లబడలేదు.

ఆంగ్ల ప్రభుత్వ పోలీసుల, సైనికుల జాడ కూడా కన్పించని అమృతసర్ పట్టణంలో ఉద్యమకారులు సాయంత్రం ఆరు గంటల వరకు పూర్తి స్థాయిలో వీరవిహారం చేశారు. ఆ తరువాత వేర్వేరు చిన్న చిన్న దళాలుగా విప్లవకారులు విడిపోయి పలు ప్రాంతాలకు విస్తరించారు. ఆలోగా టెలిఫోన్, టెలిగ్రాఫ్ సదుపాయాలు చక్కబడటం, రైల్వే లైనులు పునరుద్ధరించడం వలన ఆంగ్లేయాధికారులు, ఆంగ్ల సైన్యాధికారులు సమాచారం అందుకుని శాంతి భద్రతల పునరుద్ధరణకు పూనుకున్నారు. అనుమానితుల జాబితా తయారయ్యింది.

ఈ సంఘటనలో అత్యంత ధైర్యసాహసాలతో పాల్గొన్న విప్లవయోధుల వివరాలు ఆంగ్లేయాధికారులకు అందాయి. ఆ వివరాల మేరకు ఉద్యమకారుల అరెస్టుల కోసం భారీ స్థాయిలో వేట ఆరంభమయ్యింది.

చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయిన ఈ సంఘటనలో పాల్గొన్న పలువురిని ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించింది. ఆ విధంగా నిర్బంధానికి గురయిన వారిలో ఆంగ్ల ప్రభుత్వంతో సాయుధపోరాటం చేస్తున్న విప్లవకారులు మెహరుద్దీన్ తోపాటుగా దీనా (Deena), కరంచంద్ (Karamchand), మనోహర్ సింగ్ (Manohar Singh), సాధిఖ్ (Sadikh), మొహమ్మది (Mohammadi), సంధి (Sandhi), జమాలుద్దీన్ (Jalaluddin), జయరాం సింగ్ (Jayram Singh) తదితరులు ఉన్నారు'. (Ex-Andaman Political Prisoners Fraternity Circle అధ్యక్షులుగా పనిచేసిన Mr Anup Dasguptha బెంగాలీ భాషలో 'Cellular Jail, E. Nirbasitg Biplobidder Katha' శీర్షికన రచించిన పుస్తకం Shishu Sahitya Samsad Pvt Ltd., Kolkata ద్వారా 2016 లో ప్రచురితమయ్యింది. ఆ పుస్తకం 'An Account of Revolutionaries Detained in Cellular Jail' శీర్షికన ఆంగ్లంలో అనువదించ బడింది. ఆ అముద్రిత గ్రంథం నుండి సేకరించిన వివరాలివి.)

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు (Amritsar National Bank Action Case) గా సుప్రసిద్ధమయిన ఈ సంఘటనలో ఆంగ్ల ప్రభుత్వం మెహరుద్దీన్ ను నిందితుడిగా పేర్కొంది. ఆ తరువాత పంజాబు మార్షల్ లా కేసు-75 (Punjab Marshal Law Case-76) లో ఆయనను నిందితునిగా పేర్కొంటూ కేసు నమోదు చేసింది. ఆ కేసు విచారణ తరువాత భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మెహరుద్దీన్ కు తొలుత మరణదండన విధిస్తూ 1919 జూన్ 2న ఆంగ్ల న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ తరువాత మరణదండనను ఆంగ్ల ప్రభుత్వం యావజ్జీవిత కారాగారశిక్షగా మార్చింది. ఆ విధంగా మార్చిన ఉత్తర్వుల మేరకు ఆంగ్లేయాధికారులు ఆయనను అండమానులోని సెల్యులర్ జైలుకు తరలించారు. అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలులో 'అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసు'తో విఖ్యాతుడయిన మెహరుద్దీన్ 'ఖైది నం.43339' (Prisoner No.43339) గా పరిగణించబడ్డారు. ఆ తరువాత 1921 నాటి పరిణామాల వలన ఆంగ్ల ప్రభుత్వం జాతీయోద్యమకారులు మెహరుద్దీన్ ను అండమాను శిక్షాక్షేత్రం నుండి భారత ప్రధాన భూభాగంలోని జైలుకు తరలించింది.◆

# అబ్దుల్ ఖాదిర్ చౌధురి

అప్పటి బెంగాల్ పరగణా ప్రాంతంలోని, ఇప్పటి బంగ్లాదేశ్ లోని రాజాషాహి (Rajshahi) డివిజన్‌లోని బోగ్రా (Bogra) జిల్లాకు చెందిన ఖేత్‌లాల్ (Khetlal) ప్రాంతంలోని కాంతాహార్ (Kantahar) గ్రామం నివాసి అబ్దుల్ ఖాదిర్ చౌధురి (Abdul Qadir Chaudhury) 1901 నవంబరు 10న జన్మించారు. ఆయన తండ్రి మౌల్వీ అబ్దుల్ లతీఫ్ చౌధురి. తండ్రి బహుభాషల్లో ప్రతిభాపాటవాలను చూపిన పండితుడు. ఆ పండితుడి కుమారుడు అబ్దుల్ ఖాదిర్ చౌధురి ప్రస్తుత బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలోని 'ఢాకా వైద్య కళాశాల'లో (Dhaka Medical School) వైద్యశాస్త్రం అభ్యసించారు.

ఆంగ్లేయులను మాతృభూమి నుండి తరిమివేయాలన్న లక్ష్యంతో సాగుతున్న జాతీయోద్యమంలో అబ్దుల్ ఖాదిర్ చౌధురి చురుగ్గా పాల్గొన్నారు. ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమంలో క్రియాశీలక పాత్రను నిర్వహించిన ఆయనను ఆంగ్ల ప్రభుత్వం నిర్బంధించి కటకటాల పాల్జేసింది. పలు నేరారోపణలతో ఆయనను ఆంగ్ల న్యాయస్థానం ముందు నిలబెట్టింది. విచారణ తంతు జరిపిన న్యాయస్థానం ఆయనకు మూడు వందల రూపాయల జరిమానా విధించింది. మూడు వందల రూపాయల జరిమానా చెల్లింపుకు అబ్దుల్ ఖాదిర్ చౌదరి నిరాకరించారు. ఆ కారణంగా ఆయన వైద్యశాలను ఆంగ్లేయాధికారులు జప్తు చేశారు.

ఆ తరువాత కూడా అబ్దుల్ ఖాదిర్ చౌధురి అన్ని కష్టనష్టాలను భరిస్తూ జాతీయోద్యమంలో చురుగ్గా పాల్గొంటూ వచ్చినందున ఆయన పలుమార్లు ఆంగ్ల పోలీసుల దాష్టీకానికి, కారాగార శిక్షలకు గురయ్యారు.

ఖిలాఫత్–సహాయనిరాకరణ ఉద్యమం తరువాత భారత రాజకీయ క్షేత్రంలో పలు మార్పులు వచ్చాయి. ఆ కారణంగా ఆంగ్లేయులను మాతృభూమి నుండి వెళ్ళగొట్టేందుకు సాయుధపోరాట మార్గం మాత్రమే బలమైన ఆయుధంగా భావించిన అబ్దుల్ ఖాదిర్ చౌధురి విప్లవోద్యమాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆ క్రమంలో బెంగాలు కార్యక్షేత్రంగా విప్లవోద్యమాన్ని నడుపుతున్న 'అనుశీలన సమితి' సభ్యత్వం చేబట్టిన అబ్దుల్ ఖాదిర్ విప్లవోద్యమంలో ప్రధాన భాగస్వాములయ్యారు.

ఆంగ్ల ప్రభుత్వం మీద సాయుధ పోరాటం చేస్తున్న విప్లవకారులకు ఆయుధాలు అవసరమయ్యాయి. ఆయుధాల సమకూర్చుకునేందుకు అవసరమైన ధనాన్ని రాబట్టేందుకు ప్రభుత్వ సంస్థల ఖజానా మీద విప్లవకారులు దృష్టి సారించారు. ఆ క్రమంలో దినజ్‌పూర్ (Dinajpur) ప్రాంతంలోని తపాలాశాఖ నుండి ఇతర ప్రాంతాలకు తరలిస్తున్న ప్రభుత్వ ఖజానా సొమ్ము మీద విప్లవకారుల దృష్టి పడింది. ప్రభుత్వ ఖజానా తరలింపు సమయంలో దాడి జరిపి ప్రభుత్వ ధనాన్ని కొల్లగొట్టాలని విప్లవోద్యమ నాయకులు నిర్ణయించారు. ఆ నిర్ణయం మేరకు బలూర్‌ఘాట్ (Balurghat) మరియు హిల్లీ (Hilly) వెడుతున్న డార్జిలింగ్ మెయిల్ (Darjeeling Mail) రైలులో తరలిస్తున్న ప్రభుత్వ ధనాన్ని స్వాధీనం చేసుకునేందుకు విప్లవకారులు తర్జన–భర్జనలు జరిపి ఒక పథకం రూపొందించారు.

ఆ పథకం ప్రకారంగా 1933 అక్టోబర్ 28న హిల్లీ వెడుతున్న డార్జిలింగ్ మెయిల్ రైలు మీద విప్లవకారులు సాహసోపేత దాడి జరిపారు. ఆ రైలులో తపాలాశాఖకు చెందిన నగదు సంచులను తపాలా శాఖ ఉద్యోగి కాళీచరణ్ మహాలి తీసుకుంటుండగా సాయుధులైన విప్లవకారులు ఆకస్మికంగా దాడి చేశారు. ఆ సందర్భంగా జరిగిన పెనుగులాటలో కాల్పులు కూడా జరిగాయి. ఆ కాల్పుల కారణంగా తపాలాశాఖ ఉద్యోగి కాళీచరణ్ తీవ్రంగా గాయపడ్డాడు. ఆ తరువాత అక్టోబర్ 29న కలకత్తాలో కన్నుమూసాడు. ఆ సంఘటనలో విప్లవకారులు తపాలాశాఖకు చెందిన నగదు సంచులను స్వాధీనం చేసుకున్నారు. ఆ తరువాత రైల్వేస్టేషన్‌లో ప్రభుత్వ ధనాన్ని దాచిపెట్టిన ఇనుప పెట్టె (Iron Chest) ను కూడా పగుల గొట్టారు. ఆ Iron Chest ఉన్న నగదును కూడా విప్లవకారుల దళం స్వాధీనం చేసుకుంది. ఈ సంఘటన 'హిల్లీ రైల్వే స్టేషన్ రైడ్ యాక్షన్ ప్లాన్' (Hilly Railway Station Raid

Action Plan) గా సుప్రసిద్ధమయ్యింది. విప్లవకారుల దళం ఈ దాడి విజయవంతం కావడంతో తపాలాశాఖ సొమ్ము, రైల్వేస్టేషన్ నగదు పెట్టెలోని నగదు మొత్తం మీద 2,900 రూపాయలను కాకుండా మరో 400 రూపాయల విలువగల Insured కవర్లను కూడా విప్లవకారులు సొంతం చేసుకున్నారు.

ఆ అనూహ్య చర్యతో ఉలిక్కిపడిన ఆంగ్ల ప్రభుత్వం ఈ సంఘటనలో పాల్గొన్న విప్లవకారులను, వారికి సహకరించిన ఇతరులను గుర్తుపట్టి వారి కోసం భారీ ఎత్తున వేట సాగించింది. ఆంగ్లేయ ప్రభుత్వానికి చిక్కకుండా పలు మాసాల పాటు విప్లవకారులు రహస్యంగా గడిపిన తరువాత సంఘటనలో పాల్గొన్న విప్లవకారులు అంతా పట్టుబడ్డారు. అబ్దుల్ ఖాదిర్ చౌధురితోపాటుగా ఆయన సహచరులు ప్రాణకృష్ణ చక్రవర్తి (Pran Krishna Chakraborty), హృషికేష్ భట్టాచార్య (Hrishikesh Bhattacharyya), సోరజ్ కుమార్ బసు (Soroj Kumar Basu), సత్యవ్రత చక్రవర్తి (Satyabrata Chakraborty), ప్రఫుల్ల కుమార్ సన్యాల్ (Profulla Kumar Shyanal), కిరణ్ చంద్ర దేవ్ (Kiran Chandra Dey), హరిపాద బసు (Haripada Basu), రామకృష్ణ సర్కార్ (Ram Krishna Sarkar) ఉన్నారు. ఈ యోధుల మీద ప్రభుత్వ ఖజానా దోపిడి, హత్య తదితర నేరాలను ఆంగ్ల ప్రభుత్వం నమోదు చేసింది.

ఆ సంఘటన కాస్తా 'హిల్లీ రైల్వే స్టేషన్ రైడ్ యాక్షన్ ప్లాన్' గా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో సుప్రసిద్ధమయ్యింది. ఈ కేసు విచారణకు దినజ్‌పూర్ (Dinajpur) కార్యక్షేత్రంగా ప్రత్యేక ట్రిబ్యునల్ (Special Tribunal) ఏర్పాటయ్యింది. ఆ కేసు విచారణ 1934 ఫిబ్రవరి 17 నుండి 1934 సెప్టంబర్ ఆరు వరకు జరిగింది. ఈ సంఘటనలోని నిందితులలో అలోకరంజన్ దార్ (Alokranjan Dar), ససధర్ సర్కార్ (Sasadhar Sarkar), లాలూ పాండే (Laloo Pandy) లు విచారణ ప్రారంభంలోనే తమ నేరాన్ని అంగీకరిస్తూ సంఘటన సంబంధించిన వివరాలన్నీ పూసగుచ్చినట్టు బయటపెట్టారు.

ఆ తరువాత విచారణ పూర్తి చేసిన Special Tribunal 'హిల్లీ రైల్వే స్టేషన్ రైడ్ యాక్షన్' లో పాల్గొన్న విప్లవకారులకు ఐదు సంవత్సరాల నుండి పది సంవత్సరాల కఠిన కారాగార శిక్షను, మరణ దండనను విధిస్తూ 1934 ఫిబ్రబరి 27న తీర్పు చెప్పింది. ఆ తీర్పు మీద విప్లవకారులు ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేశారు. ఆ విచారణలో ఉన్నత న్యాయస్థానం క్రింది కోర్టు విధించిన శిక్షలను తగ్గిస్తూ తన తీర్పు ప్రకటించింది. ఆ తీర్పు ప్రకారంగా కేసులోని కొందరిని భారత ప్రధాన భూభాగంలోని స్థానిక జైళ్ళకు పంపగా మరికొందరిని అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యూలర్ జైలుకు తరలించారు. (Ex-Andaman

Political Prisoners Fraternity Circle అధ్యక్షులుగా పనిచేసిన Mr Anup Dasguptha బెంగాలి భాషలో Cellular Jail, E. Nirbasitg Biplobidder Katha శీర్షికన రచించిన పుస్తకం Shishu Sahitya Samsad Pvt Ltd., Kolkata ద్వారా 2016 లో ప్రచురితమయ్యింది. ఆ పుస్తకం An Account of Revolutionaries Detained in Cellular Jail శీర్షికన ఆంగ్లంలో అనువదించబడింది. ఆ అముద్రిత గ్రంథం నుండి సేకరించిన వివరాలివి.)

ఈ సంచలనాత్మక Hilly Action Case లో నిందితుడయిన అబ్దుల్ ఖాదిర్ చౌధురిని 1933 అక్టోబర్ 28న అరెస్టు చేశారు. ఆయన వద్ద ఉన్న రివాల్వర్‌ను స్వాధీనం చేసుకున్నారు. అక్రమంగా ఆయుధం కలిగి ఉన్నాడంటూ మారణాయుధాల నిరోధక చట్టం క్రింది ఆయన మీద నేరారోపణలు నమోదు చేశారు. ఈ కేసు విచారణకు దినజ్‌పూర్ (Dinajpur) కార్యక్షేత్రంగా బ్రిటిష్ ప్రభుత్వం ప్రత్యేక ట్రిబ్యునల్ (Special Tribunal) ఏర్పాటు చేసింది. ఆ ప్రత్యేక ట్రిబ్యునల్ Hilly Action Case ను విచారించి భారత శిక్షాస్మృతి లోని సెక్షన్స్ 395/120-బి సెక్షన్ల క్రింద అబ్దుల్ ఖాదిర్ చౌధురిని నేరస్థుడిగా నిర్ధారించింది.

1934 ఫిబ్రవరి 27న అబ్దుల్ ఖాదిర్ చౌధురికి యావజ్జీవిత కారాగారశిక్ష విధిస్తూ తీర్పు ప్రకటించింది. ఆ తీర్పు మీద ఆయన ఉన్నత న్యాయస్థానంలో అప్పీల్ చేయగా క్రింది కోర్టు విధించిన యావజ్జీవిత కారాగార శిక్షను ఏడేండ్ల కఠిన కారాగార శిక్షగా మార్చింది. 1935లో ఆంగ్లేయాధికారులు అబ్దుల్ ఖాదిర్ చౌధురిని అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించారు. ఆ సెల్యులర్ జైలులో ఆయన Permanent Incarceration No. 215 గా పరిగణించబడ్డారు.

అండమానులోని సెల్యులర్ జైలులో ఆంగ్లేయాధికారులు స్వాతంత్ర్య సమరయోధుల పట్ల వ్యవహరిస్తున్న తీరుతెన్నులను నిరసిస్తూ 1937లో సాగిన నిరాహారదీక్షా కార్యక్రమంలో అబ్దుల్ ఖాదిర్ చౌధురి కూడా చాలా చురుగ్గా పాల్గొన్నారు. ఆ దీక్షలకు దిగివచ్చిన ఆంగ్ల ప్రభుత్వం జైలు విధివిధానాలలో మార్పులు తెచ్చింది. ఆ తరువాత సంభవించిన రాజకీయ పరిణామాల కారణంగా అబ్దుల్ ఖాదిర్ చౌధురి 1937-38లో అండమాను సెల్యులర్ జైలు నుండి విముక్తి పొంది భారత ప్రధాన భూభాగం చేరుకున్నారు. అండమానులో ఏడు సంవత్సరాల పాటు కారాగార శిక్షను అనుభవించిన తరువాత ఇండియా ప్రధాన భూభాగం చేరుకున్న అబ్దుల్ ఖాదిర్ చౌధురి 1939లో అన్ని విధాలుగా పూర్తిగా స్వేచ్ఛ పొంది స్వగ్రామం బోగురా (Bogura) చేరుకున్నారు. ◆

# సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది

సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది (Sayyad Akbar Jaman Akbarabadi) ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఆగ్రా నివాసి. ఆయన తండ్రి సయ్యద్ అమీర్ జమాన్. అక్బర్ జమాన్ అక్బరాబాది అరబిక్, పర్షియన్ భాషల్లో పాండిత్యం సంపాదించి 'మాజిద్' (Majid) అను కలం పేరుతో కవిత్వం రాసారు. ఆగ్రాలోని కళాశాలలో కొంతకాలం ఉపాధ్యాయునిగా బాధ్యతలు నిర్వర్తించి ప్రధానోపాధ్యాయుడిగా (Head Moulvi) పదోన్నతి పొందారు. ఆ తరువాత ప్రధాన గుమాస్తా (Head Clerk) గా ఆగ్రా కోట కొలువులో చేరారు.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా ఆల్వార్ సంస్థానానికి చెందిన పోరాట యోధులు సుబేదార్ లాల్ బహుదూర్ ఖాన్ మేవాతి (Subedar Lal Bahadur Khan Mewati) ఆగ్రా కోటను చుట్టుముట్టారు. ఆగ్రా పట్టణం అతని స్వాధీనంలోకి వెళ్ళింది. ఆ సమయంలో నాలుగు రోజుల పాటు ఆగ్రా కోటలోకి రాకపోక లాల్ బహుదూర్ ఖాన్ మేవాతి ఆధీనంలో ఉండి పోయింది. ఆంగ్లేయాధికారులు ఆగ్రాకోట బయటకు రాలేక లోపల దాక్కొని బిక్కుబిక్కు మంటూ గడిపారు. ఆంగ్లేయాధికారులు సంక్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటుండగా స్వదేశీ యోధులకు సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది సహకరించారు.

ఆగ్రా కోటలోని ఆంగ్లేయాధికారుల విముక్తి, రక్షణ కోసం ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలు పెద్ద సంఖ్యలో ఆగ్రా కోటను, ఆగ్రా పట్టణాన్ని చుట్టుముట్టాయి. ఆ సమయంలో స్వదేశీ పోరాట యోధులతో కలసి సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది ఆగ్రా కోట నుండి తప్పుకుని ఇండోర్ వెళ్లారు. ఆంగ్లేయ బలగాలు ఆగ్రా పట్టణాన్ని, ఆగ్రా కోటను తిరిగి స్వాధీనంలోకి తెచ్చుకున్నాక సయ్యద్ అక్బరాబాది ఇండోర్ నుండి ఆగ్రా వచ్చారు. ఆగ్రాలో ఉద్యోగ బాధ్యతలు చేపట్టేందుకు ప్రయత్నిస్తుండగా, తిరుగుబాటు సమయంలో ఆయన స్వదేశీ సైనికులకు సహకరించడం, ఆ తరువాత ఇండోర్‌కు తప్పుకోవడం గమనించిన ఆంగ్లేయాధికారి ఆయనను గుర్తుపట్టి ఆ విషయాన్ని ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేశాడు. ఆ ఫిర్యాదు మేరకు సయ్యద్ అక్బరాబాదిని ఆంగ్లసైనికులు నిర్బంధించారు. తిరుగుబాటు సమయంలో తిరుగుబాటు యోధులకు సహకరించారన్న ప్రధాన ఆరోపణల మీద సైనిక విచారణ జరిపి, నేరం నిర్ధారించి, కఠిన కారాగార శిక్ష విధించి, సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాదిని అండమాను శిక్షాక్షేత్రానికి తరలించారు.

అండమానులో ప్రధాన గుమాస్తా (Head Clerk) గా పనిచేస్తున్న ఆగ్రాకు చెందిన పండిత సాలిగ్రాం (Pandith Saligram) ఆయనకు పరిచయం అయ్యారు. పండిత సాలిగ్రాం ఆయనను తన సహాయకుడిగా నియమించుకున్నారు. ఆ విధంగా అండమాను శిక్షాక్షేత్రంలో ఐదు రూపాయల జీతంతో ఆరంభమైన సయ్యద్ అక్బర్ జమాన్ గుమాస్తా ఉద్యోగం 70 రూపాయలు పొందగల స్థాయికి చేరిందది. అండమానులో మొహమ్మద్ జాన్ (Mohammed Jan) అను యువకుడు ఆయన పంచన చేరాడు. ఈ ఇరువురు కలసి అండమానులో విద్యాబోధన ఆరంభించారు. ప్రఖ్యాత రచయిత మౌల్వీ మహమ్మద్ జాఫర్ థానేసరి అండమానుకు వచ్చాక అక్బరాబాది ఆయనకు శిష్యుడిగా సేవలందజేశారు.

అండమాను శిక్షాక్షేత్రంలో 20 సంవత్సరాల పాటు గడిపిన తరువాత సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది అండమాను నుండి విముక్తి పొంది ఆగ్రా పట్టణం చేరుకున్నారు. ఆగ్రాలో విద్యాబోధన ప్రధాన వ్యాపకం చేసుకున్నారు. ఆ తరువాతి కాలంలో అనారోగ్యం కారణంగా ఆయనకు అంధత్వం సంభవించింది. కళ్ళు కనిపించకున్నా కూడా తనకున్న అసాధారణ జ్ఞాపకశక్తితో గడిపారు. ఆయన సృజియించిన సాహిత్యం అంతా మౌల్వీ మొహమ్మద్ అలీ షాహ్ మాయ్‌కష్ అక్బరాబాది (Moulvi Mohammed Ali Shah Maikash Akbarabadi) సంకలనం చేసి భద్రపర్చారు. చివరకు ఆర్థికంగా చితికిపోయిన సయ్యద్ అక్బర్ జమాన్ అక్బరాబాది పేదరికంతో స్నేహం చేస్తూ కన్నుమూసారు. ◆

# మొహమ్మది

స్వాతంత్ర్య సమరయోధులు మొహమ్మది (Mohammadi) పంజాబ్ రాష్ట్రం నివాసి. ఆయన తండ్రి పేరు అజీజ్ కాశ్మీరి. 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా సుప్రసిద్ధమయిన అమృతసర్ నేషనల్ బ్యాంకు యాక్షన్ కేసులో (Amritsar National Bank Action Case) మొహమ్మది నిందితులు. మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ఆకాంక్షిస్తూ ఉద్యమిస్తున్న భారతీయులను అణగద్రొక్కాలని భావించిన ఆంగ్ల ప్రభుత్వం 1919లో క్రూరమయిన రౌలట్ చట్టం తెచ్చింది. ప్రజాస్వామిక, మానవీయ విలువలను ఏమాత్రం ఖాతరు చేయని ఆంగ్లేయాధికారులు ఆ రాక్షస చట్టం ఆసరాతో రెచ్చిపోతూ ప్రజలకు, జాతీయోద్యమకారులకు బహిరంగ శిక్షలు విధిస్తూ, అత్యంత కిరాతకంగా వ్యవహరించారు.

ఆ కిరాతక చర్యల పట్ల తీవ్ర నిరసన వ్యక్తం చేసిన స్వాతంత్ర్య సమరయోధులు డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ, (Dr. Saifuddeen Kichulu), డాక్టర్ సత్యపాల్ (Dr. Satyapal) లను ఆంగ్ల ప్రభుత్వం ఆక్రమంగా నిర్బంధించింది. ఆ నిర్బంధానికి వ్యతిరేకంగా పంజాబ్ రాష్ట్రంలో ప్రజా వ్యతిరేకత పెల్లుబికింది. పంజాబ్ రాష్ట్రం అమృతసర్‌లో ప్రజలు, విప్లవకారులు

కలసి 1919 ఏప్రిల్ 10న భారీ నిరసన ప్రదర్శన నిర్వహించారు. ఆ సందర్భంగా పెద్ద ఎత్తున తరలి వచ్చిన ఉద్యమకారులు, ప్రజలు కలసి టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లను విధ్వంసం చేసి తొలుత సమాచార చేరవేతకు విఘాతం కల్గించారు. ఆ తరువాత రైల్వే స్టేషన్ చుట్టుముట్టి తగులబెట్టారు. రైళ్లను తగులబెట్టి రైళ్ళ రాకపోకలకు అంతరాయం కల్పించారు. ఈ సందర్భంగా ఒక రైల్వే ఉద్యోగి కూడా మృత్యువాత పడ్డారు.

ఆ ప్రాంతంలోని Alliance Bank, Chartered Bank, National Bank లను ప్రజానీకం చుట్టుముట్టి ధ్వంసం చేశారు. ఈ సందర్భంగా ఇరువురు బ్యాంకు అధికారులు కూడా ప్రాణాలు పోగొట్టుకున్నారు. బ్రిటిష్ భారత సైన్యంలోని గూర్ఖా సైనిక దళం సంఘటన స్థలానికి చేరుకుని ప్రజలను, విప్లవకారులను నియంత్రించడానికి విచక్షణారహితంగా కాల్పులు జరుపుతూ విఫల ప్రయత్నాలు చేసింది. ఆఘమేఘాల మీద వచ్చిన గూర్ఖా సైనిక దళం వైఫల్యంతో ప్రజలు, విప్లవకారులు మరింతగా విజృంభించారు.

ఆ తరువాత రైల్వే రవాణా వ్యవస్థ, సమాచార చేరవేత వ్యవస్థ చక్కబడ్డాక ఆంగ్ల ప్రభుత్వం ఈ సంఘటనలో నిందితుల కోసం వేట ప్రారంభించింది. చివరకు 'అమృతసర్ అలియన్స్ బ్యాంక్ అండ్ నేషనల్ బ్యాంక్' (Amrithsar Alliance Bank and National Bank) కేసుగా భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో సుప్రసిద్ధమయిన ఈ సంఘటనలో పాల్గొన్న పలువురిని నిర్బంధించింది. అలా అరెస్టయిన వారిలో ఆంగ్ల ప్రభుత్వంతో సాయుధ పోరాటం చేస్తున్న విప్లవకారులు మొహమ్మది తోపాటుగా మెహరుద్దీన్ (Meharuddin), దీనా(Deena), కరంచంద్ (Karamchand), మనోహర్ సింగ్ (Manohar Singh), సాధిఖ్ (Sadikh), సంధి (Sandhi), జలాలుద్దీన్ (Jalaluddin), జయరాంసింగ్ (Jayram Singh) తదితరులు ఉన్నారు.

ఈ సంఘటనలో మొహమ్మది తదితరులను నిందితులుగా పేర్కొంటూ ప్రభుత్వం పంజాబు మార్షల్ లా కేసు–75 (Punjab Marshal Law Case-75) రూపొందించింది. ఆ కేసు విచారణ తరువాత భారత శిక్షాస్మృతి సెక్షన్ 121 ప్రకారంగా మొహమ్మదికి మరణదండన విధిస్తూ 1919 జూన్ 2న న్యాయస్థానం తీర్పు చెప్పింది. ఆ శిక్షను ఆంగ్ల ప్రభుత్వం యావజ్జీవితకారాగార శిక్షగా మార్చింది. ఆ మేరకు ఆంగ్లేయాధికారులు అండమాను లోని సెల్యులర్ జైలుకు ఆయనను తరలించారు. అండమాను సెల్యులర్ జైలులో మొహమ్మది 'ఖైది నం. 46844' (Prisoner No.46844) గా పరిగణించబడ్డారు. చివరకు 1921లో ఆంగ్ల ప్రభుత్వం మొహమ్మదిని భారత ప్రధాన భూభాగంలోని మరో జైలుకు తరలించింది. ◆

# గమీరుద్దీన్ సర్కార్

గమీరుద్దీన్ సర్కార్ బెంగాల్ రాష్ట్రంలోని దినజ్‌పూర్ (Dinajpur) జిల్లా, బల్లూర్‌ఘాట్ (Ballurghat) గ్రామం నివాసి. ఆయన తండ్రి బజీరుద్దీన్ సర్కార్ (Bajiruddin Sarkar). 1915లో జన్మించిన గమీరుద్దీన్ సర్కార్ (Gamiruddin Sarkar) గమీర్ షేక్ (Gamir Sheik) అను మరోపేరుతో విప్లవోద్యమంలో చలామణి అయ్యారు. మాతృభూమి నుండి ఆంగ్లేయులకు ఉద్వాసన పలకాలంటే సాయుధపోరాట మార్గమే బలమైన సాధనంగా భావించిన గమీరుద్దీన్ బెంగాలు కేంద్రంగా విప్లవోద్యమాలను నడుపుతున్న విప్లవ సంస్థల కార్యకలాపాల పట్ల ఆకర్షితులయ్యారు.

బెంగాల్ విప్లవకారులతో కలసి ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పలు కార్యకలాపాలలో పాల్గొనడం ఆరంభించారు. సాయుధ పోరాటాలు సాగించడానికి ఆర్థికబలం -ఆయుధబలం-అంగబలం విప్లవోద్యమ సంస్థలకు అవసరమయ్యాయి. ఆ అవసరాల మేరకు కావాల్సిన వనరులను సమకూర్చుకోడానికి విప్లవకారులు పలు మార్గాలను అన్వేషించి ఆచరణలో పెట్టారు. ఆ చర్యలలో భాగంగా ఆయుధాల కొనుగోలుకు అవసరమయిన డబ్బు కోసం విప్లవకారుల దళం దాడులకు సిద్ధమయ్యింది.

1934 జూలై 13న దినజ్‌పూర్ (Dinajpur) జిల్లా. బల్లూర్‌ఘాట్ (Ballurghat) పోలీసు స్టేషన్ పరిధిలోని బొల్లా (Bolla) గ్రామం మీద విప్లవకారులు దాడి చేసారు. ఆ దాడి నిర్వహించడానికి ముందు విప్లవకారుల దళం జూలై 10 నుండి 13వ తేది వరకు విస్తృతంగా చర్చలు జరిపింది. ఆ చర్చల పర్యవసానంగా బొల్లా (Bolla) గ్రామంలోని సంపన్నుడు, ఆంగ్ల ప్రభుత్వానికి తొత్తు అయినటువంటి ప్రాణబంధు చౌధురి (Pranabandhu Chowdhury) ఇంటి మీద దాడి నిర్వహించడానికి విప్లవకారుల దళం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు ప్రాణబంధు చౌధురి ఇంటి మీద జరిగిన దాడిలో ఇతర విప్లవకారుల తోపాటుగా గమీరుద్దీన్ సర్కార్ భాగస్వామి అయ్యారు. ఈ దాడిలో విప్లవకారుల దళం సుమారు 284-00 రూపాయల నగదును రాబట్టుకుంది.

ఈ దాడి సంఘటన జరగ్గానే మేల్కొన్న ఆంగ్ల ప్రభుత్వ పోలీసు బలగాలు ఆఘమేఘాల మీద సంఘటనాస్థలం చేరుకుని దర్యాప్తు ఆరంభించాయి. ఆ దర్యాప్తు ఫలితంగా 1934 లో గమీరుద్దీన్ సర్కార్ తదితరులను దినజ్‌పూర్ దాడి కేసులో (Dinajpur Action Case) ముద్దాయిలుగా పేర్కొన్నారు. అనంతరం ఆయనను, ఆయనతోపాటుగా మరో ఐదుగురు ఆయన సహచరులను ఆంగ్లేయాధికారులు నిర్బంధించారు. ఈ సంఘటనను 'దినజ్‌పూర్ దాడి కేసు' గా పేర్కొన్న బ్రిటిష్ ప్రభుత్వం, ఆ కేసు విచారణకు దినజ్‌పూర్ (Dinajpur) కార్యస్థానంగా ప్రత్యేక ట్రిబ్యునల్ (Special Tribunal) ఏర్పాటు చేసింది.

ఆ ట్రిబ్యునల్ దినజ్‌పూర్ దాడి కేసు ను విచారించి భారత శిక్షాస్మృతి లోని సెక్షన్ల 395/120-బి క్రింద గమీరుద్దీన్ సర్కార్‌ను, ఆయన సహచరులలో కొందరిని నేరస్థులుగా నిర్ధారించింది. చివరకు 1934 ఫిబ్రవరి 12న తీర్పు ప్రకటించిన ప్రత్యేక ట్రిబ్యునల్ (Special Tribunal) విప్లవకారులకు పలు రకాల కారాగార శిక్షలను ప్రకటిస్తూ, గమీరుద్దీన్ సర్కార్‌కు ఆరు సంవత్సరాల కఠిన కారాగారశిక్ష విధించింది.

ఆ తీర్పు మేరకు తొలుత గమీరుద్దీన్ సర్కార్ ను రాజాషాహి కేంద్ర కారాగారానికి తరలించారు. అ రాజాషాహి కేంద్రకారాగారంలో ఆయన ఖైదీ నం. 969గా పిలవబడ్డారు. ఆ తరువాత 1936 లో ఆంగ్లేయాధికారులు ఆయనను అండమాను శిక్షాక్షేత్రంలోని సెల్యులర్ జైలుకు తరలించారు. ఆ సెల్యులర్ జైలులో ఆయన Permanent Incarceration No. 346 గా పరిగణించబడ్డారు. ఆ తరువాత దేశంలో చోటుచేసుకున్న పలు రాజకీయ పరిణామాల కారణంగా విప్లవకారుడు గమీరుద్దీన్ సర్కార్ 1937-38లో అండమాను సెల్యులర్ జైలు నుండి విముక్తి పొందారు. ◆



# మున్షీ జుల్ఫిఖార్ అలీ

అండమాను-నికోబారు దీవులను 1942లో ఆంగ్లేయ పాలన నుండి విముక్తం గావించి జపాన్ సైన్యాలు సంపూర్ణంగా స్వాధీనపర్చుకున్న తర్వాత స్థానిక ప్రజానీకం మీద ప్రారంభించిన దాష్టీకాలను అత్యంత ధైర్యసాహసాలతో ఒంటరిగా ఎదుర్కొని తొట్టతొలుతగా అమరుడయిన యువకిశోరం మున్షీ జుల్ఫిఖార్ అలీ (Munshi Zulfiquer Ali). ఆయన 1922లో అండమానులోని అబెర్‌దీన్ (Aberdeen) గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రి మున్షీ అక్బర్ అలీ (Akbar Ali) సంపన్న వ్యాపారస్థుడు. మంచి పలుకుబడి, ప్రజల మన్నన పొందిన వ్యక్తి. ఆయన బిడ్డడు జుల్ఫిఖార్ అలీ కూడా మంచి నడవడికతో అబెర్‌దీన్ ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్నాడు. గ్రామస్థులు జుల్ఫిఖార్‌ను సన్నీ/సొన్ని (Sunny/Sonny) అని ముద్దుగా పిలిచేవారు. పందొమ్మిది ఏండ్ల వయస్సులో ఆయన వివాహం అబెర్‌దీన్ గ్రామానికి చెందిన మెహ్‌ముదన్ బీబీ (Mehmudan Bibi) తో జరిగింది.

బ్రిటన్ మిత్రరాజ్యాలు (Allied Powers) అక్షరాజ్యాల (Axis Powers) మధ్యన 1939 సెప్టెంబర్ ఒకటిన ద్వితీయ ప్రపంచ యుద్ధం ఆరంభమయ్యింది. ఆ యుద్ధం తొలి దశలో అక్షరాజ్యాల మిత్రబృందంలోని జపాన్ విజయపరంపర సాగిస్తూ దూసుకు పోయింది. ఆ విజయాల పరంపరలో భాగంగా 1942 మార్చి 13న బర్మా రాజధాని

రంగూన్‌ను బ్రిటన్ నుండి స్వాధీనం చేసుకున్న జపాన్ సైన్యాలు, 1942 మార్చి 22న ఆంగ్లేయుల ఆధీనంలో ఉన్న అండమాను–నికోబార్ దీవులను చేరుకున్నాయి. జపాన్ సైన్యాల రాకను పసికట్టిన ఆంగ్ల ప్రభుత్వం అండమాను–నికోబార్ దీవులలోని తమ సైనిక స్థావరాన్ని ఖాళీచేసి తమ సైన్యాలతోపాటు తమ వెంట రాగలిగిన పౌరులను ఆ దీవుల నుండి ఇండియాకు తరలించింది. సముద్రమార్గాన, ఆకాశమార్గాన, భూమార్గాన ఎటువంటి ప్రతిఘటన లేకపోవడంతో ఒక్క బుల్లెట్టు ఉపయోగించకుండా అండమాను–నికోబార్ దీవులను జపాన్ సైన్యాలు అతి తేలిగ్గా 1942 మార్చి 23న స్వాధీనం చేసుకున్నాయి.

అడ్డూ–ఆపూ లేకుండా అండమాను దీవుల మీద ఆధిపత్యం సంపాదించుకున్న జపాన్ సైన్యాల ఆనందానికి హద్దులు లేకుండా పోయింది. ఆ కారణంగా 1942 మార్చి 24న జపాన్ సైన్యాధికారులు తమ సైనికులకు సైనిక క్రమశిక్షణ–సైనిక నియంత్రణ నుండి మినహాయింపు కల్పిస్తూ కొంత సమయం పాటు స్వేచ్ఛగా ఆనందించడానికి అవకాశం ఇచ్చారు. ఆ ఆటవిడుపు అవకాశాన్ని అందిపుచ్చుకున్న జపాన్ సైనికులు అండమానులోని అబెర్‌దీన్ తదితర గ్రామాల మీద పడ్డారు. విజయోత్సాహంతో ఊగిపోతూ జపాన్ సైనికులు ఆ జనవాసాల మధ్యన యధేచ్ఛగా సంచరిస్తూ ఇష్టానురీతిగా ప్రవర్తించసాగారు. గ్రామస్థుల ఇళ్ళల్లోకి జొరబడి అందినకాడికి ఎత్తుకపోసాగారు, అవసరం లేదన్పించిన దానిని తగులబెట్టి ఆనందించసాగారు. ఆ వికృత చేష్టలను చూస్తూ ఏమీ చేయలేని నిస్సహాయతతో బాధపడుతూ కన్నీరు–మున్నీరు అవుతున్న గ్రామస్థులను చూసి మరింతగా ఆనందిస్తూ కేరింతలు కొడ్తూ జపాన్ సైనికులు బాధిత గ్రామస్థులను ఆటపట్టించసాగారు.

జపాన్ సైనిక మూకలు తమ విధ్వంసకర చేష్టలతోపాటుగా వీధుల్లో విచ్చలవిడిగా సంచరిస్తూ కన్పించిన మహిళల పట్ల అసభ్యంగా ప్రవర్తించ సాగారు. నిస్సిగ్గుగా వ్యవహరిస్తూ వెకిలి వేషాలు వేస్తూ, చేష్టలు చేస్తూ ఆడపిల్లను ఆటపట్టిస్తూ జుగుప్సాకరంగా మాట్లాడ సాగారు. బలవంతంగా ఇళ్ళల్లోకి ప్రవేశించి గృహిణుల పట్ల అసహ్యంగా, అశ్లీలంగా ప్రవర్తించ సాగారు. అసభ్యకర సంజ్ఞలతో, అతి నైచ్య శృంగార చేష్టలను నిర్లజ్జగా ప్రదర్శించ సాగారు. ఒకవైపున గ్రామస్థులను దోచుకుంటూ, గ్రామస్థుల ఆస్తులను తగుల బెడుతూ మహిళల పట్ల ఆసభ్యంగా ప్రవర్తిస్తున్న తమ సైనికులను ఏమాత్రం నియంత్రించకుండా జపాన్ సైన్యాధికారులు చూసి చూడనట్టుగా మిన్నకుండి పోయారు.

జపాన్ సైనికులు గ్రామంలో సాగిస్తున్న దుష్కృత్యాలను గమనిస్తూ వచ్చిన అండమాను యువకిశోరం మున్షీ జుల్ఫీఖార్ అలీ రంగప్రవేశం చేశారు. గ్రామస్థుల సంపదను

దోచుకోవడం, తగులబెట్టడం వరకు సహించిన ఆయన జపాన్ సైనిక ముష్కరులు తమ గ్రామ ఆడపడుచుల పట్ల సాగిస్తున్న అసభ్య ప్రవర్తనను చూసి సహించలేక పోయారు. గ్రామంలో యుధేచ్ఛగా వికృత చేష్టలను సాగిస్తున్న జపాన్ సైనికులు 1942 మార్చి 24 మధ్యాహ్నం ఒంటి గంట నలభై నిమిషాల సమయాన అబెర్‌దీన్ గ్రామంలోని ఆషిక్ అలీ (Ashique Ali) అను పెద్దాయన ఇంటి పరిసరాలకు చేరుకున్నారు. అటు ఇటు పరుగులు దీస్తూ సమీపంలోని ఇళ్ళల్లోకి జొరబడ్డారు. ఆ ఇళ్ళలోని మహిళల పట్ల, ఆడపిల్లల పట్ల అనుచితంగా, అశ్లీలంగా ప్రవర్తించసాగారు. ఆ అవమానకర దృశ్యాలను చూసిన జుల్ఫీఖార్ అలీ సైనికుల మాటలు-చేతల పట్ల తీవ్ర అభ్యంతరం వ్యక్తంచేశారు. ఆ అభ్యంతరాలను లెక్కచేయకుండా జుల్ఫీఖార్ అలీని వెకిలి మాటలతో జపాన్ సైనికులు అవమానపర్చారు.

జపాన్ సైనికుల వికృత చేష్టల పట్ల ఆగ్రహించిన జుల్ఫీఖార్ అలీ తమ సమీప బంధువు మహమ్మద్ అలీ (Muhammed Ali) ఇంటిలోకి వెళ్ళారు. ఆ ఇంటి నుండి ఒక తుపాకి (BB Gun) తీసుకుని బయటకు వచ్చి జపాన్ సైనికులను నిలువరించేందుకు హెచ్చరికలు చేస్తూ గురిపెట్టారు. ఆ హెచ్చరికలను జపాన్ సైనికులు ఖాతరు చేయకుండా జుల్ఫీఖార్ అలీని ఆటపట్టిస్తూ తమ వెకిలి చేష్టలను కొనసాగించారు. ఆగ్రహించిన జుల్ఫీఖార్ అలీ జపాన్ సైనికుల దిశగా కాల్పులు జరిపారు. ఆ హఠాత్పరిణామంతో హడలెత్తిన జపాన్ సైనికులు సంఘటన స్థలాన్ని వదలి తమ స్థావరం వైపుగా పరుగులు పెట్టారు. ఆ కాల్పుల వలన ఎటువంటి ప్రాణ నష్టం జరగకున్నా సైనికుల నుండి ఎదురుకాగల ప్రమాదకర పరిస్థితులను జుల్ఫీఖార్ అలీ పసికట్టారు. ఆ మరుక్షణమే సంఘటనా స్థలం నుండి ఆయన నిష్క్రమించారు. ఆయన భార్య మెహ్‌ముదన్ బీబి గర్భిణి కావడం వలన పుట్టించికి వెళ్ళి ఉంది. జుల్ఫీఖార్ అలీ కూడా సమీపంలోని తన అత్తగారింటికి వెళ్ళిపోయారు.

జుల్ఫీఖార్ జరిపిన కాల్పులతో తమ ఆగడాలు ఆపి తమ సైనిక స్థావరం వైపుకు పరుగులు తీసిన జపాన్ సైనికులు క్షణాలలో మరింత మంది సహచరులను వెంట బెట్టుకుని మారణాయుధాలతో సంఘటనా స్థలం చేరుకున్నారు. జుల్ఫీఖార్ అలీ కోసం వెతుకులాట ఆరంభించారు. ఆయన కన్పించకపోయేసరికి ఆగ్రహంతో ఊగిపోతున్న జుల్ఫీఖార్ అలీని అప్పగించమని కేకలు వేస్తూ, నానా యాగీ చేస్తూ గ్రామస్థుల ఇళ్ళమీద సైనికులు దాడులు ఆరంభించారు. ప్రతీకార జ్వాలలతో మండిపడుతున్న సైనికులకు జుల్ఫీఖార్‌ను అప్పగిస్తే అతడ్ని బతకనివ్వరని భయపడిన గ్రామస్థులు మిన్నకుండిపోయారు. గ్రామస్థుల నుండి సానుకూల ప్రతిస్పందన రాకపోవడంతో సైనికులు గ్రామస్థుల మీద కూడా భౌతికదాడులకు

పాల్పడ్డారు. గ్రామంలోని ఇళ్ళను తగులబెట్టారు. గ్రామాన్ని కమ్మేస్తున్న అగ్ని జ్వాలలను ఆర్పేందుకు గ్రామస్థులు ప్రయత్నించగా సైనికులు అడ్డుకున్నారు. ఆ కారణంగా తమ గ్రామం గ్రామం తగులబడి పోతుంటే గ్రామస్థులు మౌనంగా విలపించసాగారు. జుల్ఫీఖార్‌ను పట్టి అప్పగిస్తే సరి లేకున్నట్టయితే గ్రామాన్ని మొత్తంగా తగులబెడ్తామంటూ రంకెలు వేస్తూ, గ్రామస్థులను హెచ్చరిస్తూ జపాన్ సైనికులు వీరంగం వేయసాగారు.

ఆ విధ్వంసకర పరిస్థితిని చూసి గ్రామస్థులకు, గ్రామానికి ఎదురుకానున్న పెను ప్రమాదాన్ని గ్రహించిన Chief of Police Force బాధ్యులు నారాయణ రావు రంగప్రవేశం చేశారు. జుల్ఫీఖార్ అలీ కన్పించకపోయేసరికి గ్రామ విధ్వంసానికి పాల్పడుతున్న జపాన్ సైనికులకు నచ్చజెప్పి అబెర్‌దీన్ గ్రామాన్ని, గ్రామస్థులను రక్షించేందుకు నారాయణ రావు ముందుకు వచ్చారు. జపాన్ సైనికులను, సైన్యాధికారులను కలసి జుల్ఫీఖార్‌ను వెతికి తెచ్చి అప్పగించగలమని విధ్వంసకాండకు స్వస్తి పలకవలసిందిగా నచ్చజెప్పారు. గ్రామస్థుల మీద నిప్పులు కక్కుతున్న జపాన్ సైనికులను జపాన్ సైన్యాధికారుల ద్వారా నచ్చజెప్పి శాంతింప జేశారు. 1942 మార్చి 25 ఉదయం 9 గంటల 45 నిమిషాలకు ఎట్టి పరిస్థితులలోనూ జుల్ఫీఖార్ అలీని తమకు అప్పగించాలని జపాన్ సైన్యాధికారులు హుకుం జారీ చేశారు.

ఆ షరతును అంగీకరించిన పోలీసు అధికారి నారాయణరావు గ్రామస్థులను, జుల్ఫీకర్ అలీ తల్లితండ్రులను-బంధువులను కలిసారు. గ్రామ పరిస్థితుల తీవ్రతను వివరించారు. జపాన్ సైనికుల ప్రతీకారచర్యల వలన గ్రామం, గ్రామ ప్రజలు పూర్తిగా నష్టపోవాల్సి వస్తుందని, ప్రాణ నష్టం కూడా తప్పదని గ్రామస్థులకు వివరించి నచ్చ జెప్పారు. ఈ ప్రమాదకర పరిస్థితుల నుండి గ్రామాన్ని, గ్రామ ప్రజలను క్షేమంగా బయట పడేయ్యాలంటే జుల్ఫీఖార్ అలీని జపాన్ సైనికులకు అప్పగించడం మినహా మరో మార్గం లేదన్న చేదు వాస్తవాన్ని గ్రామస్థుల ముందుంచారు. జుల్ఫీఖార్‌ను జపాన్ సైనికుల సమక్షానికి తీసుక వచ్చేందుకు గ్రామస్థుల ముఖ్యంగా జుల్ఫీఖార్ కుటుంబీకుల సమ్మతిని ఆయన రాబట్టారు. గ్రామాన్ని రక్షించుకోవాలనుకున్న గ్రామపెద్దలు, జుల్ఫీఖార్ కుటుంబీకులు గుండెదిటవు చేసుకుని నారాయణరావు చేసిన సూచనను అంగీకరించారు.

ఆ తదుపరి అత్తగారింట ఉన్న జుల్ఫీఖార్ అలీ వద్దకు నారాయణ రావు వెళ్ళారు. గ్రామంలో తాండవిస్తున్న భయంకర పరిస్థితులు, జపాన్ సైనికుల విధ్వంసకాండను వివరించారు. ఈ విధ్వంసకర సంక్షోభం నుండి గ్రామాన్ని, గ్రామ ప్రజలను, మహిళల మానమర్యాదలను, ప్రాణాలను కాపాడగలగటం జుల్ఫిఖార్ అలీ నిర్ణయం మీద ఆధారపడి

ఉందన్న వైనాన్ని ఆయనకు విడమర్చి చెప్పారు. ఆ ప్రమాదకర పరిస్థితులను జుల్ఫీఖార్ అర్థం చేసుకున్నారు. తుపాకి పట్టుకుని బెదిరించడం మాత్రమే కాకుండా కాల్పులు కూడా జరిపిన కారణంగా ప్రతీకారం కోసం ఎదురు చూస్తున్న జపాన్ సైనికుల చేతికి తాను చిక్కితే తనను బతకనియ్యరని కూడా జుల్ఫీఖార్ అలీ గ్రహించారు. కష్టనష్టాలను బేరిజు వేసుకున్న జుల్ఫీఖార్ జపాన్ సైనికుల ఆగ్రహ జ్వాలల నుండి తన గ్రామం, గ్రామ ప్రజలను రక్షించుకోవాలంటే తాను బయటకు రావటం తప్ప మరో మార్గం లేదన్న వాస్తవాన్ని గ్రహించారు. గ్రామం కోసం, గ్రామ ప్రజల కోసం జపాన్ సైన్యాల క్రౌర్యానికి తాను బలికాక తప్పదనుకున్నారు. ఈ విపత్కర పరిస్థితులను గ్రహించి శోకసముద్రంలో మునిగి ఉన్న భార్యకు, తల్లితండ్రులకు, బంధు, మిత్రులకు నచ్చజెప్పారు. జపాన్ సైనికుల డిమాండ్ మేరకు నిర్దేశిత సమయానికి సైనికుల ఎదుట హాజరు కాడానికి జుల్ఫీఖార్ అలీ సిద్ధపడ్డారు.

1942 మార్చి 25 ఉదయం 9 గంటల 45 నిమిషాలకు మున్షీ జుల్ఫీఖార్ అలీని గ్రామస్థులు జపాన్ సైనికుల సమక్షానికి తీసుకొచ్చారు. అండమానులో మరెవ్వరూ కూడా జపాన్ అధికారులకు గాని, సైనికులకు గాని ఎదురు తిరగకుండా ఉండేందుకు కఠినాతి కఠినంగా వ్యవహరించాలని నిర్ణయించుకున్న సైన్యాధికారులు తమ సైనికులకు తగిన ఆదేశాలతో స్వేచ్ఛ కల్పించారు. ఒక సామాన్య గ్రామస్థుడు తమ మీద తుపాకి గురి పెట్టడం, కాల్పులు జరపడాన్ని జపాన్ ప్రభుత్వానికి, జపాన్ సైన్యానికి అవమాకరమని భావిస్తూ ఆగ్రహంతో రగిలిపోతున్న జపాన్ సైనికులు తమ అధికారులు కల్పించిన వెసులుబాటుతో మరింత రెచ్చిపోయారు. జుల్ఫీఖార్ అలీని అబెర్‌దీన్ గ్రామంలోని ఆనాటి బ్రౌనింగ్ క్లబ్ (ప్రస్తుత నేతాజి క్లబ్) ఆవరణ లోని ఒక స్థంబానికి చేతులు వెనక్కు విరిచి కట్టారు. ఈ శిక్షా కార్యక్రమాన్ని ప్రజలంతా వీక్షించాలని జపాన్ సైనికులు ఆదేశిస్తూ గ్రామ ప్రజలందరిని రప్పించి క్లబ్ ఆవరణ చుట్టూ నిలబెట్టారు. జుల్ఫీఖార్ కుటుంబీకులు, బంధు-మిత్రులు, గ్రామస్థులు భయానక పరిణామాలను ఊహిస్తూ తీవ్ర వ్యాకులతకు గురవుతూ, ప్రాణాలను ఉగ్గబట్టుకుని జపాన్ సైనికుల అమానుష ఆదేశాలను పాటించారు.

జుల్ఫీఖార్ అలీ రాజద్రోహానికి పాల్పడ్డారని జపాన్ సైన్యాధికారులు నేరారోపణ చేశారు. ఆ రాజద్రోహానికి మరణశిక్ష తప్పదన్నారు. ఆ శిక్షను అమలు జరపమని జపాన్ సైన్యాధికారుల అదేశాలు అందగానే జపాన్ సైనిక మూకలు స్థంబానికి కట్టివేయబడి ఉన్న జుల్ఫీఖార్ మీద పాశవికంగా విరుచుక పడ్డారు. జుల్ఫీఖార్ చేసిన రాజద్రోహం నేరానికి గాను విధించిన మరణదండన అమలులో భాగంగా ఆయన మీద అధికారిక కిరాతక దాడి



Zulfikar Ali grave as on 04-07-2021in Aberdeen village of Andaman

ఆరంభమయ్యింది. తుపాకి మడమలతో ఇష్టానురీతిగా కొడుతుండగా, మరికొందరు తుపాకి బాయనెట్‌లతో జుల్ఫీఖార్ శరీరాన్ని తూట్లు పొడవసాగారు. మరికొందరు ఆయనను తమ ముష్టిఘాతాలకు గురిచేయసాగారు. ఆ మూకల రాక్షస చర్యలకు అడ్డూ–ఆపూ లేకపోవడంతో యధేచ్ఛగా అన్ని రకాల మారణాయుధాలను ఆయన శరీరం మీద ప్రయోగిస్తూ జుల్ఫీఖార్ అలీని చిత్రహింసలకు గురిచేసారు. యద్ధ విద్యలలో తమ కౌశల్యాన్ని ఆయన మీద ప్రయోగించారు. జుల్ఫీఖార్ అలీ శరీరం లోని ఎముకలు పట పటమని విరుగుతున్నా, శరీరం నుండి విడివడి మాంసం ముద్దలు వేలాడుతున్నా, రక్తం కారుతున్నా ఆపకుండా జపాన్ సైనికులు తమ రాక్షస క్రీడను కొనసాగిస్తూ వికృతానందం పొందసాగారు. ఆ కిరాతక చర్యలతో జుల్ఫీఖార్ శరీరం పూర్తిగా రక్తసిక్తమై మాంసపు ముద్దయ్యింది. శరీరం నుండి రక్తం స్రవించి ధారలు కడుతున్న కొద్ది భయకంపితులయిన గ్రామస్థుల కళ్ల వెంట కన్నీరు కాల్వలు కడుతుంటే జపాన్ సైనికులు మరింతగా రాక్షసానందం పొందసాగారు.

జుల్ఫీఖార్ అలీ శరీరంలో ఏమాత్రం కదలిక లేకుండా పొయినంత వరకు ఆ రాక్షసకాండ యధేచ్ఛగా సాగింది. అప్పటికి ఆయనను వదలి పెట్టని జపాన్ సైనికులు జుల్ఫీఖార్ చేతులను, కాళ్ళను తమ ఇష్టానురీతిగా మడిచి ఎముకలను విరిచేస్తూ కేరింతలు

కొట్టారు. ఆయన శరీరం మొత్తం నుజ్జు నుజ్జు అయ్యేంత వరకు తమ కిరాతక కాండకు జపాన్ సైనికులు స్వస్తి పలకలేదు. చివరకు జుల్ఫీఖార్ పూర్తిగా అచేతనుడయ్యాక 12 మందితో కూడిన జపాన్ ప్రత్యేక కాల్పుల దళం రంగంలోకి దిగింది. ఆ దళం సైనికులు స్థంభానికి వేలాడబడి నేలకు తాకుతున్న నిర్జీవుడు జుల్ఫీఖార్ అలీ శరీరాన్ని కూడా వదలి పెట్టలేదు. ఆయన భౌతికకాయం పట్ల కూడా దారుణంగా ప్రవర్తించారు. ఆయన మీద కాల్పులు జరిపి బుల్లెట్లతో శరీరాన్ని జల్లెడ జల్లెడ చేశారు. చివరకు ఆయన ఉచ్ఛ్వాస -నిశ్వాసలను పరీక్షించి జుల్ఫీఖార్ చనిపోయాడని పూర్తిగా నిర్ధారించుకున్నాక తమ రాక్షసకాండకు స్వస్తి పలికి రక్తసిక్తమయిన మృత్యుస్థలి నుండి జపాన్ సైనికులు నిష్క్రమించారు.

జుల్ఫీఖార్ అలీ మీద సాగిన భయానక రాక్షసకాండను చూస్తూ ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో కన్నీరు-మున్నీరవుతూ గడిపిన గ్రామస్థులు ఒక్కముమ్మడిగా జుల్ఫీఖార్ అలీ దేహం చుట్టూ చేరారు. గ్రామాన్ని విధ్వంసం నుండి కాపాడటానికి, గ్రామ మహిళల మానమర్యాదల రక్షణ కోసం భయంకర చిత్రహింసలను సహించి అసువులు బాసిన తమ ప్రియతమ బిడ్డడు, సాహసి, త్యాగమూర్తి జుల్ఫీఖార్‌కు శ్రద్ధాంజలి ఘటిస్తూ ఆయన అంత్యక్రియలలో పాల్గొన్నారు. అబెర్‌దీన్ గ్రామం ముద్దుబిడ్డ సన్నీ/సొన్ని (Sunny/Sonny)ని పుడమితల్లి గర్భంలో సమాధి చేసి బరువెక్కిన హృదయాలతో ఇళ్ళకు మళ్ళారు.

జపాన్ సైన్యాలు అండమానులో అడుగుపెట్టాక అండమాను ప్రజల ఆస్తులను, అండమాను ఆడపడుచుల మానమర్యాదలను పరిరక్షించే క్రమంలో పోరుబాటన సాగి, జపాన్ ముష్కర మూకల చేతిలో హతమయిన మున్షీ జుల్ఫీఖార్ అలీ అమరవీరునిగా చరిత్రకెక్కారు. జపాన్ సైనికుల అమానుషత్వాన్ని ఎదిరిస్తూ లొంగుబాటు కంటె మరణం మేలంటూ ధైర్యసాహసాలతో ఆత్మబలిదానానికి సిద్ధపడిన అండమాను బిడ్డడిగా జుల్ఫీఖార్ అలీ చరిత్రకారుల ప్రశంసలు అందుకున్నారు.

అండమాను ప్రజల ఆత్మ బలిదానాలను పేర్కొంటూ ప్రముఖ చరిత్రకారుడు Rabin Raychowdhury తన గ్రంథం 'Black Days in Andaman & Nicobar Islands' లో మున్షీ జుల్ఫీఖార్ అలీ ప్రత్యేకతను కొనియాడుతూ 'In the history of these Islands, Zulfquer Ali is the solitary example who preferred death to clemency. He was the only son of this soil who laid down his life to protest against the Japanese tyranny and prefered self-sacrifice to ignominious submission. His sacrifice was so great and glorious that he can not be compared to anybody else whoso-ever faced death during the Japanese occupation' (Page/121), అని శ్లాఘించారు.

అమర వీరుడు మున్షీ జుల్ఫీఖార్ అలీ బలిదానం సంఘటన తరువాత కూడా అండమానులో ప్రవేశించిన జపాన్ సైనికుల ఆగడాల వలన వేలాదిగా ప్రజలు నిర్బంధాలకు గురయ్యారు. అసంఖ్యాకంగా సెల్యులర్ జైలులో బంధించబడ్డారు, చిత్రహింసలకు గురయ్యారు, మూకుమ్మడి కాల్పులకు బలయ్యారు, నడి సముద్రంలో ముంచి వేయబడ్డారు. భారత జాతీయ సైన్యం, ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ సభ్యులు, ఆ సంస్థలకు అండమానులో ప్రాతినిధ్యం వహిస్తున్న నాయకులు కూడా మినహాయింపు ఏమాత్రం లేకుండా జపాన్ సైన్యం దుర్మార్గాలకు బలయ్యారు. ఈ యోధులంతా జపాన్ సైనిక వర్గాలకు వ్యతిరేకంగా, ఆంగ్లేయులకు అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నారన్న ప్రధాన నేరారోపణల మీద హత్యాకాండకు గురయ్యారు.

మున్షీ జుల్ఫిఖార్ అలీ మాత్రం జపాన్ సైన్యం అండమాను దీవులలో అడుగు పెట్టిన మూడవ రోజుననే జపాన్ సైనికులు ఆరంభించిన ఆగడాలను అరికట్టేందుకు, అండమాను మహిళల గౌరవాభిమానాల రక్షణకు పోరుబాటన సాగి, ఇరవై ఏండ్ల వయస్సులో అమరుడయిన ఆయన త్యాగాన్ని, ధైర్యసాహసాలను అండమాను-నికోబారు దీవుల ప్రజలు ఈనాటికి స్మరించుకుంటున్నారు. 1942 మార్చి 25 నాటి ఈ త్యాగపూరిత సంఘటనకు స్మారకంగా అండమాను దీవుల్లోని అబెర్‌దీన్ గ్రామం నడిబొడ్డున ఆనాడు నిర్మితమయిన అమర వీరుడు జుల్ఫీఖార్ అలీ మజార్ (సమాధి) ని ప్రజలు ఈనాటికి గౌరవప్రపత్తులతో సంరక్షించుకుంటున్నారు. ఆ మజార్ ఉన్న ప్రాంతం ఈనాడు అబెర్‌దీన్ ప్రధాన బజారు కూడలిలో భాగమయినప్పటికి జుల్ఫీఖార్ అలీ మజార్ కు ఏమాత్రం నష్టం కలగకుండా అధికారులు. ప్రజలు ఎప్పటికప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకుంటున్నారు. అండమాను-నికోబారు దీవుల సందర్శనకు ప్రపంచ వ్యాప్తంగా వస్తున్న యాత్రికులు 'ముక్తి స్థల్' (Mukthi Sthal) గా భావిస్తున్న 'సెల్యులర్ జైలు' (Cellular Jail) సందర్శనతోపాటుగా అమర వీరుడు మున్షీ జుల్ఫీఖార్ అలీ 'మజార్' ను సందర్శించి ఆయన ధైర్యసాహసాలను, ఆయన వీరోచిత చర్యను ఎంతో ప్రేమతో స్మరించుకుంటూ గౌరవమర్యాదలను ప్రకటిస్తున్నారు.◆

(This Article is based on the information received from number of interviews I had on phone with veteran educationist, historian, author of many books on Andaman Mr. M Ahmad Mujtaba (Port Blair, Andaman & Nicobar Islands),
Black Days in Andaman & Nicobar Islands,
(Rabin Raychowdhury, Manas Publications, New Delhi, 2004),
MAHNAMA INSHA (Urdu Magazine)
Published from Port Blair, May-June 2017
**and** some other documents and books.)



# ముహమ్మద్ అబ్దుల్ జలీల్

ఆంగ్లేయుల నుండి అండమాను ఆక్రమించుకున్న జపాన్ సైనికుల అరాచకాలకు బలయిన ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ (Indian Independence League) అండమాను దీవుల చెందిన నాయకులలో ముహమ్మద్ అబ్దుల్ జలీల్ (Muhammad Abdul Jalil) ఒకరు. అండమాను ప్రాంతపు పోర్టు బ్లెయర్ (Port Blair), అబెర్‌దీన్ బజార్ (Aberdeen Bazar) గ్రామంలో ఆయన 1909 జనవరి 31న జన్మించారు.

అబ్దుల్ జలీల్ తండ్రి పండిత ముహమ్మద్ నాజిర్ (Pandit Muhammad. Nazir). ఆయన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ యోధులు. ఆయన అసలు పేరు పండిత అయోధ్య రాయ్ శర్మ (Pandit Ayodya Rai Sarma). పండిత అయోధ్య రాయ్ తండ్రి పేరు పండిత జీవన్ రాయ్ (Pandit Jeevan Rai). ఆ తండ్రి-బిడ్డలు ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బరేలి (Breily) ప్రాంతానికి చెందిన సంస్కృత పండితులు. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సందర్భంగా బరేలి జైలులో జరిగిన తుపాకి కాల్పుల సంఘటనను పురస్కరించుకుని పండిత అయోధ్య రాయ్ శర్మకు ఆంగ్లేయ న్యాయస్థానం జైలుశిక్ష విధించింది. 1871 జనవరి మూడున అధికారులు ఆయనను అండమానుకు తరలించారు. అండమాను శిక్షాక్షేత్రంలో 20 ఏండ్లు గడిపిన తరువాత 1891లో ఆయనకు నుండి విముక్తి

లభించింది. ఆ తరువాత పండిత అయోధ్య రాయ్ శర్మ ఇస్లాం మతం పుచ్చుకుని షేక్ మసూద్ (Shaik Masood) కుమార్తె చాంద్‌బీబి (Chand Bibi) ని వివాహమాడారు. ఆ దంపతులకు తొమ్మిది మంది కుమారులు కలుగగా అందులో ముహమ్మద్ అబ్దుల్ జలీల్ ఒకరు. 1923 జూన్ 23న కన్నుమూసిన పండిత ముహమ్మద్ నాజిర్ బిడ్డలకు అండమానులో అందుబాటులో ఉన్న చదువును మాత్రమే కాకుండా వారిని బర్మా రాజధాని రంగూన్, అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయానికి కూడా పంపించి ఉన్నత చదువులు చెప్పించారు.

పండిత ముహమ్మద్ నాజిర్ మార్గదర్శకంలో ఆయన బిడ్డడు ముహమ్మద్ అబ్దుల్ జలీల్ అప్పటి బర్మా (Burma) ఇప్పటి మయన్మార్ (Mayanmar) రాజధాని రంగూన్ (Rangoon) లో ఉపాధ్యాయ శిక్షణ పూర్తి చేశారు. ఆ తరువాత పోర్టు బ్లెయర్‌లోని ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయునిగా నియుక్తులయ్యారు. ఉపాధ్యాయులుగా అబ్దుల్ జలీల్ తన బాధ్యతలను నిర్వహిస్తూ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence Leauge) అండమాను శాఖలో సభ్యులయ్యారు. ఆ తరువాత ఆయన 'లీగ్'లో పలు ప్రధాన బాధ్యతలను చేపట్టి ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన కార్యకలాపాలను చురుగ్గా నిర్వహించారు.

అబ్దుల్ జలీల్ ఉత్తమ ఉపాధ్యాయునిగా మాత్రమే కాకుండా ఆంగ్లేయ వ్యతిరేక ఉద్యమకారునిగా కూడా మంచి ప్రజాదరణ పొందారు. ఆయన కార్యకలాపాల పట్ల అనవసరపు అనుమానపు దృక్కులను పెంచుకున్న జపాన్ సైన్యాధికారులు 1943 అక్టోబర్ 22న అబ్దుల్ జలీల్‌ను అరెస్టు చేశారు. అండమానులోని సెల్యులర్ జైలులో ఆయనను నిర్బంధించి ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వమని జపాన్ సైన్యాధికారులు బలవంత పెట్టారు.

ఆంగ్లేయులకు అనుకూలంగా, జపాన్ సైన్యాలకు వ్యతిరేకంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టుగా ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వడానికి అబ్దుల్ జలీల్ ఏమాత్రం అంగీకరించ లేదు. ఆ కారణంగా జపాన్ సైనికులు ఆయనను చిత్రహింసల పాల్జేశారు. అనంతరం 1944 జనవరి 30న హోంఫ్రాయ్‌గంజ్ (Homfraygunj) వద్ద జపాన్ కాల్పుల దళం ఆయనను నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపింది. మాతృభూమి విముక్తి లక్ష్యంగా చేపట్టిన కార్యక్రమాల నిర్వహణలో అమరుడయిన ముహమ్మద్ అబ్దుల్ జలీల్ పార్థివ దేహాన్ని అండమాను లోని హోంఫ్రాయ్‌గంజ్ లో ఖననం చేశారు. ◆

# నవాబ్ అలీ ఖాన్ సాహెబ్

అండమాను దీవులలోని పోర్టు బ్లెయర్ ప్రాంతానికి చెందిన అబెర్‌దీన్ గ్రామం బజారు (Aberdeen Bazar) నివాసి నవాబ్ అలీ ఖాన్ సాహెబ్ (Nawab Ali Khan Saheb) 1884 జూలై ఒకటిన జన్మించారు. ఆయన తండ్రి పేరు వజీర్ అలీ (Wazir Ali). విద్యావంతుడయిన అలీ ఖాన్ సాహెబ్ ఆంగ్ల ప్రభుత్వంలోని పశు సంవర్ధక శాఖలో సహాయకుడిగా నియుక్తులయ్యారు. అండమాను ప్రజలకు తగిన విధంగా సేవలను అందిస్తూ అలీ ఖాన్ సాహెబ్ మంచి ప్రజాదరణను పొందారు.

1936లో ప్రముఖులు రయిజాదా హంస్‌రాజ్ (Raizada Hansraj), మొహమ్మద్ యాసిన్ ఖాన్ (Mohammad Yasin Khan) లు అండమాను లోని పోర్టుబ్లెయర్ వచ్చిన సందర్భంగా స్థానిక Local Born Association Hall లో ఏర్పాటు చేసిన కార్యక్రమం నిర్వహణలో అలీ ఖాన్ సాహెబ్ ప్రధాన పాత్ర నిర్వహించారు. ఈ సందర్భంగా ప్రముఖులను ఆహ్వానించి స్వాగతించిన గౌరవాన్ని ఆయన పొందారు. ప్రభుత్వ ఉద్యోగ విరమణ తరువాత ఆయన విద్వత్తు, ప్రజలలో ఉన్న గౌరవమర్యాదలను గమనించిన ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను మూడవ తరగతి గౌరవ న్యాయమూర్తిగా నియమించింది.

ఆంగ్లేయ వలసపాలకుల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) పట్ల ఆకర్షితులయిన ఆయన అండమానులో లీగ్ శాఖను ఏర్పాటు చేయటంలో ఎనలేని కృషి చేశారు. అండమానులో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' స్థాపించడం మాత్రమే కాకుండా 'లీగ్' విస్తరణకు పలు విధాల శ్రమించారు. అండమానులోని పోర్టు బ్లెయర్‌లో 'లీగ్' శాఖ ఏర్పడిన తరువాత 'లీగ్' కార్యక్రమాల నిర్వహణ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించిన అలీ ఖాన్ సాహెబ్ 'లీగ్' కు అన్నీ తానై బహుముఖ పాత్రను నిర్వహించారు.

1939లో ఆరంభమయిన ద్వితీయ ప్రపంచ యుద్ధం తొలిదశలో విజయపతాక ఎగరేసిన జపాన్ సైన్యం రంగూన్‌ను స్వాధీనం చేసుకున్నాక 1942 మార్చి 23న అండమానుకు ప్రాణప్రదమయిన పోర్టు బ్లెయర్‌ను ఆక్రమించుకుంది. ఆ తరువాత 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence Leauge) నాయకులు, కార్యకర్తలను అనుమానపు దృక్కులతో చూడసాగింది. అనుమానితుల పట్ల జపాన్ సైనికులు కఠినంగా వ్యవహరిస్తూ క్రూర శిక్షలకు గురి చేయసాగారు. జపాన్ సైనికుల కిరాతక చర్యల వలన ఆండమాను ప్రజలలో భయోత్పాతం నెలకొంది. ఆ విపత్కర పరిస్థితులలో అలీ ఖాన్ సాహెబ్ ప్రజల పక్షం వహించి బాధితులకు అండగా నిలిచారు. అండమాను ప్రజల పట్ల జపాన్ సైన్యం వ్యవహరిస్తున్న తీరుతెన్నులను ఆయన బహిరంగంగా నిరసించారు, విమర్శించారు. జపాన్ సైన్యాధికారులు అండమానులోని ప్రజలను, లీగ్ కార్యకర్తలను మూకుమ్మడిగా నిర్బంధాల పాల్జేయడం, చిత్రహింసలు పెట్టడం, పలు రకాలుగా ఇక్కట్లు కల్గించటం లాంటి అమానుష చర్యలను ఆయన అత్యంత తీవ్రంగా విమర్శించారు.

ప్రజల పక్షం వహించి సందర్భానుసారం జపాన్ సైన్యాధికారులను తీవ్రంగా విమర్శించడానికి కూడా ఏమాత్రం వెనుకాడని అలీ ఖాన్ పట్ల జపాన్ సైన్యాధికారులు ఆగ్రహించారు. ప్రజలను ఇక్కట్ల పాల్జేస్తున్న జపాన్ సైనికులను విమర్శిస్తున్న అలీ ఖాన్ సాహెబ్ ను జపాన్ సైనిక బృందం నిర్బంధించింది. ఆయనను కొంతకాలం సెల్యులర్ జైలులో బంధించి ఏ కారణంగానో విడుదల చేసింది. 1943 అక్టోబరులో మరోమారు అలీ ఖాన్ ను అరెస్టు చేసిన జపాన్ సైన్యాధికారులు ఆయనను సెల్యులర్ జైలులో బంధించారు. చివరకు జపాన్ సైన్యాధికారుల ఆదేశాల మేరకు జపాన్ సైనిక బృందం ఆయన మీద సాగించిన భయానక హింసాకాండ, క్రూరచర్యల మూలంగా నవాబ్ అలీ ఖాన్ సాహెబ్ సెల్యులర్ జైలులో 1945 జూలై మాసంలో చివరిశ్వాస విడిచారు.◆



# యం. అబ్దుల్ ఖాలిఖ్

ఆంగ్ల ప్రభుత్వం పక్షాన అండమానులోని జపాన్ సైనిక వ్యవహారాల మీద గూఢచర్యం జరుపుతున్నారన్న అసత్య అభియోగం మీద జపాన్ సైనిక దళాల క్రూరత్వానికి బలయిపోయిన 'ఏడుగురు దుగ్నాబాద్ అమరయోధుల'లో (Seven Martyrs of Dugnabad) యం. అబ్దుల్ ఖాలిఖ్ (M. Abdul Khalique) ఒకరు. 1921 జూన్/ఆగస్టు 26న జన్మించిన అబ్దుల్ ఖాలిఖ్ అండమానులోని అబెర్‌దీన్ (Aberdeen Bazar) నివాసి. ఆయన తండ్రి పేరు యం. అబ్దుల్ రవూఫ్ (M. Abdul Rauf). అండమాను లోప్రాథమిక విద్య తరువాత బర్మా రాజధాని రంగూన్‌లో అబ్దుల్ ఖాలిఖ్ ఉన్నత విద్యను పూర్తిచేసి అబెర్‌దీన్ వచ్చి ప్రభుత్వ వాతావరణ విభాగం (Meteorogical Department) లో ఉద్యోగం చేపట్టారు. ఆయన జైతున్ (Zaitoon) ను వివాహమాడగా, ఆ దంపతులకు మెహరూన్ (Mehroon), నజ్మూన్ (Najmoon) అను బిడ్డలు కలిగారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధుల వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న అబ్దుల్ ఖాలిఖ్ మాతృభూమిని ఆంగ్లేయుల నుండి విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) పట్ల ఆకర్షితులయ్యారు. అండమాను లోని పోర్టు బ్లెయర్ కార్యక్షేత్రంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజానీకాన్ని

కూడగడుతున్న 'లీగ్' లో చేరిన అబ్దుల్ ఖాలిఖ్ లీగ్ కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆయన కార్యకలాపాల పట్ల అనుమానపు దృక్కులు సారించిన జపాన్ సైన్యాధికారులు తమ సైనిక కార్యకలాపాల రహస్యాలను అబ్దుల్ ఖాలిఖ్ ఆంగ్ల ప్రభుత్వానికి చేరవేస్తున్నారని భావించారు.

ఈ మేరకు అబ్దుల్ ఖాలిఖ్ మీద అసత్య అభియోగాన్ని మోపి ఆయనను కుటుంబ సభ్యుల సమక్షంలో 1943 జనవరి 23న అరెస్టు చేసారు. ఆయన పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరిస్తూ సెల్యులర్ జైలుకు తరలించారు. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వాల్సిందిగా ఆయన మీద ఒత్తిడి తెచ్చారు. అసత్య అభియోగాన్ని ఆరంభంలో ఆయన అంగీకరించక పోవడంతో ఆగ్రహించిన జపాన్ సైన్యాధికారులు అయనను భయంకర చిత్రహింసలకు గురిచేసారు. ఆ రాక్షసకాండను సహించ లేకపోయిన ఆయన జపాన్ సైనిక ఆధికారుల ఒత్తిడి మేరకు ఒప్పుదల వాంగ్మూలం మీద సంతకం చేశారు. ఆ వాగ్మూలం ఆధారంగా జపాన్ సైనిక న్యాయస్థానం అబ్దుల్ ఖాలిఖ్‌కు మరణదండన విధించింది.

జపాన్ సైనిక వ్యవహారాల మీద గూఢచర్యం సాగిస్తున్నారన్న నేరారోపణల మీద విచారణ జరిపి మరణదండన విధించబడిన అండమానుకు చెందిన ప్రముఖులు, సైనిక పోలీసు విభాగానికి చెందిన ఇత్తర్ సింగ్ (Itter Singh), ఛోటా సింగ్ (Chotta Singh), సుబేదార్ మేజర్ సుభాఖాన్ (Subedar Major Subha Khan), ఉన్నతాధికారులు గోపాల కృష్ణ (Gopala Krishna), నారాయణ రావు (Narayana Rao), వైద్యసేవలను అందిస్తున్న డాక్టర్ సురేంద్రనాథ్ (Dr Surendra Nath Nag) లతో అబ్దుల్ ఖాలిఖ్ ని కలిపి మొత్తం ఏడుగురికి జపాన్ సైనిక న్యాయస్థానం విధించిన మరణశిక్ష అమలుకు జపాన్ సైన్యాధికారులు ఏర్పాట్లు ఆరంభించారు. అండమాను ప్రజలు గౌరవాభిమానాలతో 'ఏడుగురు దుగ్నాబాద్ అమరయోధుల' అంటూ పిలువబడిన ఆ ఏడుగురిని అండమానులోని దుగ్నాబాద్ తీరానికి (Dugnabad Shore) తరలించి జపాన్ రాజ్య కాల్పుల దళం (Japan Imperial Firing Squad) 1943 మార్చి 30న అత్యంత క్రూరంగా ఆ యోధులను కాల్చి చంపింది.

ఈ మేరకు జపాన్ సైన్యాధికారుల దాష్టీకానికి బలయినటువంటి యం. అబ్దుల్ ఖాలిఖ్‌తో పాటుగా మిగిలిన అమరవీరుల అమరత్వం నిరంతరం స్మరణకు వచ్చేలా దుగ్నాబాద్ వద్ద 'దుగ్నాబాద్ అమర వీరుల స్మారకం' (Seven Martyrs of Dugnabad Memorial) నిర్మించుకున్న అండమాను ప్రజలు ఈనాటికి కూడా ఆ ఆమర వీరుల పట్ల గౌరవప్రపత్తులను వ్యక్తంచేస్తూ ఆ యోధుల త్యాగాలను స్మరించుకుంటున్నారు.◆



# యం. అబ్దుల్ గఫూర్

అండమాను-నికోబారు దీవులను ఆంగ్లేయుల నుండి జపాన్ సైన్యాలు స్వాధీనం చేసుకున్నాక సైనికులు సాగించిన అఘాయిత్యాలకు భార్యతో సహా జైలు పాలయ్యి, భయంకర చిత్రహింసలకు గురైన ఉపాధ్యాయులు, ఉద్యమకారులు యం. అబ్దుల్ గఫూర్ (M. Abdul Gafoor) 1910 మార్చి ఒకటిన అండమాను దీవుల సముదాయంలోని రోజ్ ఐల్యాండ్ (Rose Island) లో జన్మించారు. అబ్దుల్ గఫూర్ తండ్రి పండిత ముహమ్మద్ నాజిర్ (Pandit Muhammad Nazir). ఆయన సంస్కృత పండితులు, స్వాతంత్ర్య సమరయోధులు.

పండిత ముహమ్మద్ నాజిర్ అసలు పేరు పండిత అయోధ్య రాయ్ శర్మ (Pandit Ayodya Rai Sarma ). ఆయన తండ్రి పేరు పండిత జీవన్ రాయ్ (Pandit Jeevan Rai). ఆ తండ్రి-బిడ్డలు ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బరేలి (Breily) ప్రాంతానికి చెందిన గొప్ప సంస్కృత పండితులు. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం సందర్భంగా బరేలి జైలులో జరిగిన తుపాకి కాల్పుల సంఘటనలో పండిత అయోధ్య రాయ్ శర్మ మీద అభియోగాలు మోపిన ఆంగ్లేయ న్యాయస్థానం ఆయనకు యావజ్జీవిత కారాగారశిక్ష విధించింది. ఆ కారణంగా 1871 జనవరి మూడున ఆంగ్లేయాధికారులు ఆయనను అండమాను శిక్షాక్షేత్రం తరలించారు. అండమానులో 20 ఏండ్లు గడిపిన తరువాత 1891లో ఆయనకు విముక్తి

లభించింది. ఆ తరువాత పండిత అయోధ్య రాయ్ శర్మ ఇస్లాం మతం పుచ్చుకుని చాంద్‌బీబి (Chand Bibi) ని వివాహమాడారు. ఆ దంపతులకు తొమ్మిది మంది కుమారులు, ఇరువురు కుమార్తెలు కలుగగా కుమారులలో చివరివారు ముహ్మద్ అబ్దుల్ గఫూర్. బిడ్డలకు ఉన్నత చదువులు చదివించిన పండిత ముహ్మద్ నాజిర్ 1923 జూన్ 23న కన్నుమూసారు.

అండమానులో ప్రాథమిక విద్యను పూర్తి చేసిన అబ్దుల్ గఫూర్ ఉన్నత విద్య కోసం బర్మా రాజధాని రంగూన్ వెళ్ళారు. రంగూన్‌లోని Anglo-Vernacular High school నుండి ఉన్నత పాఠశాల విద్యను ఆయన 1930లో పూర్తి చేశారు. ఆ తరువాత తిరిగి అండమాను చేరుకుని 1930 జూన్ ఒకటిన అండమానులో ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులుగా ఉద్యోగం చేపట్టారు. ఆ తరువాత మళ్ళీ రంగూన్ వెళ్ళి Baptist School నుండి ప్రత్యేకంగా ఉపాధ్యాయ శిక్షణ పొంది అండమాను తిరిగి వచ్చిన అబ్దుల్ గఫూర్ Middle School Teacher గా 1941 మే మూడున పదోన్నతి పొందారు.

1943లో అండమాను దీవులను జపాన్ ఆక్రమించినాక ఆంగ్ల పాలకుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న లక్ష్యంతో ఉద్యమిస్తున్న 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' (Indian Independence League) కార్యక్రమాల పట్ల ఆయన మొగ్గు చూపారు. ఒకవైపున ఉపాధ్యాయునిగా బాధ్యతలు నిర్వహిస్తూ మరోకవైపున ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు పండిత ముహ్మద్ నాజిర్ (Pandit Muhammad.Nazir) బిడ్డడిగా ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాల పట్ల అబ్దుల్ గఫూర్ ఆసక్తి చూపారు.

ఆంగ్లేయుల అధికారం నుండి అండమాను దీవులు విముక్తి పొంది జపాన్ సైన్యాల ఆధీనంలోకి వచ్చాక ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ (Indian Independence Leauge) శాఖలు అండమానులో విస్తృతంగా ఏర్పాటు అయ్యాయి. ఆ క్రమంలో అబ్దుల్ గఫూర్ ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ సభ్యత్వం చేపట్టి లీగ్ కార్యక్రమాల నిర్వహణలో చురుగ్గా పాల్గొనసాగారు.

అండమానులో ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ కార్యక్రమాల నిర్వహణకు పోర్టు బ్లెయర్ కార్యక్షేత్రంగా చేసుకున్న అబ్దుల్ గఫూర్ లీగ్ కార్యకలాపాలను ముమ్మరం చేశారు. ఆయన కృషి, నిబద్ధత, కార్యదక్షత గురించి తెలుసుకున్న ఇండియన్ నేషనల్ ఆర్మీ అధికారి మేజర్ అల్వీ (Major Alvi) ద్వారా ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, ఇండియన్ నేషనల్ ఆర్మీ (Indian National Army) కార్యక్రమాల ప్రచార అధికారిగా (Propaganda Officer) 1943 ఆయన మార్చి 30న నియుక్తులయ్యారు. ఇండియన్ నేషనల్ ఆర్మీ అధికారి మేజర్ అల్వీ

మార్గనిర్దేశకత్వంలో అండమానులోని సౌత్ పాయింట్ (South Point) ఏరియాను ప్రధాన కార్యక్షేత్రంగా చేసుకుని అండమాను–నికోబారు దీవులలోని పలు ప్రాంతాలకు ప్రచార సామగ్రిని (Publicity Material) పంపిణి చేయాల్సిన బాధ్యతలను ఆయన సమర్ధవంతంగా నిర్వహించటమే కాకుండా ప్రచార కార్యక్రమాల నిర్వహణను కూడా అబ్దుల్ గఫూర్ తన సహచరులతో కలసి ముమ్మరంగా చేసారు.

ఆంగ్లేయుల నుండి అండమానును స్వాధీనం చేసుకున్న జపాన్ సైన్యాలు తొలుత 'ఆసియా ఆసియావాసులది' (Asia is for Asians only) అని ప్రకటించాయి. బ్రిటన్ మిత్రరాజ్యాల (Allied Powers) అక్షరాజ్యాల  (Axis Powers) మధ్య సాగుతున్న రెండవ ప్రపంచ యుద్ధం తొలిదశలో విజయ పరంపరను సాగించిన జపాన్ సైన్యం మలిదశలో పరాజయాల పరంపరను చవి చూడసాగింది. ఆ క్రమంలో అండమానులోని జపాన్ సైన్యానికి ఆహారం, ఆయుధాలు సరపరా అవుతున్న మార్గాల మీద ఆంగ్ల సైన్యాలు గురి తప్పకుండా దాడులు చేస్తుండటం వలన అండమాను ప్రజానీకం మీద జపాన్ సైన్యాధికారులకు అనుమానం కలిగింది. ఆ అనుమానం పెనుభూతమయ్యి అండమాను ప్రజలను ఇక్కట్ల పాల్జేసింది. పరాజయం అంచులకు చేరుకుంటున్న జపాన్ సైన్యాలు అసహనం–అసంతృప్తితో రగిలిపోతూ అండమాను ప్రజలను ఆంగ్లేయ గూఢచారులుగా అనుమానించారు.

అబ్దుల్ గఫూర్ చర్యల మీద, ఆయన నిర్వహిస్తున్న ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, ఇండియన్ నేషనల్ ఆర్మీ కార్యక్రమాల మీద జపాన్ సైనిక బృందం అనుమానపు దృక్కులు సారించింది. 1944 జూలై 13న ప్రస్తుతం అండమానులోని ANIIDCO Building పక్కన ఉన్న పర్వత ప్రాతంలో అబ్దుల్ గఫూర్ తన భార్య హాఫీజున్నీసా (HafiZ-un-Nisa), కుమార్తె ఉమ్మెసల్మా (Um-e-Salma) లతో కలసి పశువులను మేపుకుంటున్న సమయాన జపాన్ సైనిక బృందం ఆయన వద్దకు చేరుకుంది. అబ్దుల్ గఫూర్‌ను పలు ప్రశ్నలతో వేధించి ఆయనను నిర్బంధించి అబెర్‌దీన్ పోలీసు స్టేషన్‌కు తరలించింది. ఆ పోలీసు స్టేషన్‌లో కొంతసేపు ఉంచి అక్కడ నుండి సెల్యులర్ జైలుకు తీసుకెళ్ళి బంధించింది. ఆ సెల్యులర్ జైలు గదిలో అబ్దుల్ గఫూర్‌ను నాలుగున్నర నెలలపాటు నిర్బంధించి గూఢచర్యాన్ని అంగీకరిస్తూ ఒప్పుదల వాంగ్మూల పత్రం మీద సంతకాలు చేయాల్సిందిగా బలవంతం చేస్తూ జపాన్ సైనికులు భయానక చిత్రహింసలకు గురిచేశారు.

అబ్దుల్ గఫూర్‌ను సెల్యులర్ జైలులో చిత్రహింసలకు గురిచేస్తున్న సమయంలో ఆయన భార్య హాఫీజున్నీసా (Hafiz-Un-Nisa) ను కూడా జపాన్ సైన్యాధికారులు వదలలేదు.

ఆమెను కూడా 1944 ఆగస్టు 20న నిర్బంధించి తెచ్చి సెల్యులర్ జైలులో పడేసారు. ఆమె పట్ల కూడా అత్యంత దాష్టీకంగా వ్యహరించిన జపాన్ సైనికులు తమ క్రూరత్వాన్ని చాటుకున్నారు. 1944 ఆగస్టు 20 నుండి 1944 సెప్టెంబర్ 12 వరకు ఆమెను సెల్యులర్ జైలు గదిలో బంధించి ఉంచి భయానక చిత్రహింసల పాల్జేసారు. చివరకు 1944 సెప్టంబర్ 12న హాఫీజున్నీసా ను జైలు నుండి విడుదల చేశారు.

ఆమె భర్త అబ్దుల్ గఫూర్ ను మాత్రం జపాన్ సైనికులు వదిలిపెట్టలేదు. ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలంగా గూఢచర్యానికి పాల్పడుతున్నట్టు ఒప్పుదల వాంగ్మూలం ఇవ్వాల్సిందేనని జపాన్ సైనికులు ఆయనను బలవంతం పెట్టసాగారు. జపాన్ సైనికుల చిత్రహింసలను భరిస్తూ గడిపిన అబ్దుల్ గఫూర్ నేరం ఒప్పుదల పత్రం మీద సంతకం చేయనందున జపాన్ సైనికులు ఆయనను మరింతగా చిత్రహింసల పాల్జేశారు.

చివరకు జపాన్ సైనికులు ఆయనను విడుదల చేశారు. జపాన్ సైనిక బృందం భయంకర చిత్రహింసల నుండి విముక్తమయిన అబ్దుల్ గఫూర్ 1944 డిసెంబర్ 30న తన సోదరులు యం. అబ్దుల్ రవూఫ్ (M Abdul Rauf) ఇంటికి చేరుకున్నారు. అబ్దుల్ గఫూర్ రాక కోసం ఆయన కుటుంబీకులంతా అక్కడ ఎదురు చూస్తున్నారు. జపాన్ సైనికుల చేతుల్లో కోడలు హాఫీజున్నీసా (Hafiz-un-Nisa) చవిచూసిన భయానక చిత్రహింసలకు మించిన భయంకర చిత్రహింసలను అనుభవించిన తన కుమారుడు అబ్దుల్ గఫూర్ ఇంటికి వస్తుండగా ఆయన తల్లి చాంద్‌బీబి (Chand Bibi) తనయుడి రాక కోసం ఆత్రుతతో ఎదురు చూడసాగారు. ఆ ఎదురు తెన్నులకు ముగింపు పాడుతూ తనయుడు అబ్దుల్ గఫూర్ ఇంటికి రాగానే ఆయనను కౌగలించుకుని కన్నీరుగార్చిన చాంద్‌బీబి కుమారుడి ఒడిలోనే ఆకస్మికంగా కన్నుమూసారు. అబ్దుల్ గఫూర్ ఇంటికి క్షేమంగా వచ్చినందున సంతోష సముద్రంలో మునిగి తేలాల్సిన ఆ కుటుంబం తమ కుటుంబ పెద్ద చాంద్‌బీబి ని ఊహించని విధంగా కొల్పోయి శోకసముద్రంలో మునిగిపోయింది.

ఉత్తమ ఉపాధ్యాయునిగా మాత్రమే కాకుండా స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబీకునిగా, క్రమశిక్షణతోపాటుగా నిర్దిష్ట నియమ-నిబద్ధతల సమరయోధునిగా, 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' నేతగా అండమాను ప్రజల గౌరవాభిమానాలను సొంతం చేసుకున్న యం. అబ్దుల్ గఫూర్ స్వల్ప అస్వస్థత తరువాత 1971 మార్చి 12న కన్నుమూసారు. ఆయన అంత్యక్రియలు అండమానులోని Phoenix Bay వద్ద బంధుమిత్రుల సమక్షంలో జరిగాయి. ◆

# ఆధార గ్రంథాలు




## తెలుగు గ్రంథాలు – BOOKS IN TELUGU :

01. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి, 1999.
02. 1857 : ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, హైదరాబాద్. 2008.
03. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, హైదరాబాద్, 2007.
04. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి, 2010.
05. భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు (ప్రథమ భాగం), సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి, 2005.
06. చరితార్థులు (1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వలస పాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్న భారత ఉపఖండంలోని 155 మంది ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల చిత్రపటాలు, సంక్షిప్త వివరాలు), సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్. ఉండవల్లి, 2014.
07. భారత స్వాతంత్ర్య సాయుధ సమర చరిత్ర, పడాల రామారావు, విశాలాంధ్ర,1990.
08. అండమాన్ జైలులో స్వాతంత్ర్య వీరులు, సుధాంశుదాస్ గుప్తా, ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాద్, 1984.

## ఆంగ్ల గ్రంథాలు - BOOKS IN ENGLISH :

01. A History of Our Relations with The Andamanese, MV Portman, Office of the Superintendent of Government Printing, India, Calcutta, 1899.

02. The Andaman Islands, FAM Das, Good Shepherd Convent Press, Bangalore, 1937.

03. The Tale of My Exile, Bariundra Kumar Ghosh, Arya Office, Pondichery, 1822.

04. Andaman and Nicobar Islands, (Imperial Gazetteer of India) Office of the Superintendent of Government Printing, India, Calcutta, 1909.

05. The Silent Past of Andamans-Few Freedom Fighters of 1857, Ahmad Mujtaba, Port Blair, 2005.

06. Unsung Heroes of Freedom Struggle in Andamans-Who's Who, Com piled and Edited by Rashida Iqbal, Directorate of Youth Affairs, Sports and Culture, Andaman & Nicobar Admistration, Port Blair, 2004.

07. The Heroes of Cellular Jail, S N Aggarwal, Rupa Publications, New Delhi, 2018.

08. Twelve Years of Prison Life, Ullaskar Dutt, The Arya Publishing House, Calcutta, 1924.

09. Kalapani (History of Andaman & Nicobar Islands with a Study of India's Freedom Struggle), L.P Mathur, Eastern Book Corporation, Delhi, 1985.

10. Roads to Freedom (Prisoners in Colonial India), Mushirul Hasan, OUP, New Delhi, 2016.

11. Andaman and Nicobar Islands (A Saga of Freedom Struggle). RVR Murthy, Kalpaz Publications, Delhi, 2011.

12. History of the Andaman and Nicobar Islands (1756-1966), Mathur L.P, Sterling Publishers, Jullundur, 1968.

13. My Transportation for Life, Veer Savarkar, Prabhat Prakashan, New Delhi, 2020.

14. Cellular Jail of Andaman and Nicobar Islands, Amit Rai Jain, Shree Publishers & Distributors, New Delhi, 2017.

15. Black Days in Andaman & Nicobar Islands, Rabin Raychowdhury, Manas Publications, New Delhi, 2004.

16. Cellular Jail (Cells Beyond Cells), Priten Roy and Swapnesh Choudhury, Farsight Publishers & Distributors, Delhi, 2016.

17. Mopilla Muslims of Kerala - Ronald E Miller, Orient Longman, Madras, 1976.

18. Indian Revolutionaries (1757-1961), Volume 1 to 5, Shrikrishan 'Saral', Ocean Books Pvt. Ltd., New Delhi, 1999.

19. A Misunderstood Legacy : VD Savarkar and the Creation of Hinduthva, Julia Kellely Swifit, Wesleyan University, 2015.
20. Indian Musalmans, W.W. Hunter, Trubner & Company, Londan, 1876.
21. Ghadar Movements: Original Documents-Soldiers' Revolts (Volume-4), Malwinder Jit Singh Waraich & Harish Jain, Unistar,Chandigarh, 2013.
22. The Indian War of Independence 1857, Veer Savarkar, Abhishek Publications, Chandigarh (India), 2021.
23. South India in 1857 War of Independence, Dr V.D. Divekar, SAKSHI, (Sri Aurobindo Kapasi Sastry Institute of Vedic Culture), Bangalore, 2019.
24. Freedom Movement and Indian Muslims, Shantimoy Ray, People's Pubishing House Pvt. Ltd., New Delhi,1983.
25. Penal Settlement in Andaman, R.C. Majumdar, The Ministry of Education and Social Welfare, Government of India, Delhi, 1975.
26. History of Freedom Movement in India - Tarachand, Four Vols., Govt. Publications, New Delhi, 1992.
27. Who is Who Indian Martyrs - Dr. P.N. Chopra, Govt. of India Publications, New Delhi,
28. Wahabi and Farazi Rebels of Bengal - Narahari Kaviraj, People's Publishing House, 1982.
29. History of Freedom Movement in India, RC Majumdar, Calcutta, 1962.
30. Eminent Indian Freedom Fighters, Three Volumes , S.K Sharma, Anmol Publications Pvt. Ltd., New Delhi, 2004.
31. Veer Savarkar, Dhanunjay Keer, Popular Prakashan, Bombay, 1966.
32. Muslims In India, A Biographical Dictionary, Edited by Naresh Kumar Jain, Volumes I and II, Manohar, New Delhi, 1983.
33. Encyclopedia of Muslim Biography, (India, Pakistan, Bangaldesh), Edited by Five Volumes, APH Publishing Coorporation, New Delhi, 2001.
34. History of School Education in Andaman & Nicobar Islands, M. Ahmed Mujtaba (Alig), Insha Publications, Kolkata, 2015.
35. Memories of Andman & Nicobar Islands, M Ahmed Mujtaba (Alig), Insha publications, Kolkata, 2013.
36. Andaman and Nicobar Islands, RR Tamta, National Book Trust of India, New Delhi, 1991.
37. Patriots of Andaman in Freedom Movement (1942-1945), Gauri Shankar Pandey, Homfraygunj Martyrs'Memorial Committee, Kolkata.

## ఆంగ్ల వ్యాసాలు : ARTICLES IN ENGLISH :

01. Ambala Conspiracy Case of 1864 : Moulana Mohammad Jafar Thanesari, by Aijaz Ahamd, Indian Streams Research Journal, Solapur, Vol 4, Issue 4, May 2014.

02. The Moplah Rebellion and Andamans (Moplah Colonisation Scheme 1921-30) By PK Zubair Ahmed, Editor : The Light of Andaman, BEING ISLANDER, weekly , SUNDAY , SEPTEMBER 2, 2012, Published from Port Blair, Andaman.

03. Travel & Nation : Moulana Jafar Thanesari as a Mutiny Convict by Prof. Seema Alvi, Dept of History and culture, JMI, New Delhi.

04. Freedom Fighters or Criminals? Post-colonial Subjectivities in the Andaman Islands, South-East India, Philipp Zehmischm, Kontur, 22 – 2011

## బెంగాలి గ్రంథాలు - BOOKS IN BENGALI :

01. Cellular Jail, E. Nirbasitg Biplobidder Katha ( An Account of Revolutio -naries Detained in Cellular Jail) by Anup Dasguptha, Shishu Sahitya Samsad Pvt Ltd., Kolkata, 2016.

## హిందీ గ్రంథాలు – BOOKS IN HINDI

01. Kalapani, Vinayak Damodar Sawarkar, Prabhath Prakashan, New Delhi, 2020.

02. Hindushstani Musalmaanonka Jung-e-azad me Hissa, Sayyad Ibrabim Fikri, Published with the Indian Government finacial support, New Delhi, 1999.

03. Bhagi Hindusthan, Dr. Nuzhath Fhathma, Sahithya Sangam, Alahabad, 2016.

04. Jama Masjid Aberdeen (1872-2020), M Ahmed Mujtaba (Alig), Insha publications, Kolkata, 2005.

05. Saat Mashhoor Hastiya ki Shahadat Dignabad Mein, M. Ahmad Mujtaba, Insha Publications, Kolkata, 2019.

06. Ektha Andaman me, M. Ahmed Mujtaba (Alig), Insha publications, Kolkata, 2005.

## ఉర్దూ గ్రంథాలు – BOOKS IN URDU


01. Zajariya-e-Andaman-o-Nicobar, M Ahmed Mujthaba, Port Bliar, Andaman-Nicobar Islands, 2016

02. Sangharsh Azadi-e- Hind aur Phirangiyonse Nejath, MR Zama Ejaji.

03. Thehirik-e-Azadi-e- Hind Me Muslim Ulema aur Awamka Kirdar, Salman Mansoorpuri, Mushirabad, Hijri 1423.

04. Thehirik-e-Azado aur Muslman, Aseera Darvi, Devbund, 1997.

05 Gumnam Mujahid e Azad : Sher Ali Khan Afridi, Dr. Mohammed Shahid Siddiqui Ailg., All India Urdu Talim Ghar, Lucknow, 2021.


## Websites :


01. https://www.wdl.org/en/item/9698/view/1/207/

02. https://www.andaman.gov.in/

03. https://www.cabaltimes.com/2015/07/26/cellular-jail-andaman/

01. https://historicalleys.blogspot.com/2012/09/the-moplh-resettlement-at-andaman.html

04. http://being-islander.blogspot.com/2012/09/the-moplah-rebellion-and-andamans_2.html

05. http://eprints.lse.ac.uk/32803/1/Sherman_From_hell_paradise_2009.pdf

06. https://www.facebook.com/Andaman.Nicobar/posts/10155101190825216

07. https://www.facebook.com/Andaman.Nicobar/photos/pcb.10155101190825216/10155101189985216

08. https://core.ac.uk/download/pdf/217896.pdfhttps:/www.jagritbharat.com/ why-the-cellular-jail-in-andaman-should-dis turb-our-conscience/

09. http://proud2bindiangroup.blogspot.com/2011/05/indian-freedom-fighters-in-andaman.html

10. https://kontur.au.dk/fileadmin/www.kontur.au.dk/Kontur_22/ZEHMISCH_MOD1.pdf

11. https://historicalleys.blogspot.com/2012/09/the-moplah-resettlement-at-andaman.html

12. http://www.millenniumpost.in/opinion/the-forgotten-occupation-264874

13. https://en.wikipedia.org/wiki/Japanese_occupation_ of_the_ Andaman _Islands
14. https://en.wikipedia.org/wiki/Homfreyganj_massacre
15. https://yourstory.com/2017/08/cellular-jail-andaman-islands/amp
16. https://whc.unesco.org/en/tentativelists/5888/
17. http://www.indianculture.gov.in/history-andaman-and-nicobar-islands-1756-1966
18. https://www.wdl.org/en/item/9698/view/1/9/

## Youtube Channels :

01. https://www.youtube.com/watch?v=JgJCLPqy7og
02. https://www.youtube.com/watch?v=k9E5MOS_4bk
03. https://www.youtube.com/watch?v=M-dJyYI1vTI
04. https://www.youtube.com/watch?v=k9E5MOS_4bk&t=166s
05. https://www.youtube.com/watch?v=S7t4C0MT4Kw

## THANK YOU

My heartfelt thanks to the following personalities who helped me in different ways during the preparation of **ANDAMAANU JAILU : MUSLIM FREEDOM FIGHTERS.**

**Dr. Rashida Eqbal** (Asstt. Director : Department of Art and Culture, Cellular Jail, Port Blair, Andaman Nicobar Islands), **Mr. M. Ahmad Mujtaba** (Author, Port Blair, Andaman & Nicobar Islands), **Mr. Anup Dasguptha** (President: Ex-Andaman Political Prisoner's fraternity Circle, Kolkata, West Bengal), **Mrs. Samira Begum** (Aberdeen, Port Blair, Andaman & Nicobar Islands), **Dr. Suhail Ahmad Wani** (Indore, Madhya Pradesh), **Mr. Mohammed Zuhair E** (Iringattiri, Malappuram Dist., Kerala), **Mr. Bhuvanagiri Venkata Krishna Purnanandam** (Guntur, AP), **Mr. Abul Fouzan** (Karimnagar, Telangana), **Mr. Madiraju Govardhana Rao** (Mangalagiri, Andhrapradesh), **Mr. Syed Azmathullah Beyabani,** (Hyderabad, Telangana) **.**

**- Syed Naseer Ahamed**



భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల మహత్తరపాత్రను వివరిస్తున్న

# సయ్యద్ నశీర్ అహమ్మద్

రచించిన చరిత్ర గ్రంథాలు

## భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు




భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం జనసముదాయాల త్యాగాల చరిత్రను సంక్షిప్తంగా వివరిస్తుంది. 1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో భాగంగా సాగిన ప్రధాన ఘట్టాలలో ముస్లింల పాత్రకు సంబంధించిన విలువైన సమాచారాన్ని క్లుప్తంగా అందిస్తుంది.

**(ఏడవ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## మైసూరు పులి : టిపూ సుల్తాన్




బ్రిటిష్ పాలకుల సామ్రాజ్యవిస్తరణ కాంక్షను ఆదిలోనే గ్రహించి స్వదేశీ పాలకులను హెచ్చరించడమే కాకుండా, జీవిత చరమాంకం వరకు పరాయిపాలకులతో పోరాడిన తొలితరం జాతీయవాది, మైసూరు పులిగా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్ జీవిత చరిత్రను విలువైన చిత్రాలు, ఫోటోలతో ఆవిష్కరిస్తుంది.

**(ఏడవ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 69, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్




సర్దార్ భగత్‌సింగ్‌కు స్ఫూర్తిగా నిలచిన విప్లవకారుడు, భారత స్వాతంత్ర్యోద్యమంలో సంచలనం సృష్టించిన 'కాకోరి రైలు' సంఘటనలో ప్రధాన పాత్ర పోషించి, 27 ఏండ్ల వయస్సులో ఉరిశిక్షను ఆనందంగా స్వీకరించిన సమర యోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ ఫోటోలతో కూడిన పోరాట చరిత్రను తెలుపుతుంది.

**(ఐదవ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## భారతస్వాతంత్ర్యోద్యమం:ముస్లిం ప్రజాపోరాటాలు




బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా 1765 ప్రాంతం నుండి సాగిన ప్రజా పోరాటాలలో ప్రధానమైన బెంగాల్ సన్యాసులు-ఫకీర్ల ఉద్యమం, వహాబీ యోధుల తిరుగుబాట్లు, ఫరాజీ వీరుల విజృంభణ, మలబారు మోప్లాల వీరోచిత పోరాటం, ఖుదా-యే-ఖిద్మత్‌గార్ల అహింసోద్యమ చరిత్రలను వెల్లడిస్తుంది.

**(ద్వితీయ ముద్రణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు :168, మల్టికలర్ టైటిల్, వెల : రు.50)**




## భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు

స్వాతంత్ర్యోద్యమంలో విశిష్ట త్యాగాలతో, అపూర్వ ధైర్య సాహసాలతో ఆంగ్లేయుల పై ఉద్యమించిన ముస్లిం మహిళల జీవిత గాధలను దృశ్యీకరిస్తుంది. 1857 నుండి 1947 వరకు సాగిన వివిధ పోరాటాలలో భాగస్వాములైన 61 మంది మహిళా యోధుల విశేషాలను అందజేస్తుంది.

**(తృతీయ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు :286, మల్టికలర్ టైటిల్, వెల: రు.160)**




## భారతస్వాతంత్ర్య సంగ్రామం:ముస్లింయోధులు-1

1757లో బ్రిటిషర్ల పెత్తనానికి వ్యతిరేకంగా ఆరంభించిన పోరాటం నుంచి, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం, జాతీయోద్యమంలో పాల్గొని ఆంగ్లేయాధికారులతో, ఆంగ్ల ప్రభుత్వంతో తమదైన మార్గంలో పోరాటాలు, ఉద్యమాలు సాగించిన 35 మంది పోరాటాల యోధుల వివరాలతోపాటు, అరుదైన చిత్రపటాలూ ఈ గ్రంథంలో ఉన్నాయి.

**(ద్వితీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 316, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**




## చిరస్మరణీయులు (బ్రిటిష్ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొన్న ముస్లిం యోధులు)

1757 నుండి 1947 వరకు సాగిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న ముస్లిం పోరాటయోధులలో ఎంపిక చేసిన ఓ వంద మంది జీవిత రేఖాచిత్రాలు, ఆ యోధుల అమూల్యమైన ఫోటోలు, చిత్రాలు ఈ గ్రంథంలో ఉన్నాయి. అలనాటి యోధుల త్యాగపూరిత చరిత్రను సాధికారికంగా క్లుప్తంగా తెలుపుతుంది ఈ గ్రంథం.

**(ద్వితీయ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 224, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**




## 1857 : ముస్లింలు

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల భాగస్వామ్యాన్ని, వ్యక్తమైన హిందూ-ముస్లింల ఐక్యతను, ఆంగ్లేయుల హింసాకాండ, విస్మరణకు గురైన ముస్లింల త్యాగాలను, త్యాగాలు ఒకరు చేస్తే భోగాలు మరొకరు అనుభవిస్తున్న తీరుతెన్నులను చర్చకు పెడుతూ పలు ఆసక్తికర అంశాలను వివరంగా ప్రస్తావించిన విమర్శనాత్మక గ్రంథమిది.

**(ద్వితీయ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 224, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**

## అక్షరశిల్పులు (ముస్లిం కవులు-రచయితల సంక్షిప్త పరిచయం)




తెలుగులో రాసిన, రాస్తున్న మూడువందల ముప్పై మూడు (333) మంది ముస్లిం కవులు, రచయితలు, అనువాదకుల వ్యక్తిగత, సాహిత్య వివరాలు, అందులో సుమారు 257 మంది ఫోటోలు, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఈ-మెయిల్ ఐడిలతో కూడిన సమాచారం ఇందులో లభ్యం. తెలుగు వాఙ్మయ చరిత్రకారులచే నభూతో-నభవిష్యతి' అని ప్రస్తుతించబడి, అరుదైన సమాచారం అందించే పుస్తకమిది.

**(ద్వితీయ ప్రచురణ, 1/8 డెమ్మి సైజు, పేజీలు : 184, మల్టికలర్ టైటిల్, వెల : రు. 150)**

## భారత స్వాతంత్ర్యోద్యమం:ఆంధ్రప్రదేశ్ముస్లింలు




భారత స్వాతంత్ర్యోద్యమంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముస్లింల పాత్రను దర్శింపజేయగల పుస్తకమిది. 1780 నాటి విశాఖ తిరుగుబాటు నుండి 1948 వరకు సాగిన పోరాటాల వివరాలు ఉన్నాయి. యాభై మంది సమరయోధుల జీవిత చరిత్రలు, సుమారు మూడు వందల మంది ఉద్యమకారుల సంక్షిప్త సమాచారం గల ఈ గ్రంథంలో అరుదైన చిత్రాలు ఉన్నాయి. ప్రముఖ చరిత్రకారులు, ప్రజలచే ప్రస్తుతించబడిన గ్రంథమిది.

**(తృతీయ ప్రచురణ, 1/8 డెమ్మి సైజు, పేజీలు : 394, మల్టికలర్ టైటిల్, వెల : రు. 250)**

## కువైట్ కబుర్లు




'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' ఆహ్వానం మేరకు కువైట్‌లో జరిగిన '66వ భారత గణతంత్రదినోత్సవం', 'సొసైటీ' 30వ వార్షికోత్సవ సంబరాల సందర్భంగా 2015 జనవరి 28 నుండి ఫిబ్రవరి 5 వరకు 'కువైట్'లో పర్యటించిన సయ్యద్ నశీర్ అహమ్మద్ అక్కడి విశేషాంశాలతో రూపొందించిన గ్రంథమిది.

**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మి సైజు, పేజీలు : 126, మల్టికలర్ టైటిల్, వెల : రు. 40)**

## బిస్మిల్-అష్ఫాఖ్




భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో అగ్నిశిఖలుగా ఖ్యాతిగాంచిన విప్లవకారులు అష్ఫాఖుల్లా ఖాన్, రాంప్రసాద్ బిస్మిల్‌ల మధ్యనున్న స్నేహాన్ని, మాతృభూమి విముక్తి కోసం, హిందూ-ముస్లిం జన సముదాయాల ఐక్యత కోరుతూ ఆ వీరయోధులు సాగించిన కృషిని వివరించే ఈ గ్రంథం తొలిసారిగా 2015లో ప్రచురితం.

**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మి సైజు, పేజీలు : 24, మల్టికలర్ టైటిల్, వెల : రు. 10)**

## చరితార్థులు (ఆల్బం)

1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వలస పాలకులకు వ్యతిరేకంగా భారత ఉపఖండంలో సాగిన పోరాటాలలో పాల్గొన్న 155 మంది ముస్లిం యోధుల అరుదైన చిత్రపటాలు, ఆయా యోధుల పోరాట చరిత్రలు సంక్షిప్తంగా తెలుగు - ఆంగ్ల భాషల్లో అందించిన వినూత్న ఆల్బం. ఈ తరహా ఆల్బమ్ ఉపఖండంలో మొట్టమొదటిదని చరిత్ర పండితుల, ప్రజల, ప్రముఖులచే ప్రశంసలు పొందింది. కువైట్‌లోని తెలుగు ప్రజలు, సంస్థలు 2015లో నిర్వహించిన భారత రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా ప్రత్యేకంగా ఆవిష్కరించ బడింది. 2019లో తమిళంలో ప్రచురితమయిన ఆల్బం త్వరలో హిందీ, ఉర్దూ భాషల్లో రానున్నది. మళయాలం, కన్నడం, గుజరాతీ, బెంగాలీ భాషల్లో ప్రచురణకు ప్రయత్నాలు సాగుతున్నాయి. ఈ ఆల్బం కొనసాగింపుగా 'చరితార్థులు-2' 2023లో ప్రచురితం.

**(ప్రథమ ప్రచురణ 2014 , 1/4 డెమ్మీ సైజు, పేజీలు : 352, మల్టికలర్ టైటిల్, మౌంట్ బౌండ్, జాకెట్, వెల : రు. 1000.)**




## ఆజాద్ హింద్ ఫౌజ్: ముస్లిం పోరాట యోధులు

మాతృభూమి విముక్తి లక్ష్యంగా సాగిన సాయుధ పోరాటాల పరంపరలో అగ్రగామిగా ప్రసిద్ధమయిన భారత జాతీయ సైన్యం, నేతాజి సుబాష్ చంద్రబోస్ నేతృత్వంలో నిర్వహించిన పోరాటం, ఆయన ఏర్పరచిన ఆజాద్ హింద్ ప్రభుత్వం తదితర విశేషాలతో కూడిన ఈ గ్రంథం ఆనాడు ఇంటా-బయటా సాగిన విప్లవోద్యమాల ప్రస్తావనలతో, అరుదయిన చక్కని ఛాయా చిత్రాలతో రూపుదిద్దుకుని 2019లో వెలువడింది.

**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 484, మల్టికలర్ టైటిల్, వెల : రు. 400)**




## మౌలానా అబుల్ కలాం ఆజాద్

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో విశిష్ట పాత్రను నిర్వహించి, సాధించిన స్వాతంత్ర్య ఫలితాలను ప్రజల పరం చేయడానికి వినూత్న వ్యవస్థల నిర్మాణానికి పునాదులు వేసిన స్వతంత్ర బారత తొలి విద్యాశాఖామాత్యులు మౌలానా అబుల్ కలాం ఆజాద్ మీద 2020లో వెలువడిన పుస్తకం ఐదు వేల ప్రతులు మిత్రుల సహకారంతో ప్రజలకు చిరుకానుకగా అందజేత.

**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 24, మల్టికలర్ టైటిల్, వెల : రు. 10)**

## మహాత్మాగాంధీఃముస్లిం సహచరులు-అనుచరులు




మహాత్మాగాంధీ బారిస్టర్‌గా 1892లో దక్షిణాఫ్రికాకు వెళ్ళి అక్కడి వర్ణ వివక్షత,జాతి వివక్షతలకు వ్యతిరేకంగా సాగించిన పోరాటం భాగస్వాములు కావడం మాత్రమే కాకుండా 1914లో ఆయన స్వదేశం తిరిగి వచ్చి మాతృభూమి విముక్తి పోరాటంలో విజయం సాధించిన 1947 నాటి చివరి ఘట్టం వరకు ఆయనతో కలసి-మెలసి ఉద్యమించిన ఆయన ముస్లిం సహచరులు, ఆయన మాటను శిలాశాసనంగా భావించిన వెంట నడిచిన మహాత్ముని ముస్లిం అనుచరుల చిత్రాలతో 2019లో ముద్రిత గ్రంథమిది.

**(ప్రథమ ప్రచురణ,2019,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 32, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25).**




ఈ గ్రంథాన్ని మిత్రుల సహకారంతో 5,000 ప్రతులు ప్రచురించి తెలుగు రాష్ట్రాలలో ఉచిత పంపిణి జరిగింది. ఆ తరువాత మరికొందరు వదాన్యుల ఆర్థిక సహకారంతో ఈ గ్రంథం ఆంగ్ల అనువాదాన్ని మూడు వేల ప్రతులు ప్రచురించి 2020లో భారత దేశం లోని ఎంపిక చేసిన ప్రాంతాలలో పంపిణి అయ్యింది.

**(ప్రథమ ప్రచురణ,2049,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 32, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25).**

## ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్




మహాత్మా జోతిరావు పూలే, సావిత్రిబాయి పూలేలతో కలసి అతి శూద్ర, శూద్ర కులాల వారికి, బాలికులకు విద్యాగంధం అందించడానికి 170 ఏండ్ల క్రితం నడుంకట్టి 'బేటి పడావ్' ఉద్యమ భావనకు పునాదులేసిన 'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' మీద దేశంలో రాసిన తొట్టతొలి చరిత్ర గ్రంథం 2021 మార్చిలో ముద్రితం. సావిత్రీ బాయి పూలే 124వ వర్ధంతి రోజున ఆరంభించి వివిధ సాహిత్య -సామాజిక సంస్థలు, మిత్రుల సహకారంతో నాలుగు రాష్ట్రాల లోని 171 ప్రాంతాలలో గ్రంథావిష్కరణ జరిగింది. ఈ గ్రంథం ఆంగ్ల అనువాదం జూన్‌లో ముద్రించి తెలుగు భాషేతర రాష్ట్రాల లోని వందలాది సాహితీ సంస్థలకు, గ్రంథాలయాలకు దాతల చిరుకానుకగా అందించాం. ఆయా ప్రాంతాల మిత్రులు ఈ గ్రంథాన్ని స్థానికంగా ఆవిష్కరించి గ్రంథాలయాలకు, ఆసక్తి గల పాఠకులకు అందించి సరికొత్త చరిత్రకు కారకులయ్యారు.




**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 50)**

# పుస్తకావిష్కరణల పర్వంలో చరిత్ర సృష్టించిన పుస్తకం

ప్రముఖ విప్లవకారులు, అమరజీవి అష్ఫాఖుల్లా ఖాన్ సాహసోపేత జీవిత గాథను తొలిసారిగా 2002లో 'షహీద్-యే-ఆజం : అష్ఫాఖుల్లా ఖాన్' శీర్షిక పుస్తకం ప్రచురితమయ్యింది. ఆ తరతవాత వివిధ సంస్థల ద్వారా ఈ గ్రంథం పలుమార్లు పునర్ముద్రణయ్యింది. ఆ తరువాత విప్లవకారులు, ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, అష్ఫాఖుల్లా ఖాన్ మిత్రులు పండిత రాంప్రసాద్ బిస్మిల్ ల మధ్య గల స్నేహ సంబంధాలను విశ్లేషిస్తూ తొలిసారి 2015లో 'అష్ఫాఖ్-బిస్మిల్' శీర్షికన మిత్రుల సహకారంతో ఐదు వేల ప్రతులు ముద్రించి తెలుగు రాష్ట్రాలో పాఠకులకు కానుకగా అందించాం. ఈ గ్రంథాన్ని లభించిన పాఠకాదరణను దృష్టిలో ఉంచుకుని, వదాన్యుల ప్రేమపూర్వక సహాయ-సహకారాలతో 2017లో మళ్ళీ తెలుగు భాషలో మాత్రమే కాకుండా ఉర్దూ, ఆంగ్ల భాషల్లో మొత్తం మీద మరో 14 వేల ప్రతులను ముద్రించాం. ఈవిధంగా మిత్రుల ఆర్థిక - హార్థిక సహకారంతో ప్రచురించిన ఈ పుస్తకాలను భారతదేశ వ్యాప్తంగా 172 పట్టణాలోని తెలుగు ప్రజల చిరుకానుకగా అందించాము. 1927 డిసెంబర్ 19న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బ్రిటిష్ జైళ్లల్లో అమరులైన ఆ వీరయోధుల అపూర్వ త్యాగాన్ని, వలస పాలకుల మీద సాగించిన అసమాన పోరాటాన్ని, ఆ ఇరువురు యోధుల మధ్య నెలకొన్న ఆదర్శనీయమైన స్నేహ-సౌభ్రాతృత్వాన్ని, ఐక్యతను స్మరిస్తూ, ప్రజలచే స్మరింప చేయడానికి డిసెంబర్ 19న 'ఐక్యతాదినోత్సవం' పాటించమని ప్రజలకు పిలుపు ఇచ్చాము. భారతదేశం మొత్తం మీద రెండు వందలకు పైగా ఎంపిక చేసిన ప్రాంతాలలోని వ్యక్తులకు, సాహితీ సంస్థలకు ఈ పుస్తక ప్రతులను వదాన్యుల చిరుకానుకగా అందించగా,. ప్రతులను అందుకున్న మిత్రులు, సంస్థలు 2017 డిసెంబర్ 19న 'ఐక్యతాదినోత్సవం' పాటిస్తూ 155 ప్రాంతాలలో ఆ రోజున పుస్తకాన్ని ఆవిష్కరించి చరిత్ర సృష్టించారు. ఒక గ్రంథం ఒక నిర్దేశిత రోజున 155 చోట్ల ఒక్కసారిగా ఆవిష్కరించ బడటం ప్రపంచ రికార్డుగా పలువురువు పెద్దలు కొనియాడారు. ఈ గ్రంథాన్ని 2020లో మరోమారు మూడు వేల ప్రతులను ప్రచురించి ప్రజలకు **చిరు కానుక**గా అందించాం. ఈ విధంగా **'పండిత రాంప్రసాద్ బిస్మిల్ - అష్ఫాఖుల్లా ఖాన్ (హిందూ -ముస్లిం ఐక్యతకు ప్రతిరూపాలు)'** గ్రంథం దఫ,దఫాలుగా **22 వేల ప్రతులు** ముద్రించి దాతల కానుకగా ప్రజలకు, వివిధ సాహిత్య సంస్థలకు ప్రధానంగా గ్రంథాలయాలకు అందజేత.

PANDIT RAMPRASAD BISMIL
ASHFAQULLAH KHAN
(Epitomes of Hindu - Muslim Unity)

# వినూత్న ప్రయోగం విజయవంతం



ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులను ప్రజా బాహుళ్యానికి పరిచయం చేయాలన్న సంకల్పంతో 'యూత్ వెల్ఫేర్ విజయవాడ' మిత్రుల సహకారంతో 2017 సంవత్సరం క్యాలెండర్ ప్రచురించాం. UNSUNG HEROES OF INDIAN FREEDOM STRUGGLE శీర్షికతో ఆరు పుటలతో క్యాలెండర్ ప్రచురితమయ్యింది. 1857 నుండి 1947 వరకు భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న 24 మంది యోధుల చిత్రాలతో ప్రచురించిన క్యాలెండర్ YOUTH WELFARE, VIJAYAWADA వారి చిరుకానుకగా భారతదేశంలోని పరిచయస్థులకు, సంస్థలకు, కళాశాలలకు అందించాం. ఈ ప్రయత్నంలో సహకరించిన మిత్రులకు, సంస్థలకు హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాం.

# ఐదు లక్షల 'నేమ్ స్టిక్కర్లు' ఉచిత పంపిణీ



మాతృభూమి విముక్తి కోసం సాగిన పోరాటంలో అసమాన సాహసం, త్యాగాలతో, బ్రిటిష్ పాలకుల మీద పోరాడిన మన పూర్వీకులను త్యాగాలను ప్రజలకు, ప్రధానంగా విద్యార్థులకు పరిచయం చేయడానికి విద్యార్థులు తమ పుస్తకాల మీద అంటించుకునే నేమ్‌స్టిక్కర్లను 2018లో ప్రచురించాం. ఈ ప్రయత్నం గురించి తెలుసుకున్న మిత్రులు దేశవ్యాపితంగా పలు ప్రాంతాల నుండి ముందుకు వచ్చి, మా సహకారంతో స్టిక్కర్లు ప్రచురించి పంపిణీ చేశారు. ఈ క్రమంలో ఐదు లక్షల స్టికర్లు దేశం మొత్తం మీద విద్యార్థులకు పంపిణీ అయినట్టు అంచనా. ఈ ప్రయత్నంలో మాతో సహకరించిన మిత్రులకు, సంస్థలు, ప్రతిఒక్కరికి మా హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాం.







# భారతావని అంతటా 21 వేల ప్రతుల ఉచిత పంపిణి




1917లో బీహార్ రాష్ట్రం చంపారన్ ప్రాంతంలో మహాత్మా గాంధి మీద జరిగిన హత్యాయత్నం కుట్రను వెల్లడించిన, ఆ కుయుక్తులను భగ్నం చేసిన బతఖ్ మియా అన్సారి సాహసగాథను, చంపారన్ రైతాంగ పోరాటం నాయకులు షేక్ గులాబ్, పీర్ మహ్మద్ మునీస్‌లను ప్రజలకు పరిచయం చేయాలన్న లక్ష్యంతో, మిత్రుల, సంస్థల సహకారంతో నాలుగు భాషలలో 21వేల ప్రతులు ముద్రించి 2019 జూలైలో భారతావని అంతటా ఉచితంగా పంపిణీ చేయడం జరిగింది.

# ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం : హిందూ - ముస్లిం ఐక్యత




మన దేశంలో జరుగుతున్న 'ఆజాదికా అమృత్ మహోత్సవ్' సందర్భాన్ని పురస్కరించుకుని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో హిందూ-ముస్లింల మధ్య వ్యక్తమయిన ఐక్యతకు సంబంధించి ఆనాటి కొన్ని విశేషాంశాలను, ఆసక్తిదాయక సంఘటనలను పొందుపర్చుతూ 'ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం : హిందూ-ముస్లిం ఐక్యత' శీర్షికతో రూపొందించిన ఈ పుస్తకాన్ని ఐదు వేల ప్రతులను మిత్రుల సహకారంతో వెలువరించాం. గతంలో లాగే ఈ పుస్తకాన్ని కూడా ఎంపిక చేసిన గ్రంథాలయాలకు, చరిత్రకారులకు, చరిత్ర విద్యార్థులకు, పాత్రికేయులకు, ఉత్తమ పాఠకులకు, విద్యార్థులకు అందజేత.

**(ప్రథమ ప్రచురణ 2021, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 32, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25-00)**

## 'చరితార్థులు - 2' / 'THE IMMORTALS' (ఆల్బం)




గతంలో (2014) 155 మంది ముస్లిం స్వాతంత్ర్య సమర యోధుల చిత్రపటాలు, తెలుగు-ఆంగ్ల భాషల్లో కుప్తంగా వారి వివరాలు వెల్లడిస్తు ఇటు 'చరితార్థులు' అటు 'THE IMMORTALS' శీర్షికలతో 2014లో ప్రచురించిన వినూత్న ఆల్బంకు కొనసాగింపుగా మరో 155 మంది ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల నూతన చిత్రపటాలతో 'చరితార్థులు-2' / ' THE IMMORTALS - 2' శీర్షికతో సరికొత్త ఆల్బం జూలై 2022 న వెలువడింది. గుంటూరు జిల్లా నరసరావుపేటకు చెందిన స్థానిక శ్రీ సుబ్బరాయ & నారాయణ కళాశాల (S S & N College, Narasraopet) లో నా సహధ్యాయి, సన్మిత్రులు శ్రీ శివరాత్రి చంద్రమౌళి {General Manger (Retd.), Coal India Limited} ఆర్థిక-హార్థిక సహకారంతో ఈ ఆల్బం ప్రచురణయ్యింది. గతంలో లాగే ఈ ఆల్బంను కూడా భారతదేశ వ్యాప్తంగా ఎంపిక చేసిన గ్రంథాలయాలకు, చరిత్రకారులకు, చరిత్ర విద్యార్థులకు, ఉత్తమ పాఠకులకు మిత్రులు శ్రీ చంద్రమౌళి కానుకగా అందజేత.

### త్వరలో వెలువడనున్న

01. స్వరాజ్య పోరాటం : తెలుగు ముస్లింల త్యాగాలు
02. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం అమరవీరులు
03. చరితార్థులు -3 / THE IMMORTALS - 3
04. చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు
05. దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత : దాదా అమీర్ హైదర్ ఖాన్




**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

ఫ్లాట్ నం. సి-2, శ్రీరామ్స్ ఆర్కేడ్, అమరావతి రోడ్,

ఉండవల్లి - 522501,

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

సంచారవాణి : + 91 9440241727

naseerahamedsyed@gmail.com

## రచయిత పరిచయం :



# సయ్యద్ నశీర్ అహమ్మద్

సయ్యద్ నశీర్ అహమ్మద్ నెల్లూరు జిల్లా అల్లూరు తాలూకా పురిణి గ్రామంలో 1955 డిసెంబరు 22న జన్మించారు. (అధికారికంగా పుట్టిన తారీఖు 01-08-1954) తల్లిదండ్రులు : షేక్ బీబీజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్. వ్యవసాయ కుటుంబం. చదువు : ఎం.కామ్., ఎల్ఎల్.బి., సాహిత్యరత్న (హిందీ)., డి.జె. వృత్తి : న్యాయవాది. ప్రవృత్తి : పాత్రికేయుడు-రచయిత. శాశ్వత నివాసం : ఉండవల్లి- 522501, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. సంచారవాణి ః 9440241727.

చిన్నతనం నుండి రాయడం ఆరంభించినా 1975లో 'మరో ప్రపంచం' లిఖిత మాసపత్రికలో తొలిసారిగా కవితలు ప్రచురితం. 1976 నుండి 'ప్రగతి' సచిత్ర వారపత్రిక, 'జయశ్రీ', 'జ్యోతి' మాసపత్రికల్లో పలు కథానికలు, కార్టూన్లు చోటు చేసుకున్నాయి. అప్పటి నుండి పలు పత్రికల్లో కవితలు, గేయాలు, కథలు, రాజకీయ-సామాజిక-సాహిత్య-చరిత్ర-సమీక్షా వ్యాసాలు, పలు వ్యంగ్య చిత్రాలు ప్రచురితం. మిత్రుడు వేదాంతం

సీతారామావధానితో కలసి 'మరో ప్రపంచం', 'భేరి' లిఖిత మాస పత్రికలు వెలువరించారు. రాష్ట్రంలోని పలు సాంస్కృతిక-సాహిత్య-సేవా సంస్థలలో సభ్యునిగా రచన-ప్రచురణకు సంబంధించిన బాధ్యతలను నిర్వహించారు. పలు ప్రజా సంఘాలు, సంస్థలు నిర్వహించిన పలు పత్రికలకు సంపాదకునిగా సేవలందించారు. స్వయంగా 2006 నుండి 2011 వరకు 'ఇండియా' మాసపత్రిక ప్రచురించారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ, 1998లో గ్రంథ రచన, ప్రచురణ ప్రారంభించారు. అప్పటి నుండి 1) భారత స్వాతంత్ర్యోద్యమం -ముస్లింలు, 2) భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు, 3) భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు, 4) మైసూరు పులి : టిపూసుల్తాన్, 5) భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజా పోరాటాలు, 6) షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, 7) భారత స్వాతంత్ర్య సంగ్రామం: ముస్లిం యోధులు-1, 8) చిరస్మరణీయులు, 9) 1857: ముస్లింలు, 10) అక్షరశిల్పులు, 11) చరితార్థులు (తెలుగు) / ది ఇమ్మోర్టల్స్ (ఆంగ్లం), 12) కువైట్ కబుర్లు, 13) బిస్మిల్- అష్ఫాఖ్, 14) పండిత రాంప్రసాద్ బిస్మిల్- అష్ఫాఖుల్లా ఖాన్, 15) కవిరాజు డాక్టర్ ఉమర్ అలీషా, 16) అజాద్ హింద్ ఫౌజ్ ః ముస్లిం పోరాట యోధులు, 17) గాంధీజీ ప్రాణరక్షకుడు ః బతఖ్ మియా అన్సారీ, 18) చరితార్థులు -2 (తెలుగు) / ది ఇమ్మోర్టల్స్-2 (ఆంగ్లం), 19) మహాత్మాగాంధీ ః ముస్లిం సహచరులు-అనుచరులు, 20), బహుముఖ ప్రజ్ఞాశాలి, భారత స్వాతంత్ర్య సమరయోధులు, భారతరత్న మౌలానా అబుల్ కలాం ఆజాద్, 21) ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు ః ఫాతిమా షేక్, 22) ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం ః హిందూ-ముస్లిం ఐక్యత గ్రంథాలను వెలువరించారు.

ఈ గ్రంథాలలో కొన్ని ఆంగ్లం, హింది, ఉర్దూ, తమిళం, కన్నడ, గుజరాతి భాషల్లో అనువాదం అయ్యాయి. 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు' శీర్షికతో నశీర్ రాసిన సుదీర్ఘ ఆంగ్ల వ్యాసం అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం ప్రచురించిన 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింల పాత్ర' వ్యాససంపుటిలో చోటుచేసుకుంది. ఈ వ్యాసానికి పలు రాష్ట్రాలలోని వివిధ సంస్థలు, సంఘాలు, పత్రికలు తమ ప్రత్యేక సావనీర్స్‌లో

స్థానం కల్పించాయి. నశీర్ గ్రంథాలను పలు ప్రాంతాల, భాషల దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక పత్రికలు ధారావాహికంగా ప్రచురించాయి, ప్రచురిస్తున్నాయి. ఈ గ్రంథాలలో 'పండిత రాంప్రసాద్ బిస్మిల్– అష్ఫాఖుల్లా ఖాన్', 'గాంధీజీ ప్రాణరక్షకుడు : బతఖ్ మియా అన్సారీ', 'మహాత్మాగాంధీ : ముస్లిం సహచరులు – అనుచరులు', 'ఆధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్' గ్రంథాలు తెలుగు, ఆంగ్లం, ఉర్దూ, హిందీ తమిళ భాషలో వేలాదిగా ముద్రించి భారతదేశ వ్యాప్తంగా వివిధ ప్రాంతాలలోని ఎంపిక చేసిన గ్రంథాలయాలకు, సాహితీ సంస్థలకు, వ్యవస్థలకు, వ్యక్తులకు ఉచితంగా పంపిణీ చేశారు. తెలుగు–ఆంగ్ల భాషల్లో 2014లో వెలువడిన 'చరితార్థులు' ఆల్బమ్ జాతీయంగా, అంతర్జాతీయంగా విశేష ఆదరణ పొంది 2019లో తమిళభాషలో వెలువడింది. ప్రస్తుతం ఉర్దూ, మళయాలం, హిందీ, గుజరాతి, మరాఠీ భాషల్లో వెలువడనుంది. నశీర్ రచించి వెలువరించిన ఈ గ్రంథాల పిడియఫ్ ఫైల్స్‌ను అసంఖ్యాక పాఠకులకు వారి వారి అభ్యర్ధనల మేరకు మెయిల్, వాట్సప్, టెలిగ్రాం యాప్‌ల ద్వారా ఉచితంగా అందజేస్తున్నారు. అంతర్జాలంలో రెండు ప్రత్యేక వెబ్‌సైట్లు ఏర్పాటు చేయించి పుస్తకాలను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకునే వీలు కల్పించగా ఇంతవరకు సుమారు 30వేల మంది ఆసక్తిగల పాఠకులు అడిగిమరీ పుస్తకాల పిడియఫ్ ఫైల్స్ పొందారు.

ప్రస్తుతం 01. స్వరాజ్య పోరాటం : తెలుగు ముస్లింల త్యాగాలు, 02 భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం అమరవీరులు, 03. చరితార్థులు–3 / **THE IMMORTALS- 3**, 04. చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు. 05. దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత : దాదా అమీర్ హైదర్ ఖాన్ గ్రంథాల రూపకల్పనలో నిమగ్నమైయున్నారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల మహోన్నత పాత్రను తన రచనల ద్వారా, పలు ప్రచార కార్యక్రమాల ద్వారా ప్రజలకు ఎరుక పర్చుతూ గత రెండున్నర దశాబ్దాలకు పైగా సయ్యద్ నశీర్ అహమ్మద్ సాగిస్తున్న అవిరళ కృషికి గుర్తింపుగా 1) 'వి.ఆర్ నార్ల విశిష్ట జర్నలిస్టు అవార్డు' (విజయవాడ, కృష్ణా జిల్లా, 2004), 2) 'తెలుగు భాషా పురస్కారం' (గుంటూరు, 2007), 3) 'డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ ఫెలోషిప్ అవార్డు' (న్యూఢిల్లీ, 2008), 4) 'అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అవార్డు' (హైదరాబాద్, 2010), 5) బి.యస్

రాములు పురస్కారం (హైదరాబాద్, 2011), 6) కవికోకిల చిన సుబ్బయ్య స్మారక పురస్కారం (గుంటూరు, 2012), 7) సంఘమిత్ర అవార్డు (బుక్ ఆఫ్‌స్టేట్ రికార్డ్స్, హైదరాబాద్, 2013), 8) 'మాస్టర్‌జీ ఫౌండేషన్ సేవారత్న పురస్కారం', (విశ్వజన కళా మండలి, హైదరాబాద్, 2015), 9) 'జీవిత సాఫల్య పురస్కారం' (శ్రీమతి జ్యోతిబాయి పూలే ఎడ్యుకేషనల్, ఛారిటబుల్ ట్రస్ట్, విశాఖపట్నం, 2016), 10) 'ఉగాది పురస్కారం' (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, 2016), 11) 'విశిష్ట సేవాపురస్కారం' (నరసరావుపేట కళావేదిక, గుంటూరు జిల్లా, 2016), 12) జనోపకారి ఆత్మీయ పురస్కారం (జనోపకారి మాసపత్రిక, కావలి, నెల్లూరు జిల్లా, 2016), 13) ప్రౌఢ్ ఆత్మీయ పురస్కారం (హైదరాబాద్ 2016), 14) లోక్ బంధు సద్భావనా సమ్మాన్ జాతీయ పురస్కారం (లక్నో, ఉత్తరప్రదేశ్ 2017), 15) 'కీర్తి పురస్కారం' (పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ 2015), 16) 'మహారాష్ట్ర బుక్ ఆఫ్ రికార్డ్స్' (కవితాసాగర్ పబ్లికేషన్స్, జయసింగ్‌పూర్, మహారాష్ట్ర, 2018), 17) 'సృజన ప్రియ పురస్కారం'. ('సృజనప్రియ' మాసపత్రిక, హైదరాబాద్, 2018), 18) 'డాక్టర్ పట్టాభి ప్రతిభా పురస్కారం' (డాక్టర్ పట్టాభి కళాపీఠం, విజయవాడ, కృష్ణా జిల్లా, 2018), 19) రాష్ట్రస్థాయి ఉత్తమ తెలుగు జర్నలిస్టు అవార్డు (కడప, 2018), 20) 'మాటి రతన్ పురస్కారం-2018' (అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అమర వీరుల పరిశోధనా సంస్థ, ఫైజాబాద్, ఉత్తరప్రదేశ్, 2018), 21) 'గిడుగు రామమూర్తి సాహితీ పురస్కారం' (గిడుగు రామమూర్తి పంతులు ఫౌండేషన్, హైదరాబాద్, 2019), 22) 'సురా సాహిత్య, సామాజిక సేవా పురస్కారం' (సావిత్రిబాయి పూలే ఎడ్యుకేషనల్ అండ్ ఛారిటబుల్ ట్రస్టు, విశాఖపట్నం, 2019), 23) 'కళా భారతి' పురస్కారం (మదనపల్లి సాహితీ కళా వేదిక' మదనపల్లి, చిత్తూరు జిల్లా, 2019), 24) 'జ్ఞాన జ్యోతి' పురస్కారం (ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం, విజయవాడ, 2021), 25) డాక్టర్ ఉమర్ అలీషా స్మారక జాతీయ పురస్కారం (డాక్టర్ ఉమర్ అలీషా సాహితీ సమితి, భీమవరం, 2022) లభించాయి.

భారత ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల సమాచారాన్ని ప్రజలందరికి అంద జేయాలన్న లక్ష్యంతో వివిధ సంస్థల, వ్యక్తుల ఆహ్వానం మేరకు వేలాది సభలు,

సమావేశాలలో పాల్గొని ప్రసంగించారు ఈ చారిత్రక సమాచారాన్ని ప్రధానంగా యువత, విద్యార్థుల ఎరుకలోకి తెచ్చేందుకు స్వాతంత్ర్య సమరయోధుల చిత్రపటాలతో ప్రదర్శనలను తన పర్యవేక్షణలో మనదేశంలోని వివిధ రాష్ట్రాలలో 32 వరకు ఏర్పాటు చేశారు. గత 22 ఏండ్లుగా రచన-ప్రచురణ-పంపిణీ-ప్రచార కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. విద్యార్థులు తమ పుస్తకాలకు అంటించుకునే నేమ్ స్టికర్లు, క్యాలెండర్లు, స్వాతంత్ర్య సమరయోధుల వివరాలతో చిరు పొత్తాలను, విజిటింగ్ కార్డులను భారీగా ముద్రించి ఆ సరంజామా ను వదాన్యుల చిరుకానుకగా భారతదేశంలోని పలు సాహిత్య సంస్థలు, సామాజిక సేవాకార్యకర్తల ద్వారా ప్రజలకు పంపిణీ చేశారు, చేస్తున్నారు.

01) బిస్మిల్- అష్ఫాఖ్, 02). పండిత రాంప్రసాద్ బిస్మిల్-అష్ఫాఖుల్లా ఖాన్, 03) కవిరాజు డాక్టర్ ఉమర్ అలీషా, 04.) గాంధీజీ ప్రాణరక్షకుడు : బతఖ్ మియా అన్సారీ, 05) మహాత్మాగాంధీ : ముస్లిం సహచరులు – అనుచరులు, 06.) బహుముఖ ప్రజ్ఞాశాలి, భారత స్వాతంత్ర్య సమర యోధులు భారతరత్న : మౌలానా అబుల్ కలాం ఆజాద్, 07) అధునిక భారత తొలి ముస్లిం ఉపాధ్యాయురాలు : ఫాతిమా షేక్ లాంటి గ్రంథాలు వివిధ భాషల్లో భారీ సంఖ్యలో ముద్రితమయ్యి భారతదేశంలోని వందలాది ప్రాంతాలలో అవిష్కరించబడి పుస్తకావిష్కరణల పర్వంలో వినూత్న చరిత్రను సృష్టించాయి.

సయ్యద్ నశీర్ అహమ్మద్ రచయిత, నటుడు, చిత్రకారుడు, వ్యంగ్యచిత్రకారుడు, వక్త, సంపాదకుడు, పాత్రికేయుడు, న్యాయవాది, పరిశోధకుడు, చరిత్రకారుడు, సామాజిక సేవా కార్యకర్తగా వివిధ రంగాలకు సేవలు అందిస్తున్నారు. అంతర్జాతీయ-జాతీయ-ప్రాంతీయ సభలు, సమావేశాలు, సదస్సులలో పాల్గొంటున్నారు. ఆర్థిక-సామాజిక అసమానతలు లేని లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థల నిర్మాణంలో రచయితగా, సామాజిక కార్యకర్తగా తన భాగస్వామ్యం అందించడం, జ్ఞానం ప్రజాస్వామీకరించబడాలన్న ఆకాంక్షతో అవిశ్రాంతంగా తన కార్యక్రమాలు, రచనా వ్యాసంగం సాగిస్తున్నారు.

**– ప్రచురణకర్తలు**

